ఓం నమః పురుషోత్తమాయ.
గురవే మధుసూదనాయ.

# విజ్ఞప్తి

అభిరూపశేఖరులగు పాఠకమహాశయులారా!

అస్మద్వివృత గీతావిజ్ఞానమందు, అంతరంగ పరీక్షకు జెందిన యిది రెండవ సంపుటము. ఇందు కర్మయోగము వివరింపబడినది. దీని యందలిదే యగు 'వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానము' ముద్రణమం దున్నది. కొలదికాలముననే తమ కరకమలముల నలంకరింపగలదు. ఇక గీత యందలి జ్ఞాన — భక్తి — బుద్ధియోగములును, గీతాచార్య విజ్ఞానమును, ప్రత్యేకములగు వేదవిజ్ఞాన, ఈశోపనిషద్విజ్ఞాన, బ్రహ్మవిజ్ఞానములును అచ్చుపడవలసి యున్నవి. అకార్యమెల్లఁ బాఠకుల యాదరాభిమాన ములంబట్టి యుండును.

వేదవిజ్ఞానాది ముద్రణవిషయమున, బహిరంగ పరీక్షాత్మక గీతా విజ్ఞాన ప్రథమ సంపుటస్థమగు నా విజ్ఞప్తికి బ్రాహ్మణులందును, వైశ్యు లందును కొంచెము కదలిక కల్గకపోలేదు; శ్రీమన్మహారాజశ్రీ కావ్య కళాపోషక భూపతిరాజు రామకృష్ణంరాజుగారి యొక్కయు, మహారాజశ్రీ పెన్మెత్స శివరామరాజుగారి యొక్కయు ప్రోత్సాహమున నీ గీతాప్రచు రణ మింతవరకు వచ్చినదిగాని, క్షత్రియులందుమాత్రము.... ?

అందరును నా గ్రంథములయెడ నాదరణము జూపిరా? అట్లెప్పు డైన నెందైన నుండునా? జరుగునా? "గుణదోషమయం విశ్వం స్రష్టా సృజతి కౌతుకీ" అనిగదా సూక్తి? అందును (రాజులందును) గొందరు గ్రంథముం జూడకుండగనే "ఈ గ్రంథము శాంకరమతమునకు విరు ద్ధము, రామానుజమత ప్రతిస్పర్ధి, తిలకుగారి మతమునకు వ్యతిరిక్తము,

వారికంటె నీతఁడు గొప్పవాడా? వారు మనకు బూజ్యులు. ఇట్టి గ్రంథములు వెలువడుటకు సాయమొనరించుట పాపముగూడను" అన్నారనియు.- గొందరు "చందా" యనుటతోడనే యామాటగొట్టు ముక్కులలోనికి దూరుటయు. "ముఖస్వరవర్ణ వ్యత్యయమునొంది తడిసిన రాజా సబ్బువలె జారిపోయి" రనియు విన్నాము; వారును జదువుకొన్నవారే! ధనికులే! అయిననేమి? "సతుభవతు దరిద్రోయస్యతృష్ణా విశాలా" యన్న భర్తృహరి మహారాజావారి సూక్తి కుదాహరణభూతులట! అగుదురుగాక! అట్టివారెవరి గొప్పతనము నంగీకరింతురు? ఆఢ్యోఽభిజన వానస్మికోఽన్యోఽస్తి సదృశోమమ" కోటిలోని సంపన్నులువారు. "నమ్రత్వేనోన్నమంతః పరగుణకథనైః స్వాన్ గుణాన్ ఖ్యాపయంతః" అను కోటిలోనివారు గారు. వారన్న పూజ్యులువచ్చి తమయెదుట నిలువబడినను వారు తమ వినయమునకు నింకొక క్రియార్థముఁ జెప్పుదురు. ఏమైనను. వారి యేకాగ్రతకు విషయము "స్వ" పదార్థమే. కాని. చందా పట్టికలందు పేరులు వేయించుకొని పిమ్మట సాగి యెగగొట్టిన యర్ధవయులకంటె వారు మంచివారేయని భావింతును. కానిండు. "అవ్యవస్థిత చిత్తానాం ప్రసాదోఽపి భయంకరః" అను హెచ్చరికంబట్టి వారట్లుండుటయే మేలు. "పిబంత్యేవోదకంగావో మండూకేషురుదత్స్వపి" ఇక:—

అట్లే ప్రస్తుతము:——బ్రాహ్మణారంభమునందును. కొందరు వేదాధ్యయన పారంగతు లనిపించుకొని- కడియాలో. కంకణములో. గండపెండేరములో. కుండలములో ధరించి. పేరొందిన యవధానులు- వేదాంతులగు సదాశివమూర్తులు.- చల్లని ముఖముగల సుబ్రహ్మణ్యులు- ఇట్టిగ్రంథము లొకటిగాదు. పదింటినైనను ముద్రింపింప సమర్థులు. కనుకనే— నా కృతులందలి విషయసూచిక లాలించి. పైజెప్పిన శాస్త్రవనికులవలె నిరసనము లాడక. దుష్ప్రచారమునకు దిగక. మెచ్చికొనుక నమస్కారమాత్రమునఁ దమ యశక్తతమ వెల్లడించుకొనిరట!

అది వారికిని, ఇది వీరికిని సహజస్వభావము. ("స్వభావ ప్రభవైర్గుణైః" అని దీని ననవచ్చునా ?) అంతమాత్రమున వారు దాతలు గారందురా ? ప్రభుత్వోద్యోగుల యధికారపూర్వకములగు పలుతెఱఁగుల చందాలకు, ఆంగ్లపాఠశాలలకొరకైన విరాళములకు— గోరినంతయు "కి"మ్మన కుండ నిచ్చినవారే ! ఇచ్చుచున్నవారే. వారి స్వధర్మ- స్వవిద్యాది విషయములందు మాత్రమే పాపము ! వారశక్తులు ! వీరే నేటి సనాతన విద్యోద్ధారకులు ! పరిషత్ప్రాతినిధ్య నిర్వాహకులు ! ధర్మరక్షకులు ! ఉపన్యాస వేదికలందు గంభీరోపన్యాసము లిచ్చుచుఁ బరహిత ముపదేశించువారు ! వీరు, "షట్కర్మ నిరతో విప్రః" అను ధార్మికసూక్తియందలి షట్కర్మలందును మూడు కర్మలుమాత్రమే తమవి. తక్కినవి యితరులవి యనుకొనుచుందురు. ఇట్టివారికొరకే బ్రహ్మశ్రీ నీలకంఠ దీక్షితులు "శాంతివిలాసము" కానుకగ సమర్పించుకొన్నారు. కాని, నా కృతులు వీరికొరకు గావుకదా !

పాపము ! ప్రాతఃస్మరణీయ శ్రీ శంకరాచార్యులవారినాడే వారిచే "బ్రాహ్మణత్వస్యహిరక్షితే రక్షితః స్యాత్ వైదికోధర్మః" అనిపించు స్థితిలో బ్రాహ్మణుడు పడినట్లు తోచును. ఒకనాడెందుకో పుట్టిన "బ్రాహ్మణానామనేకత్వం" అను నానుడి నేడెందుకో పనిచేయుచున్నది. ప్రస్తుతము సనాతనధర్మముపేర జరుగు సభలు- సమావేశములు- పరిషత్తులు- అనబడువానియందు, వార్షికసత్కారములు- బహుమానములు- అనబడువానికై దిరుగాడు వేదాభిమానులు- శాస్త్రాభిమానులు- నాబడువారందరును భారతీయ "స్వధర్మ" యాథార్థ్యమును, ఆచరణపూర్వకముగ గుర్తించియున్నచో, ఇంతకాలము మన సంస్కృతి- సభ్యత- ఆచార, వ్యవహారము లన్నియు మఱచి, అమృతపుత్రులగు మనము,- ఆంగ్ల మానస పుత్రులుగ మారిపోవునంతవరకు ఆంగ్లేయులిటఁ బరిపాలన సాగింపఁ గలిగియుందురా ? ఇప్పటివరకు నా పథంలోనే నడుచుచున్న ఆంగ్ల పాఠ

శాలలు మొలకలెత్తెడివా? భారతీయధర్మమునకు ప్రస్తుతము నలువంకల దాపురించియున్న చేటుల కింత గిలగిలఁ దన్నుకొనునవసరము కల్గెడిదా? ఇంట మాటాడజాలక, బయట నోరెత్తఁజాలక యుండవలసి వచ్చెడిదా? కానిండు—

ఇంతకు నేజెప్పదలచినది :-అన్ని వర్ణములవారియందును సదసద్విభాగ ముండుననియు, అయ్యది సృష్టి సహజమనియు, బ్రాహ్మణులందును, అందును- సాధారణ సంసారులందు (ఎందైన నట్టివారే) ముందుకు వచ్చి నా గ్రంథముద్రణకు సాయపడువారు లేకపోలేదనియు, "న రత్న మన్విష్యతి" అనుకొని నమ్మియున్న నా వ్రతమును "నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం" అని సెలవిచ్చిన భగవంతుడు సాగించుచున్నాడనియు నే........ ఇటీవల జేరిన చందాదారుల అన్ని వర్ణములవారి పట్టికయు మరొకచో ముద్రింపబడినది. "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్" అన్న భగవంతుడు వారి కన్నియెడల నభయ మిచ్చుగాత యని ఈ ప్రశంస నింతటితో గట్టిపెట్టుచున్నాను. ఇక:—

గ్రంథవిషయమున మంచిచెడ్డలనుగూర్చి అంతయుఁ బాఠకులు చెప్పవలసినదే. నేను ప్రత్యేకము హృదయపూర్వకముగ జెప్పుకొనునది :

"నవా దాన్నాపి సంఘర్షాత్ నాధిక్యాత్ నచకామతః
వక్ష్యామి వచనం రాజన్ యధార్థం రామ గౌరవాత్"
"వఖ్యాతి లాభపూజార్థం గ్రంథోఽస్మాభిరుదీర్యతే"
"స్వాంతస్సుఖాయ"

అని మాత్రమే. పెక్కురు పండితులకు గ్రంథములంపగా, ఇంతవరకుఁ [illegible] యమూల్యాభిప్రాయములను దయచేసినవారి నామములనుమాత్రమే

యీ దిగువ నుదహరించుకొన్నాను; అవకాశమునుబట్టి వానిం బ్రమ రింతును.

బ్రహ్మశ్రీ న్యాయాచార్య వేదాంతం శేషయ్యశాస్త్రిగారు,

,, వేదశాస్త్ర విశారద, కర్రా అగ్నిహోత్ర శాస్త్రిగారు,

,, అభినవ పండితరాజ, పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు,

,, జటావల్లభుల పురుషోత్తముగారు. M. A., Lecturer, S. R. R. And C. V. R. College బెజవాడ.

,, కేశిరాజు వెంకట నృసింహఅప్పారావుగారు. ప్రిన్సిపాలు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠం, కొవ్వూరు.

,, ఆయుర్వేదాధ్యాపక, కల్దిండి బాపిరాజుగారు,

,, యం. యస్. గణేశ్వరరావుగారు. M. A. B. Ed. ఉభయభాషా ప్రవీణ.

,, గంటి సూర్యనారాయణశాస్త్రిగారు, బహుగ్రంధకర్తలు, సింహాచలము.

ఇటీవలఁ గొందరు మిత్రులు నాతో "గ్రంథకర్తలు పీఠికా కర్తలను, అభిప్రాయదాతలను, ఆశ్రయించుట బహుళము. అను లౌకిక వ్యాకరణసూత్ర మున్నది. అందలి బాహుళక చాతుర్విధ్యమున 'నప్ర వృత్తి' నీకుఁ గల్గఁగాఁ దక్కిన మూఁడువిషయములును బండితులను బట్టినవి" అని హితోపదేశము చేసినారు. కావచ్చును. "ఈ లోకమందలి దూషణ భూషణాదులు స్వర్గనరక కారణములు గావు. 'నిస్తుతి ర్నిర్నమ స్కారః' 'తుల్యమానావమానయోః' అనుకొని యూరకొంటిని. ఏమైనను, పైవారు తమ యభిప్రాయములను నా గ్రంథములను జదివి యిచ్చినవే యని సంతుష్టి నొందితిని.

కర్మఖండనము మొదటిపనిగా గొని, తమ సర్వారంభకత్వము నకు 'గజం మిధ్య పలాయనం మిధ్య' యని సమాధానమిచ్చుచు, మిథ్యా

చారాహార విహారులై సమత్వ ముపదేశించుచు దానినే నివృత్తిమార్గ మనుకొని శిష్యసంచయమున బ్రతుకు సన్యాసుల కీగ్రంథము కంటక ప్రాయము గావచ్చును. వారికి "అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం" "ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధం కర్మవైదికమ్" అని మనవి.

ఇక— "శాంకరమతమున కీ గ్రంథము విరుద్ధము" అనుకొను మహానుభావులకు, "విశిష్టాద్వైతాదులమాట యేమైనను, సిద్ధాంతలేశ సంగ్రహమందలి యద్వైతాంతర్భేదములమాట యేమందురు?" అని వినయపూర్వకముగ ఈ క్రిందిపంక్తులను గమనింపగోరెదము:

"అస్తి నాస్తీత్యాద్యాశ్చయావంతో వాఙ్మనసయోర్భేదాః యత్రైకం భవన్తి........అస్తినాస్తి. ఏకంనానా. గుణవదగుణం, జానాతినజానాతి, క్రియావదక్రియం, ఫలవదఫలం, సబీజం నిర్బీజం, సుఖం దుఃఖం, మధ్యమ మధ్యం, శూన్యమ శూన్యం. పరోహమన్య ఇతివా, సర్వ వాక్ప్రత్యయాగోచరే స్వరూపే యోవికల్ప యితుమిచ్ఛతి. సనూనం ఖమపిచర్మవద్వేష్ట యితుమిచ్ఛతి సోపానమివచపద్భ్యా మారోఢుం, జలేచ, ఖేచ, మీనానాం, వయసాంచ, పదం దిదృక్షతే"

మఱి ఈపంక్తులు శ్రీ శంకరాచార్యులవేయగుచో నిక మా దోష మేందు? ఉభయపక్షమేళనమునగాక, కేవల మొకపక్షము నాశ్రయించుట కృత్స్నసత్యమా? (ఇహైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా)

"సర్వం ఖల్విదం బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" "బ్రహ్మై వేదం సర్వం" "అశబ్ద మస్పర్శమ్" "సర్వకర్మా సర్వకామః" "తదేజతి తన్నైజతి" "నసత్తన్నాసత్" "సదసచ్చాహం" ఈ మొదలగు వాక్యములందలి యుభయపక్షములం దేయొకటియో తత్త్వమగుచో తక్కినవ దదితాదా? పర్యాయక్రమమో, ఉపాధిదృష్టియో స్వీకరించి సోపానక్రమమున నధికార తారతమ్యమను నెపమున నేమోచెప్పుట

కలహకారణముగాక సమన్వయకారణ మగునా? ఇందేపక్షము మంచి దన్నను రెండవపక్షము అతత్త్వమన్నట్లుకాదా? కనుక "సత్యం జ్ఞాన మనంతం"తో "నిత్యం విజ్ఞాన మానందం"ను క్రమముగా సమన్వయించి గానము సేయుటయే గీతాసిద్ధాంతమని 'కర్మణ్యకర్మయః పశ్యేత్' మొదలుగాగల వాక్యములవలన తార్కిక బుద్ధులకుగాక, బుద్ధినిమించిన ("యోబుద్ధేః పరతస్తుసః) అనుభూతిపరులకుఁ దోపకపోదు. ఆ యీ వివరణములెల్ల నా గ్రంథములను మొదటినుండియు సవిమర్శగ జదివిన వారికి విశదమే. కనుక జదువకయే పేరులు పెట్టువారికొరకు నిట జర్విత చర్వణము సేయఁదలపక "వాచోవిగ్లాపనంహితత్" అని యూరకుందును; ప్రధానముగ నా యుద్దేశ్యము "న వాదా"దిత్యాదిగ బైన మనవి చేసికొనియే యున్నానుగదా!

ఈ సంపుటమునందు, ప్రస్తుతమునకు దగిన నాల్గు ప్రసంగములను చివర జేర్చితిని. ఇవి యటనట నేకావించిన ప్రసంగములకు జెందినవి. శ్రోతలు సంక్షిప్తలేఖనమున నాకు దిరిగి దయచేసినవి ఇట్టివి చాల గలవు. అవకాశముంబట్టి కొన్నికొన్ని రాబోవు గ్రంధములందో, ప్రత్యేకముగనో ప్రకటించుకొనుచుందును.

ముద్రణావసరమున నేనస్వస్థతచే నిల్లు గదలక తమవంకఁ జూడకయున్నను, ఓర్చి యీ గ్రంథము నీ రూపమున ముద్రించియిచ్చిన అవంతీ ముద్రణాధికారులు బ్రహ్మశ్రీ మహీధర కృష్ణమోహనరావుగారికి వందనము లర్పించుకొనుచున్నాను.

తప్పులు చాలపడినవి; ఓపినకొలది సవరించితిని. తక్కినవి సవరించుకొన పాఠకులకు బ్రార్థన.

కేవలము గుణక్షీరములను మాత్రమే గ్రహించు పరమహంసలకు నమస్కరించి దోషైకదృక్కులగు కవిభుజాలకీ క్రిందిశ్లోకములు వేర్చి యర్పించుకొనుచున్నాను:

1. మన్నిందయాయదిజనః పరితోషమేతి
నన్వప్రయత్న జనితోఽయమనుగ్రహో మే,
శ్రేయోఽర్థినోహిపురుషాః పరతుష్టిహేతోః
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజంతి॥

2. సతలసులభదైన్యే నిస్సుఖే జీవలోకే
యదిమమ పరివాదాత్ప్రీతిమాప్నోతి కశ్చిత్,
పరివదతు యథేష్టం మత్సమక్షం తిరోవా
జగతి తు బహుందుఃఖే దుర్లభః ప్రీతియోగః॥

3. స్వధర్మ పీడామపహాయయోఽయం
మత్వాపళుద్ధ్యర్థ మిహప్రవృత్తః,
న చేత్క్షమామప్యహమస్య కుర్యాం
మత్తః కృతఘ్నో వదకీదృశోఽన్యః॥

4. కశ్చిత్పుమాన్ క్షిపతి మాం ప్రతిరూక్షవాక్యై
స్సోఽహం క్షమా భవన మేత్య ముదంప్రయామి,
శోకం వ్రజామిపునరేవ యతస్తపస్వీ
చారిత్ర తస్ఖలితవానితి మన్నిమిత్తమ్॥

—జ్ఞానాంకుశము.

మచిలీపాలెము,
1949
విరోధి,
విజయదశమి.

ఇట్లు
భవదీయుడు,
గ్రంథకర్త.

# చందాదారులు.

మ.రా శ్రీ ముదునూరి రాజగోపాలరాజు, ఆత్రేయపురం.
,, ముదునూరి పేర్రాజు, ,,
,, సాగి రామరాజు, ,,
,, చేకూరి తమ్మిరాజు ,,
,, ఇందుకూరి సూర్యనారాయణరాజు ,,
,, అల్లూరి రామరాజు, సఖినేటిపల్లి
,, రుద్రరాజు వెంకటరాజు, గోడి
,, గాదిరాజు వెంకటరాజు, ఎండగండి
,, పిన్నంరాజు నరసింహరాజు, మోగల్లు
,, వేగేశ్న సత్యనారాయణరాజు, మహదేవపట్నం
,, వేగేశ్న వెంకటసోమరాజు, ,,
,, భూపతిరాజు రామభద్రరాజు, కుముదవల్లి
,, దెందుకూరి రాజయ్య, కోలమూరు
,, సాగి సత్యనారాయణరాజు, చింతపల్లి
,, వేగేశ్న కనకదుర్గ వెంకటసత్యనారాయణరాజు, పాందువ్వ
,, చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాదరాజు, ఫత్తేపురం
,, చింతలపాటి సూర్పరాజు, గణపవరం
,, వేగేశ్న పెదసుబ్బరాజు, నరసింహపురం
,, గోకరాజు నరసింహరాజు, జువ్వలపాలెం
,, మంతెన నాగరాజు, ,,
,, వేగేశ్న సత్యనారాయణరాజు ,,
,, పెన్మెత్స సీతారామరాజు, సత్యవాడ
,, ఇందుకూరి రామరాజుగార్లు ,,

మ. రా. శ్రీ భూపతిరాజు సత్యనారాయణరాజు గారు, ఖండవల్లి
,, రుద్రరాజు బలరామకృష్ణంరాజు, చించినాడ
,, రుద్రరాజు రామరాజు ,,
,, రుద్రరాజు బాలవిజయ వెంకట నరసింహరాజు, చించినాడ
,, పేరిచర్ల అప్పలనరసింహరాజు, ఇలపకుర్రు
,, చిలువూరి సత్యనారాయణరాజు, ,,
,, జంపన నరసింహరాజు, ,,
,, దాట్ల బంగార్రాజు, కొమరగిరిపట్నం
,, రుద్రరాజు రామయ్య, వల్లూరు
,, కొండ మంగమ్మ, భీమడోలు
,, బాదర్వాడ వెంకటసుబ్బరాజు, భీమడోలు
,, నంబూరి జగ్గరాజు, ఉచ్చిలి
,, నంబూరి వెంకటసోమరాజు, ఉచ్చిలి
,, ముదునూరి గంగరాజు, గంటి
,, ముదునూరి సూర్యనారాయణరాజు, గంటి
,, సయ్యపరాజు సత్యనారాయణరాజు, ,,
,, దండు నరసింహరాజు, వెదురేశ్వరము
,, భూపతిరాజు కృష్ణంరాజు, బల్లిపాడు
,, వేగేశ్న రాజంరాజు, ,,
,, దండు సుబ్బరాజు, ,,
,, పాలకోడేటి సోమసుందరం, పాలకోడేరు (డైరెక్టరు : ది జ్యోతి పెయింట్స్ అండ్ వార్నిష్ ఇండస్ట్రీస్, మద్రాసు)
,, వేదాంతం నరసింహమూర్తి, అబ్బిరాజుపాలెం
,, వేదాంతం సీతారామయ్య,
,, మైలవరపు శేషగిరిరావుగార్లు, ఇలపకుర్రు

మ.రా శ్రీ కొమాండూరి గోపాలాచార్యులు, దొడ్డిపట్ల
,, ధరణీప్రగడ సుబ్బారావు, ,,
,, శేట్టలూరి విజయసారథ్యాచార్యులు, బూరుగపల్లి
,, నేదునూరి సత్యనారాయణమూర్తి పోడూరు
,, మలపాక సత్యనారాయణమూర్తి గుంపర్రు
,, కొంపెల్ల రామమూర్తి, గుంపర్రు
,, నండూరి సత్యనారాయణమూర్తి, వెంకటరామపురాగ్రహారం
,, వల్లూరి సూర్యనారాయణరావు, వల్లూరు
,, వల్లూరి కృష్ణమూర్తి, ,,
,, వల్లూరి నరసింహమూర్తి ,,
,, సన్నిధిరాజు సుందరం, గరగపర్రు
,, వెంపటి రామబ్రహ్మశాస్త్రి, చింతలమోరి
,, యర్రమిల్లి సత్యనారాయణ, ఓవర్సియర్-గణపవరము
,, చావలి సుబ్బారాయుడు, ఓవర్సియర్- సిద్ధాంతము
,, తమిరస రామచంద్ర వెంకటఅప్పారావు, ప్లీడర్-నర్సాపురం
బ్రహ్మశ్రీ మంచిరాజు చినవెంకటరత్నం, భీమడోలు
,, వడ్లపట్ల శేషమ్మ, ,,
,, పుల్లాభట్ల మల్లయ్యవారి కృష్ణమూర్తి,,
,, కొచ్చెర్లకోట సుబ్బారాయుడుగారి సత్యనారాయణ, భీమడోలు
,, కొచ్చెర్లకోట జోగిరాజు, భీమడోలు
,, కొచ్చెర్లకోట సత్యనారాయణ ,,
,, కూచిమంచి సూర్యనారాయణ, మిర్తిపాడు
,, శ్రీపాద దేవీశంకర ప్రసాదరావు, రాజమండ్రి
,, శ్రీపాద సుందరపార్థివేశ్వర ప్రసాదరావు, ,,
,, ఉపాధ్యాయుల నరసింహమూర్తిగార్లు, ,,

బ్రహ్మశ్రీ గోటేటి మహాలక్ష్మమ్మ. రాజమండ్రి
,, బులుసు పాపయ్యశాస్త్రి. ,,
,, వారణాసి వెంకటసుబ్బారావు. ఊనగట్ల
,, నందిగం సుబ్బారావు. ,,
,, విడమర్తి బాలసూర్య భీమరాజు. విడమర్రు
వైశ్యశ్రీ ఎలమరి సుబ్బారావు. (డి॥ జడ్జి) ఆత్రేయపురం
,, ఎలమరి వెంకటేశ్వర్లు. ,,
,, చెక్కా నాగన్న. పెదఅమిరం
,, పెరుమాళ్ళ వెంకటేశ్వర్లు. గరగపర్రు
,, మహంకాళి రంగయ్య. లక్కవరం
,, వందనపు నారాయణమూర్తి ,,
భజన సమాజము. ,,
బాలభక్త సమాజము. ఆత్రేయపురం
లైబ్రరీ. ,,
శ్రీయుత దొడ్డా (పే॥కు) సత్తిరాజు. చింతలమోరి
,, పడవల (మ॥కు) సత్తిరాజు ,,
,, పేరాబత్తుల వెంకటపతి. ,,
,, యెనుముల ఆంజనేయమూర్తి. కేశవదాసుపాలెం
,, పసుపులేటి వెంకటాద్రి. భీమడోలు
,, గుద్దంటి నరసింహమూర్తిగార్లు. వీరవాసరము

# విషయసూచిక.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 15 | కోశవము | కోశము |
| 3 | 1 | సమ్రాడ్రే | సమ్రాడే |
| 3 | 4 | త్వాహా | త్యాహా |
| 3 | 17 | విధియతే | విధీయతే |
| 5 | 12 | రూవ | రూప |
| 6 | 4 | వవ్య | వ్యవ |
| 7 | 8 | మిద్రియ | మింద్రియ |
| 8 | 3 | జ్ఞాగ | జ్ఞాన |
| 9 | 18 | భగం | భగ |
| 11 | 15 | మహా | మాహాః |
| 12 | 8 | కొప్తైవన | కొపైవన |
| 14 | 8 | యొన్న | యెన్న |
| 19 | 19 | యాస్తోప | యాప్తోప |
| 20 | 18 | బ్రూయః | బ్రూయుః |
| 21 | 3 | జుగ్వేద | ఋగ్వేద |
| 21 | 5 | ద్విజోశ్రై | ద్విజో |
| 23 | 21 | సాధునా | సాధూనా |
| 26 | 7 | ఇకొంక | ఇంకొక |
| 31 | 3 | గురువాం | గురుంవా |
| 31 | 7 | కట్టిలు | కుట్టిలు |
| 33 | 12 | పశు | పశ |
| 36 | 17 | నాచరించ | నాచరింప |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 117 | 8 | ప్రజాతి | ప్రజాపతి |
| 119 | 20 | బది | బడి |
| 124 | 12 | మాం ప్రద్యంతే | మాం ప్రపద్యంతే |
| 136 | 21 | ప్రబృతు | ప్రభృతు |
| 139 | 21 | సత్యపూత | సత్యపూత |
| 152 | 8 | యోగ | యోగ్య |
| 152 | 11 | యోగత్యం | యోగ్యతం |
| 154 | 16 | తరగుల | తరగతుల |
| 156 | 9 | అజ్ఞానపూర్వకములు, | అశుభసంస్కారములకు |
| 158 | 6 | ప్రాణో | ప్రాణ్వో |
| 159 | 4 | తేబో | తేజో |
| 159 | 5 | పధాన | ప్రధాన |
| 159 | 7 | శుక్లి | శుక్ల |
| 159 | 8 | ష్ఠిత | ష్ఠిత |
| 160 | 4 | దుక్థ | క్థ |
| 165 | 4 | శ్చిత్త | శ్చిత్త |
| 165 | 12 | విశేము | విశేషము |
| 166 | 19 | దేనస్ | ఏనస్ |
| 170 | 19 | జాంద్ర | జాంద్రా |
| 184 | 7 | న్వమే | న్వమే |
| 198 | 22 | కలో | లోకః |
| 200 | 20 | షత్తుల | ష్యత్తుల |
| 203 | 20 | వచిచించు | వచించు |
| .. | .. | హరి | హారి |
| 212 | 20 | అహాక | అహంక |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 229 | 12 | యాయెడ | యీ యెడ |
| 230 | 21 | వ్యాప్తి | వ్యాప్తి |
| 247 | 20 | తాకిక | లౌకిక |
| 248 | 9 | దేస్వర్గ | దేవస్వర్గ |
| 250 | 21 | నమ | సమ |
| 253 | 10 | స్మతః | స్మృతః |
| 254 | 4 | విషముల | విషయముల |
| 259 | 2 | యోగముజే | యోగముచే |
| 260 | 3 | విజాన | విజ్ఞాన |
| 278 | 2 | ప్రవృతి | ప్రవృత్తి |
| 288 | 13 | యాగ్నే | యాగ్నేయ |
| 292 | 7 | మాడు | మూడు |
| 298 | 8 | సించు | పించు |
| 299 | 16 | హ్రాస | హ్రాస |
| 303 | 25 | నిబంద | నిబంధన |
| 308 | 10 | ప్రదిపాద | ప్రతిపాద |
| 266 | 16 | తతౌ | తద్ |
| 272 | 16 | తే | లే |
| 309 | 14 | గ్వాలా | గ్వాలా |
| 314 | 20 | నుప్పు | టుప్పు |
| 318 | 2 | అవ్యక్తా | అవ్యక్తా |
| 321 | 18 | జ్ఞా | జ్ఞా |
| 323 | 15 | విస్వ | వివస్వ |
| 324 | 6 | యజు | యజ |
| 326 | 20 | కర్మ | కర్మా |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 327 | 2 | చేసు | చేసి |
| 328 | 5 | అందును-సమాపే | అందును-రెండును-సమా |
| 340 | 22 | ప్రాశ్చా | పాశ్చా |
| 343 | 15 | ఋత్వ | ఋత్వ |
| ,, | 16 | ఋత్వ | ఋత్వ |
| ,, | 18 | స్వయంబు | స్వయంభు |
| ,, | 19 | నబు | నబు |
| 348 | 8 | భేము | భేదము |
| 359 | 10 | వాగ్భా | వాగ్భా |
| 368 | 4 | స్వాంత్ర్య | స్వాతంత్ర్య |
| 369 | 2 | స్వః | స్వ |
| 370 | 5 | స్వవ్య | స్వన్య |
| 373 | 4 | యున్నది | యున్నవి |
| 375 | 11 | వివిరణ | వివరణ |
| °78 | 6 | క్షర | క్షరమ్ము |
| ,, | 7 | నశ్వర | నక్షర |
| 80 | 5 | గతం | గతః |
| 181 | 10 | పరం | పరః |
| 383 | 18 | ప్రథివి | పృథివి |
| 384 | 8 | వ_ర్త్య | వర్గ్య |
| 386 | 7 | ఋసోమ | ఋతసోమ |
| 389 | 7 | మంత్ర | మాత్ర |
| 390 | 22 | ఇతవ | ఇతరబ |
| 390 | 23 | శార | శాస |
| 402 | 2 | మాత్మ | మాత్మక |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 402 | 6 | హోమ | స్తోమ |
| 409 | 11 | కలది | కలదు |
| 414 | 15 | స్త్రీపుతళ్ళ | స్త్రీపుంవచ్ఛ |
| 415 | 16 | ఆస్య | ఆప్య |
| 415 | 21 | వైశ్వాక | వైశ్వా |
| 416 | 15 | స్మృతి | స్మృతి |
| 421 | 13 | అంత | అంత్య |
| 437 | 1 | పశ్చాక | పశ్చా |
| .. | 7 | మనుజుత | మనుజత |
| 440 | 18 | భూని | భూతాని |
| 446 | 3 | అంతలి | అందలి |
| 447 | 8 | అన్మాదస్యం | అన్నాదస్యం |
| 452 | 1 | అధిష్ఠాత్మ | అధిష్ఠాన |
| 454 | 4 | చిత | చితి |
| 456 | 1 | విశమ్ | విశ్వమ్ |
| 456 | 21 | ర్వేదిష్టం | ర్నేదిష్టం |
| 457 | 5 | ధిష్టాక | ధిష్ణాక |
| 458 | 9 | చ్ఛాగ | |
| 460 | 21 | అత్యా | ఇత్యా |
| 463 | 4 | త్రయా | త్రయీ |
| 463 | 12 | ప్రహణ | ప్రాణ |
| 469 | 12 | విశ్వోపదాన | విశ్వోపాదాన |
| 470 | 9 | పవర్గ్యము | ప్రవర్గ్యము |
| 480 | 14 | వృద్గల | పుద్గల |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 480 | 20 | ట్లవి | ట్లది |
| 484 | 13 | పంశు | పశు |
| 486 | 5 | ప్రయుక్తమో | ప్రయుక్తతమో |
| 487 | 2 | అవాధ | అవైధ |
| 487 | 21 | యకా | యవా |



నా "ముద్దుల చిట్టి"
లక్ష్మీనారాయణమూర్తి

ఓమ్
నమఃపురుషోత్తమాయ

# కర్మయోగవిజ్ఞానమ్

(గీతావిజ్ఞానాంతర్గతము)

## ఉపక్రమము

"మనకేమి కావలయును?" "యోగక్షేమోనః కల్పతామ్" భారతీయ ముముక్షువు కోరిక యింతే. వస్తువు లభించుట, అది యంతర్యామ* సంబంధముచే నాత్మం జెందుట ఇదే యోగము. అది నియతసమయమువరకు నుండుట క్షేమము. ఈ రెండును మానవజీవన పరమపురుషార్థములు. వానినే స్తుతిమంత్రములద్వారా మనము కోరికొనుచుందుము.

'ఏదో వస్తువు లభించుట' యన్నంతనే యోగశబ్దమునకు వ్యాఖ్య కాజాలదు. ప్రపంచము విశాలము, అనంతము. పదార్థము లనంతములు. మనుజుని కోరిక లనంతములు. ఎవడు దేనిని కోరడు? కోరినదాని నెల్ల బ్రతివాడును పొందగలడా? అసంభవము. భినభిన్న యోగ్యతలు, గుణములు, శక్తులు

* వస్తువును మనయిష్టము వచ్చిన ట్లుపయోగించుకొని స్వాతంత్ర్యము (స్వతంత్రః కర్తా) కలిగియుండుట అంతర్యామసంబంధము, అదే యోగము. అటుకానిది (బహిర్యామము) అది అయోగమే. దేశము దేశసంపత్తి మనకు బహిర్యామములు, కోశవమకోశాద్యక్షునకు బహిర్యామము. పారతంత్ర్యయోగము. ఇట్టిది కాదిచటి యోగము.

కల సాంసారిక పదార్థములను నియతయోగ్యతలు, గుణములు, శక్తులు కలవారే కేవల మిచ్ఛామాత్రమున పొందగలరనుట యసంభవము. అట్టిచో పదార్థప్రాప్తికై యేదో యొక మర్యాద నవశ్య మాశ్రయింపవలయును.

ప్రపంచము లనంతములు, పదార్థము లనంతములు, కోరికలు ననంతములే. మనుజుడననేమి? 'కామసముద్రము' అని శ్రుతియన్నది. ఆపూర్యమాణ సముద్రమునం దనంతతరంగములుచ్చావచభావమున నిటునటు డోలాయమానము లగునట్లే మనస్సముద్రమునందును, వివిధకామనాతరంగము లావిర్భావతిరోభావము లందుచుండును. మనుజుని ప్రతియొక క్రియయు, చేష్టయు, నేదో యొక కామనాప్రేరణఫలమే.

ఒక పెద్దబజారు వీథిలో నొకమేడపైనుండి క్రిందికి జూడుడు. నలుగడ నెన్ని నరముండములు వచ్చుచు బోవుచు నుండునో! ఒక్కొక ముండమేమి? ఒక్కొక కామసముద్రము! ఎన్ని లక్ష్యములు !! ఎన్ని కల్లోలములు !! "వానికి వీడు దానిని యిచ్చెను, వీడు వానికి దీని నిచ్చెను" అని యనుకొనుచుండురు. అవి వట్టిమాటలు. ఎవడు దేనినిచ్చును? ఈయగలడు? ఎవడు దేనిం గైకొనును? ఇదియంతయు గామక్రీడ-కౌతూహలము, దాతయు, ప్రతిగ్రహీతయు గామమే, ఇచ్ఛలేనిదే యెవడిచ్చును? ఎవడు కైకొనును? ఈకామసముద్రసామ్రాజ్యస్పష్టీకరణమున నీవచనముల వధేయములు.

1. కామోభూతస్య భవ్యస్య సమ్రాడే కోవిరాజతి
సఇదం ప్రతి పప్రధే ఋతూనుత్సృజతేవశీ
2. కఇదం కస్మా అదాదిత్యహ-ప్రజాపతిర్వై కః
సప్రజాపతయే దదాతి, ఇతికామః కామాయేత్వాహ
కామేనహి దదాతి-కామేన ప్రతిగృహ్ణాతి
3. కామోదాతా కామః ప్రతిగ్రహీతా ఇత్యాహ
కామోహిదాతా, కామః ప్రతిగ్రహీతా
4. కామం సముద్రమావి వేశేత్యాహ సముద్ర ఇవహికామః
నేవహి, కామస్యాంతోఽస్తి నసముద్రస్య. (తై. బ్రా.)

ఇట్టి యనంత కామనా సముద్రమున, దన శరీర నౌకను కామనారూప వాయుతరంగముల యూపుల కిటునటు డోలాయమానము గావించు కైవర్తుడు, కర్మభోక్త, జీవాత్మ తన కామనలంబట్టి యెప్పుడు దేని నొందునో నిర్ణయించుట కష్టము; ఈయనంతకామనలను, వీనికి జెందిన పదార్థముల యనంతతను గనుగొన్న నాత్మవిస్మృతి కలుగును, పరమపురుషార్థవంచన లభించును.

"ఇంద్రియాణాంహి చరతాం యన్మనోఽను విధియతే
తదస్యహరతిప్రజ్ఞాం 'వాయుర్నావమివాంభసి'

ఈ దుస్థితినంతయు నెరింగిన యాప్తకాములు, ఆత్మకాములు, నిష్కాములు, కృతకృత్యులు, మహర్షులు, ఇట్లు నిర్ణయించిరి.

"ఆపూర్యమాణమ చలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తియద్వత్
తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వేసశాంతి మాప్నోతి, నకామకామీ.

ఈ నిర్ణయ తాత్పర్యమేమన :—సాధారణులు కామనను సముద్రమనుకొందురు. వస్తుతః సముద్ర మాత్మ. ఇందలి తరంగములు కామనలు. వీని నాత్మ ధర్మమునం బ్రవేశపెట్టి నిష్కామమగు దానిని (ఆత్మను) సకామము గావించివైచితిమి. కామనలు మనవి. కాని మనము వానివార మైతిమి. సముద్రము యొక్క యనంతత, సాంత సాది కామనారూపమున బరిణతము గావింపబడినది. ఇదే యశాంతికి ముఖ్య కారణము. దీని దొలగింపవలయుచో సముద్ర తరంగ పార్థక్యమే కేవలోపాయము. "సాముద్రో హి తరంగః క్వచన సముద్రో నతారంగ" అను శ్రీశంకర సిద్ధాంతము ననుగమింప వలయును.

తరంగములు సాముద్రము లనుట నిజమే. కాని తరంగములది సముద్ర మెన్నడును గాజాలదు గదా! ఎన్ని తరంగములు, ఎన్ని నదులు సముద్ర గర్భమందుండి యేమి చేసిన జేయనిండు. ఆ యనంతముయొక్క యనంత శాంతికేమి? కామన పుట్టినది, కానిండు. వస్తువు ప్రాప్తించినది, కానిండు. ప్రాప్తింపలేదు, పోనిండు. కానిది కాదు, కానున్నది కాక మానదు. పరాధికారచర్చ మీకేల? ద్రష్టలగుడు, దృశ్యము కావలదు. "అశాంతి కలుగుచున్న" దందురా? దానితో మీకేమి? కానిండందుము. సాంతము, సాదియగు తత్త్వమే యశాంతి గావించుచున్నది. తా మనంత సముద్రములు. కామమూలాశాంతి మిమ్మేమి సేయగలదు? తాము తాముగా నుండుడు! ఇదే యశాంతినుండి తప్పించుకొను నుపాయము.

మహర్షులు నాల్గు భాగములు గావించిరి. కామనలు, జ్ఞాన - కర్మ - అర్థ - కలా - భేదమున నాలుగు. పదార్థములు నంతే.

విశ్వమంతటిమాట యెట్లున్నను, భారతవర్షమందే, వ్యవస్థితమైయున్న వర్ణవ్యవస్థ నాధారముగా గొని విచారించుచో ఆకామనలు, పదార్థములు చక్కగా బోధపడును. బ్రాహ్మణవర్ణమునకు జ్ఞానకామన; అధికారము జ్ఞానపదార్థములందు. క్షత్రియవర్ణమునకు కర్మకామన; అధికారము కర్మపదార్థములందు. వైశ్యవర్ణమున కర్థకామన; అధికార మర్థపదార్థములందు. శూద్రవర్ణమునకు కలాకామన; అధికారము కలాపదార్థములందు. ఇట్లు :-బ్రహ్మ-క్షత్ర-విట్-శూద్ర-భావములకు జెందిన నాల్గువర్ణములును గ్రమముగ ఈనాల్గు కామనల సీమలనుండి తమతమ కామనకు జెందిన యధికృతపదార్థముల నొంది దానితో నంతర్యామసంబంధముచే యోగముగావించి క్షేమపాత్రులు కాగలరు. ప్రాప్తవస్తురక్షణమే క్షేమముకదా! తన యిచ్ఛానుసారము తనయధికారమునకు వచ్చిన వస్తువునకే రక్షణ కాగలదు. పరాధికృతవస్తువు రక్షించుచున్నను హరింపబడును. లేదా హరణభయ ముండును. దానితో మనము సుఖింపజాలము. స్వకామానుబంధి పదార్థప్రాప్తి యున్నపుడే యోగక్షేమ మర్యాద; లేనిచో కాదు.

అందరకు నన్నియు గావలయును. కాని పొందు యోగ్యత? సమయము నెక్కడ? ఈశ్వరసిద్ధికొరకే సమాజవర్గ

కరణము గావింపనయ్యెను. విభక్తవర్ణములు తమతమ సంచిత తత్త్వములచే పరస్పరావశ్యకతాపూర్తులు గావించుకొనవలయును. "మావిద్విషావహై" ఇందువలన లోకతంత్ర మక్షుణ్ణముగ నుండును. రాష్ట్రము సమృద్ధముగ నుండును. విప్లవముతో బనియే యుండదు. పరిణామము? ఐహలౌకికాభ్యుదయనామకసుఖము రాష్ట్రమునకు బ్రాతిస్వికసంపత్తియగును. అదియే స్వ + తంత్రరాష్ట్రము. అందుకు వ్యతిరేకముగ బ్రాహ్మణసమాజము ధనలోలుపము, క్షత్రియవర్ణ మింద్రియలోలుపము, వైశ్యవర్ణము ధర్మసంచాలకము, శూద్రవర్గ ముపదేశకము నయ్యెనా, పర + తంత్రరాష్ట్రమగును.

ఇది యైహలౌకిక యోగక్షేమవిచారణ, పరమావధి యింతే, కాని భారతీయులకు దీనితో నాత్మసుఖ ప్రధానమగు పారలౌకిక యోగక్షేమముగూడ నుండవలయును. కనుకనే వారికి శరీరానుబంధి యోగక్షేమములకై వర్ణవ్యవస్థయు ఆత్మానుబంధియోగక్షేమార్థ మాశ్రమవ్యవస్థయుగూడ వెలసియున్నది. వర్ణాశ్రమసంస్కార వ్యవస్థావిజ్ఞానమునందా యావివరణములెల్ల నరయనగును.

బ్రహ్మకర్మవిజ్ఞానమందు ఆత్మయొక్క దివ్యపర్వములు, బ్రహ్మకర్మలనియు, లౌకికపర్వములు జ్ఞానక్రియలనియు, జెప్పియుంటిమి. బ్రహ్మకర్మలు రెండును ఆత్మస్వరూపములే. వీనికి యోగక్షేమమర్యాద ఘటితముకాదు. మనకు వేరుగ నుండు

దానితోడనేగదా యోగము? వ్యష్టిరూపములగు జ్ఞానక్రియ లాత్మసీమకు బాహిరములు. ఆత్మయొక్క బ్రాహ్మభాగము జ్ఞాగయోగమువలనను, కర్మభాగము క్రియాయోగమువలనను, ఉపకృతములగును. ఈదృష్టితో జ్ఞాన-క్రియా-భేదముచే యోగములు రెండే యైనను వీని మధ్యావస్థ, భక్తియోగమను మూడవయోగము (ఉభయయోగము) ఒకటి యేర్పడును. బ్రహ్మకర్మలకు యోగములేదు. యోగమన్నది వ్యష్టిరూపములగు జ్ఞానాదులకే. కనుకనే వెనుకటి ప్రకరణమును, బ్రహ్మకర్మవిజ్ఞానమని (యోగశబ్దము చేర్పక) వ్యవహరించితిమి. ప్రస్తుత ప్రకరణమును యోగభావముంబట్టి కర్మయోగవిజ్ఞానమంటిమి. బ్రహ్మకర్మలన్నవి కేవలము ఎఱుంగదగినవే. కర్మయోగమన్నది వ్యావహారికయోగము. ఇట్లే జ్ఞానయోగ-భక్తియోగములును వ్యవహారిక యోగములుగనే యెంచబడును.

సదసల్లక్షణబ్రహ్మ కర్మమూర్తియగు నాత్మబ్రహ్మయొక్క మౌలికరహస్యము నెరుంగుటయే ప్రథమాశ్రమము. (బ్రహ్మచర్యము) ఇందు ద్విజాతిబాలకుడు సఫలుడగు గురువుయొక్క సిద్ధాశ్రమమునందు యమనియమాది నియంత్రణమున నుండి బ్రహ్మకర్మ పరీక్షుగావించును. "ఇది నేను, ఇదిచేయవలయు" నను జ్ఞానము కలిగినతోడనే సమావర్తన సంస్కారానంతర మింటికి దిరిగివచ్చి మొదట కర్మయోగమాచరింపనై గార్హస్థ్యముంగైకొని, 50 సం॥ వయస్సు వచ్చువరకు గర్మ

మార్గ ప్రవృత్తుడై-ఆత్మయొక్క కర్మభాగము నీ వ్యష్టిరూప కర్మయోగమున నుపకృతము (వికసితము) గావించుకొనును. పిదప యుపాసనాప్రధానమగు వానప్రస్థాశ్రమ ప్రవేశము గావించి, ఈశ్వరప్రణిధానలక్షణ భక్తియోగమునొంది చివర కాత్మయొక్క బ్రహ్మభాగ వికాసముకొరకు చాలవదగు సన్న్యాసాశ్రమస్వీకారము గావించి జన్మసాఫల్యము నొందును. ఇట్లు బ్రహ్మకర్మ పరీక్షద్వారా, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములచే కర్మ-భక్తి-జ్ఞానభావ యోగములనొంది యాధ్యాత్మిక సంస్థను సబలము, సంపూర్ణము, గావించుకొని కృతకృత్యుడగుటయే ప్రాచీనాభిమత యోగపరంపర. గీతదృష్టియందు ఈమూడు యోగములును, ఒక విశేషకారణముచే యోగమర్యాదా వంచితములే. బుద్ధియోగమే యోగము. ఇదే దాని విలక్షణసిద్ధాంతయోగము. ఈదృష్టిలో యోగములు కర్మ-భక్తి-జ్ఞాన-బుద్ధి భేదములచే నాల్గు. అందు ప్రస్తుతము క్రమప్రాప్తము కర్మయోగము :-

ఇత్యుపక్రమః.

## 2. సంగతి

కుర్వన్నేవేహ కర్మాణి, జిజీవిషేచ్ఛతం సమాః
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి నకర్మలిప్యతే నరే.

కర్మయోగజటిలత సర్వవిదితము. భగవంతుడునూడ "గహనాకర్మణోగతిః" అనియెను. గొప్ప తత్త్వదర్శులుగూడ

నిందు కింక ర్తవ్యవిమూఢత నందుచుందురట! 'కిం కర్మేతి కిమ కర్మేతి కవయోఽప్యత్ర మోహితాః' సాధారణముగ భక్తి-జ్ఞాన యోగములు జటిలము లనుకొందురు. కారణము? భక్తచరిత్రలంజూడ, భగవంతుడు భక్తుల కారంభముననే యెన్నో పరీక్షల గావించునని తోచును. జ్ఞానకృపాణధారం గూర్చి జెప్ప నక్కరయే లేదు. "క్షురస్యధారా నిశితాదురత్యయా దుర్గం పథ స్తత్కవయోవద న్తి" కాని వా స్తవము వేరు.

భక్తిమార్గమం దారూఢుడైన పిదపనే భక్త పరీక్ష యారంభమగును. జ్ఞానయోగారూఢ యోగికి పతనభయ ముండుచుండును. కాని, ఇందన్ననో, 'ప్రథమ కబళే మక్షికా పాతః' ఇందు ఆరూఢుడైన పిదప సౌలభ్యమే, ఇది సుగమ పథమే. కాని ఆరూఢుడగుటయే కఠినము. కనుక ప్రాథమిక దృష్టింబట్టి యిది యీ రెంటిని మించినది. భక్తునకు - జ్ఞానికి, మోహముండక పోవచ్చును. కాని, కర్మఠునకో, పదేపదే మోహము నెదుర్కొనుచునే యుండవలయును. అప్పుడు మనోబుద్ధులు కుంఠితము లగుచుండును. అందుల కెన్ని యుదాహరణములనైన జూపవచ్చును. అథనుండి ఇతఃపరకు ధర్మసంకటములెన్నో కలుగుచుండును.

"పితుర్దశగుణం మాతా గౌరవేణాతి రిచ్యతే" అని ధర్మశాస్త్రవచనము. పరశురాముడు తండ్రిమాననతిమెయి దల్లి తల నరికెను. అది పవిత్ర కర్మయట! పిల్లి యెలుకం జంప నుంకిం

చును. "సబలప్రాణి దుర్బల ప్రాణిం జంపబోవుచో తటస్థ వ్యక్తి యా ఘాతుకవృత్తి నిరోధము గావింపవలయు" నని ధర్మాదేశము. సరియే. 'జీవో జీవస్య జీవనమ్' పారస్పరికాన్నాన్నాద భావముపైననే ప్రాణిజీవిత మాధారపడి యున్నది గదా! ఇప్పుడు పిల్లిం దరిమివైచి యెలుకను (మహాప్రాణిం జంపి, యల్ప ప్రాణిని) రక్షించుటా? మానుటా?

ఇట్లే సత్యాహింసాస్తేయాస్తిక్యాదులగు ధర్మాదేశము లన్నిటను, అపవాదములే యగపడును. ఇక నియమమునకు మహత్వ మెక్కడ? దేశ కాల పాత్ర ద్రవ్య శ్రద్ధా భేదముం బట్టి సత్యాహింసా పరిభాషలం దెన్నో భేదభావము లున్నవి. ఏమి చేయగలము. దేనిని మానగలము. తనకు నచ్చినట్లా? "స్వస్యచ ప్రియమాత్మనః" అని స్మృతియు జెప్పినది.

కాని, యా సిద్ధాంతము మాత్రము నిర్దోషమందుమా? దాని నూతగా గొని కొందరు మహానుభావులు "వర్ణాశ్రమ వ్యవస్థలు, మూర్తిపూజ, అవతార సత్త, తీర్థ మహాత్మ్యము శ్రాద్ధకర్మ మొదలగు శాస్త్రాదేశములు, బ్రాహ్మణుల స్వార్థ లీలలు. ఇవి యన్నియు దేశ, జాతి, వ్యక్తి వినాశ ముఖ్యకారణములు. 'స్వస్యచ ప్రియమాత్మనః' ఎవరి యిచ్చవచ్చినట్లు వారు నడచుటయే యుచితము" అందురు.

ఇందుపై త్రాగుబోతులను, వ్యభిచారులను, దొంగలను, జూదరులను ఏమనగలము. వారందరును 'ఆత్మనః తుష్టి రేవ చ' అందురు. మనువు కూడ "నమాంసభక్షణే దోషో,

న మద్యే న చ మైథునే, ప్రవృత్తిరేషా భూతానాం" అని మద్య పానాదికము స్వాభావిక ప్రవృత్తి యనియెను. "మద్య పానాదులచే బాహ్యజగత్తు పాడై సమాజోచ్ఛృంఖలత యేర్పడి, శాంతికి భంగము వాటిల్లునని యాత్మతుష్టివాదు లందురు గాక, యెట్లైనను ఆత్మతుష్టి సిద్ధాంతముగూడ నంతగా మహాత్త్వము కలది కాదు. ఈ చిక్కు వదల్చుకొనుట కింకొక పరిభాష నారయ వలసినదే.

'సమాజమున కొప్పైన సత్కర్మ లుపాదేయములు. తక్కినవి త్యాజ్యము లందుమా? ఈ సిద్ధాంతమును నిలువ జాలదు. దేశకాల పాత్రాదులంబట్టి సమాజమం దార్థిక, నైతిక పరివర్తనములెన్నో జరుగుచుండును. ఏ సమాజము నొకనియత స్వరూపానుగామిగ నుండదు. దైశిక - కాలిక రూఢివాదము లెన్నో అప్పటప్పటికి సామాజిక వ్యవస్థాంగోపాంగము లగుచు, కాలాంతరమున నవి ముఖ్యాంగములై శాశ్వత ధర్మముయొక్క స్థానముంగూడ నాక్రమించు కొనుచుండును. బహు భోజన, బహు వివాహ, బాలపరిణయ, కన్యావిక్రయ, వృద్ధవివాహా దులు సమాజమునకు ఘాతకములని యెరుంగుదుము. కాని రూఢి వాదులకు పెద్దల (నాయకుల) ముందర నోరెత్తజాలము. వారి పురాతన ఛాందస మటుంచుడు. కాని రూఢివాద భక్త సమాజము తన కళ్ళెము వారిచేత బెట్టినది. వారిమాటయే సమాజపు మాట. వారి నిర్ణయమే సామాజిక నిర్ణయము. కనుక పై సిద్ధాంతము నిలుచు టెట్లు? ఇంకొక మార్గము జూతము.

"సమాజ ప్రతిష్ఠగల శిక్షితులు లాభనష్టములు, సారాసారములు నెరింగిన శిష్టులు నిర్ణయించినది సమాజ కల్యాణము కొరకు" అందుమా ? అట్టివా రెవరు ? ఈ యోగ్యత లన్నియు సామయిక శాసన త్రయమునకు జెందినవి. శాసక యోగ్యతలను శాసిత రాష్ట్ర మనుగమించుట సామాన్యము. కనుకనే 'యథా రాజా తథా ప్రజా' 'రాజకాలస్య కారణమ్' అను వచనములు వెలసినవి.

శాసకజాతి యే శిక్ష, సంస్కృతి, సభ్యత, ఆచార వ్యవహారాదులందు బ్రతిష్ఠితమై యుండునో, వానిని తప్పనిసరిగ ననుగమించుట శాసితజాతుల విధి. అట్టి శాసక జనామోదితులే పూర్వోక్త యోగ్యతలు కలవారుగ నెన్నబడుదురు. కనుక అట్టిశాసక జాతులకు జెంది ఈ ధర్మములెల్ల, యోగ్యతలెల్ల సమాజ మూల స్తంభము లనవచ్చునా ?

ఉదాహరణమునకు భారతీయ సమాజమునే గైకొనుడు. తన శిక్షా, సభ్యతాది సంస్కృతులందేమియు బోలికలేని, శాసకజాతి ననుగమించుచున్నది. పాశ్చాత్య శిక్షకు బ్రధాన లక్ష్యము భూతోన్నతి, ఐహలౌకిక సుఖము. ఆత్మపరమాత్మలు స్వర్గనరకము, పుణ్యపాపములు, ముక్తి మొదలగు నతీంద్రియ పదార్థములు వారి శిక్షయందు లేనివానితో దుల్యములు. భారతీయ శిక్షయందన్ననో, భూతోన్నతికో, ఆత్మనిశ్శ్రేయస తాదరమును గలదు. వేసేల, ఈ రెంటి యుద్దేశ్యములందును,

సంస్కృతులందును, పూర్వ పశ్చిమముల కున్నంత భేదమే యున్నది. కానిందు, భారతీయ సమాజము శాసకనీతి నను గమింపక తప్పలేదు. ఫలితము ? అదే శిక్ష, అదే సభ్యత, అదే సంస్కృతి, అదే వివేకము, అదే ప్రతిష్ఠ, అంతట నన్నిట నదే యారాధ్య మంత్రము. పాశ్చాత్య శిక్షా నిష్ణాతులగు శిక్షకులే నేడు శిక్షితులు, సభ్యులు, వివేకులు, ప్రతిష్ఠితులు. వారి సిద్ధాంత ప్రచారమే నేటి భారత కల్యాణ కారకము. అని యొన్నబడుచున్నది.

ఇక తమ మౌలిక సంస్కృత్యధ్యయనము గావించిన భారతీయ విద్వాంసుల యభిప్రాయము బట్టి పాశ్చాత్య సంస్కృతి కేవలము భూతోన్నతికి గారణాభాసమై భారతీయత్వ సర్వనాశకారణమని సిద్ధమగుచున్నది. ఇరు దెగలవారును దామ సమాజ నేతలు కావలయునని యహమహమిక జూపు చున్నారు. పరస్పర నిందలతో గృతకృత్యుల మయ్యెద మను కొనుచున్నారు. తటస్థులు వీరిని సంస్కర్తలు, సనాతనులు అని పిల్చెదరు. ఈపేరులను మనముగూడ గొంతతప వంగీక రింతము.

సంస్కర్తలు :-వీరు గావింపనున్న సంస్కరణము రూఢి వాదముతోబాటుగ మౌలికతంగూడ సంస్కరింపనెంచు చున్నారు. రోగముతోబాటు రోగిసత్తగూడ నుంచరాదను చున్నారు. భారతీయ సభ్యతయందలి యేయంగము నుపయో గమునకు గాదని వీరిమతము. ఇక :-

సనాతనులు :-సత్యయుగ కల్పితస్వప్నములం గనుచున్నారు. రోగితోబాటు రోగమునుగూడ రక్షింపవలయునని పిరితలపు. మౌలికత్వావేశమునబడి రూఢివాదమునుగూడ ధర్మమనుకొని విఫలచేష్టల గావించుచున్నారు. ధర్మముం గుత్త గొన్నవారొకరు-వేరొక రామాట యన్నంతనే రోతపడువారు. విశుద్ధాదర్శవాదు లొకరు, ఇంకొక రుత్పథకర్మానుగాములు. ఒక రాలస్య ప్రతిమూర్తులు-వేరొకరు విరుద్ధకర్మలవలన గర్మ తులమను నభిమానము నొందువారు.

ఇందెవరును తమతప్పు నంగీకరింపరు. సిద్ధాంతములు మాత్ర ముదారములు. మాటవరుసకు విశ్వబంధుత్వ మాదర్శము. కాని వ్యవహారమం దణుమాత్రమును సహనశక్తి లేదు. తమ సిద్ధాంతమునకు విరుద్ధముగ నేమియు వినగోరరు. ఫలితము? నేటి మనసమాజమున కొకయాదర్శము, సిద్ధాంతము, వ్యవస్థితజీవనము లేదు. అందరు నేతలు, పండితులు, శిక్షితులు, వివేకులు, ప్రతిష్ఠితులు. ఇట్టిచో గర్తవ్యాకర్తవ్య నిర్ణయము గూర్చి పై సిద్ధాంతమునకు విలువయుండు టెట్లు?

ఇట్లు బుద్ధివాదము, ఆత్మతుష్టి, సమాజానుబంధము, నేతృత్వము మొదలగు నన్నియుపాయములును నొక విధముగ వ్యర్థములనియే సిద్ధమయినది. ఇక కర్తవ్యనిర్ణయమెట్లు? సమాజమందలి శిష్టులు, శిక్షితులు నగుమహానుభావుల చేతి యందు కర్తవ్యసూత్ర మున్నదనుట కొంతవరకు నిజమే, "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః" అన్నట్లు వారు

కర్తవ్యముల నాచరింతురు. అట్టివారి యాచరణముల ననుగమించుట మనబోంట్లకుచితము. కాని ఈయుపాయము మాత్రము అపవాదరహిత మనగలమా? అంకును భారతీయ సమాజమునందా? దీని సభ్యతకు జెందిన కొన్ని నియమములు ప్రకృతిదేవీ సంబంధముగలవి. సనాతనములు. ఎప్పుడు నేకరూపమున నడచుచుండును. పైయుపాయమును కర్తవ్యనిర్ణయము నెడ నపవాదరహితము కాదనుటకు అతీతవర్తమాన భారతశిష్టతంగూర్చి అవలోకించుకొందము అదియే చాలును.

శాసితజాతి తనకిచ్ఛలేకున్నను గతిలేక పాలకజాతి సంస్కృతి వేషము ధరించి తీరవలయునంటిమి. పిదప జిరకాలికాభ్యాసముచే నాశాసితుల యనిచ్ఛ యభినివేశపూర్వకేచ్ఛారూపమున బరిణమించును. నేడు చాలవరకాస్థితియే ప్రాప్తించుచున్నది. భారతము బాహ్యాశాసక ప్రసారితశిక్షాసభ్యతా ప్రవాహపతితమై కొట్టుకొని పోవుచున్నది. ఇక నొకవంక కేవలము ప్రాచ్యసభ్యతా పక్షపాతముగల ప్రాచ్యశిక్షాదీక్షితవిద్వద్వర్గముగూడ నప్పుడప్పుడు తన పద-నేతృతాభిమానముంగూర్చి యుద్ఘోషింపుచున్నది. చివరకు నేటి మనసమాజముభయతఃపాశరజ్జు గ్రహాగృహీతమై యున్నది.

ఇట్టి కర్తవ్యనిర్ణయజటిలత నేడేకాదు, గతయుగములందును గలిగియున్నది. నిండ్యమగు ద్రౌపదీవస్త్రాపహారణకర్మ సందర్భమున భీష్మునివంటివాని నోటినుండి 'ధర్మస్యసూక్ష్మగతిః' యను నిర్ణయము వినబడినది. ద్రోణునంతటివాడు పద్మవ్యూహము నెపమున నభిమన్యు నక్రమముగా మడియించెను.

ధర్మగ్లాన్యుపశమనార్థ మవతారమెత్తిన శ్రీకృష్ణభగవాను
దుర్యోధనుని తొడలు విరుగనేయ భీమునకు సన్న జేసె
ఏమందుము. ఈజటిలతల సన్నిటినుండియు దప్పించుకొనుట
ప్రాచీనసంప్రదాయపరంపరను జెందిన యీక్రింది శ్లోకః
జ్ఞప్తికి వచ్చుచున్నది.

"శ్రుతిర్విభిన్నా స్మృతయోవిభిన్నా నైకో ఋషిర్యస్యవచః ప్రమాణం
ధర్మస్యతత్త్వం నిహితంగుహాయాం. "మహాజనో యేనగతస్సపంథా

సూక్ష్మదృష్టి నవలోకించుచో నీ సూడశ్లో మెంత్తో మా
కము, కర్తవ్యాకర్మ నిర్ణయమున బరమోపాదేయము
తోచును. సామాన్యుల కింతకంటె మంచిమార్గమేదియు నుం
జాలదు. వేదము 'మాహింస్యాత్ సర్వాభూతాని' య
'అగ్నిషోమీయం పశుమాలభేత' యనుచున్నది. అంత్య
స్పర్శ నిషేధించు స్మృతియే దేవయాత్రా వివాహాదులం
"స్పృష్టాస్పృష్టిర్నదుష్యతి" యనుచున్నది. ఇట్టిచో సామ
న్యులు కింకర్తవ్యతా విమూఢులై లక్ష్యచ్యుతు లగుచుందు
అందరు నిట్టివిరోధములను సమన్వయించుకొనగలుగుదు రను
యసంభవము. కనుక 'మహాజనో యేనగతః సపంథాః' అ
టయే సంభవము. ఇందుకు రూపాంతరము గీతయు నీసిద్ధా
తానుగమన ముత్తమమన్నది.

"యద్యదాచతిశ్రేష్ఠః తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతే లోకస్తదనువర్తతే"

సామాన్యులకు గతిలేమి నీమార్గముమంచి దండుము. కాని యిదిమాత్ర మపవాదరహితమా? గుణదోషమయ ప్రపంచమునందు సర్వథానిర్దుష్టపరిభాష యేర్పరచుట యసంభవమే.

"దృష్టంకిమపిలోకేఽస్మిన్ ననిర్దోషంననిర్గుణం
అవృణధ్వ మతోదోషాన్ వివృణుధ్వంగుణాన్‌బుధాః"
"గుణదోషమయంసర్వం స్రష్టాసృజతికౌతుకీ"

ఒకచో శ్రుతియు నీమహాజనపథానుగమనమును (కొంచెము సంశోధించి) యాదేశించెను. లోకనీతి-రాజనీతియందు నిపుణులగు మహాపురుషులును మనుష్యులే. మనుష్యుని యంతర్జగత్తు 'అనృతసంహితావై మనుష్యాః' అన్నట్లు సర్వదా సత్యసిద్ధాంతానుగామి కాజాలదు. సమయానుకూల స్థితిగతులంబట్టి యందును బ్రమాదముకలుగుట స్వాభావికమే. కనుక మహాపురుషుల సుచరితలను, సదాచరణలను, అనుగమించుటయే మన కర్తవ్యము. వారి యితరచరిత్రల మీమాంసతో మనకు బనిలేదు. ఇదే సంశోధన గావించి శ్రుతి చెప్పియున్నది.

"యాన్యస్మాకంసుచరితాని తానిత్వయోపాస్యాని నోఇతరాణి
యాన్యనవద్యానికర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి" (తై. ఉ.)

ఇంతటితో లోకనీతి-రాజనీతి గాధయైనది. ఇక ధర్మనీతి సంబంధమునందు మహాజనశబ్ద పరిభాషయేమో చూతము. లోక-రాజనీతులు దృష్టపదార్థములకును, ధర్మనీతియదృష్టపదార్థములకును జెందినవి. ధర్మనీతికి జెందిన కర్తవ్యకర్మలంగూర్చి

యదృష్టాతీంద్రియతత్త్వద్రష్టులగు నాప్తమహర్షులేమహాజనులు. లోక-రాజనీతి నిపుణవ్యక్తులింకఃప్రమాణభూతులుగారు. ఏదేశ సభ్యత, సంస్కృతి ఆచార వ్యవహారాదులు కేవలము రాజనీతికే ప్రధానతనిచ్చునో ఏదేశరాజనీతితంత్రమందు ధర్మనీతి స్థానము కేవలము గౌణమో, అనగా ధర్మవాదమునకు ప్రకృతితో సంబంధములేక కేవలము మతవాదమాత్రముగ నుండునో ఆదేశముల మాట యటుండనిండు. అచట భూతోన్నతియే ప్రధానలక్ష్యముగాగల రాజనీతిపారదర్శులే మహాజనులు.

మనవిచారణ భారతదేశమునుగూర్చి. ఎంక, కృష్ణమృగము స్వేచ్ఛగ సంచరించునో ఎందు ధర్మతత్త్వము ప్రధానమో ధర్మనీతిననుగమించు రాజ-లోకనీతులే రాజ-లోకనీతులుగ నెంచుఎంచబడునో, ఎందు భూతోన్నతి ప్రధానలక్ష్యముగల రాజ-లోకనీతు లుపేక్షింపబడునో వీనివలన ధర్మవృషభమున కేమూఘాతము తగిలినను ఎందు ఓర్వబడదో, అట్టి సంఘర్షణావసరమున నితరనీతులెల్ల ధర్మనీతియెదుట నుపేక్షింపబడునో అట్టి భారతదేశముంగూర్చి ప్రస్తుతము విచారించెదము. ఒకమారా ? వేలకొలది పర్యాయములు ధర్మనీతికి ముఖ్యస్థానమీయవలసిన యవసరము లిట దటస్థించెను.

ధర్మప్రవర్తకులగు నాప్తమహర్షుల యాప్తోపదేశరూప శబ్దశాస్త్రమే కర్తవ్యకర్మనిర్ణయమందు ఇట ప్రధానముగ నెంచబడినది. లోకోన్నతి నాశించి లోక-రాజనీతులను

ప్రాధాన్య మిచ్చిన మహాపురుషుల యాదేశము లుపేక్షింపబడినవి. మరియు తత్త్వజ్ఞానాభావముచే కేవలము తమతమ కల్పనల నూతనగాగాని చిరంతనపరంపర నుపేక్షించి ధర్మములకు దత్ప్రతిపాదక శాస్త్రములకు తమతమ యిచ్ఛవచ్చిన వ్యాఖ్యలంగావించు సాహసమునకొడిగట్టిన యదృష్టవాదులగు మహాపురుషుల యాదేశములు నుపేక్షింపబడినవి.

చివరకు :-ఎట్టివారి నార్యజాతి మహాపురుషులనును? సందేహశూన్యముగ నిశ్చిత తత్త్వ వాద ప్రతిపాదనగావించు వేదశాస్త్రపారదర్శులగు విద్వాంసులను. ఎవరి యాదర్శముల ననుసరించును? వేదశాస్త్ర మాదర్శముగాగలవారి వచనములను. శాస్త్రప్రమాణయుక్త మహాపురుషవచనములనే కర్తవ్యాకర్మనిర్ణయముంగూర్చి ప్రమాణములుగ మన్నించును. మానవ ధర్మ రహస్య వేత్తయగు భగవంతుడు మనువు మహాజనశబ్దమున కీవ్యాఖ్యయే మన యెదుట నుంచెను. చూడుడు :-

1. నైఃశ్రేయసమిదంకర్మ యథోదితమశేషతః
మానవస్యాస్యశాస్త్రస్య రహస్యముపదిశ్యతే
2. అనామ్నాతేషుధర్మేషు కథంస్యాదితిచేద్భవేత్
యంశిష్టాఃబ్రాహ్మణాః బ్రూయః సధర్మస్యాదశంకితః.
3. ధర్మేణాధిగతోయైస్తు వేదఃసపరిబృంహణః
తేశిష్టాఃబ్రాహ్మణాఃజ్ఞేయాః శ్రుతిప్రత్యక్షహేతవః.
4. దశావరావాపరిష ద్యంధర్మంపరి కల్పయేత్
త్ర్యవరావాఽపివృత్తస్థా తంధర్మంనవిచాలయేత్.

5. త్రైవిద్యో హేతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా.

6. ఋగ్వేదవి ద్యజుర్విచ్చ సామవేదవి దేవచ
త్ర్యవరాపరిషద్జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే.

7. ఏకోపివేదవిద్ధర్మం యంవ్యవస్యేద్ద్విజోత్తమః
సవిజ్ఞేయః పరోధర్మో నాజ్ఞానాం ఉదితో ఽయుతైః.

8. అవ్రతానామమంత్రాణాం, జాతిమాత్రోపజీవినాం
సహస్రశః సమేతానాం పరిషత్త్వం న విద్యతే.

9. యంవదంతి తమోభూతా మూర్ఖాధర్మ మతద్విదః
తత్పాపంశతధాభూత్వా తద్వక్తౄననుగచ్ఛతి.

10 ఏతద్వోఽభిహితం సర్వం నిశ్శ్రేయసకరంపరం
అస్మాదప్రచ్యుతో విప్రః ప్రాప్నోతి పరమాంగతిమ్.

ఇందలి శిష్టులే మహాజనులు. వీరివచనములే—తద్
సంగ్రహరూప శబ్దశాస్త్రమే కర్తవ్యాకర్మనిర్ణయమునం
దిగ్ప్రమాణము. కారణము ? కర్మయన్న దొక యతీంద్రి
పదార్థము. ఏకర్మనుండి యెప్పుడేవిధముగ నేసంస్కా
జనించునో దానిలేపముచే ప్రజ్ఞానమగుమనస్సునకు ఏ హి
హితములు వాటిల్లునో మన చర్మచక్షుర్విషయము గా
ఆయా కర్మరహస్యపరిణామ సాక్షాత్కారమున కొక వి
దృష్టి కావలయును. అయ్యది చిరకాలతపోయోగ ద్వారః
ప్రాప్తమగును. వేదశాస్త్రమును, తదనుగామియగు ధర్మ
శాస్త్రమును, విదితవేదితవ్యులు, అతీతానాగతజ్ఞులు, సా

త్కృతధర్మములు నగు మహర్షులప్రత్యక్షదృష్టికి జెందినవి. వారు తమ చిరకాలతపోయోగ ప్రాప్తమగు దివ్యదృష్టి (అంతర్విజ్ఞాన యోగార్థదృష్టి) చే నీగుప్తరహస్యములను సాక్షాత్కారము గావించుకొనిరి. అవియే శబ్దశాస్త్రముద్వారా మనయెదుటకు వచ్చినవి. మన కవియే ప్రత్యక్షప్రమాణములు. అందెట్టిసందేహావసరము నుండజాలదు. ఇక నందుపదేశింపబడిన మార్గమును, నిర్ణయమును అనుసరించి మనస్సును, ఇంద్రియములను నడపుటయే మనపని. "శబ్దప్రమాణకా వయం యదస్మాకం శబ్దఆహ తదస్మాకం ప్రమాణమ్" ఈ ప్రమాణవాదమం దపవాదమున కించుకయు దావుండదు. ధర్మమన ప్రకృతియే. తద్విచారణజ్ఞానము అతీంద్రియదృష్టికి జెందినది. అందు అట్టి దివ్యదృష్టిగలవారి వచనములే ప్రమాణములుగ గొని నడువక తప్పదు.

ఇక కేవలతర్కవాదము నూతగాగొని తదభినివేశమునబడి యథేచ్ఛగ ధర్మనిర్ణయ దుస్సాహసికులగు బుద్ధివాదులు తాముపాపకర్మల నాచరించుటేగాక సమాజపతనమునకును గారణులగుచున్నారు. వీరొనరించు పాపము సమాజవ్యవస్థయందుచ్ఛృంఖలతం బెంచి కాలాంతరమున సమూలనాశము గావించును. బలప్రథా నాసురప్రాణానుగ్రహమున గొంతకాలము ముగ్ధసమాజ మీబుద్ధివాదుల ననుగమించినను, అవిద్యాతమోభావములకు జెందిన కేవలభూతోన్నతిద్వారా వీరు కొంతకాలమున్నత సంపన్నులవలె గన్పట్టినను పరిణామము

సర్వనాశమే. ఏమి? ఉచ్ఛృంఖలము, అశాస్త్రీయము, తము నగు కర్మమార్గము తమోగుణప్రధానమై యాసురభ త్తేజక మగును. అది యర్థసంపత్తి కుత్తేజకము. ఇక ద గామియగు తామసవ్యక్తి కొంతకాలము సమృద్ధిశాలిగ ఁ నను పరిణామము? ప్రకృతిసిద్ధమే. (ధర్మసిద్ధమే)

"అధర్మేణైధతేతావత్ తతోభద్రాణిపశ్యతి
తతఃసపత్నాఞ్జయతి సమూలస్తువినశ్యతి."

'ఉత్ + నతి' లక్షణముగల యున్నతినే వైహిక సుఖ మనుకొని అశాంతిమయ భూతవిప్సంబడి 'తిన త్రావుట, యానందించుట' యే జీవనముఖ్యోద్దేశ్య మనుకొ వారి దృష్టిలో నాబూర్వోక్తమగు ధర్మమయ-ఉత్పధగా కర్మవాద ముపకారకమగుగాక! కాని ఆస్తికభారతీయుడు ఆ సత్తపై విశ్వాసముంచి పుణ్యాపాపభావములు తథ్యపూర్ణ లుగనెంచి శాంతిపూర్ణములగు నైహలౌకి కాభ్యుదయములఁ బాటుగ బారలౌకిక నిశ్శ్రేయసుఖమును జీవనముఖ్యోద్దేశ్య లుగ నెంచును. అతనిదృష్టిలో శబ్దశాస్త్రప్రమాణీకృత ధ పథమే కల్యాణప్రదము. ఇట్లు చివరకు :- కర్తవ్యకర్మనిర్ణ విషయమున నపవాదరహితమగు శబ్దశాస్త్రముపైనే విశ్రమిం వలయును. ఈక్రిందివచనముల నవలోకింపుడు :-

1. వేదోఽఖిలోధర్మమూలం స్మృతిశీలేచ తద్విదామ్
ఆచారశ్చైవసాధునా మాత్మనః తుష్టిరేవచ

2. యఃకశ్చిత్ కస్యచిద్ధర్మో మనునా పరికీర్తితః
ససర్వోఽభిహితో వేదే సర్వజ్ఞానమయో హి సః
3. సర్వంతుసమవేక్ష్యేదం నిఖిలంజ్ఞానచక్షుషా
శ్రుతిప్రామాణ్యతో విద్వాన్ స్వధర్మేనివిశేతవై
4. శ్రుతిస్మృత్యుదితంధర్మం అనుతిష్ఠన్హి మానవః
ఇహకీర్తిమవాప్నోతి ప్రేత్యచానుత్తమంసుఖం
5. శ్రుతిస్తువేదోవిజ్ఞేయో ధర్మశాస్త్రంతువై స్మృతిః
తేసర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాంధర్మోహినిర్బభౌ
6. యోఽవమన్యేత తేమూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః
ససాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః
7. వేదస్స్మృతిఃసదాచారః స్వస్యచప్రియమాత్మనః
ఏతచ్చతుర్విధంప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణం
8. అర్థకామేష్వసక్తానాం ధర్మంజ్ఞానంవిధీయతే
ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణంప్రథమంశ్రుతిః.

ధర్మమునం దన్నిటికంటె మొదటిదగు మూలప్రమాణము మంత్రబ్రాహ్మణాత్మక వేదమంతయు నగును. ఇక తదనుగతమగు స్మృతి రెండవప్రమాణము. తద్విదుల—అనగా వేదవేత్తల శీలము మూడవప్రమాణము. సాధుపురుషుల యాచరణము నాల్గవప్రమాణము. ఆత్మతుష్టి యైదవప్రమాణము.

"1 బ్రహ్మణ్యత, 2 దేవపితృభక్తత, 3 సౌమ్యత, 4 అపరోపతాపిత, 5 అనసూయత, 6 మృదుత, 7 అపా

రుష్యం, 8 మైత్రతా, 9 ప్రియవాదిత్వం, 10 కృతజ్ఞత, 11 శర
ణ్యత, 12 కారుణ్యం, 13 ప్రశాంతచిత్తత, ఇతిత్రయోదశవిధం
శీలం" అను హారీతవచనానుసారముగ నీత్రయోదశవిధ శీల
గుణములు గలవారి వచనము ధర్మమునకు ప్రమాణము. అట్టి
వారు వేదము నాధారముగాగొని ధర్మనిర్ణయము సేయుదురు.
వేదనిష్ఠలేని శీలోదయ మసంభవము. పూర్వజన్మకృత సుకృత
కర్మల యనుగ్రహముచే సహజముగ నుదయించిన శీలమును
సామయిక స్థితిగతులు ప్రవాహమునంబడి పాడుచేసికొను వారి
వృత్తి, ధర్మమునందు ప్రమాణముకాదు. ఏస్థితియందైనను
సిద్ధాంతమునందు వేదమే ధర్మమూలము. తదనుగతమును
తత్ప్రమాణానుగతము, తత్సిద్ధాంతసమర్థకము నగు శీలగుణమే
ధర్మమందు ప్రమాణము. వేదవిరుద్ధములగు కారుణ్యాదుల
ననుగమించువారు ధర్మనిర్ణాయకులు కాజాలరు. కనుకనే
"స్మృతి-శీలేచతద్విదామ్" అని మను వనెను. శ్రుతి ననుగ
మించినదే స్మృతి. వేదానుగత శీలమే ధర్మమూలము.

కొందరాత్మతుష్టియన "తమకు మంచిదనితోచినది" అను
కొందురు. అది ప్రమాదము. ఆత్మతుష్టియన్నది వికల్పభావ
మునకు జెందినది. ఒకానొక గుప్తమాలికరహస్యముం బట్టి
శ్రౌతాదేశములు మనస్థూలదృష్టికి విరోధములుగదోచును.
కాని మనకట్టిచో రెండుపక్షములును ప్రమాణములగును.

"శ్రుతిద్వైధంతుయత్రస్యాత్ తత్రధర్మావుభౌస్మృతౌ
ఉభావపిహి తౌధర్మౌ సమ్యగుక్తౌ మనీషిభిః"

మరియు జ్ఞానకర్మోపాసనల యితికర్తవ్యతలం గూర్చియు శ్రుతి యనేకవికల్పములను అంగీకరించినది. అన్నియు ప్రామాణికములే. సాధకుడగు వాత డెందు తనయోగ్యత, ఇచ్ఛయు, జూచికొని యేవికల్పములైన ననుగమింపవచ్చును. కనుక స్మృతి "ఆత్మనః తుష్టిరేవచ" అనియెను. దానికి గర్గుడును 'వైకల్పికే ఆత్మతుష్టిః ప్రమాణమ్' అని వివరణమిచ్చెను.

ఇకొంకవిషయము :- శీలము, సాధ్వాచరణము మొదలగు ప్రమాణముల ప్రామాణ్యమునకు వేదప్రామాణ్యమునే మూలముగా జెప్పిన మనుస్మృతి, యథేచ్ఛాచారమును ఆత్మతుష్టిగా జెప్పుననుట పరిహాసాస్పదము, అసంభవము ననుకొనవలెను. ఇంకను :-

వేదసమ్మతస్మృతులన్నియును, శీల సాధ్వాచారాత్మతుష్ట్యాదులును, వేదమూలకములైననే ధర్మనిర్ణయమందు ప్రమాణములు. అయినను, వేదముతక్క తక్కిన ధర్మప్రమాణములందును, మనుస్మృతిస్థానము ముఖ్యము. కారణము ? అందలి ప్రతిసిద్ధాంతమును స్పష్టముగ వేదమం దుపలబ్ధమగుచున్నది. కనుకనే శ్రుతియు "మనుర్వైయత్కించిదవదత్ తద్భేషజం భేషజతాయాః" అనియెను. ఇతరస్మృతులు భారతము, మానవధర్మశాస్త్రము ముఖ్యమన్నవి. ఇందువలన మనుస్మృతిసిద్ధాంతానుగమనమునేయు స్మృతులే ధర్మనిర్ణయమందు ప్రమాణములనియు దేలుచున్నది. మనుస్మృతి కింత

యుత్కర్ష వచ్చుటకు గారణ మది వేదము ననుగమించుటవల ననే. చూడుడు:-

1. వేదార్థోపనిబంధత్వాత్ ప్రాధాన్యంహిమనోస్స్మృతం
మన్వర్థవిపరీతాతు యాస్మృతిగసానశస్యతే
2. తావచ్ఛాస్త్రాణిశోభన్తే తర్కవ్యాకరణానిచ
ధర్మార్థమోక్షోపదేష్టా మనుర్యావన్నదృశ్యతే. (బృహస్పతి)
3. పురాణంమానవోధర్మః సాంగోవేదశ్చికిత్సితమ్
ఆజ్ఞాసిద్ధానిచత్వారి నహన్తవ్యాని హేతుభిః. (భారతము)
4. యావేదబాహ్యాఃస్మృతయః యాశ్చకాశ్చకుదృష్టయః
సర్వాస్తానిష్ఫలాఃప్రేత్య తమోనిష్ఠాహితాఃస్మృతాః."
(మనుస్మృతి)

ఇంతటితో బుద్ధివాదులకు ధర్మకర్మనిర్ణయమందు బుద్ధి తర్కముల కేమియు విలువ లేదని యెరుకపడగలదు. కారణము? అది బుద్ధికతీతవిషయము. మానవబుద్ధివికాసము మనస్సు ద్వారా ఇంద్రియముల నాధారముగాగొని దృష్టబాహ్యజగత్తుపై నాధారపడియున్నది. ఏపదార్థములం దింద్రియములకు గతికలదో వానియందే మన మనోబుద్ధులు వ్యవహరింపగలవు. ధర్మకర్మలందుకు లొంగునవి కావుగదా! కనుక నట్టియతీంద్రియ తత్త్వవిషయములందు కేవల మైంద్రియకజ్ఞానముగల యస్మదాదులబుద్ధి యుపయోగింపబడజాలదు.

"సర్వంకర్మేదమాయత్తం విధానే దైవమానుషే.
తయోర్దైవమచింత్యంతు మానుషే విద్యతే క్రియా" (మనువు)

కనుక నట్టియెడ నాయతీంద్రియద్రష్టల వచనములే ఇంద్రియభక్తులమగు మనకు ప్రత్యక్షప్రమాణములు. శబ్ద ప్రమాణముకంటె నన్యమార్గములేదు. పుణ్యపాప ధర్మాధర్మములం గూర్చిన జ్ఞానమునకై శబ్దమే శరణ్యము. ఎట్లన :-

## హింసాహింసలను గూర్చి

విచారింపుడు :-మనోవాక్కాయకర్మలచే దేనికి నేకష్టమును గల్గింపకుండుట యహింస. కల్గించుట హింస. అది శాంతి, ఇది యశాంతి కల్గించును. ఇంతవరకు నిర్వివాదమే. కాని యీవిషయమున బుణ్య-పాపము లనునవి రాగానే మన బుద్ధి కుంఠితమైపోవును. అహింసవలన సుఖము, హింసవలన దుఃఖము వచ్చుటనిజమే. సుఖదుఃఖము లింద్రియానుభూత విషయములు. కాని పాపపుణ్యములన్నవి అతీంద్రియవిషయములు. హింస పుణ్యము, అహింస పాపము అని యేల యొప్పుకోరాదు? అన్నచో బుద్ధివాద మేమియు చేయజాలదు.

శబ్దప్రమాణము నాశ్రయింపనిచో నీతగవుతీరదు. పాపపుణ్యము లనునవి యతీంద్రియసంస్కారములు, చర్మచక్షుఃపరములు. యోగు లింద్రియాతీత మగు నార్షదృష్టితో నీసంస్కారములను సాక్షాత్కరించుకొనిరి. వారి కథనమే యిందు నిర్ణాయకము. వారి వ్యవస్థంబట్టి యేవిమర్శయు లేకుండ నడువవలసినదే.

మన మనుకొను హింసాహింసల కేమియు విలువలేదు. ఇవి ప్రత్యక్షదృష్ట సుఖాసుఖములంబట్టి నిర్ణయింతుము. శాస్త్రము వీనినిగణింపదు. మనము పుణ్యమనుకొనున దందు పాపముగా నుండును. మనకు హింసగాదోచిన దందహింస యే యగును. ఇంద్రియాతీతసంస్కారములు, పుణ్యపాపము లనునవే హింసాహింసా వ్యవస్థాపకములనియు శబ్దశాస్త్రమే యిందు కాధారమనియు ఫలితార్థము. అవి మన యనుభవమునకు విరుద్ధములుగ దోచినదోచనిండు.

యజ్ఞమందలి పశుపురోడాశము, భగవతికాళియెదుటి పశుబలి యీకోటిలోనివే. మనదృష్టికివి హింసలయ్యు పాపములయ్యును, శాస్త్రదృష్టికివి యహింసలు పుణ్యములు. వర్తమానసభ్యత యీవిషయమున గోపించుగాక. సత్యము గప్పిపుచ్చజాలము. యజ్ఞమునందలి పశువధంగూర్చి నేడెన్నో యూహాపోహాలు సాగుచున్నవి. అహింసను బోధించిన శాస్త్రమే యీహింసను వచించుటలో నేదో రహస్యము-తథ్యము నుండియుండును. ఆయతీంద్రియ తథ్యము మన కెరుకపడ కున్నను, తలవంచి యంగీకరింపవలయును. ఇట పశ్వాలంభనమీమాంసయను ప్రకరణము నరయవలయును.

కొంతతడవు ధర్మనీతినటుంచి లోకనీతిదృష్టితో హింసాహింసలనరయుదము. రాష్ట్రసమృద్ధికై జ్ఞానక్రియార్థశిల్పవాణిజ్య సేనాశస్త్రాదులగు సాధనములెల్ల తప్పక యుండవలసినవేగదా! ఇందు రాష్ట్రరక్షణకు సేనసదాసజ్జీభూతముగ నుండవలయును

గదా! సరియే. అక్షత్రసమాజము తనశస్త్రప్రయోగాభ్యాస ముం జక్కగ గాపాడుకొనుటకు సాధనమేమి? మనుష్యుల నందుకు సాధనములుగ గొనవలయునా? శాస్త్రము నడుగుడు! యథావసరమున ఆరణ్యక హింసక పశుసంహారము. కల్పిత పుత్తలికానుగమనము మొదలగు సాధనముల వలనను, బలి దానప్రథమునను తదభ్యాసరక్షణ గావించుకొనగలదు. మానవ సమాజహితార్థ మీహింసాకర్మలను మన మాదరింపవలసినదే. అందరును జపమాలలద్రిప్పుచున్న బనిజరుగదుగదా! తమ తీక్ష్ణశస్త్రధారలచే శత్రుమర్మభేదన మొనరించిన క్షత్రియులంద రును చండికా-బలి కనన్యోపాసకులన్నది యొక ఐతిహాసిక సత్యము. దౌర్భాగ్యవశమున భారతవర్షము అనైభాహింసా వాదమునంబడి బౌద్ధకాలమునుండియు శస్త్రబలముం బోగొట్టు కొన్నది.

సమాజమునకు ధార్మికశిక్షనొసంగు బ్రాహ్మణవర్గ మాధ్యాత్మికభావముల నుపాసించున దగుట నది శస్త్రబల సార్థక్యము కలది కనుక "శస్త్రధారణ బ్రాహ్మణునకు నిషిద్ధ" మని మన్వాదులు వచించినను వారే సమయవిశేషావసరము లంబట్టి బ్రాహ్మణుడు శస్త్రముంబట్టవలయు ననియు నాదే శించిరి. ఇట్టిచో నేటి యధ్యాత్మవాదము ననుసరించు కల్పితా హింసకు విలువయెట్లు?

1. శస్త్రంద్విజాతిభిఃగ్రాహ్యం ధర్మోయత్రోపరుధ్యతే
ద్విజాతీనాంచవర్ణానాం విప్లవేకాలకారితే

ఆత్మనశ్చపరిత్రాణే దక్షిణానాంచసంగరే
స్త్రీవిప్రాభ్యుపపత్తౌచ ఘ్నన్ధర్మేణనదుష్యతి
గురువాంబాలవృద్ధౌవా బ్రాహ్మణంవాబహుశ్రుతం
ఆతతాయినమాయాంతం హన్యాదేవావిచారయన్. (మనువు)

ఈకల్పితాహింసావాద బిభీషికవల్లనే మనయాయుర్వేద ...ందలి శల్యచికిత్స, శస్త్రచికిత్సలు నాశనమైనవని చెప్ప ...క్కరలేదు. కత్తులుగూడ నసిధార నాలింగనము గావించు ...ద్చి నేటివారు ఎలుకంజూచి భయపడువారైరి. ఇక శస్త్ర యోగాభ్యాసముగలవారి యెదుట మనమేమగుదుమో ...ప్పనక్కరలేదు.

ఇదియంతయు గల్పితాహింసామోహ ఫలము. పిరికి ...ము మనపౌరుషమును నాశముగావించినది. ఈనపుంసకతచే ...ము మన ధన జన పశు సంతతు లెల్ల నపాయస్థితిలో బడినవి. ...న మాధ్యాత్మికవాదముం గొని అహింసయో యని యప ...రరాగాలాపము సేయుచున్నాము.

ఆధ్యాత్మికాహింస కేనాటికైనను శస్త్రబలమవశ్యము ...ంగితీరవలయునసి యహింసావాదు లనవచ్చును. అదినిజమే. ...ద్ధాంతము సార్వజనీనమే. ఆధ్యాత్మికశక్తి కెదుట నేపశు ...మును విజయమునందజాలదు. కాని రాష్ట్రమంతయు నొక్క ...ట్టున నాధ్యాత్మికవాదగామి కాగలదా? మానవసమాజము ...త నొకయచ్చున గరగిపోయనగునా? అట్లైనాడైన జరిగి

నట్లు కలదా? అనంత వర్షములనుండి ధారావాహికముగ సాగి వచ్చు నితిహాసమే యిందుకు సాక్ష్య మీయగలదు. ఆక్రమణ లందు శస్త్రమే రక్షించిన ట్లరయగలరు.

కల్పనావాదులు ధ్రువ ప్రహ్లాదుల నుదహరింతురు. కాని ఈయుదాహరణములు భక్తిమార్గములందు శస్త్రబల ముపేక్షణీయ మనుకొనవచ్చును గాని, బాహ్యజగత్తునకు జెందియుండు కర్తృమార్గమును శస్త్రబలవంచితము గావింపజాలము. వస్తుతః జ్ఞానమార్గాది రక్షణకైనను ఈబలము నాశ్రయింపవలయును. దేవాసురులందైన ద్వాదశ మహాసంగ్రామములు సత్యయుగ ఘటనలు. యజ్ఞరక్షణ కసురవినాశార్థము విశ్వామిత్రుడు, రామచంద్రుని సహాయోగము గోరుట త్రేతాయుగఘటన. కురు పాండవయుద్ధము ద్వాపరయుగఘటన. కలియుగ ఘటనలను గూర్చి విశేషింపబనియే లేదు. ఏకదేశి సిద్ధాంతముగాని తక్కిన సామయికసిద్ధాంతముల నపేక్షించుట యేటి బుద్ధిమత్త్వము? "మాహింస్యాత్" అన్నశాస్త్రమే. 'యుద్ధాయ కృతనిశ్చయః' 'ఆతతాయినమాయాన్తం హన్యాదేవావిచార యన్' అన్నది. "అందరు బల్లకినెక్కుచో మోయువారెవ" రన్నట్లు అందరును తపస్వులు, మహర్షులు, అధ్యాత్మవాదులు నగుచో లోకనీతిసంచాలన మెవరుసేయుదురు? అదియావశ్యకమే కాదా? అధ్యాత్మవాద మెంతయావశ్యకమో భూతవాదము నంతేయావశ్యకము.

ఇంతకును పశుబలిసమర్థించుట మా యభిప్రాయము కాదు. హింసాహింసాభావములనుగూర్చియే ప్రస్తుతము. ఏనీతి వ్యవస్థాపకులము మనముకాము. శాస్త్రము చెప్పినదే మనకు మాన్యము. కొందరు వేదభక్తులుకూడ పశుపురోడాశముం గూర్చి వివదించుచున్నారు. వేదములందు, బ్రాహ్మణములందు నిది (బలివిధానము) స్పష్టముగా గోచరింపుచుండ, దానిని గాదని హింసాహింసా పరిభాషల నేర్పరచుటకు వారి కేయాధారములుకలవో! పాపపుణ్య వివేకజ్ఞానము వారెట నేర్చిరో! యజ్ఞమందలి హింసయవశ్యముహింసయే కాని, ఏదో అతీంద్రియభావముచే నది యహింసగ నంగీకృతమైనది. అది పుణ్యప్రదమే యని చెప్పబడినది.

1. యజ్ఞార్థంపశవఃసృష్టాః స్వయమేవస్వయంభువా
   యజ్ఞస్యభూత్యైసర్వస్య తస్మాద్యజ్ఞేవధోఽవధః
2. ఓషధ్యఃపశవోవృక్షాః తిర్యంచః పక్షిణస్తథా
   యజ్ఞార్థంనిధనంప్రాప్తాః ప్రాప్నువంత్యుత్సృతీపునః
3. మధుపర్కేచయజ్ఞేచ పితృదైవతకర్మణి
   అత్రైవపశవోహింస్యా నాన్యత్రేత్యబ్రవీన్మనుః
4. యావన్తి పశురోమాణి తావత్కృత్వోహమారణమ్
   వృథాపశుఘ్నఃప్రాప్నోతి ప్రేత్యజన్మని జన్మని
5. యావేదవిహితాహింసా నియతాస్మింశ్చరాచరే
   అహింసామేవతాం విద్యాత్ వేదాద్ధర్మోహినిర్బభౌ

6. యజ్ఞాయజగ్ధిమాంసస్య సహదేవోఽవిధిఃస్మృతః
అతోఽన్యథాప్రవృత్తిస్తు రాక్షసోవిధిరుచ్యతే
7. నియుక్తస్తుయథాన్యాయం యోమాంసంనాత్తిమానవః
సప్రేత్యపశుతాంయాతి సంభవానేకవింశతిమ్
8. కుర్యాద్ఘృతపశుంసంగే కుర్యాత్పిష్టపశుంతథా
నత్వేవతువృథాహంతుం పశుమిచ్ఛేత్కదాచన

(ఇత్యాదిః మను. 5 అధ్యా.)

యజ్ఞీయ హింసావిషయమున బూర్వపక్షానువాద పూర్వకముగ వ్యాసమహర్షి "అశుద్ధమితిచేత్; న శబ్దాత్" అని సిద్ధాంతము చేసెను. అచట ఆయన యభిప్రాయము "పాపపుణ్యాద్యతీంద్రియ పదార్థ విషయములందు గేవలము శబ్దప్రమాణమే శరణమనియే." మన కల్పనల కం దేమియు విలువ లేదు.

లోక దృష్టాంతముం బట్టియు హింసాహింసావ్యవస్థల నరయుడు; శస్త్రచికిత్సవలన నెంత పీడ కలుగును? దాసిని హింసయనవచ్చునా? సూచీవేధ చికిత్సకొరకు మందులను సిద్ధముసేయనై పశుపక్షిమృగాదులను తత్తత్కార్యాగారములం దెన్నిటి నెన్నివిధముల హింససేయుచుండుట లేదు? అవియన్నియు హింసలక్రిందికిరావా? మనుజసమాజాభివృద్ధి కవియేనా ఆలంబనములు? యజ్ఞీయపశువధకాదా? ఇదేటిబుద్ధివాదము? కానిండు, శాస్త్రీయకర్మ సదోషమా? నిర్దోషమా? అన్నది ప్రకృతముగాదు "బుద్ధివాదము నాధారముగాగొని యేవిషయ

మునిర్ణయింపజాల మ"నుటయే ప్రకృతము చెప్పదలచినది. ఈవిషయమున నొండురెం డుదాహరణము లిచ్చెదము.

నేడు కొంద రీశ్వరభక్తు లుపాసనాకాండకు జెందిన వర్ణ ధర్మముల యుచ్చావ చాధికారములను మానవతా కళంకము లుగ నెంచి దేవతాప్రతిమల దర్శన స్పర్శనల వలననే యవర వర్ణులకు గల్యాణ మగునని భావించుచున్నారు గదా! ఆయాస్తి కుల నొకవిషయ మడుగవచ్చునా ? దేవతాప్రతిమల దర్శించు టచే గల్యాణమగుననియు, మందిరములందు ప్రతిమారూప మున భగవంతుడున్నాడనియు వారికిదేనివలన దెలిసినది ? దేని నాధారముగాగొని వారు దేవతాప్రతిమోపాసన దేవదర్శ నాదులు లాభప్రదము లనుకొనుచున్నారు ? 'శాస్త్రముంబట్టి' యనుటకంటె నింకేమనగలరు ? సరే, ఆవిషయము శాస్త్రసిద్ధ మగుచో, తత్సంబంధమున దమకల్పనలను సమావేశపరచుట యేటిబుద్ధిమత్త్వము ? శాస్త్రము ప్రకృతిసిద్ధ నిత్యవర్ణధర్మాను సార ముపాసనకునై యేప్రకారములను జూపెనో, ఏయేవర్ణ ముల కేయే నియమోపనియమముల నేర్పరచెనో వానిననుగమిం చుట భారతీయవర్ణసమాజమునకు గల్యాణముకాదా ?

అతీంద్రియకర్మల నటుంచుడు. ప్రత్యక్షలౌకికవ్యవహార ములనరయుదము. ఇందును పదేపదే శబ్దప్రమాణమే దిక్కు. ఓషధులను, మందులను అమ్మువాడు పండితుడు కాడు. వాని మాటనమ్మి అక్కలకర్ర, తిప్పతీగ, నేలవేము మొదలగునవి

స్వీకరింతుముగదా! ఇది గుఱ్ఱము, ఇది యేనుగు, ఇది పక్షి ఇత్యాదిపదార్థబోధ, వృద్ధవ్యవహారమూలక శబ్దప్రమాణము నాధారముగ గొన్నదేగాని, మనము పరీక్షించి యెరింగినది కాదుగదా!

పరీక్షించుట మంచిదే. అందువలన నాత్మవిశ్వాసము మునుపటికంటె దృఢమూలమగును. కనుక నదియుత్తమసాధనమే. కాని, పరీక్షాక్షేత్రమం దందరకు సమానాధికారము యోగ్యత లేదు. ఇక :-అతీంద్రియపదార్థ పరీక్షంగూర్చి యన్ననో ఆర్షదృష్టిశూన్యులు, కేవలశబ్దజ్ఞానానుగాములు నగువారు విద్వాంసులుగూడ సర్వసాధారణకోటిలోనే చేరుదురు. "పరీక్షింతుము, తెలిసికొందుము, అనుగమింతుము, అనుష్ఠింతుము" అనుకొనుచో జీవనమే కఠినమగును. ఆచరణానిశ్చయం దీ సిద్ధాంతము సర్వథా నిష్ఫలము.

"ప్రతిదినము సంధ్య నుపాసింపవలయును." అన్నపుడు బుద్ధివాది "సంధ్యామూలికరహస్య మంతయు నెరింగియాచరింతు" నని యూరకున్నచో నతడు బ్రదికియుండగ సంధ్యానాచరించ నవసరమే ప్రాప్తింపదు. అందరును రహస్యవేత్తలు, నుపదేష్టలు గాజాలరు. అందరును రహస్యజ్ఞానపాత్రులును గారు. జిజ్ఞాసకలవారు సద్బుద్ధిపూర్వకముగ రహస్యజ్ఞానము నొందప్రయత్నింపవచ్చును. అంతవరకు గర్మనే చేయమనుట మూర్ఖము. అది కర్మనుండి తప్పించుకొనుట కొకయెత్తుగా

గూడ గొందర కుపయోగపడుచున్నది. అట్టివారేమియుజేయక వట్టిదంబములను పల్కుచుందురు. వేషభూషావిన్యాసములు, సేవాధర్మనిర్వహణము, అతిశయవినోదప్రియత్వము మొదలగు నీనిత్యకర్మలతోడనే వీరికి కాలముగడుచును. ఇక శాస్త్రీయ కర్మానుష్ఠాన మెక్కడ? ఎప్పుడు? అట్టిచో వీరు, "తెలియ కుండజేయనేల?" అని తప్పించుకొనుచుందురు. రహస్యజ్ఞాన మెరింగియు నట్టివా రేమియు జేయరు. ఫలమునొందరు. ఇక నిట్టివారి పరీక్షలకు విలువయేమి? నిజముగ గళ్యాణమువల యుచో శ్రద్ధావిశ్వాసపూర్వకముగ, శబ్దప్రమాణము నాధార ముగ గొనియే, కర్తవ్యప్రవృత్తులు గావలయును. అప్పు డభ్యు దయనిశ్శ్రేయస సిద్ధి కధికారులగుదురు. లక్ష్యైకదృష్టియే లక్ష్యైకదృష్టిసిద్ధికి ముఖ్యద్వారము.

ఇంతకును:-కర్మయోగ నిర్ణయముంగూర్చి, మనమెప్పు డేమి సేయవలయును, ఏకర్మ శ్రేయస్కరము? ఏకర్మ ప్రేయ స్కరము? అను జిజ్ఞాసయందు మానవబుద్ధి పనిసేయజాల దనియు, ఇందుకు శాస్త్రమొకటే ప్రమాణమనియు, మనకల్పన లేనిర్ణయమును జేయజాలవనియు శాస్త్రోపదేశముంబట్టి నడచు టయే కల్యాణమూలసూత్ర మనియునే జెప్పదలచినది.

ఆర్యప్రజాసర్వస్వము ధర్మశాస్త్రము. ఇదే కర్మనిర్ణా యకము. అఖిలబ్రహ్మాండగుప్త ప్రాకృతికతత్త్వముల నాధార ములుగ గొని కర్మమార్గవ్యవస్థ నేర్పరచిన భారతీయశాస్త్రము

మహావిశాలమన్నచో నాశ్చర్యమేమి? ఈయల్పకాయ పరిలేఖలో శాస్త్రప్రతిపాదిత కర్మకలాపమంతయు నానుపూర్వితో దిగ్దర్శన మొనరింపను జాలము. కనుక ఇతరములగు స్మార్త శాస్త్రముల విచారణమాని ముఖ్యముగ వేదశాస్త్రసిద్ధ కర్మకలాపమునే సంక్షిప్తముగా నిరూపింతుము. ఇప్పటి కదియే సమీచీనముగ దోచుచున్నది.

భారతీయుల కర్మకలాపము, ధర్మకృత్యములు, పరంపరగ వేదశాస్త్రముపైనే ఆధారపడి యున్నవి. మను యాజ్ఞవల్క్య వశిష్ఠాది నిర్మిత స్మృతిశాస్త్రములు, నిర్ణయసింధు, విధానపారిజాతాది 'నిబంధగ్రంథములు' శారీరిక ప్రాధానిక వైశేషిక తార్కిక మీమాంస కాది దర్శనతంత్రములు మొదలుగ సంగభూతములగు నీయితరశాస్త్రముల ప్రామాణ్యమంగీభూత వేదప్రమాణముపైననే యాధారపడియున్నది. కనుక నీశాస్త్రములెల్లను పరతఃప్రమాణములు. వేదమన్ననో ప్రత్యక్షదృష్ట అసందిగ్ధార్థ భావము గలదగుటచే అన్యప్రమాణాపేక్ష లేని దగుటవలన స్వతఃప్రమాణము.

పరతఃప్రమాణరూప మన్వాదిశాస్త్రములు వేదానుకూలములు. వీని యాదేశములకు మూలములు వేదమందున్నవి. కనుక నవిప్రామాణికములే. వేదవిరుద్ధములగు స్మృతి, నిబంధ, దర్శనాదులు త్యాజ్యములు. ఉపేక్షణీయములు. ఇందువలన వేదము సర్వశాస్త్రమూలమనియు, అది యీశ్వర ప్రణీతమనియు, అపౌరుషేయ మనియు దోచును.

వేదము పౌరుషేయమా? అపౌరుషేయమా? వేద మంత్రము లీశ్వరరచితములా? మహర్షి రచనలా? ఇది నిర్ణీత మయ్యును, వర్తమానమునందు వివాదగ్రస్త విషయమై యున్నది. వేదము, కొందరుదార్శనికుల దృష్టియం దపౌరుషేయము. కొందఱిదృష్టిలో బౌరుషేయము. ఏమయినను, వేద సత్యతయం దార్యసంతానమున కేసందియమును ఎన్నడును లేదనుట నిర్వివాదము. ఇరువదవ శతాబ్దమువంటి నేటి భయంకరయుగ మందైనను, వేదమందు సర్వసాధారణులకును అనన్య నిష్ఠ కన్పట్టుచున్నది. యావజ్జీవము పాశ్చాత్య శిక్షాసముద్ర మునం బడియున్న భారతీయులును, వేద మననేమో యెరుంగకుండియు, పదభ్రష్టులయ్యు తత్సముఖము నందు నతశిరస్కులే యగుట చూచుచున్నాము. ఇక స్వాయముగ బశ్చిమదేశ విద్వాంసులు వేదమునెడ గౌరవముం జూపుట సుప్రసిద్ధమే.

క్రొత్తవిచారణలుగల నేటిచదువరులు గొందరు మాత్రము, "మన్వాదులు మనవంటిమానవులే. వారిమాటల నంధవిశ్వాసముతో నమ్మనేల? పరీక్షించియే చూచెదము, నేడవి పనికిరావు, కాలానుసార మవి మారదగినవే, మారవచ్చు" నందురు. కాని వేదప్రామాణ్యము నెదుర్కొను నపుడు వీరును తమ తర్కములను వదలుకొందురు.

భారతవర్షమం దనేకమతములు, అనేక సంప్రదాయములు, అనేకాచారములు, జ్ఞానకర్మోపాసనల అనేకప్రకార

షులు నున్నవి. కాని, ఈయన్నిటికి మూలములు వేదమం మన్నవి. కనుకనే ఈవిభిన్నమార్గములెల్ల మన కుపాదేయములే యగుచున్నవి.

సాటిలేని యలౌకిక గ్రంథము గీత. ఈశ్వరపూర్ణావతారి యగు శ్రీకృష్ణుని ముఖపంకజ వినిస్సృత మధురూపము. వేదోపబృంహకమగుటవలననే ప్రామాణికమైనది. అందువల ననే అదిస్వతఃప్రమాణ మనదగినదయ్యును పరతఃప్రమాణకోటికి జెంది 'స్మార్తోపనిషత్తు'గ వ్యవహరింపబడినది. భగవంతుడు స్వయముగ వేదప్రామాణ్యము నంగీకరించినట్లు యీశ్లోకముల వలన గీతాభక్తు లెరుంగుదురు.

"యఃశాస్త్రవిధిముత్సృజ్య వర్తతేకామకారతః
నససిద్ధిమావాప్నోతి నసుఖం నపరాంగతిం
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి."

కానిండు భారతీయకర్మవాద మూలాధారము వేద శాస్త్రమే. వేదమును నిరాకరించుటవలననే బౌద్ధమత మెంత మంచిదయ్యును అనుపాదేయము, నుపేక్షణీయము నైనది. పాశ్చాత్యవిద్వాంసులును, తదనుయాయులునగు భారతీయ విద్వాంసులును, కొందరు భారతీయ ధర్మవాదముంగూర్చి "భారతీయుల కొకమతము, ఒకశాస్త్రము లేదు. అనేకమత ములు, వానింబోషించు ననేకశాస్త్రములు, అవియును బర

స్పరవిరుద్ధములు. ఈభేదవాదములవలననే రాష్ట్రైక్యత, సమన్వయము, ఏకసూత్రసంఘటనము లేకున్నది. కుదురకున్నది" అని యాక్షేపింతురు.

ఇయ్యది భారతీయ తత్త్వవాదము నెఱుంగమిచే గలిగిన కల్పనాప్రౌఢివాదము. ఎన్నిమతము లంగీకరించినను భారత వర్షము ఒకేఒక వేదసూత్రముచే బద్ధమై యభిన్నధరాతలప్రతిష్ఠితమై యున్నదని యెరుంగవలయును. ప్రజావర్గస్థితింజూడుడు. అందరును సమానులు కాగలరా? ఒకరాష్ట్రమందలి ప్రజల కర్మలు, నైయక్తికయోగ్యతలు, శక్తులు, గుణములు, ప్రకృతులు, పరస్పర మెంతెంతభిన్నములు? అయినను వీరందరు నొకరాష్ట్రపతి కనుగాములుగ నుండి, తచ్ఛాసనసూత్రబద్ధులై స్వస్వకర్మరతులై నిర్విరోధముగ రాష్ట్రహితసాధన గావించుట లేదా? అట్లే సనాతనధర్మాంతర్గత సంప్రదాయములు, మత వాదములు అనాదికాలమునుండియు సాగివచ్చు వేదశాస్త్ర రూప సమ్రాడనుశాసనానుశాసితములై సర్వథా, ప్రామాణికములే యగును. వేదశాస్త్రరూపమగు నొకేయభిన్నధరాతలమున గుణత్రయభేదభిన్న సంప్రదాయవాదములు ప్రతిష్ఠితములై యున్నవి. భేదసహిష్ణువగు నభేదమే భారతీయ మూలమంత్రము. భారతీయధర్మమునకు కర్మవాదమునకు నిదే సర్వోత్కర్ష. ఈమానవవచనము లరయుడు :-

1\. యజ్ఞానాంతపసాంచైవ శుభానాంచైవకర్మణాం
వేదఏవద్విజాతీనాం నిఃశ్రేయసకరః పరః

ములు నున్నవి. కాని, ఈయన్నిటికి మూలములు వేదమం దున్నవి. కనుకనే ఈవిభిన్నమార్గములెల్ల మన కుపాదేయములే యగుచున్నవి.

సాటిలేని యలౌకిక గ్రంథము గీత. ఈశ్వరపూర్ణావతారి యగు శ్రీకృష్ణుని ముఖపంకజ వినిస్సృత మధురూపము. వేదోపబృంహకమగుటవలననే ప్రామాణికమైనది. అందువల ననే అదిస్వతఃప్రమాణ మనదగినదయ్యును పరతఃప్రమాణకోటికి జెంది 'స్మార్తోపనిషత్తు'గ వ్యవహరింపబడినది. భగవంతుడు స్వయముగ వేదప్రామాణ్యము నంగీకరించినట్లు యీశ్లోకముల వలన గీతాభక్తు లెరుంగుదురు.

"యఃశాస్త్రవిధిముత్సృజ్య వర్తతేకామకారతః
నససిద్ధిమవాప్నోతి నసుఖం నపరాంగతిం
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి."

కానిండు భారతీయకర్మవాద మూలాధారము వేద శాస్త్రమే. వేదమును నిరాకరించుటవలననే బౌద్ధమత మెంత మంచిదయ్యును అనుపాదేయము, నుపేక్షణీయము నైనది. పాశ్చాత్యవిద్వాంసులును, తదనుయాయులునగు భారతీయ విద్వాంసులును, కొందరు భారతీయ ధర్మవాదముంగూర్చి "భారతీయుల కొకమతము, ఒకశాస్త్రము లేదు. అనేకమత ములు, వానింబోషించు ననేకశాస్త్రములు, అవియును బర

స్పరవిరుద్ధములు. ఈభేదవాదములవలననే రాష్ట్రైక్యత, సమన్వయము, ఏకసూత్రసంఘటనము లేకున్నది. కుదురకున్నది" అని యాక్షేపింతురు.

ఇయ్యది భారతీయ తత్త్వవాదము నెఱుంగమిచే గలిగిన కల్పనాప్రౌఢివాదము. ఎన్నిమతము లంగీకరించినను భారతవర్షము ఒకేఒక వేదసూత్రముచే బద్ధమై యభిన్నధరాతలప్రతిష్ఠితమై యున్నదని యెరుంగవలయును. ప్రజావర్గస్థితిం జూడుడు. అందరును సమానులు కాగలరా? ఒకరాష్ట్రమందలి ప్రజల కర్మలు, వైయక్తికయోగ్యతలు, శక్తులు, గుణములు, ప్రకృతులు, పరస్పర మెంతెంతభిన్నములు? అయినను వీరందరు నొకరాష్ట్రపతి కనుగాములుగ నుండి, తచ్ఛాసనసూత్రబద్ధులై స్వస్వకర్మరతులై నిర్విరోధముగ రాష్ట్రహితసాధన గావించుట లేదా? అట్లే సనాతనధర్మాంతర్గత సంప్రదాయములు, మతవాదములు అనాదికాలమునుండియు సాగివచ్చు వేదశాస్త్రరూప సమ్రాడనుశాసనానుశాసితములై సర్వథా, ప్రామాణికములే యగును. వేదశాస్త్రరూపమగు నొకేయభిన్నధరాతలమున గుణత్రయభేదభిన్న సంప్రదాయవాదములు ప్రతిష్ఠితములై యున్నవి. భేదసహిష్ణువగు నభేదమే భారతీయ మూలమంత్రము. భారతీయధర్మమునకు కర్మవాదమునకు నిదే సర్వోత్కర్ష. ఈమానవవచనము లరయుడు :-

1. యజ్ఞానాంతపసాంచైవ శుభానాంచైవకర్మణాం
వేదఏవద్విజాతీనాం నిఃశ్రేయసకరః పరః

2. చాతుర్వర్ణ్యంత్రయోలోకాః చత్వారశ్చాశ్రమాః పృథక్
భూతంభవ్యం భవచ్చైవ సర్వంవేదాత్ప్రసిద్ధ్యతి
3. వైదికేకర్మయోగేతు సర్వాణ్యేతాన్యశేషతః
అంతర్భవన్తిక్రమశః తస్మిన్‌తస్మిన్ క్రియావిధౌ
4. పితృదేవమనుష్యాణాం వేదఃచక్షుః సనాతనమ్
అశక్యంచాప్రమేయంచ వేదశాస్త్రమితిస్థితిః
5. యావేదబాహ్యాః స్మృతయో యాశ్చకాశ్చకుదృష్టయః
సర్వాస్తాఃనిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠాహితాః స్మృతాః
6. శబ్దఃస్పర్శశ్చరూపంచ రసోగంధశ్చపంచమః
వేదాదేవప్రసూయంతే ప్రసూతిగుణకర్మతః
7. బిభర్తిసర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్
తస్మాదేతత్ పరంమన్యే యజ్జన్తోరస్యసాధనమ్
8. సర్వేషాంతుసనామాని కర్మాణిచపృథక్పృథక్
వేదశబ్దేభ్యఏవాదౌ పృథక్సంస్థాశ్చనిర్మమే
9. వేదోదితం స్వకంకర్మ నిత్యంకుర్యాదతంద్రితః
తద్ధికుర్వన్ యథాశక్తి ప్రాప్నోతిపరమాంగతిం
10. శ్రుతిస్మృత్యుదితంసమ్యఙ్నిబద్ధం స్వేషుకర్మసు
ధర్మమూలంనిషేవేత సదాచారమతంద్రితః
11. వేదప్రణిహితోధర్మః; హ్యధర్మస్తద్విపర్యయః.

ఈధర్మాధర్మ కర్తవ్యాకర్తవ్య పరిభాషంబట్టి వేద మొకటే యపవాదరహిత ప్రమాణమని తేలుచున్నది. ఇక

కర్మమార్గజటిలతనుండి తప్పించుకొనుటకు కేవలము వేదశాస్త్రానుగమనమే ముఖ్యమార్గము. దానింబట్టిపోయిన నేయసాయమును దానియంతనదే నివృత్తినొందును.

ఇంద్రియానుగత స్థూలబుద్ధిచే మనము కర్మనిర్ణయమును సేయబోవుచో మోహముదయించును. కల్పనార్థము :- వీ పాపపుణ్య హింసాహింసల నిర్ణయించు విద్వాంసు దగుచో అర్జునునకువలెనే ధర్మసంకటంజిజ్ఞాసమానాను. అట్టి యతీంద్రియ కర్మరహస్య విషయ లము శాస్త్రవిధియే మనకర్తవ్యపథమును రక్షించును. సర్వశాస్త్ర మూలాధారము వేదశాస్త్రము. వైదికకర్మయోగ నిరూపణ ప్రసక్తము. కనుక ప్రసంగ పిధింబట్టి యిట నించుక వేదత్వ-వేదస్వరూపముల నెరుంగుట యప్రస్తుతముకాదు. (విశేషములు వేదవిజ్ఞానమందరయనగును.)

ప్రకృతిసిద్ధములగు నన్నివిషయముల సోపపత్తికనిరూపణల నొనరించు విజ్ఞానశాస్త్రము, విద్యాశాస్త్రము, వేదశాస్త్రము. అగ్నిహోత్రము చేయవలయును. అనుటయేగాక ఎందుకు ? ఎప్పుడు ? ఎట్లు ? అను జిజ్ఞాసనుగూడ నిది శాంతింపజేయును. "జ్యోతిష్టోమయజ్ఞకర్తయగు యజమానుని మానుషాత్మ దైవాత్మాకర్షణముచే త్రిణాచికేతమను త్రివృత్స్వర్గముం జేరు" నను మౌలికరహస్యముంగూడ నిది యుద్ఘాటించును. ఇత్యాదులే దీని ముఖ్యవిషయములు.

మన్వాదిస్మృతిసంగ్రహము ధర్మశాస్త్రము. ఇది ముఖ్యముగ విధినిషేధ నిరూపణ సేయునది. "ఇదంకురు" "ఇదంమాకురు" "ఇదంకర్తవ్యం" "ఇదంనకర్తవ్యం" అని యాదే[illegible]ని అది యట్లేలచేయవలయును? ఇట్లేలచేయరాదు? [illegible] వాదముగాలక బుద్ధివాదము నది [illegible] ప్రమేయంబు [illegible]

"యోఽవమ[illegible] స్మృతయో [illegible]హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః
ససాధుభిర్బహి[illegible]స్తికోవేదనిందకః"

చేయదగినది, చేయగూడనిది, చెప్పునది, అభ్యుదయ నిఃశ్రేయఃప్రాప్తికారణములను నిరూపించునది ప్రత్యవాయ ప్రాయశ్చిత్త భాగి కాకుండ జేయునట్టి కర్మవ్యవస్థాపక శాస్త్రమే స్మృతిశాస్త్రము. అంతు కర్మల కార్యకారణరహస్యనిరూపణ యుండదు. అనుష్ఠానమువలన స్వరూపరక్ష గావించుకర్మలే 'ఆత్మనాధృతస్సన్ ధారయతి' 'యుత్వాత్ ధారణసంయుక్తమ్' 'ధర్మిణా ధృతస్సన్ ధర్మిణం, స్వస్వరూపేఽవస్థాపయితి' ఇత్యాది నిర్వచనములంబట్టి ధర్మశబ్దమున బిలువబడును. కర్తవ్యకర్మయే ధర్మము. అదియొకగుప్త కార్యకారణభావమునకు జెందినది. ఆప్తులుదానిం బరీక్షించి వ్యవస్థగావించి 'ఇట్లే చేయవలయు' ననిచెప్పిరి. ఆపదమందలి బలప్రయోగ తాత్పర్యమిదే. వ్యక్తి రేకదశయందు కర్మస్వరూపమే చెడును. ఈకార్యకారణ రహస్యమే విద్య. "యదేవవిద్యయా శ్రద్ధయోపనిషదా కరోతి

తదేవ వీర్యవత్తరం భవతి' ఇంతకును కర్తవ్యకర్మయే ధర్మము. దాని కార్యకారణాత్మక మౌలికరహస్యమే విద్య యని భావము. ఇక స్మృతిశాస్త్రము కర్తవ్యకర్మనిరూపణమే చేయును కనుక నదిధర్మశాస్త్రము. శ్రుతియో కార్యకారణ రహస్యములను స్పష్టీకరించున దగుటచే విద్యాశాస్త్రము. ఫలితార్థము :– వేదము విద్య, స్మృతి ధర్మము. వేదము విద్యాపుస్తకము, స్మృతి ధర్మపుస్తకము. 'ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః.'

## వే ద స్వ రూ ప ము

గీతావిజ్ఞాన నామకరహస్యప్రకరణమునం దార్షదృష్టి స్వరూపముం జెప్పుచో సాక్షాత్కృతధర్ములగు నాప్తపురుషుల దృష్టి 'ప్రత్యక్షజ్ఞాన' మని చెప్పియుంటిమి. అట్టి ప్రత్యక్షజ్ఞానాత్మక ప్రత్యక్షదృష్టి నభినయించు ప్రత్యక్షద్రష్టయొక్క వాక్యమే మనకు 'శ్రుతి' (ప్రత్యక్షదృష్టి.) ద్రష్టద్వారా విన్నవాక్యము మనకు ప్రత్యక్షదృష్టివలె నిర్భ్రాంతప్రమాణము. శ్రోత తాను విన్నదానిని తనవాక్యములతో మనకు వినిపించు వాక్యసంగ్రహము 'స్మృతి'.

'శ్రుతి' యన పరీక్షకాచార్యుని ప్రత్యక్షదృష్టార్థ మభిప్రేతము కనుక వేదము విజ్ఞాన మని యంగీకరింపవలయును. అనగా :–యథార్థద్రష్టయగు పరీక్షకుని దృష్టి (ప్రత్యక్షజ్ఞానము)

వేదము. విజ్ఞానోపదేశకు డగునతనివాక్యమును వేదమే యని సారాంశము. అహర్నిశలు తత్త్వాన్వేషణలగ్నచిత్తుడై యుండు వ్యక్తియే 'పరీక్షకుడు' అందు నెగ్గినవాడు, పరీక్షిత, తత్త్వము నందుకొన్నవాడు కనుక 'ఋషి' అనగా :-తపఃప్రభావమువలన లభించిన యోగదృష్టిచే నతీంద్రియ పదార్థములం గనుగొని పరీక్షవలన వాని తాత్త్వికస్వరూపము నవగతము గావించు కొన్న మహానుభావుడు ఋషి యని భావము. 'ఋషతిగచ్ఛతి విషయమ్' తనచే దృష్టార్థమం దీయన తదంస్థలము జేరిన ప్రామాణికుడు కనుక 'తత్రభవాన్' అనబడును. ఇదే యీతని 'ఆప్తత' కనుక నాయన ఆప్తుడు. ఇట్లే ఆయనయొక 'ఋషి, ద్రష్ట, సిద్ధ-ఆప్త- సాక్షాత్కృతధర్మ - తత్రభవాన్' మొదలగు నుపాధులు సార్థకము లగుచున్నవి. అట్టి యాప్తమహర్షుల ద్వారా ఆర్షదృష్టిచే గనుగొనబడినదియు సర్వథా పరీక్షిత మును, సందేహరహితమును అగు విజ్ఞానతత్త్వము-మౌలిక తత్త్వము-వేదతత్త్వమందురు. నియతియొక్క ఆగుప్తతత్త్వము పేరే వేదము.

ఈతత్త్వాత్మక వేదమునకు ఋగ్యజుసామాథర్వణములు, బ్రాహ్మణారణ్యకోపనిషత్తులు అను పర్వములెట్లు ఏల కలిగెను? ఏనికి 21, 101, 1000, 9 ఇత్యాది క్రమి శాఖాంతరభేదము లకు గారణమేమి? ప్రకృతిదేవి గుప్తసామ్రాజ్యమందే యేసియ మోపనియమములచే నీతత్త్వాత్మక వేదము తన్మాత్రలద్వారా సృష్టినిర్మాణ ప్రవృత్తమగును? బ్రహ్మనిశ్వసితము, నపౌరు

షేయమునగు నీవేద మాజగన్నియంత, జగదీశ్వరుని సహస్ర ముఖములనుండి యెట్లు వెలసినది? అను మొదలగు ప్రశ్నలకు సమాధానము లీయు నిట నవసరముగాదు. వేదవిజ్ఞానము నందు వీనికి సమాధానము లరయవలయును.

ప్రస్తుత మీవిషయమున నీమాత్ర మనుకొన్న జాలును; తాత్త్విక వేదమునకు ఏస్వరూపము, ఏయవయవసంస్థానము, ఉదాత్తాదిస్వరలహరి గాయత్ర్యాది ఛందోక్రమము అత్రి మరీచి కశ్యప విశ్వామిత్ర వసిష్ఠాది ప్రాణఋషి సంస్థానవిశేషములు కలవో సరిగా నట్టి యానురూప్యమే శబ్దాత్మక పౌరుషేయ వేదనిర్మాణము నందును గలదు. అనగా:- నిత్యము తాత్త్వికమునగు వేదస్వరూపానురూపముగ నే ద్రష్టలగు మహర్షులు బుద్ధిపూర్వకముగ ("బుద్ధిపూర్వావాక్యకృతిర్వేదే") గావించిన విజ్ఞానవాగ్వాక్యరచనా సంగ్రహమే 'తాచ్ఛబ్ద్యన్యాయముచే' వేదనామప్రసిద్ధమయ్యెను. తత్త్వాత్మకవేదక మపౌరుషేయము, నిత్యము, అకృతకము. కూటస్థము. ఇక వాఙ్మయవేదము ఋషికృతము. పౌరుషేయము, అనిత్యము, కృతకము. వేద మంత్రరచయితలు ఋషులు. మంత్రాత్మక వేదగ్రంథము పౌరుషేయము. ఈ మంత్రసిద్ధ ఋగాదిభేదభిన్న త్రైకాలికవిజ్ఞానతత్త్వ మపౌరుషేయవేదము.

తత్త్వాత్మక వేదమునకు మహర్షులు ద్రష్టలు. స్మర్తలు "బ్రహ్మాద్యాఋషిపర్యంతాః స్మర్తారోఽస్యనకారకాః" మంత్రా

త్మక అనగా తత్స్మరణానురూపోపనిబద్ధ శబ్దాత్మక వేదమునకు వారుకర్తలు. మీమాంసాదర్శనముంబట్టి "శబ్దార్థములభిన్నములు; వానిసంబంధమౌత్పత్తికము. (ఉత్పత్తిసృష్టముగాని యుత్పన్నసృష్టముకాదు.) అనుకొన్నచో అర్థాత్మక (తత్త్వాత్మక) శబ్దాత్మక వేదములు రెండును అపౌరుషేయములేయనుకోవలయును. (ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధః) ఈదృష్టితో సనాతధర్మావలంబులు వేదతత్త్వానుగృహీత వేదమంత్రములకును అపౌరుషేయత నంగీకరింతురు. అదియట్లు ఆదరణీయమే.

మంత్రవాక్య సాధారణలౌకిక శబ్దవాక్యకంటె కొంత విశేషమహిమ కలిగియుండును. వేదమంత్రముల ఛందో, దేవతా, స్వరాక్షర విన్యాసాక్షరసంఖ్యాదు లెల్ల ప్రకృతి సంబద్ధములు, నలౌకికములు నైయున్నవి. వేదతత్త్వము 'విద్యుత్తు' అన్నచో వేదమంత్రము విద్యుత్సంచరణస్థానరూప విద్యుత్తంతు వనవచ్చును. దాహకశక్తి దానియందువలె దీపియందు నుండునుగదా! యజ్ఞప్రక్రియలందు యథావిధిగ వేదమంత్రములను ఉచ్చరించుమాత్రనే శత్రువినాశమగును. స్వరమాత్రా ద్యుచ్చారణలం దేమాత్రమిటునటునైనను మంత్రరూపవాగ్వజ్రము యజ్ఞకర్తను నాశముచేసివైచును.

"దుష్టఃశబ్దః స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తో నతదర్థ మాహ
సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః స్వరతోపరాధాత్"

ఇదే మంత్రమంత్రత్వము. కనుకనే కల్పసూత్రకారులు వేదమంత్రపారాయణ మతిశయపుణ్యకారణ మనిరి. సూక్ష్మ

దృష్టి నవలోకించినచో మనమైనను "వేదభాష యలౌకికభాష యనియు, దీని కూర్పునందు ప్రకృతిహస్తక్షేప మవశ్య మున్న దనియు, ఇది మానవీయ జ్ఞానమునకు బరమైనదనియు" నంగీకరింతుము. "ఇందలి ప్రత్యక్షరమును విధియొక్క గుప్తవిధాన సంబద్ధము, అపరివర్తనీయము, శాశ్వతము, సనాతనము, అపౌరుషేయము" అని తోచును.

కానిందు వేదాపౌరుషేయత్వ పౌరుషేయత్వ వివాద ముంబడక ప్రకృత మనుసరింతము. తత్త్వాత్మక శబ్దాత్మకము లగు రెండు వేదములు సమానములనుకొనియే వేదస్వరూప మును విచారింతము. వేదతత్త్వము ఋగ్యజుస్సామాథర్వణము లను నాల్గుభాగములుగలవి. ఈనాల్గు తత్త్వవేదముల యాజ్ఞిక సమన్వయమువలననే విశ్వ-విశ్వస్థప్రజా నిర్మాణము జరిగినది. వేదతత్త్వజ్ఞుల దృష్టియం దీవేదతత్త్వ మనేకవిధములు గలది. అవి 'ఛందో-వితాన, రస, ఉపలబ్ధి, దేశ, కాల, దిక్, వర్ణ, పర్వ, నిదాన, గాయత్రీమాత్రిక-బ్రహ్మనిశ్వసిత-బ్రహ్మస్వేద-యజ్ఞమాత్రి కేత్యాది నామములచే నటనట నుపశ్రుతము లగు చున్నవి. ప్రస్తుతము ప్రకరణసంగతికై పార్థివ యజ్ఞ మాత్రిక వేదమును, సౌర-గాయత్రీమాత్రిక వేదమును విచారింతము.

'అగ్నిర్భూస్థానః, వాయుర్వేంద్రో వా న్తరిక్షస్థానః సూర్యో ద్యుస్థానః'(నిరుక్తము)అనునైగమికసిద్ధాంతానుసారముభూలోక మగ్నిప్రధానము. "యథాగ్నిగర్భాపృథివీ తథాద్యౌరింద్రేణ గర్భిణీ" అని శ్రుతియు జెప్పెను. ఈపార్థివాగ్ని రసబలక్షణ,

హృదయస్థప్రజాపతి యొక్క పరస్పరవిరుద్ధములగు నమృత మృత్యుభావ భేదముచే రెండుభాగములై యున్నది. 1 అమృతాగ్ని రసాగ్ని, 2 మర్త్యాగ్ని బలాగ్ని. మన ప్రతిష్ఠయగు భూపిండము బలప్రధానమర్త్యాగ్నిమయము. ఈమర్త్యాగ్ని నే యాజ్ఞికుల చిత్యాగ్ని. భూకేంద్రము నాధారముగ గొని భూపిండము నలువంకలను ఏకవింశాహర్గణము పర్యంతము వ్యాప్తమై యుండు ప్రాణాగ్ని యే రసప్రధా నామృతాగ్ని. దీని వలన మహిమాపృథివీరూప, సౌమ్య (పార్థివ) త్రిలోకి స్వరూప మేర్పడును. యాజ్ఞికు లీయమృతాగ్నిని 'చిత్రేని ధేయాగ్ని' యందురు. మర్త్యాగ్నినిర్మిత భూపిండము హవిర్వేది. అమృతాగ్నిమయ సౌమ్యత్రిలోకీరూప మహాపార్థివమండలము మహావేది. ఈరెండును ప్రాకృతికములు, నిత్యములు. ఇందు మొదటిది హవిర్యజ్ఞమునకును, రెండవది జ్యోతిష్టోమయజ్ఞము నకును ప్రతిష్ఠలు.

ఇక :- భూపిండ-మహాపృథువులకు ప్రతిష్ఠయగు నగ్ని తత్త్వమునకు ప్రతిష్ఠ సోమతత్త్వము. కారణము? అగ్నిసహజముగ నన్నాదము. సోమాన్నములేక యొక క్షణమైనను స్వస్వరూపస్థితి నుండదు. మనశరీరమందు "ఆలోమభ్యః ఆనఖాగ్రేభ్యః" వ్యాప్త వైశ్వానరాగ్నిం జూడుడు. సాయం ప్రాతరన్నాహుతి యున్నంతవరకే యదిసబలముగ స్వస్థముగ నుండును. అటుగానినా డది మందము, శరీరము శిథిలము నగునుగదా !

పార్థివాగ్నియు నగ్నియే కనుక నిదియు నన్నాదము, భోక్తయునై అన్నసోమముం గోరుట సహజము. సావిత్రాగ్నిమయ సూర్యుం జూడుడు. అందు బ్రహ్మణస్పతినామక సోమమనవరతము నాహుత మగుచుండును. అందువలననే అనగా 'సూర్యోహవా అగ్నిహోత్రమ్' అను నగ్నిహోత్రయజ్ఞము వలననే సూర్యదేవత స్వస్వరూపమున నుండును. ఇంతకును :-

అన్నాదాగ్ని యన్నసోమాహుతి వలననే సురక్షితముగ నుండగల దన్నచో నీయగ్నిమయ పార్థిసంస్థయందును అగ్నిషోమసమన్వయము నంగీకరింపవలయునని తాత్పర్యము.

అమృత-బ్రహ్మ-శుక్రమూర్తి యగు ప్రజాపతియొక్క శుక్రకళనుండి పదార్థస్వరూప నిర్మాణముజరుగునని ఈశావాస్యవిజ్ఞాన శుక్రనిరుక్తి ప్రకరణమున జెప్పియుంటిమి. ప్రజాపతికి స్వాభావికములగు నమృత-మృత్యు కలానుగ్రహమున నీశుక్రతత్త్వమునకును అమృతమృత్యుభేదములు కలవు. శుక్రము 'వాక్కు-ఆపః-అగ్ని' యని మూడుభేదములు గలది. ఇవి యమృతమృత్యుభేదముచే మూడు మూడు భేదములుగలవి కాగా: శుక్రము లారగును. ఇందు మర్త్యశుక్రత్రయివలన మర్త్యాగ్నిప్రధాన చిత్యభూపిండ స్వరూపమును అమృతశుక్రత్రయివలన నమృతాగ్నిప్రధాన చితేనిధేయ పృథివీమండల స్వరూపమును వెలయును.

కేంద్రము-పృష్ఠము మధ్యభాగము నని భూపిండమును మూడుభాగములు గావింపుడు. 1 కేంద్రమందు మర్త్యవాక్కు

క్రము, 2 పృష్ఠమందు మర్త్యాగ్నిశుక్రము, 3 మధ్యప్రదేశమందు మర్త్యాపశ్శుక్రము నున్నవి. ఇట్లు 1 కేంద్రస్థవాక్శుక్రావచ్ఛిన్న భూభాగమే స్వర్లోకము. 2 పృష్ఠస్థ అగ్నిశుక్రావచ్ఛిన్న భూభాగమే భూలోకము. 3 అంతఃప్రదేశస్థ ఆపఃశుక్రావచ్ఛిన్న భూభాగమే భువర్లోకము. ఇట్లు కేవలము మర్త్యభూపిండమందే వాగాపోఽగ్నులను మూడు మర్త్యశుక్రములచే గ్రమముగ భూః* భువః సువః అను మూడులోకములేర్పడుచున్నవి. ఈ మూటి మొత్తము భూపిండము. ఈలోకత్రయాత్మక భూపిండాధారముననే అమృతశుక్రత్రయీ వితానము జరుగుచున్నది. ఈప్రథనమువలననే 'యదప్రథయత్' అను బ్రాహ్మణవచనానుసారముగ మహావేదిలక్షణ పార్థివ మండలము పృథివి యనబడినది. మన మున్నది పృథివిపైగాదు భూపిండముపై. భూపిండవ్యాప్తి సర్వవిదితమే. కాని పృథివీ మండలమన్ననో సూర్యపిండమునకు బైవరకు వ్యాప్తిగలదై

---

* భూః-భువః-సువః-; పృథివీ-అంతరిక్ష ద్యౌః ఇవి పర్యాయములు గావు. "దివంచ పృథివీంచ అంతరిక్షమథోసువః" అనుచో ద్యౌ-సువః. అనుపృథఙ్నిర్దేశమరయునది. భూర్భువస్వః యను మూడును చిత్యభూపిండాంతర్భావములు. పృథివ్యంతరిక్షద్యౌలకు ప్రాణాగ్నిమయ సౌమ్యత్రిలోకిరూప మహాపృథివియందంతర్భావము. భూరాదులకు మర్త్యశుక్రత్రయితోడను, పృథివ్యాదులకు అమృతశుక్రత్రయితోడను సంబంధము. భూపిండకేంద్రాది మహిమాపృథివికి, త్రయస్త్రింశదహర్గణాత్మి కాంతిమపరిధివరకు గ్రమముగ భూకేంద్రాంతఃప్రదేశ భూపృష్ఠ త్రివృత్స్తోమ పంచదశస్తోమ, ఏకవింశస్తోమములనునీ 6 భాగములతో మర్త్యవాక్శుక్రావచ్ఛిన్న స్వర్లోకాదిత్రయముతోడను, అమృతాగ్నిశుక్రావచ్ఛిన్న పృథివీలోకాది త్రయముతోడను క్రమికసంబంధము.

యున్నది (ఈవిషయము మరొకచో జూడవచ్చును.) ఇది మర్త్యశుక్రత్రయికి జెందిన భూపిండ దిగ్దర్శనము.

ఇక నమృతశుక్రత్రయికి జెందిన పృథివీమండలముం జూతము. పార్థివ ప్రాణవ్యాప్తి యున్నంతవరకును పృథివీ మండలమందురు. ఇందు రెండుదృష్టులతో నమృతశుక్రతయీ భాగము నరయవచ్చును. 1 వషట్కారదృష్టి, 2 జ్యోతిష్టోమ మను సంవత్సరయజ్ఞదృష్టి. ఇందు :-

(1) వాక్తత్త్వమునుండియే వషట్కార స్వరూపమేర్ప డును. పూర్వోక్తవాగాది షట్శుక్రవికాసమును కేవలము వాగ్వి కాసమే. అదే సర్వవ్యాపియగు ప్రాజాపత్యవాక్కు. ఆనంద విజ్ఞాన మనఃప్రాణ గర్భిత వాక్కు. దాని వ్యాప్తినే మహర్షు లిట్లు కీర్తించుచున్నారు. "అథోవాగేవేదం సర్వం" "వాచీమా విశ్వాభువనాన్యర్పితా" "అనాదినిధనానిత్యా వాగుత్సృష్టా స్వయంభువా" "వాగ్వివృతాశ్చవేదాః" "వాగక్షరం ప్రథ మజా ఋతస్య వేదానాం మాతా ఽమృతస్యనాభిః"

యుగ్మాయుగ్మ (సరి—బేసి) స్తోమములంగాని యీవాక్ త్త్వవ్యాప్తి విచారణ సేయుచో పార్థివవాక్కుయొక్క 48 యహర్గణముల నెదుట బెట్టుకొనవలయును ; కాని యీ యహ ర్గణములన్నిటి విచారణయు నొక గొప్పజటిలసమస్య. కనుక ప్రకృత మయుగ్మస్తోమములకు జెందిన 33 అహర్గణములవరకు వ్యాప్తమైయున్న పార్థివాక్కు నాధారముగాగొనియే, అమృ తశుక్రత్రయీ మీమాంస గావించెదము.

భూపిండకేంద్రమం దమృతమృత్యూభయోభయమూర్తి యగు ప్రజాపతియుండి "ప్రజాపతిశ్చరతిగర్భే అన్తరజాయమానో బహుధావిజాయతే" అని కీర్తింపబడుచున్నాడు. భూపిండసృష్టికి బూర్వమేమున్నది? అన్నచో —'ఆనందవిజ్ఞానమనఃప్రాణగర్భితవాఙ్మయప్రజాతి' యని సమాధానము. వాక్తత్త్వమే ప్రజాపతి యంతిమపర్వము. 'వాచారంభణంవికారో నామధేయం' అను శ్రుతియు, ప్రజాపతివాక్పర్వమే సృష్ట్యుపాదాన కారణమనుచున్నది. కనుక, ప్రజాపతిని వ్యవహారసౌకర్యమునకై 'వాఙ్మయప్రజాపతి— వాక్ప్రజాపతి, యను పేరులతో వ్యవహరింతుము.

భూపిండపూర్వము, వాఙ్మయప్రజాపతి సామ్రాజ్యమే యుండెను. శ్రుతియు, "ఆదశలో ప్రజాపతి యేకాకిగనుండెను. అపు డతనికడ తనదైన లాతిదైనను వాక్కొకటిగనే యుండెను. సృష్టిసాక్షియగు శ్వోవసీయస మనస్సుయొక్క స్వాభావికకామన (ఉత్థితాకాంక్ష) యొక్క ప్రేరణకల్గినది. అందువలన ప్రజాపతి తన యీ స్వధనరూప వాక్కును సృష్టిరూప ప్రవృత్తము జేయుదు ననుకొని సత్యసంకల్పు డతడట్లే చేసెను. వాక్కువలననే సృష్టినిర్మాణము గావించెను. వాగ్భాగమునే పత్నిగా జేసికొనెను. ప్రాణాదిశేషభాగముచే స్వయముగ నాయన పతియయ్యెను. ఈ మిథునమునకు గర్భాధానము జరిగినది. సృష్టిస్వరూపము వెలసినది." అని చెప్పుచున్నది.

* ఈ వాక్సృష్టి స్పష్టీకరణవచనము లరయుడు :—

(1) ప్రజాపతిర్వా ఇదమేక ఆసీత్ తస్య వాగేవ స్వమాసీత్, వాగ్ద్వితీయా సఐక్షత-'ఇమామేవ వాచంవిసృజా- ఇయం వా ఇదం సర్వం విభవన్తీ ఏష్యతి- ఇతి' సవాచం వ్యసృజత. (కఠసంహితా)

(2) ప్రజాపతిర్వా ఇదమాసీత్ తస్యవాగ్ద్వితీయాసీత్ తాంమ్మిథునంసమభవత్ సాగర్భమధత్త సాస్మాదపాక్రామత్ సేమాఃప్రజాఃఅసృజత సాప్రజాపతిమేవపునఃప్రావిశత్ (తాండ్య బ్రాహ్మణము)

త్రైలోక్యమందు వాఙ్మయ ప్రజాపతి వైభవమేర్పడును. "ప్రజాపతిర్వై వాక్, వాగ్వై ప్రజాపతిః" టను ప్రజాపతి యశోగానమే. వాక్కే ప్రజాపతి స్వరూపము, 'వాగ్వా౽స్య స్వో మహిమా' ఈ ప్రాజాపత్యవాక్కు సహస్రభావమునొంది వషట్కారజననియగును. మనఃప్రాణభరితమగు నీవాక్కును 'గౌ' అందురు. ఇదే సహస్రము.

* శ్రుతిప్రతిపాదిత వాక్తత్త్వము శబ్దప్రపంచభిన్నత [illegible]ము. వాక్తత్త్వ మునుండి పిదప శబ్దప్రపంచ వికాసముకల్గెను. కనుక వాకు[illegible] శబ్దపర్యాయ మన జాలము. కాని వేరొకదృష్టితో గొంతతడవు 'వాక్కు' అనగ శబ్దప్రపంచమన వచ్చును. శబ్దతన్మాత్ర సృష్టికి మూలముగదా! మొద[illegible]తాకియయ్యెను వాక్కుల ముపయోగించువాడు లోకవైభవయుక్తుడగుటయు [illegible]చుచున్నాము. ఇట్లు రెండు శ్రుతులను వాక్తత్త్వవిమర్శతో, పరమార్థతత్త్వ[illegible]రూపణగూడ సేయుచున్నను. లోకదృష్టితో "మనముగూడ ప్రజాపతివలె పూర్ణవైభవయుక్తులము గావలయుచో తమతమ వాగ్బలముల నుపయోగమునకు దెచ్చుకొనుట మంచిది" అని సంకేత మాత్రముగా జెప్పుచున్నది.

"వాగ్వాఏషా నిదానేన యత్ సాహస్రీ తస్యా ఏతత్ సహస్రం వాచః ప్రజాతం" "సహస్రధా మహిమానః సహస్రం యావద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్"

(ఈవివరము మరొకచో జూడవచ్చును.) ఈసహస్ర వాగ్ధారల యాధారముననే ప్రజాపతియొక్క వాఙ్మయ వషట్కార స్వరూప మేర్పడును.

ఈప్రాజాపత్యవాక్కు అమృతమృత్యుమయి. ఎట్లన:- "అర్ధంహవై ప్రజాపతే రాత్మనో మర్త్యమాసీ దర్ధమమృతం" అన్నట్లు:-ఆనందవిజ్ఞానగర్భిత మనఃప్రాణవాఙ్మయ, సృష్టిసాక్షీ ప్రజాపతి అమృతమృత్యుధర్మయుక్తుడు. కనుక నతని యంతిమ వాక్కళయు, అమృతమృత్యు ధర్మయుక్తమగుట సహజసిద్ధము గదా !

దీనినుండి 'దైవానిచభూతాని' యను రెండుతెగల ప్రజ కలిగినది. అమృతవాక్కునుండి దైవప్రజయు, మర్త్య వాక్కునుండి భూతప్రజయు వికసిల్లెను. భూపిండ సంబంధము గల యస్మదాదులు మర్త్యభూతప్రజ. పృథివీమండలసంబంధము గల అగ్న్యాదులు అమృతదేవప్రజ. "అంతరంమృత్యోరమృతంమృత్యోరమృతమాహితం" అన్నట్లు అమృతమృత్యువులు పరస్పర మవినాభూతములు. కనుక భూతప్రజయందమృతవాక్కును, దేవప్రజయందు మర్త్యవాక్కునుగూడ ఉండునని యంగీకరింపవలయును. ఇక నీరెంటి నిర్మాణమందును భేదమేమన భూతప్రజానిర్మాణము అమృతవాగ్గర్భిత మర్త్య

వాక్కులనుండియు దేవప్రజానిర్మాణము మర్త్యవాగ్గర్భితామృత వాక్కునుండియు నైనది. భూతప్రజయందు మర్త్యవాక్కు దేవప్రజయం దమృతవాక్కును ప్రధానము లనిభావము.

అమృతగర్భిత మర్త్యవాక్కునుండి 'సోఽపోఽసృజత వాచఏవలోకాత్;' "వాగేవసా ఽసృజ్యత" అన్నట్లు మొట్ట మొదట మర్త్యాపఃశుక్రమే వెలువడును. మనువును "అపఏవ ససర్జాదౌ తాసుబీజ మవాసృజత్" అనియెను. ఈమర్త్యాపః శుక్రమందు క్రమముగ ఘనత యేర్పడగ ఆపః ఫేన-మృత్-సికతా-శర్కరా-అశ్మ-అయస్-హిరణ్యము లను నెనిమిది వికారము లేర్పడి చివరకు మర్త్యాగ్నిశుక్రస్వరూపము కలుగును. "తాసుబీజమవాసృజత్" అన్న బీజ మీమర్త్యాగ్నిశుక్రమే. ఇట్లు :-వాక్శుక్రమే క్రమముగ ఆపః అగ్ని (చిత్య-మర్త్య-అగ్ని) రూపమునొంది భూపిండస్వరూప సమర్పకమగును. ఇది (వాక్శుక్రము) కేంద్రమునందు తానుగను, మధ్యప్రదేశమందు ఆపశ్శుక్రముగను, భూపృష్ఠమందు అగ్నిశుక్రముగను ఉండును. తత్త్వతః భూపిండమందు ప్రాజాపత్యము లగు మూడుమర్త్యశుక్రములును సిద్ధించుచున్నవి. (ఈవిషయము ముందే చెప్పబడినది.)

కేంద్రస్థవాక్కుయొక్క అమృతభాగము రసప్రధానమగుట నిది తేజోరసమందురు. ఇది భూపిండము నలుగడలను సమానాంతరముగ వితతమగును. అందువలన నది తనసహస్ర

భావ (పూర్వోక్త) ముచే నొక వేయిమండలములుగ నగును. ఈవాక్సాహస్రీమండలమే భూకేంద్రస్థప్రజాపతికి మహిమ. వితానము. ఇందు ప్రజాపతి ప్రతిష్ఠితుడై యుండును. "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః".

ఈసహస్రమండలములను వేర్వేరుగ నారేసి స్తోమములుగ నెన్నిరి. ముప్పది ముప్పది వాగ్రశ్మి లొక్కొక యహర్గణము చొప్పున 1000 లో 33 అహర్గణములు కాగా, 10 మండలములు మిగులును. ఇదే ప్రజాపతి యుచ్ఛిష్టము. ఇదే ప్రజాసృష్టికారణము "ఉచ్ఛిష్టాజ్జజ్ఞిరేసర్వమ్" అని యాథర్వణికవచనము.

33 అహర్గణములలో మూటికి కేంద్రస్థ బ్రహ్మ విష్ణు ఇంద్రు లను హృద్యాక్షరములం దంతర్భావము. అనగా :- మూడహర్గణములకు మర్త్యవాఙ్మయ లేదా మర్త్యశుక్రరూప భూపిండమం దంతర్భావ మనిభావము. కాగా నిక బయట మిగులునవి 30 అహర్గణములు. ఇక భూపిండస్థములగు మూడహర్గణములతో నారేసి యహర్గణములను గలుపుచు భోగా 1 త్రివృత్ (9), 2 పంచదశ (15), 3 ఏకవింశ (21), 4 త్రిణవ (27), 5 త్రయస్త్రింశ (33) భేదమున బంచ వాక్తోమము లేర్పడును. ఇంతేకాక :-సప్తదశస్తోమ మను నొక స్వతంత్రస్తోమ మొకటి యంగీకరింపబడినది. 33 అహర్గణములు గల మహిమామండల కేంద్రము, 17 వ యహర్గణము. మహి

మూ కేంద్ర మగుట నిది యగ్నిన్ని కగనుట యుచితమే "తస్మిన్ హాతస్థుః భువనానివిశ్వా" అన్నట్లు, ఇటు 16, అటు 16 నకును మధ్యదగు నీస్తోమ "మనేకాహర్గణస్తోమ" మను లక్షణమునకు వెలియైనను ఇది స్వతంత్రముగ నెన్నబడినది. ఈసప్తదశస్తోమమే 'సప్తదశప్రజాపతి' 'ఉద్గీథప్రజాపతి' అను మొదలగు పేరు లొందినది.

ఇంకొకవిషయము:- పార్థివసంస్థయందు, 1 భూపిండకేంద్రము, 2 మహిమామండల (33 యొక్క) కేంద్రము, 3 మహిమామండలాంతిమపరిధి అను ముఖ్యస్థానములుమూడు. ప్రజాపతితత్త్వము ఈమూడుస్థానములందును ముఖ్యముగా వికసిల్లును. స్థానభేదములంబట్టి మూడురూపములు ధరించును. 1 భూకేంద్రస్థప్రజాపతికి, అనిరుక్తప్రజాపతి, ప్రణవ, అంతర్యామి, కః, ఇత్యాదినామకములు. 2 మహిమాకేంద్రస్థప్రజాపతికి సప్తదశప్రజాపతి, ఉద్గీథప్రజాపతి మొదలగుపేరులు. 3 అంతిమ (33 అహర్గణముల చివర సర్వసంస్థాగర్భిత) హృద్య ప్రజాపతికి 'చతుస్త్రింశప్రజాపతి' 'ఓంకార' 'సః' నిరుక్త ప్రజాపతి అను పేరులు. మిగిలిన యుచ్ఛిష్టరూప దశాహర్గణ సమష్టి 34 వ యహర్గణము దీనికి పరిధిరక్షక సర్వప్రజాపతితో సంబంధము కనుక సర్వప్రజాపతిని 'చతుస్త్రింశప్రజాపతి యందురు. ఇంతకును :- వేయియగు గోతత్త్వమునకు 33 అహర్గములు. ఇవి: 9-15-17-21-27-33 అని యారుస్తోమములు. ఇందు

మొదటిస్తోమము, భూపిండస్థములగు మూడహర్గణములతో జేరి 9 యహర్గణములుకలది. మూడవస్తోమము స్వతంత్రముగ నొకయహర్గణాత్మకము. తక్కిన 2-4-5-6 స్తోమములు, అనగా: 15-21-27-33 స్తోమములు ఆరేసి యహర్గణములు కలవే. మొత్తమీస్తోమములును భూకేంద్రమునుండి వెడలి మహిమా మండల పరిధివరకు వ్యాప్తమగు సహస్రప్రాజాపత్య వాగ్వివర్త ములే యని తేలినది.

## వషట్కారపరిలేఖ :

### పార్థివ సంస్థ

(34)—సర్వప్రజాపతి:

| | | |
|---|---|---|
| 28-29-30-31-32-33 | త్రయస్త్రింశస్తోమము | (6)—33 |
| 22-23-24-25-26-27 | త్రిణవస్తోమము | (5)—27 |
| 18-19-20-21 | ఏకవింశస్తోమము | (4)—21 |
| మహిమా మండలము (17) | ఉద్గీథప్రజాపతి-సప్తదశస్తోమము | (3)—17 |
| (16) | | |
| 10-11-12-13-14-15 | పంచదశస్తోమము | (2)—15 |
| 4-5-6-7-8-9 | త్రివృత్: స్తోమము } అనిరుక్త ప్రజాపతి. | (1)— 9 |
| భూపిండః కేంద్రము 1-2-3 | | |

మండలభేదముచే నొకేవాక్కునకు రువిభాగములు. ఇదే వాక్ + సట్కారము, పరోక్షభాషలో వషట్కారమయినది. యజ్ఞమందు వాఙ్మయేంద్రునకాహుతి నిచ్చుచో 'ఇంద్రాయవా (క్)షట్' అందురు. శబ్దసంకేతముంబట్టి 'మనః ప్రాణగర్భితవాక్కే వాక్' కనుక తద్వ్యక్తీకరణార్థము 'వౌషట్' ప్రయోగము. (ఈవివరణము మరొకచో నరయనగును.

భూపిండమర్త్యశుక్రములకు వాక్-అపః-అగ్నిః, అనియు మహిమాపృథివియందలి శుక్రత్రయమునకు, అగ్ని-ఆపః-వాక్ అనియు క్రమములు. వషట్కార-యజ్ఞ-దృష్టులం బట్టి అమృత శుక్రత్రయికి రెండు విభాగము లని చెప్పి మొదట వషట్కార దృష్టితో శుక్రత్రయ నిరూపణ మపక్రమించితిమి. వషట్కారము ప్రాజాపత్యవాక్సంబంధము కలది. కనుక అప్రాకృతమయ్యును, అందుకు జెందిన యహర్గణ నిరూపణజేయనయ్యెను. ఇక మరల ప్రకరణప్రాప్త వషట్కారానుగతామృత శుక్రత్రయిని నిరూపింతుము.

33 అహర్గణములుకల వషట్కారమండలమునకయుగ్మ స్తోమములతో సంబంధమంటిమి. యుగ్మస్తోమవ్యాప్తింబట్టి ఈపార్థివ వషట్కారమే 48 అహర్గణములవరకు వ్యాప్తమగునని విస్తరభయముచే నావివరణ మీయజాలమంటిమి. కాని ప్రకరణసంగతికై కొంత తెలిసికొనవలసిన దున్నది. ఏమన :-

24 అక్షరములుగల గాయత్రి, 44 అక్షరములుగల త్రిష్టుప్, 48 అక్షరములుగల జగతి అను యుగ్మస్తోమ సంబంధముచే పార్థివవషట్కారమునకు గాయత్ర-త్రైష్టుభ-జాగత-ములను మూడు సంస్థలు నగును. ఛందస్సంబంధముచే నీ మూడు యుగ్మస్తోమములును 'ఛందోమాస్తోమ'ము లనబడును. భూకేంద్రమునుండి లేదా స్థూలదృష్టింబట్టి భూపృష్ఠమునుండి 24 అహర్గణమువరకు గాయత్రస్తోమవ్యాప్తి, 44 అహర్గణము వరకు త్రైష్టుభస్తోమవ్యాప్తి 48అహర్గణమువరకు జాగతస్తోమ వ్యాప్తి. అహో! పార్థివవిస్తార మెంతవరకు గలదో దీనింబట్టి యంచనాగా నూహింపుడు. ఏమన నీమహిమాపృథివియొక్క 21 వ యహర్గణముపై సూర్యుడున్నాడు, దాని 48 వ అహర్గణపర్యంత వ్యాప్తి యెంతవరకు నుండును?

కానిండు యుగ్మస్తోమచర్చ విడిచెదము. ఇట నొక విషయమెరింగిన జాలును. ఏమన:-48 యహర్గణములను 21-33-48 ఇట్లు మూడు భాగములు గావింపుడు. (భూకేంద్రమునుండి) 21 వ అహర్గణ పర్యంతము అమృతాగ్నిశుక్ర వ్యాప్తి యుండును. 33 వరకు అమృతాపశ్శుక్రవ్యాప్తి యుండును. 48 వరకు అమృతవాక్శుక్రవ్యాప్తి యుండును. ఇదే వషట్కారానుగ తామృతశుక్రత్రయి యనబడును.




ఇక క్రమప్రాప్తమగు యజ్ఞసంబంధి అమృతశుక్రత్రయిం జూతము. "అగ్నిఃసర్వాదేవతాః" అన్నట్లు 33 గురు యజ్ఞియ దేవతలకును ప్రాణాగ్నియందంతర్భావము. పూర్వోక్తప్రకారము మహాపృథివియొక్క 21 వ యహర్గణపర్యంతమును నీయమృతప్రాణాగ్నివ్యాప్తి యుండును. కనుక నీయాగ్నేయ మండలమునే దేవమండలము లేదా యజ్ఞమండలము అందుము. ఈయజ్ఞమండల దృష్టితోడను శుక్రత్రయీవ్యాప్తి నరయ వచ్చును.

స్వయముగ నగ్నియే తన ఘన, తరళ, విరళములను నీమూడు క్రమికావస్థల భేదముచే గ్రమముగ త్రివృత్ 9, పంచదశ 15, ఏకవింశ 21 స్తోమములందు వేర్వేరు రూపముల

నున్నది. (1) త్రివృత్ స్తోమావచ్ఛిన్నాగ్నియే యగ్నియనబడును. ఇటనే అమృతాగ్నిశుక్రభోగము జరుగుచున్నది. (2) పంచదశస్తోమావచ్ఛిన్నాగ్నియే వాయువు అనబడును. ఇటనే అమృతాపశ్శుక్ర మున్నది. (3) ఏకవింశస్తోమావచ్ఛిన్నాగ్నియే ఆదిత్యుడనబడును. ఇటనే అమృతవాక్శుక్రవ్యాప్తి. ఇట్లు :- కేవలము పార్థివాగ్నిమండల మందే అమృతశుక్రత్రయీభోగము సిద్ధమగుచున్నది.

ఆగ్నేయా. దేవప్రాణరూపా.
యజ్ఞియాపృధివీ.
అమృతశుక్రమయీ.

| | | | |
|---|---|---|---|
| ఏకవింశస్తోమః 21 | 21 / 16 | ఆదిత్యః | — వాక్శుక్రమ్: |
| పంచదశస్తోమః 15 | 15 / 10 | వాయుః | — ఆపశ్శుక్రమ్: |
| త్రివృత్ స్తోమః 9 | 9 / 4 | అగ్నిః | — అగ్నిశుక్రమ్: |
| | 3 | అగ్నిః | |
| | 2 | ఆపః | |
| భూపిండః (మర్త్యశుక్రమయః) | 1 | వాక్ | |

21 స్తోమాంతమున్న పార్థివప్రాణాగ్నియే యజ్ఞాగ్ని. యజ్ఞమాత్రికవేదోత్పత్తి దీనినుండియే. పైజెప్పబడిన, 33 అహర్గణములకు జెందిన వషట్కారమండలమం దగ్నిసోమ సత్తయున్నది. ఈపార్థివ షట్కారముయొక్క 21 వ అహర్గణము వరకు పార్థి వామృతాగ్నియు, అటనుండి 33 పర్యంతము సోమతత్త్వమును వ్యాప్తములు. వస్తుతః 33 అహర్గణములు గల వషట్కార మండలార్థమునందు (16 వరకు) అగ్నియు, తక్కిన అర్థభాగమునందు (18 నుండి 33 వరకు) సోమము నున్నవి. ఈరెంటి నడుమదగు 17 వ అహర్గణము సప్తదశప్రజాపతియని మున్నుచెప్పియుంటిమిగదా! ఈస్థానమే పార్థివసోమయజ్ఞము (జ్యోతిష్టోమయజ్ఞము) నకు ఆహావనీయ కుండము. ఇందలి పార్థివప్రాణాగ్నియే ఆహావనీయాగ్ని. దీనికి పైనున్న సోమమిం దాహుతముకాగా నాయగ్ని జ్వాల 21 వరకు పెరుగును. కనుక నీదృష్టితో భూపిండధరాతలము మొదలు 21 వరకు అమృతాగ్నిసత్తయు అంతకుపైన 33 వరకు సోమ వ్యాప్తియు నంగీకరింపబడినది.

21 వరకుబోవు నగ్నిజ్వాల మొదట ఘనము, మధ్య తరళము, చివర విరళము నగును. ఈ యవస్థాత్రయమును యాజ్ఞికులు ధ్రువ-ధర్త్ర-ధరుణ ములందురు. 9-15-21 స్తోమములం దివియే అగ్ని వాయు ఆదిత్య నామములొందునంటిమిగదా! ఇందలి అగ్నినుండి మన వాగింద్రియమును, వాయువు నుండి ప్రాణేంద్రియ (ఘ్రాణేంద్రియ) మును, ఆదిత్యునుండి

చక్షురింద్రియమును వికసిల్లినవి. ఇక :-21 కి పైనున్న సోమము గూడ సాయతనము, నిరాయతనమునను రెండు తెఱలగును. ఇందు మొదటిది భాస్వసోమ మందురు. దీనినుండి మన యింద్రియమనస్సు వికసిల్లును. రెండవది దిక్సోమ మందురు. దీని నుండి మన శ్రోత్రేంద్రియము వికసిల్లెను. ఇట్లు :-33 వరకు వ్యాప్తమై యుండు అగ్నిషోముల కవస్థాభేదముచే క్రమముగ 3-2- అవస్థలగును. అందు అగ్నిత్రయి అన్నాదము. సోమ ద్వయి అన్నము. వీనిలో అగ్నిత్రయినుండి త్రయీవేదము, సోమద్వయినుండి యథర్వవేదమును వెలసినవి.

(1) పార్థివవషట్కారముయొక్క త్రివృస్తోమమందలి ఘనాగ్ని పార్థివము. ఇది యున్నప్రదేశ మీమహాపృథివికి భూలోకము. ఈలోకమందలి యీపార్థివ ప్రాణాగ్నినుండి ఋగ్వేదము వెలసినది. (2) పంచదశస్తోమ మందలి వాయు నామక తరళాగ్ని అంతరిక్ష్యము. ఇదియున్న ప్రదేశ మీమహా పృథివి కంతరిక్షలోకము. ఇందలి యీ యాంతరిక్ష్యప్రాణా త్మక వాయువు నుండియే యజుర్వేదము వెలసినది. (3) ఏక వింశస్తోమ మందలి ఆదిత్యనామక విరళాగ్ని దివ్యము. యీ ప్రదేశ మీమహాపృథివికి ద్యులోకము. ఇందలి దివ్యప్రాణాత్మ కాదిత్యునుండి సామవేదము వెలసినది. ఇట్లు :- కేవలము మహా పృథివియొక్క త్రివిధస్తోమ లోకము లందలి యధిష్ఠాతా దేవ తలు మూవురి వలననే మూడువేదముల వికాసము సిద్ధ మగు చున్నది.

(1) పార్థివాగ్ని దేవత తన ఋగ్వేదముచే పార్థివయజ్ఞమునకు హోతయై హౌత్రకర్మ కధ్యక్షుడగును. యాజ్ఞికులీ కర్మను శస్త్రకర్మ యందురు. (2) ఆంతరిక్ష్య వాయుదేవత తన యజుర్వేదముచే అధ్వర్యుడై ఆధ్వర్యవకర్మను సాగించును. ఈకర్మను యాజ్ఞికులు గ్రహకర్మ యందురు. (3) ద్యులోకస్థాదిత్యుడు తన సామవేదముచే ఉద్గాతయై ఔద్గాత్రకర్మ ప్రతిష్ఠాపకు డగును. ఈకర్మను స్తోత్రకర్మ యందురు.

ఇక మిగిలిన సోమద్వయినుండి ఘోరాంగిరా, అథర్వాంగిరా సమష్టిరూపమగు నాల్గవ యథర్వవేదము వికసిల్లెను. దీనిచే చతుర్థలోకాధిష్ఠాత చంద్రుడీపార్థివయజ్ఞమునకు బ్రహ్మయై బ్రహ్మకర్మ ప్రవర్తకుడగును.

అగ్నిత్రయి అన్నాదమగుటచే వేదత్రయి నన్నాదమందుము. సోమద్వయి యన్నమగుటచే అథర్వవేదము నన్నమందుము. అన్న మన్నాదగర్భగతమగుచో 'అత్త్రైవాఖ్యాయతే నాద్యమ్' అన్నట్లు అన్నాదమే యగును. కనుక నథర్వాణవేదమున కొకదృష్టితో స్వతంత్రవ్యవహారము లేక వేదములను మూడనియే వ్యవహారము వెలసినది.

అగ్నిమయ పార్థివ ఋగ్వేదముచే మూర్తినిర్మాణము (పిండనిర్మాణము) జరుగును. వాయుమయాంతరిక్ష్య యజుర్వేదముచే పిండమందలి గతితత్త్వము వికసిల్లును. ఇక పిండమహిమారూపమున పిండమునకు నలుగడలను వితతమగు తేజోమండలము ఆదిత్యమయ దివ్యసామవేదమునకు జెందినది.

పిండము-గతి-వితానము (మూర్తి-గతి-తేజము) అను నీమూటి సమన్వయమువలననే వస్తుస్వరూప నిష్పత్తి యగును. ఇవి మూడును క్రమముగ ఋగ్యజుస్సామసంభవములు. ఈతాత్త్విక వేద విగ్రహనముం గావించు నీవచన మరయదగినది.

"ఋగ్భ్యోజాతాం సర్వశో మూర్తి మాహుః
సర్వాగతి ర్యాజుషీహైవ శశ్వత్
సర్వంతేజః సామరూపంహశశ్వత్
సర్వంహీదం బ్రహ్మణాహైవ సృష్టమ్." (తై. బ్రా.)

ఈమనూక్తియు యజ్ఞమాత్రికయగు నీపార్థివ వేదమును స్పష్టీకరించుచున్నది.

"అగ్నివాయురవిభ్యస్తు త్రయంబ్రహ్మసనాతనమ్
దుదోహయజ్ఞసిద్ధ్యర్థమ్ ఋగ్యజుస్సామలక్షణమ్."

ఇంతటితో తాత్త్విక వేద సామాన్యవిచారణ మైనది. ఇక విశేషస్వరూపముంగూడ గొంచెము తెలిసికొందము. ఏదేని వస్తుపిండముంగొని, యందు వేదతత్త్వముం దర్శింతము, వస్తు కేంద్రము మొదలుకొని వస్తుప్రధివంక కుత్తరోత్తర ప్రాస్వభావమున బరిణతమగు త్రిభుజసూచీము ఖాగ్నితత్త్వమే ఋగ్వేదము. మూర్తిభావస్వరూప సంపాదకము ఋగ్వేదమే గదా. ఇది హృదయాదినుండి ప్రథివంక కుత్తరోత్తరము జిన్నదగుచుండును. కనుకనే పురోవస్థిత వస్తుపిండమునుండి మనము దూరముపోవుకొలదియు, నావస్తువు నాకార ముత్తరోత్తరము జిన్నదిగ గన్పట్టును. (పరిలేఖలను వేదవిజ్ఞానమందరయనగును.)

ఇక స్థితి నిం కొకవిధముగా మార్పడు. ప్రథినుండి కేంద్రమువంక కు త్తరోత్తరము జిన్నవగు మండలములను నిర్మించునట్టియు, కేంద్రమునుండి ప్రక్షివర కు త్తరోత్తరము పెద్ద మండలములను నిర్మించునట్టియు వర్తులవృత్తాకార పరిణత తేజోమ యాదిత్యతత్త్వమే సామవేదము. వస్తువునొక కేంద్ర ముగా నెంచి చుట్టునొక మండలము నిర్మించినచో నది సామ మగును. ఆమండలమునం దెచటనుండి యావస్తువుం జూచినను అది యొకతీరుగనే యగపడును. వస్తుపిండముబుక్కు, పిండ మెన్నడును దృష్టికి విషయముకాదు. అదిస్పృశ్యము మాత్రమే. ముట్టగలరుగాని దానిం జూడజాలరు. సామాత్మకమండలమే దృష్టివిషయము కాగలదు. "చూచుదానిని ముట్టలేకుండు టయు, ముట్టజనుదానిని జూడజాలమియు" వేదమహిమ. చూడబడునది సామమండలము. స్పృశింపబడునది బుక్పిం డము. ఈరెంటిలో బుక్తత్త్వము (కేంద్రస్థితవస్తుపిండము). ఆమండలరేఖపై నిలిచి చూచువారందరకు సమానాకారము గనే యుండును. కనుకనే "బుచాసమంమేనే తస్మాత్సామ" అన్నట్లు ఈ బుక్సము రేఖాత్మక మండలమును సామయన వచ్చును. మరియు:-ప్రతివస్తుపిండావసానమును ఆవస్తుబహిర్మం డల లక్షణ రేఖాత్మక మండలముపైన నగుగదా! అంతవరకే వస్తుస్వరూపదర్శనము సంభవము. ఈమండలములు వేయన్నది వేరుమాట దీసంబట్టి "సహస్రవర్త్మాసామవేదః" అనుటతగును. కాని ఏదశయందైనను మండలమే వస్త్వవసానభూమియగును.

అవసానమే సామము కనుక ఈయవసానభావముంబట్టియు నీమండలములు సామ నామమునొందినవి. ఇంకను :-

ప్రకారాంతరదృష్టితో సామశబ్ద రహస్యము నరయుదము. వస్తుపిండమందు తత్కేంద్రమును స్పృశింపుచు పరిణాహము నీవలనావల వ్యాపించియుండు రేఖాభావము విష్కంభము (వ్యాసము) అందురు. అది వస్తుపిండమూలప్రతిష్ఠ. కనుక దీనిని ఋక్కు అనవచ్చును. ఇక పరిణాహమును (రేఖాత్మక బహిర్మండలము) సామ. పూర్వముగూడ మండలమునే సామ యంటిమిగదా! వ్యాసముంద్రిగుణితము గావించినచో వస్తుబహిర్మండల మేర్పడునన్నది సర్వసమ్మతమే కనుక 'త్ర్యుచంసామ.' అన్నది వెలసినది. ఋఙ్మంత్రోచ్చారణకాలముం ద్రిగుణితము గావించుచో సామ యగుట యందు నిదే రహస్యము.

ఇక క్రమప్రాప్తమగు యజుర్వేదముం జూతము. సామాన్యముగ ఋగ్యజుస్సామము లను క్రమమున్నను, తాత్త్వికదృష్టిచే ఋక్సామము లొకవిభాగము, యజు స్సొకవిభాగము నవలెను. విష్కంభపరిణాహములు రెండును సమసంబంధులు. ఈరెంటిచే సీమితమగు యజుస్సు పృథగ్జాతీయము, కనుక వేదత్రయికి ఋక్సామయజుస్సులనుటే క్రమవ్యవస్థ. కనుకనే యజుర్నిరూపణ మిట క్రమప్రాప్తమంటిమి.

ఋక్కువిష్కంభము. సామము పరిణాహము. ఈరెండును వయోనాధ (ఆయతనఛందో) మాత్రములు. సత్తాసిద్ధ

పదార్థములుకావు. కేవలము భాతిసిద్ధములు. ఈరెంటిచే నవచ్ఛిన్నతత్త్వము, వయశ్శబ్దవాచ్యమే యజుర్వేదము. అదియొక వస్తుతత్త్వము సత్తాసిద్ధపదార్థము, కనుక దానిని బురుషుడందురు. ఋక్కు-మహోక్థము, సామము మహావ్రతము యజుస్సు పురుషుడు. అని వ్యవహారము. మహోక్థ - మహావ్రతరూప ఋక్సామాయతన ఛందఃప్రతిష్ఠిత వస్తుతత్త్వము యజుస్సు ద్రవత్వ గురుత్వోత్క్షేపణత్వ అపక్షేపణత్వాది ధర్మముల కాశ్రయభూమి ఋక్సామవేష్టిత యజుఃపురుషుడే: కనుకనే 'ఋక్సామేయజురపీతః' అను వచనము వెలసినది.

పార్థివ యజ్ఞమాత్రిక వేదమునకు మూలప్రతిష్ఠ సౌర గాయత్రీమాత్రికవేదము. సౌరప్రజాపతి, సావిత్రీపరాఙ్ముఖుడగుటచే గాయత్రీతో దాంపత్యమునొంది త్రయీవేదాధారమునదన సంవత్సరయజ్ఞమునకును, తద్వారా పార్థివవేదసంస్థకును, స్వరూపసమర్పకుడగును. 'సైషాత్రయీవిద్యాతపతి' "తద్దేతద విద్వాంసఅప్యాహుః త్రయీవాఏషావిద్యాతపతిఇతి" ఇత్యాది వచనములు సూర్యునింగూడ వేదమయునిగ జెప్పుచున్నవి. ఈసౌరవేదమే గాయత్రతేజస్సంబంధమువలన గాయత్రీమాత్రిక నామమున బ్రసిద్ధిగాంచెను. గాయత్రతేజమన :-సూర్యబింబము నుండి వెలువడు రశ్మల ప్రతిఫలనమువలన (భూపిండముతోడను, వాయుస్తరతోడను డీకొని) తిరిగిపోవుచు, పదార్థప్రత్యక్ష కారణమగు సూర్యతేజము.

వేదమయసౌరరశ్మలు పదార్థ పృష్ఠగతములై తదాకా రాకారితములగుచు మన చక్షుఃపటలముంజేరి పదార్థప్రత్యక్ష కారణము లగుచున్నవి. రాత్రియందు సౌరజ్యోతిర్మయేంద్ర భాగ మస్తంగతము కాగా, దీపాద్యాశ్రయము గొని వస్తుప్రత్య క్షము గావించుకోవలసి యున్నది. దీపాదిప్రకాశమును పరం పరగ సౌరప్రకాశమే. విద్యుత్తుసాక్షాత్తుగ నింద్రుడు. 'యదే తదావిద్యోతతే విద్యుత్ (కేన) అని శ్రుతియు జెప్పెను. "తథాద్యౌరింద్రేణగర్భిణీ" అనుటచే ద్యులోకానుగత సూర్యు డింద్ర ప్రధానుడు. ఐంద్రజ్యోతియే సౌరజ్యోతి, తాపమగ్నికి, (వైశ్వానరాగ్నికి) ప్రకాశమింద్రునకు ధర్మములు. అగ్నిజ్వాల యం దగపడు ప్రకాశ మింద్రమహిమయే. వరుణప్రతిమూర్ఛి తేంద్రనామమే తైలము. తైలగతవరుణభాగము ధూమముగ, ఇంద్రభాగము జ్యోతిరూపమునను గన్పట్టును. వెలిగెడువాని యందెల్ల సౌరేంద్రతత్త్వమున్నది. ఆయీహేతువులచే పదార్థ ప్రత్యక్షసాధనమునందెల్ల సాక్షాత్తుగనో పరంపరగనో మూల కారణముగ సౌరేంద్రతత్త్వమున్నది. ఇట్లే "ఇత్థాచంద్రమసో గృహే" అను వచనముంబట్టి సౌరరశ్మలవలననే చాంద్రసోమ పిండమును జ్యోతిర్మయ మగుచున్నదని యెరుంగవలయును.

సూర్యునుండి వెడలి తిన్నగా భూమివంకకువచ్చు సౌర తేజము సావిత్రి. పృథివిని - అందలి పదార్థములను దాకి ప్రతి ఫలమునొంది తిరిగి సూర్యుంజేరు సౌరతేజము గాయత్రి.

పదార్థప్రత్యక్షకారణము వీనిలో గాయత్రి. సూర్యపిండముం గూడ దీనియనుగ్రహమువలననే చూడగలము. ఈపదార్థ ప్రత్యక్షీకరణమువలననే సౌరజ్యోతిర్మయవేదము గాయత్రీ మాత్రికవేద మనబడియెను. సూర్యబింబము మహదుక్థము. అవేఋక్కులు. అదిఋగ్లోకము. సౌరరశ్మిమండలము మహావ్రతము. ఇవే సహస్రసామలు. ఇదే సామలోకము. బింబ మందలి సీమిత వయోలక్షణ పురుషాగ్నియే వస్తుతత్త్వము. అదే యజుస్సు. యజుర్లోకము. సూర్యుడననేమి? మహదుక్థ మహావ్రత పురుషలక్షణ త్రయీవిద్య వెలుగుచున్నది. ఈవచనములిట ననుసంధేయములు.

"తదేతన్మండలంతపతి-తన్మహదుక్థం, తాఋచః, సఋచాంలోకః, అథయదేతదర్చిర్దీప్యతే-తన్మహావ్రతం, తానిసామాని, ససామ్నాంలోకః అథయఏష ఏతస్మిన్మండలేపురుషః సోఽగ్నిః - తానియజూంషి-సయజుషాంలోకః, సైషాత్రయ్యేవ విద్యాతపతి."

ఈ భూత భౌతిక విశ్వమందు అస్తి యనదగిన దానికెల్ల మూలము ఉపలబ్ధివేదము. 'అగ్నిషోమాత్మకం జగత్' విశ్వమంతయు నగ్నిషోమ సమ్మిశ్రణము. అగ్నిత్రయి వేదమునకును సోమ మథర్వ వేదమునకును, ప్రవర్తకములు. విశేష ధర్మముల సమన్వయముచే నీ వేదము యజ్ఞమాత్రిక - గాయత్రీ మాత్రిక - ఉపలబ్ధ్యాది అనేక భాగములుగనై విశ్వవైచిత్రికి

గారణ మగుచున్నది. ఉపలబ్ధి వేదముంజక్కగ నెరింగిన పిదప అస్తిలక్షణోపలబ్ధి దృష్టిచే విశ్వ - విశ్వాంతర్గతోపలబ్ధ చరాచర పదార్థములెల్ల వేదమయములని తేలును. వేద మర్యాదకు లోబడని పదార్థము లేదు. 'సర్వం వేదాత్ప్రసిధ్యతి' సర్వము నకు ప్రభవ - ప్రతిష్ఠా పరాయణము వేదము. వేదముయొక్క ఈ సర్వారంభకత్వము 'నూనం జనాః సూర్యేణ ప్రసూతాః' ఇత్యాది మంత్రవర్ణనల వలన సిద్ధమగుచున్నది.

శ్రుతి సూర్యుని త్రయీ విద్యామూర్తి యనియు, త్రైలోక్య ప్రసూతి కారణమనియు, ననుటచే బరంపరగ వేదమే సర్వప్రతిష్ఠ యనుకోవచ్చును. పంచ తన్మాత్రలను గుణ భూతములనుండి, భూతముల అనగా అణు - రేణు భూతముల యుత్పత్తియు, భూత పంచీకరణముచే పంచమహాభూతాత్మక విశ్వ - విశ్వప్రజోద్గమమును జెప్పబడుచున్నది. ఇక విశ్వమూల భూతములగు పంచ తన్మాత్రల వికాసమన్ననో, వేదతత్త్వము నుండియే.

శబ్దః స్పర్శశ్చ రూపం చ రసో గంధశ్చ పంచమః
వేదాదేవ ప్రసూయంతే ప్రసూతి గుణకర్మతః" (మనువు)

ఇంతవరకైన వేదవిచారణచే వేదశబ్దమున కర్థము ఈశబ్దాత్మక వేదగ్రంథముకాదని తేలును. ఇది యాతాత్త్విక వేదవివరణార్థ మాప్తమహర్షులచే వాక్యరచనాత్మకముగ వెల సినదని. మామనవి. ఇదే తాత్త్విక వేద మనుకొనుచో వీని

నుండియా పంచతన్మాత్రలు వెలసినవి? త్రయీఘనసూర్యుడీవేదగ్రంథరాశియా? కాదు, వేద మొకమౌలికతత్త్వము. దీని నుండి పంచతన్మాత్రాప్రసూతిద్వారా, సర్వమును వెలసినది. ఈవేదగ్రంథములు వేదమును వివరించు పుస్తకములు. ఆప్త మహర్షులు తమయార్షదృష్టిచే చిరకాలిక పరీక్షద్వారా నిత్య వేదతత్త్వ స్వరూప పరిచయప్రాప్తినొంది, అస్మదాదుల కల్యాణార్థము, ఆగుప్తవేదతత్త్వమును స్పష్టీకరింపనై తమ ప్రాకృతిక రహస్యభాషలో శబ్దప్రపంచముద్వారా గ్రంథరూపమున మనయెదుట బెట్టిరి. ఇంకొక పరమాద్భుతచమత్కార మేమనః- ఆ నిత్యనూతన స్థాపౌరుషేయ మౌలికవేదతత్త్వ స్వరూపానురూపముగనే శబ్దవేదముగూడ గూర్పబడినది! ఈసంక్షిప్తోదాహరణముల నరయుడు.

(1) అగ్నిఋక్కు. వషట్కారవిజ్ఞానానుసారము అగ్నివ్యాప్తి 21 వ అహర్గణమువరకు. అనగా దానికి 21 పర్వములు కనుక అగ్నిమూర్తియగు ఋక్తత్త్వమును స్పష్టీకరణముసేయు ఋగ్వేదమునకును 21 శాఖలే. "ఏకవింశతిధాబాహ్వృచ్యమ్" (2) ఋణధన విజ్ఞానుసారము, తత్త్వాత్మకము, వాయుమయమునగు యజుర్వేదము, ధనభావమువలన 101 భాగములు. కనుక నీరహస్యసూచనకై తత్ప్రతిపాదక యజుర్గ్రంథముగూడ 101 శాఖలుగనే మనయెదుట నున్నది. "ఏకశతమధ్వర్యు శాఖాః" (3) బహిర్మండలాత్మక సామతత్త్వమున కొక వేయి యమాంతరమండలములుండును. అది సహస్రభాగ విభక్తము

కనుక తద్రహస్యభేదక శబ్దాత్మక సామవేదగ్రంథమునకును సహస్రశాఖలే. "సహస్రవర్త్మా సామవేదః". (4) దశవిధ సోమాత్మకాథర్వవేదము ఋణభావమువలన 9 భాగములు. కనుక తత్ప్రతిపాదక శబ్దాత్మ కాథర్వవేదగ్రంథమునకును 9 యే శాఖలు. "నవధాఽథర్వణో వేదః"

(ii) "అగ్నివాయ్వాదిత్యులకు ఋగ్యజుస్సామములకు క్రమికసంబంధము. "అగ్నిసర్వా దేవతాః" అన్నట్లు ఆమూ వురుదేవతలు నగ్నిరూపాంతరములే. ఈమూడువేదములును, వరుసగ త్రివృత్పంచదశైకవింశస్తోమావచ్ఛిన్న, ఘనతరళవిరళావస్థాపన్న అగ్నివాయ్వాదిత్యభిన్న అగ్నిమయ మహాపృథివికి జెందిన, పృథివ్యంతరిక్షద్యులోకములకు విభూతులు" అని ఈవరకే యెరింగితిమి. ఈవేదతత్త్వముయొక్క అగ్నిభావమును నిరూపింపనే, తత్ప్రతిపాదక శబ్దాత్మక వేదత్రయారంభము: 'అగ్ని' తోడనే అయ్యెను. "అగ్నిమీడేపురోహితమ్" ఋక్ "అగ్నే! వ్రతపతే వ్రతం చరిష్యామి" యజుస్సు "అగ్నఆయాహి వీతయే" సామము. వేదగ్రంథములు సాక్షాద్వేదతత్త్వ ప్రతికృతు లనుటకీ ప్రమాణములు చాలును.

ఇట నొకవిషయ మవధరింపదగినది. ఏమన :-(శుక్ల) యజుర్వేదోపక్రమము 'ఇషేత్వోర్జేత్వా' అని యున్నను, వైజ్ఞానికదృష్టితో 'అగ్నేవ్రతపతే' అనియే యుండవలయును. యాజ్ఞిక కర్మసంగతికై 'ఇషేత్వా' ముందుగ బఠితమైనది.

ఇష్టికి మొదటిదినమున నింద్రునకు 'సాన్నాయ్య' (దధి) కావల యును. అందుకు గోదోహనమున గోవత్సముందోలుటకు పలాశశాఖ స్వీకరింపనై (ఇషేత్వా ఊర్జేత్వా (ఛినద్మి) (అన్న ముకొరకు దానివలనగలుగు ఊర్గ్రసముకొరకు నిన్ను నరికెదను.) అని ఈమంత్రము వినియోగము. వస్తుతః 'అగ్నే వ్రతపతే' అని ఆరంభించుటే యుచితము. ఇందుకు ప్రమాణము తదీయ బ్రాహ్మణము "ఓమ్ వ్రతముపైష్యన్ అంతరేణా" అని మొద లుగ 'అగ్నే వ్రతపతే' అనునదే మొదటి మంత్రముగ నంగీక రించెను.

(iii) సరిమే :—అగ్నిమయఋగ్వేదము త్రివృత్ స్తోమ రూపపృథివికిజెందినదిగదా! పృథివిమనకు సమీపము, పురోఽవ స్థితము, కనుక సీసామ్ముఖ్య భావముచే పార్థివఋఙ్మయాగ్ని పురోహితమనదగును. కాగా, ఋగ్వేము పార్థివ, పురోహి తాగ్నిప్రధానము కనుక తత్ప్రతిపాదకఋగ్వేద గ్రంథోపక్రమ మును, 'అగ్నిమీడేపురోహితమ్' అని యున్నది.

కర్మను వ్రతమందురు. అది క్రియ. గతి. వాయుమయ యజుర్వేదము గతిభావాత్మకము. వ్రతపతి (కర్మసంచాల కము.) ఇది పంచదశస్తోమరూపాంతరిక్ష లోకమునకు జెందినది. ఏకర్మ సంచాలనమునకైన నంతరిక్ష (మవకాశ) మావశ్య కము. అందలి వాయుతత్త్వమే ప్రాణరూప గతిభావ ప్రవర్త కము. కనుక ఆంతరిక్ష్య వాయుమయ యజురగ్ని వ్రతపతి

శబ్దముచే సూచించెను. పక్షాంతరమున, ఇషే త్వోర్జే త్వా వాయవః, అనియు ననుకొనవచ్చును.

ఆదిత్యమయ సామవేదము 21 స్తోమరూప ద్యులోకమునకు జెందినదిగదా! అది (ఆదిత్యాగ్ని) మనకెంతో దూరమం దున్నందున, తత్సంబుద్ధి 'ఆయాహి' అని దూరసంబంధమును సూచించినది. ఇంకవలనగూడ నీవేదగ్రంథములా తాత్త్వక నిత్యవేదానురూపములే యని తోచును.

(iv) పార్థివాగ్ని ఘనము, ఋఙ్మయము, మూర్తి (పిండ) ప్రవర్తకము ననుకొంటిమి. పిండభావసీమితమూర్తి సరళముగ నెఱుంగుటకు గ్రహింపదగును. కనుకనే మూర్తిసంపాదకమును, పార్థివము నగు మౌలిక ఋగ్వేదముయొక్క సీమాభావ వ్యక్తీకరణమునకై తత్ప్రతిపాదక ఋగ్వేదగ్రంథము పద్యరూపము ధరించియున్నది. అర్థబ్రహ్మవివర్తమందు మూర్తిభావ (పిండభావ) మునకు గలస్థానమే, శబ్దబ్రహ్మవివర్తమునందు పద్యభావమునకు గలదు.

"అంతరిక్షాగ్ని తరళము. వాయుశబ్దవాచ్య" మంటిమి. ఈప్రాణవాయువు యజుర్మయము గతిభావప్రేరకము. వాయుతత్త్వము అసీమమువంటిది. చెదరియుండునది ఋతతత్త్వము. పిండమువలె దీనికి సీమాభావ ముండదు. కనుకనే తత్తత్త్వప్రతిపాదక యజుర్వేదగ్రంథమును, గద్యరూపము ధరించినది. వాయువు-గద్యవాక్కు ఈరెండు నొకపోలికగలవి.

పిండమే తన ప్రాణభాగముచే వితతమై మహిమామండలముగ బరిణతమగును. పార్థివపిండాగ్ని లేదా ఋగగ్ని నో

వితతమై విరళాగ్ని-సామాగ్ని రూపము నొందును. ఋగ్వి తానమే సామము. వితానభావమే గానము. విష్కంభాత్మిక ఋక్త్రిగుణభావముచే పరిణామాత్మక సామస్వరూపము నిష్పన్న మగును గదా! కనుకనే సామమంత్రములకు వితానభావాత్మక గీతిభావమందు వినియోగ మైనది. ఆగీతకర్మచే, ఉద్గానభావ ముచే 'ఔద్గాత్రకర్మ' యనబడినది. వితాన-గాన-భావములకు సామ్య మున్నదిగదా "గీతిషుసామాఖ్యా"

ఇంతటితో తాత్త్విక-శాబ్దిక వేదస్వరూపము విశదపడి యుండును. కాని ఇట నొకటిమాత్రము జ్ఞప్తియందుంచదగిన దేమన :-మంత్రవాక్య సాధారణలౌకిక వాక్యవంటిది కాదు. అది యలౌకికము. దానికి నిర్మాణముజరుగలేదు. గుంఫనము మాత్రమే. విజ్ఞాన వేదమందలి స్వర-ఛందో-వర్ణాదులే యింకను గలవు కనుకనే ఆయా నియతులకు భంగములేకుండ పారా యణజేసినను, ఆయా మంత్రఫలము లందవచ్చును. తత్తన్మంత్ర ప్రాణదేవత లాకర్షింపబడుదురు. అటుగాక మిథ్యాప్రయుక్త మగుచో నావాగ్వజ్రము యజమానుని హింసించునని యీ వరకే చెప్పితిమి గదా! అందలి ప్రతి అవయవమును మహాలిక తత్త్వసంబద్ధము. మానవకల్పన కందు తావులేదు. మనసొంత రచనలవంటి దదికాదు. కనుకనే ఋషిప్రణీతమయ్యె నది దృష్ట మనబడినది. అది సత్యవాక్య. అనాదిసిద్ధస ఋషులచే ప్రాకృ తిక నియమాధారమున గుంఫితమాత్రము. కనుకనే ఇదియు,

అపౌరుషేయము నిర్భ్రాంతము అనుట తగును. భారతీయ కర్మకలాప నిర్ణాయక మిదే. ఈ నిర్ణయము వేదతత్త్వనిజస్వరూపము నెరుంగుటచే మరింతనిష్ఠకు గారణమగును.

## జ్ఞాతవ్య కర్తవ్య భేదముచే వేదశాస్త్రమునకు రెండుభాగములు.

విజ్ఞానాత్మక నిత్యవేదము, తత్ప్రతిపాదక శబ్దవేదము అను నీరెంటిలో శబ్దవేదమే మన కుపయోగి. కర్తవ్యకర్మ నిదే తెలుపును. కర్మయోగలక్ష్య మిదే. మంత్రబ్రాహ్మణ భేదముచే నిది రెండుభాగములు. 'మంత్రబ్రాహ్మణయో ర్వేద నామధేయమ్'' మంత్రమును బ్రహ్మ యందురు కనుక వీనిని బ్రహ్మబ్రాహ్మణము లనియు ననవచ్చును. బ్రహ్మవ్యాఖ్యానము బ్రాహ్మణము.

పిండ గతి వితానాత్మక ప్రాకృతిక ఋగ్యజుస్సామాత్మక అగ్నివాయ్వాదిత్యమయ త్రయీవేదతత్త్వ స్వరూప పరిచయార్థము, గద్యపద్యగేయాత్మక మంత్రరూప వేదభాగము మనయెదుటనున్నది. పద్యాత్మక మంత్రసంగ్రహము ఋక్సంహిత. గద్యాత్మక మంత్రసంగ్రహము యజుర్వేదసంహిత. గేయాత్మక మంత్రసంగ్రహము సామసంహిత. ఈమంత్రాత్మక వేదభాగము విజ్ఞాన-స్తుతి-ఇతిహాసము లనునీ మూడు జ్ఞాతవ్యవిషయములనే విశేషరూపమున నిరూపించును. రెండవదగు బ్రాహ్మణభాగమునకు: విధి ఆరణ్యక ఉపనిషత్తు లనునీ

మూడు విభాగములు. ఇది కర్తవ్యవిషయ నిరూపణ సేయును. (చూ. గీతావిజ్ఞానము).

జ్ఞాతవ్య విషయములందలి విజ్ఞానమునందు కర్తవ్యప్రతిచ్ఛాయ యున్నట్లు తోచవచ్చును. తత్త్వపరీక్షగదా, విజ్ఞానము? అది కర్మకాదా? అనుకొందురు! కాని ఇట వర్ణాలిక విజ్ఞానవేదమే విజ్ఞానశబ్దముచే నభిప్రేతముకాని పరీక్షాకర్మకాదు. గ్రంథాధ్యయనముద్వారా వేదతత్త్వము నెరుంగుటయే విజ్ఞానము. దీనివ్యావహారిక రూపము యజ్ఞకర్మయే. అయ్యది విధిభాగప్రతిపాదిత యజ్ఞకాండాంతర్భూతము.

ఇట్లే:-సంహితయందలి స్తుతిభాగోపయోగము కర్తవ్యాత్మక మగు నుపాసనాకాండ (అరణ్యకము) యందే, కనుక ప్రాతిస్వికరూపమున సంహితయందున్న స్తుతిభాగము కేవలము జ్ఞాతవ్యమే. ఇక నితిహాసము జ్ఞాతవ్యమనుటంగూర్చి వేరుగ జెప్ప బనిలేదు.

ఇట్లు ఈ మూటిపరిజ్ఞానము కల్గినపిదప కర్తవ్య కర్మప్రవృత్తుడు గావలయును. అప్పుడే సఫలత లభించును. ఆకర్తవ్యకర్మలు, 1 ప్రవృత్తి, 2 నివృత్తి, 3 ఉభయ భేదముచే మూడు భాగములు. ప్రవృత్తికర్మ కర్మయోగము, నివృత్తికర్మ జ్ఞానయోగము. ఉభయకర్మ భక్తియోగము. సంహిత విజ్ఞానస్తుతీతిహాసములనువలె బ్రాహ్మణము, విధిభాగముచే కర్మయోగమును, ఆరణ్యకభాగముచే (నుభయ

కర్మయగు) భక్తియోగమును, ఉపనిషద్భాగముచే నివృత్తి లక్షణ జ్ఞానయోగమును, నిరూపించును. ఇట్లు బ్రహ్మ-బ్రాహ్మణాత్మక వేదభాగములచే జ్ఞాతవ్య-కర్తవ్యములు, మూడు మూడును గతార్థము లగుచున్నవి. 'సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి' ఇది యెరుంగనివారు బ్రహ్మభాగమే వేదమనుకొనుట శోచనీయము.

## బ్రాహ్మణవేదముయొక్క ఇతికర్తవ్యత

విధిభాగనామక బ్రాహ్మణభాగ నిరూపిత కర్మకాండ భౌతికవిశ్వమునకు జెందినది. అరణ్యకోపనిషత్తు లను బ్రాహ్మణ భాగములచే ప్రతిపాదితములగు నుపాస్తి-జ్ఞానకర్మలకు విశ్వాత్మతో సంబంధము. విశ్వాత్మయే ఈశనామ ప్రసిద్ధుడు, వేదోక్తమగు నీశశబ్దము ఈశ్వరనామముగ బరిణమించెను. ఈ ఈశ్వరతత్త్వము సోపాధిక నిరుపాధిక భేదములచే క్రమముగ సగుణ-నిర్గుణ భేదములుగ బరిణమించుచున్నది. 1 సత్యకామ, సత్యసంకల్ప, సర్వధర్మోపపన్న, ప్రాకృతానంత కల్యాణ గుణాకర, మహామాయి, ఆత్మతత్త్వము సగుణ బ్రహ్మ. 2 అకామ అసంకల్ప నిర్ధర్మక మాయాతీత (కనుకనే) విశ్వాతీత నిరంజన బ్రహ్మతత్త్వమే నిర్గుణబ్రహ్మ. అరణ్యకభాగ ముఖ్యలక్ష్య ముపాస్యసగుణబ్రహ్మ. ఉపనిషద్భాగము సగుణ బ్రహ్మద్వారా తటస్థవృత్తిచే నిర్గుణబ్రహ్మను లక్ష్యముగా గొన్నది.

ప్రకారాంతరముగ :-కర్మకాండయందు గర్మయు, ఉపాసనాకాండయందు జ్ఞానకర్మలసమానతయు, జ్ఞానకాండయందు

జ్ఞానమును ప్రధానములు. ఉపాసనాకాండయందు జ్ఞానకర్మ సమన్వయము ప్రత్యక్షమే, ఎట్లన :-' సాపరానురక్తిరీశ్వరే' అన్నట్లు ఈశ్వరానురక్తిలక్షణ సగుణేశ్వర ధ్యానమే యుపాసన. ఈధ్యానము మానసజ్ఞానాత్మక వృత్తివిశేషము. దీనిబట్టియే యుపాసనయందు జ్ఞానసమన్వయ మంగీకరింపబడును. ఈధ్యానాత్మక జ్ఞాననిశ్చలతకై మనఃసంయమనమునకై స్వభావతః మూర్త (భౌతిక) పదార్థముల వంకకు వంగియుండు మనఃస్థిరత కొరకు, భౌతిక మూర్తపదార్థములనే మధ్యస్థములుగ స్వీకరింపవలయును. ఏదోయొక యాలంబనము లేకుండ నుపాసన సిద్ధించుట యసంభవము. ఈమధ్యస్థము గావించుకొన్న భూతభాగమే కర్మభాగము. కనుక నీదృష్టితో నుపాసన యుభయాత్మిక యందురు. ఇక జ్ఞానకాండయందు సర్వకర్మఫలత్యాగవృత్తి ప్రధానము కనుక దానిని జ్ఞానప్రధానమేయందురు.

ఇట్లు :-ఈ దృష్టితో సగుణనిర్గుణ భేదములచే, ఉపాసనాకాండ- జ్ఞానకాండల యోగములు రెంటికి పార్థక్యమున్నను, ఈ రెంటి నిరూపణకు ఆరణ్యక - ఉపనిషత్తులు రెండును వేర్వేరయున్నను విద్యాసమానతంబట్టి రెండును, పర్యవసానమునందు ఒక కాండ(విద్యాకాండ)యే యనవచ్చును. ఏమి? సగుణ విద్యయు, నిర్గుణవిద్యయు, విద్యలే. విద్యయేజ్ఞానము కనుక సగుణవిద్యజ్ఞానకాం డాంతర్భావముగ నెంచుచో జ్ఞానకర్మలు రెండే (యోగసాంఖ్యములు) మార్గములగును.

ఇందును జ్ఞప్తియందుంచదగిన విశేషమొకటి, ఏమన :- కర్మమార్గము స్వతంత్రముగ నొకటి, ఉపాసనాజ్ఞానసమన్విత యోగ (జ్ఞానయోగ) మొకటి, యని యెంచి కర్మప్రతిపాదక బ్రాహ్మణ(విధి)భాగము స్వతంత్రముగను తక్కిన రెండుయోగములను బ్రతిపాదించు నారణ్యకోపనిషద్భాగములు ఒకటిగను, వ్యవహరింపబడినవి. ఇందుకు బృహదారణ్యకోపనిషత్తను వ్యవహారమే ప్రమాణము. కనుకనే భగవంతుడును, యోగ సాంఖ్యనిష్ఠ లనుపేర, కర్మజ్ఞానములనే ప్రధానములుగ సూచించెను.

వేదము-గీత ఈరెండును, కర్తవ్యభాగమును పైవిధముగ రెండుభాగములుగ నెంచినను, ఆ కర్తవ్యభాగముయొక్క స్వాభావికత్రిత్వమునుగూడ నుపేక్షింపలేదు. అటుగానిచో విధి-ఆరణ్యక - ఉపనిషత్తు లను వ్యవహారముమాత్రమెట్లు? కనుక జ్ఞాన - భక్తి - కర్మ యోగత్రయియే వైదికయోగమనుటయు న్యాయసంగతమే. ఈ మూటిని ఒకవిశేషహేతువుచే రెండుగ నెంచిన భగవంతుడును, ఒకచో :- 'తపస్విభ్యోఽధికోయోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః, కర్మిభ్యశ్చాధికో యోగీ' యని మూటిని వేర్వేరుగ స్వీకరించెను.

కర్తవ్యవేదభాగ ముఖ్యలక్షణము యోగత్రయి. వైదిక యోగవ్యాప్తి జ్ఞానోపాసనా - కర్మ లను మూడుయోగములందు సిద్ధమగుచున్నది. జ్ఞానకర్మమూర్తి లేదా, బ్రహ్మకర్మమూర్తి, మహామాయావచ్ఛిన్న, మాయీ మహేశ్వరునితో

తదంశరూపి, బ్రహ్మకర్మమూర్తి యోగమాయావచ్ఛిన్న జీవాత్మకు యోగము కల్గించుటయే, యోగము. మహేశ్వరుని బ్రహ్మవివర్త మాధిదైవికప్రపంచము. కర్మవివర్త మాధిభౌతిక ప్రపంచము.

(1) ఆధిదైవిక సాధనములద్వారా తనయధ్యాత్మకు మహేశ్వరుని బ్రహ్మలక్షణాధిదైవిక ప్రపంచముతో యోగము గల్గించుటయే జ్ఞానయోగము. (2) ఆధిభౌతిక సాధనముల ద్వారా, అధ్యాత్మకు, మహేశ్వరుని కర్మలక్షణ ఆధిభౌతిక ప్రపంచముతో యోగముగల్గించుట కర్మయోగము. ఇదే ప్రస్తుత ప్రకరణవిషయము. (3) ఆధిభౌతిక సాధనములద్వారా, అధ్యాత్మకు మహేశ్వరుని ఆధిదైవికప్రపంచముతో యోగము గల్గించుట భక్తియోగము. ఇవి యీమూడిటను సాధ్యసాధన భేదములు.

ఈయోగప్రభావముచే జీవాత్మయం దీశ్వరీయ బలాధాన మగును. అందువలన జీవాత్మ సబలమై ఆగంతు కావిద్యాది దోషనిరాకరణ సమర్థమగును. అందుపై నాత్మస్వాభావిక శాంతానంద, నిత్యవిజ్ఞాన (చేతనా) ప్రతిష్ఠా (సత్తా) భావములు వికసిల్లును, అపూర్ణుడగు జీవుని పూర్ణతయు గృతకృత్యతయునిదే.

## నిత్యసిద్ధ - ఈశ్వరీయయోగము

మాయా మహేశ్వర గర్భ మందున్న జీవాత్మకు, విశ్వవ్యాపకములగు మాహేశ్వ రాధిదైవి కాధిభౌతిక విభూ

తుల్యతో యోగ మిప్పుడులేదా? అన్నచో ప్రస్తుతము సమాధానమేమన:-జీవుని ప్రజ్ఞాపరాధ జనిత సంచి తావిద్యాది దోషావరణము, అతని స్వాభావిక యోగము నయోగతుల్యము గావించియున్నది. పై జెప్పిన యోగత్రయి అపూర్వయోగము కాదు. అయ్యది స్వతఃసిద్ధము, ప్రాకృతము. అటుగానినాడు జీవుని స్వరూపరక్షయే యసంభవము. కనుక, యోగత్రయీ యోగ మనగా:—సాధనరూప జ్ఞానాది యోగములచే జీవాత్మ అవిద్యా ద్యావరణములను తొలగించుకొని స్వతఃసిద్ధ యోగ విభూతితో సాక్షాత్సంబంధము కలిగించుకొనుటయే. సాధన రూప యోగానుష్ఠానముచే ఆవర ణాపాకరణము కాగా, స్వాభావి కేశ్వరీయ యోగము వాయువుచే మేఘావరణము పోగా సూర్యప్రకాశమువలె ప్రస్ఫుటిత మగును. ('మేఘాపాయేఽంశుమానివ') ఈశ్వరీయజ్ఞానము- జ్ఞానోపలక్షితకర్మయు స్వతఃసిద్ధపదార్థములు, ఈభగవద్వచన మిటునవధేయము.

నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహావిద్యతే
తత్ స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మనివిందతి."

'యోగముస్వతఃసిద్ధ' మనుకొన్ననే 'తస్మాద్యోగాయ యుజ్యస్వ' అనుట సమన్వయించును. అనగా:-నిత్యసిద్ధ యోగ వికాసార్థము సాధనరూపయోగము నాశ్రయింపవలయును. యోగానుష్ఠానములేదా, స్వాభావిక యోగో ద య ము లే దు. స్వాభావికయోగోదయములేదా, ఆత్మబోధయు, దానిచే నగు మృత్యుపాశవిముక్తియు నుండదు.

"తమేవవిదిత్వాఽతిమృత్యుమేతి నాన్యఃపంథా
విద్యతేఽయనాయ
యదాచర్మవదాకాశం వేష్టయిష్యన్తిమానవాః
తదాదేవమవిజ్ఞాయ, దుఃఖస్యాన్తో భవిష్యతి"

నిత్యసిద్ధమగు నీశ్వరీయ యోగవికాస కారణభూతములగు కర్తవ్యాత్మక కర్మ-భక్తి-జ్ఞానము లను మూడు వైదిక యోగములకును బుద్ధియుక్తయోగ- అబుద్ధియుక్తయోగ భేదముచే రెండేసి భేదము లుండును.

ఈ వైదికయోగములన్నో బుద్ధియోగ మను సమత్వయోగము గూర్చిననే యవియుపాదేయములును, లేనిచో హేయములు నగును. సమబుద్ధిరూప బుద్ధియోగయుక్త యోగత్రయియే అభ్యుదయనిశ్శ్రేయస కారణమగును. అటుగాని, అబుద్ధియోగత్రయి, ప్రత్యవాయములకు బంధనములకు గారణమగును:—

## పూర్వపక్షము.

"అకామస్యక్రియా కాచిత్ దృశ్యతేనేహకర్హిచిత్
యద్యద్ధికురుతేకించిత్ తత్తత్కామస్యచేష్టితమ్"

అను మనువచనానుసారము, మనోవ్యాపారలక్షణ కామనలేకుండ నేకర్మప్రవృత్తియు సంభవముకాదు. కామనకు మూలద్వారమగు మనస్సుయొక్క మనస్త్వము, కేవ

లము బుద్ధి సహాయోగముపై నాధారపడి యున్నది. బుద్ధి ప్రకాశముంగొనియే మనస్సు తన కామనావ్యాపారమందు సమర్థమగును. అనగా:— బౌద్ధజ్ఞానప్రకాశాభాస (ప్రతిబింబ) మువలననే మనస్సు ప్రజ్ఞామూర్తి (చిన్మూర్తి)యై కామనాద్వార మగు ననిభావము. కనుక, కామనామయ మనస్సు బుద్ధిసహా యోగము నొందియే ఆయా శుభాశుభ కర్మలందు ప్రవృత్త మగును. అటుగానిచో డేకర్మయు, జ్ఞానమునుభక్తియు లేవు. ఇట్టిచో కర్తవ్యాత్మకకర్మయోగములకు బుద్ధి అబుద్ధి భేదముచే రెండు భేదము లంగీకరించుట కాధారమేమి? యన్నచో :—

## సమాధానము.

నిజమే, మనస్సునందు కామనాస్ఫూర్తిగావించు బుద్ధి తత్త్వము (1) అవిద్యాబుద్ధి (2) విద్యాబుద్ధి యని రెండుభాగ ములు. ఏకరూపయు నిశ్చయాత్మక వ్యవసాయధర్మలక్షణయు నగు నది విద్యాబుద్ధి. బహుశాఖయు, అనిశ్చయాత్మక వ్యవ సాయలక్షణయు నగు నది యవిద్యాబుద్ధి. ఇందు, విద్యాబుద్ధి మనస్సునుశాసించుచు, విషయసంసర్గజనిత సంస్కారలేపదూ రమై స్వకీయజ్ఞానప్రకాశముచే ఆత్మయొక్క సత్త్వభాగమున కుపకరించును. ఇక నవిద్యాబుద్ధియన్ననో, అందువ్యతిరేక ముగ నాత్మయొక్క సత్త్వభాగమును మలినపరచును. బుద్ధికి:- వ్యవసాయము జ్ఞానధర్మము. అవ్యవసాయవృత్తి యజ్ఞాన ధర్మము. ఒకబుద్ధి జ్ఞానలక్షణ, వేరొకబుద్ధి యజ్ఞానలక్షణ. బుద్ధి

భావ జ్ఞానధర్మములు రెంటికి సమానమయ్యును రెండవదాని జ్ఞానధర్మ మజ్ఞానాత్మక సంస్కార లేపావృతమై యజ్ఞానరూపము నొందును. అజ్ఞానావృత స్వల్పజ్ఞానమే అజ్ఞానము. అవిద్య. మోహము. "అజ్ఞానేనావృతంజ్ఞానం తేనముహ్యన్తిజంతవః" కనుక అజ్ఞానావృతబుద్ధి నవిద్యాబుద్ధిగను, జ్ఞానాత్మకబుద్ధిని విద్యాబుద్ధిగను జెప్పుదురు.

అవిద్యాబుద్ధియందలి సంస్కారలేపరూపాజ్ఞాన సంపర్క ముత్తరోత్తరము కర్మాసక్తిజనకమై యాత్మబలావరక మగును. అట్టి యవిద్యాబుద్ధి స్వకీయ జ్ఞానధర్మాభిభూతమై 'స్వధర్మాభిభవము ధర్మ్యభిభవమే' కనుక అబుద్ధి యనబడును. అట్టి బుద్ధియోగమయోగమే. మేఘావృతసూర్యు డున్నను లేనట్లే గదా! అట్టి అయోగయుక్త కర్మోపాస్తిజ్ఞానములు అబుద్ధి యోగయుక్తములు. కనుక విద్యాబుద్ధియుక్తయోగత్రయి యుపాదేయము. అటుగానిది హేయము.

## అవిద్యాచతుష్టయి

బుద్ధియొక్క స్వాభావిక వ్యవసాయధర్మము నావృతము గావించు నవిద్యాభావము. 1 అభినివేశము, 2 అజ్ఞానము, 3 రాగద్వేషములు, 4 అస్మిత అను నాల్గుభాగములు కనుక వీనిసంబంధముచే నవిద్యాబుద్ధికిని నాల్గువిభాగములు, ఈయవిద్యాబుద్ధిచతుష్టయి క్లేశ మనబడును. దీనికిప్రతిద్వంద్వియగు ధర్మ - జ్ఞాన - వైరా - గ్యైశ్వర్యభేదభిన్నవిద్యాబుద్ధిచతుష్టయు

'భగ' మనబడును. దీనిచే నది క్రమముగ నంతరించును. అందువలన ఆత్మ (కర్మాత్మ) ఆగంతుక తమోభావవిముక్తమై స్వాభావిక జ్యోతిర్భావము నొందును. మృత్యువునుండి యమృతమును, అసత్తునుండి సత్తును పొందును. ఇదే ఆత్మయొక్క స్వ-స్థత. స్వరూప-స్థితి.

అది బుద్ధియోగముపై నాధారపడియున్నది. కనుక కర్మభక్తిజ్ఞానయోగములను బుద్ధియోగవిభూతి యుక్తములను గావించి యనుగమింపవలయును. అందుకే గీత వెలసినది. గీత కర్మయోగగ్రంథము, భక్తియోగగ్రంథము, జ్ఞానయోగగ్రంథము నైయున్నది. మూడుయోగములును వేదశాస్త్రసిద్ధములు. గీతాపథము వేదశాస్త్రసిద్ధపథమే. కాని యావైదికయోగములు మూడును బుద్ధియోగానుగాములైననే యుపాదేయములు, అటుగానిచో హేయము లని గీతసంశోధించినది. లోకసంగ్రాహకు డగు భగవంతుడు బుద్ధియోగముద్వారా, వైదికయోగత్రయిని సమాదరణము గావించి సంగ్రహింపుచునే, కేవలము రాజర్షి సంప్రదాయమందే పరంపరగ వచ్చుచున్నట్టియు, స్వాభిమతమైనట్టియు, వైరాగ్యబుద్ధియోగలక్షణ బుద్ధియోగమును స్వసిద్ధాంతరూపముగ బ్రతిపాదించెను. కనుకనే గీతను బుద్ధియోగశాస్త్రమందుము.

ఈవైరాగ్యబుద్ధియోగము గలుపుకొన్నచో వైదికయోగత్రయి, (కర్తవ్యప్రపంచము) 1 బుద్ధియోగ, 2 కర్మ

యోగ, 3 భక్తియోగ, 4 జ్ఞానయోగ రూపములచే నాల్గు భాగములగును. బుద్ధియోగము సిద్ధాంతపక్షము. దానిని మఱొకచో విచారించుకొందము. ఇందుకు మొదట కర్తవ్యప్రతిపాదకములగు వైదిక విద్యారణ్యకోపనిషత్ సంబద్ధ కర్మ భక్తి జ్ఞానయోగము లందు క్రమప్రాప్తమగు కర్మయోగము నవలోకింతము.

ఇతి యోగసంగతిః.

# వైదిక కర్మయోగము

## ధర్మము - నీతి

కర్తవ్యాకర్తవ్య నిర్ణాయకము శాస్త్రమంటిమి. మానుషానృతకల్పనల కందనిదుమంతయు (న్యాయనిర్ణయములందు) దావృతే దంటిమి. శాస్త్రసిద్ధకర్మకలాపము వైదికలౌకిక భేదముచే రెండుభాగములు. పారమార్థికకర్మలు వైదికములు. వైదికకర్మను ధర్మమనియు లౌకికకర్మను నీతియనియు బిలుతురు. రెంటిసముచ్చితరూపము భారతీయకర్మకలాపము.

భారతేతరదేశములందు ధర్మ - నీతి - దృష్టికోణములు సర్వథాభిన్నములు. ఈపరాధికారచర్చ గానలయనః-ఆస్తికపుణ్యభూమియగు భారతవర్షప్రజ సహవాసదోషానుగ్రహమున ధర్మ-నీతిసంబంధి భారతీయ దృష్టికోణము నుపేక్షించి యితర దేశదృష్టికోణ పథానుసరణము సేయుచున్నది. అందువలన ధర్మము-రిలిజియన్ శబ్దములు సమానార్థకము లనుకొనుచుండుటచే అప్రాసంగికమయ్యు నీ పరచర్చకు జోటొసంగ నయ్యెను.

ఇతరదేశీయ ధర్మశబ్దము మతవాదవాచకము. మతవాదము మానవకల్పనకు జెందినది. అనృతభావయుక్తము. పరివర్తనశీలము. సమయముంబట్టి పరిణామమునొందుచుండునది. మానుషసృష్టి పార్థివ మగుటచే భూతప్రధానము కనుక నిందు భూతవర్గప్రాధాన్యము స్వతఃసిద్ధము.. అందుచే పార్థివ

ప్రజ సహజముగ భౌతికస్థూలార్థముల వంక కాకృష్టమై యుండును. కనుక ఫలితము? మానవకల్పనకు జెందిన మతవాద లక్షణ ధర్మము బాహ్యదృష్టికి సంబంధించిన భౌతికార్థప్రపంచమున కనుగామియగును. చివరకు ధర్మమార్గము నీతిమార్గ పోషక మగును. ధర్మమార్గ మంతర్జగత్తునకును, నీతిమార్గము బాహ్యజగత్తునకును సంచాలకములు. ధర్మమార్గము మన కల్పనవలననే ప్రాదుర్భవించుచో పై జెప్పినవిధముగ ననృత భావయుక్తమును భూతానుసారియునై బాహ్యజగ దాకృష్ట మగుట తథ్యము.

ఇంతకును సమయానుకూల నీతిమార్గమును పోషించుటయే విదేశీయులరిలిజియన్ శబ్దార్థమని ఫలితము. దౌర్భాగ్యమున నొకవేళ రిలిజియనుకును నీతికిని సంఘర్షణ మేర్పడినపుడు అర్థసంగ్రహ మూలమగు నీతి, ఎట్టినిర్దాక్షిణ్యముచే మానవత్వమును, సంస్కృతిని, సాహిత్యమును నాశముగావించునో నేడు వివరింపబనిలేదు. గతకాలమందును ధర్మముపేర నెట్టియత్యాచారములు జరిగినవో విజ్ఞులకు విశదమే. సోక్రటీసువంటి ధార్మికవ్యక్తికి విషపానము! దివ్యప్రేమగల మసూరుకువధ! సిగ్గు! సిగ్గు! పరమశాంతిప్రతిష్ఠ ధర్మతత్త్వము! మతవాదముగనై ఆయా దేశరాజనీతి ప్రతిద్వంద్విత యందుబడి పరమాశాంతికారణ మైనది. అగుచున్నది.

ధర్మనీతుల యీభేదమునకు మూలమేమి? మతవాదము సామయికము. మనుష్యకల్పన తత్కాలీన ప్రసిద్ధపురుషుని

ద్వారా తత్ప్రవృత్తి. ధర్మము ప్రకృతిసిద్ధ శాశ్వతపదార్థము. తత్ప్రవర్తకు డీశప్రజాపతి లేదా ఈశప్రేరణాయుక్త నిత్య ప్రకృతి. అనగా ధర్మమునకు విశ్వప్రకృతితోడను, మతవాదమునకు మానవకల్పనతోడను సంబంధము.

శాసనవ్యవస్థల పరివర్తనలతోబాటుగ రాష్ట్రీయప్రజల మనోభావముల పరివర్తనముగూడ నవశ్యంభావి. "ఇతి తే సంశయో మాభూత్ రాజాకాలస్యకారణమ్" (భారతము) శాసన ప్రణాళీపరివర్తనముచే ప్రజావర్గముయొక్క రాష్ట్రీయ-సామాజిక - కౌటుంబిక - వైయక్తికాది వ్యవస్థ లన్నిటను పరివర్తనములు కలుగును. విజేతలగు శాసకుల నీతి సంస్కృతి సభ్యతల సంఘర్షణయందు బడి విజితులగుశాసకులనీతి - సంస్కృతిసభ్యతలు పలాయితము లగును. ఇట్లు శాసనమూలక రాజనీతికి జెందిన సామయిక పరివర్తనము 'యథారాజాతథాప్రజా' యనుటను చరితార్థము గావించును.

ఈ సామయికశాసనవ్యవస్థా పరివర్తనప్రభావము తత్కాలిక సామాజికజీవన వ్యవస్థలపై బడకుండజాలదు. నవీనవ్యవస్థ వలన ప్రజల సామాజికజీవనమందు కొన్నాళ్లవరకు నొక యుచ్ఛృంఖలత, అస్తవ్యస్తత యుత్పన్నమగును. దానివ్యవస్థకై నాటికొక యోగ్యతావిశేషముగల వ్యక్తి నాయకుడై యతడు తనబుద్ధిబలము ననుసరించి సమయసంగతిబట్టి కొన్ని విశేషనియమములను సృష్టించును. ఇట్లు సమాజ మందలి

సామయికనేత ద్వారా ఆవిష్కృతము లగు నీసామయిక నియమోపనియమముల సమష్టియే మతవాదము. ఇదే విదేశీయుల పరిభాషలో రిలిజియన్. (పార్థివ ఫాల్గుణము)

శాశ్వత ప్రకృతిసూత్ర సంచాలితము ధర్మము. అపరివర్తనశీలము ప్రకృతిసిద్ధము అనాద్యనంతము. మతవాదలక్షణ రిలిజియనో! సామయికదృష్టికోణము ముఖ్యలక్షణముగా గొన్న మానవీయ కల్పనాసూత్ర సంచాలితము. శాసనవ్యవస్థంబట్టి మారుచుండునది. ఈ రెంటిసంఘర్షణాలో రాజనీతికే ప్రాధాన్యముకలుగుట కాశ్చర్యపడ బనిలేదు. ఇట్టి రిలిజియన్ రాజనీతి నాశ్రయించియే వికసిల్లును. విరోధమువచ్చినపు డిది యణగుట సహజసిద్ధము.

ఇక భారతీయధర్మము సరయుదము. నియతిసామ్రాజ్య గుప్తరహస్యముల యాధారమున లోకకల్యాణభావనగల తపఃపూతులు మహర్షులు ఏర్పరచి వారి వాక్కులతో జెప్పిన నియమసంఘమే ధర్మము. అదిశాశ్వతప్రతిసంబద్ధము. శాశ్వతము. సనాతనము. ధర్మప్రధాన భారతవర్షమందు రాజనీతి నాధారముగ గొని ధర్మము (రిలిజియన్) ప్రతిష్ఠితము గావింపబడుట లేదు. ఇచటి ధర్మనీతి యాధారముననే రాజనీతిప్రాసాదము నిలుపబడినది.

ప్రకృతిదేవి గుప్తరహస్యములను తమ దివ్యదృష్టిచే సాక్షాత్కరించుకొన్న మహర్షులు "ఆత్మశాంతిమూలప్రతిష్ఠగనున్న బాహ్యభౌతికశాంతి సురక్షితముగ నుండగలదు. అంతః

శాంతియే బాహ్యశాంతికి మూలము." అను సిద్ధాంతమును స్థాపించిరి. దీని నాధారముగగొని వారు అంతర్జగత్తు అనగా ఆత్మప్రకృతివిశిష్ట చేతనపురుషునకు జెందిన ధర్మమును బునాదిగా జేసి దానిపై బాహ్యజగత్తు (శరీర-శరీరానుబంధిసాధన) ప్రాణప్రతిష్ఠ గావించిరి. అందుచే భారతీయధర్మ-రాజనీతులకు సంఘర్ష ణావసరమే లేదు. ఒకప్పు డేమూఢశాసకుడేని, శాశ్వతమగు ధర్మము నుపేక్షించి రాజనీతిం బ్రధానముగ జేయనెంచెనా? వేన, కంస, రావణ, శిశుపాలాదులవలె నా యధర్మరతుడు మూలచ్ఛేదమే గావింపబడెను. ధర్మనీతికి రక్ష, రాజనీతికి దిరస్కారము, ఇచటి విధానము.

భారతీయరాజనీతింగూర్చి నిస్సంకోచవిషయమింకొకటి: ఇది ధర్మనీతికి బాహ్యరూపము. ధర్మనీతి కనుకూలముగ రాజనీతి తన దృష్టికోణమును దిద్దుకోవలయును. ధర్మదండము నూతగ గొని యే రాజు రాజదండసంచాలన గావించును. మనకు శాసకుడు, రాజు, నాయకుడు అన్నియు ధర్మమే. ఎంతదుర్బలుడైనను ధర్మదండముంగొని యెంత బలవంతునైన నెదుర్కొనును. ఈ వచనము లిట నవధేయములు.

"బ్రహ్మవా ఇదమగ్ర ఆసీ దేకమేవ, తదేకం సన్నవ్యభవత్. తచ్ఛ్రేయోరూప మత్యసృజత క్షత్రం, సనైవవ్యభవత్ సవిశమసృజత, సనైవవ్యభవత్ సశౌద్రంవర్ణ మసృజత పూషణమ్ సనైవవ్యభవత్ తచ్ఛ్రేయోరూప మత్యసృజత ధర్మమ్ తదేతత్ క్షత్రస్యక్షత్రం యుద్ధర్మః తస్మా ద్ధర్మా

త్పరంనాస్తి-అథో అబలీయాన్ బలీయాంసం ఆశంసతే ధర్మేణ యథా రాజ్ఞా ఏవమ్."

శ్రుతి ననుసరించు స్మృతియు, ధర్మదండవైశిష్ట్యము నంగీకరింపుచు, రాజు ధర్మరక్షకుడనియు, తత్ప్రతినిధియనియు జెప్పి అతనినిట్లు శాసింపుచున్నది.

1. బ్రాహ్మంప్రాప్తేనసంస్కారం క్షత్రియేణయథావిధి
సర్వస్యాస్యయథాన్యాయం కర్తవ్యంపరిరక్షణమ్
2. తస్మాద్ధర్మం యమిష్టేషు సవ్యవస్యేన్నరాధిపః
అనిష్టంచాప్యనిష్టేషు తంధర్మం నవిచాలయేత్
3. తస్యార్థేసర్వభూతానాం గోప్తారంధర్మమాత్మజమ్
బ్రహ్మతేజోమయందండం అసృజత్పూర్వమీశ్వరః
4. తస్యసర్వాణిభూతాని స్థావరాణిచరాణిచ
భయాద్భోగాయకల్పన్తే స్వధర్మాన్నచలన్తిచ
5. సరాజాపురుషోదండః సనేతాశాసితాచసః
చతుర్ణామాశ్రమాణాంచ ధర్మస్యప్రతిభూః స్మృతః
6. దండఃశాస్తిః ప్రజాఃసర్వాః దండఏవాభిరక్షతి
దండఃసుప్తేషుజాగర్తి దండంధర్మం విదుర్బుధాః
7. యత్రధర్మోహ్యధర్మేణ సత్యంయత్రానృతేనచ
హన్యతేప్రేక్షమాణానాం హతాస్తత్రసభాసదః
8. ధర్మఏవహతోహన్తి ధర్మోరక్షతి రక్షితః
తస్మాద్ధర్మోనహన్తవ్యో మానోధర్మోహతోఽవధీత్

9. వృషోహిభగవాన్ ధర్మః తస్యయః కురుతేహ్యాలమ్
వృషలంతం విదుర్దేవాః తస్మాద్ధర్మం నలోపయేత్
10. ధర్మాసనమధిష్ఠాయ సంవీతాంగస్సమాహితః
ప్రణమ్యలోకపాలేభ్యః కార్యదర్శనమారభేత్
11. యద్రాష్ట్రం శూద్రభూయిష్ఠం నాస్తికాక్రాంతమద్విజం
వినశ్యత్యాశుతత్కృత్స్నం దుర్భిక్షవ్యాధిపీడితమ్
12. అధర్మదండనంలోకే యశోఘ్నంకీర్తినాశనమ్
అస్వర్గ్యంచపరత్రాపి తస్మాత్తత్పరివర్జయేత్
13. యస్త్వధర్మేణకార్యాణి మోహాత్కుర్యాన్నరాధిపః
అచిరాత్తం దురాత్మానం వశేకుర్వన్తిశత్రవః
14. బహవోఽవినయాన్నష్టాః రాజానః సపరిచ్ఛదాః
వనస్థాఅపిరాజ్యాని వినయాత్ప్రతిపేదిరే
15. వేనోవినష్టోఽవినయాత్ నహుషశ్చైవపార్థివః
సుదాః పైజవనశ్చైవ సుముఖోనిమిరేవచ
16. పృథుస్తువినయాద్రాజ్యం ప్రాప్తవాన్మనురేవచ
కుబేరశ్చధనైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవగాధిజః
17. ఏవంసర్వానిమాన్ రాజా వ్యవహారాన్ సమాపయన్
వ్యపోహ్యకిల్బిషంసర్వం ప్రాప్నోతిపరమాంగతిమ్. (మనువు)

కేవలము రాజనీతియే కాక మన సామాజిక కౌటుంబిక వైయక్తిక జీవనముకూడ నీధర్మనీతినే మూలము గావించుకొన్నది. నేటివారు కొందరు "అన్న పాన వివాహాదులు కేవ

లము సామాజిక కర్మలు వీనికి ధర్మముతో సంబంధము లేదు" అందురు. అది యవిచారిత రమణీయము. భారతీయధర్మ మన్యదేశీయుల రిలిజియన్ వంటిదికాదు. భారతీయప్రజ గర్భాశయమునబడినది మొదలు శ్మశానాగ్ని నధిరోహించువరకు గల సర్వము ధర్మశృంఖలాబద్ధము.

"నిషేకాదిశ్మశానాంతో మంత్రైర్యస్యోదితో విధిః
తస్యశాస్త్రేధికారేస్మిన్ జ్ఞేయోనాన్యస్యకస్యచిత్"

ధర్మమే భారతీయ మౌలికజీవనము, ఆధర్మము. అటుగాక యర్థలుబ్ధతచే ధర్మమును రిలిజియన్ అనుకొని తమ యితరనీతులు ధర్మనీతికి వేరైనవనుకొనుచో భారతీయస్వరూపమునకే మోసము. నేడీమోసమున నుపక్రమణము జరుగుటను నివారించుకొనుటయే కర్తవ్యము. ధర్మరహస్యవిజ్ఞానమా భ్రాంతిని దొలగించును.

భారతీయధర్మమునకును అన్యదేశీయుల రిలిజియన్-నీతులకును ఆదర్శములు భిన్నములు. అచటిధర్మము రాజనీతి కనుగామి. ఇట రాజనీతి ధర్మానుగామి. అట ధర్మము సాధనము నీతిసాధ్యము. ఇట నీతిసాధనము, ధర్మముసాధ్యము. అట నాత్మ శరీరార్థము. ఇట శరీరమాత్మార్థము. అట మనకొరకు విశ్వము. ఇట విశ్వముకొరకు మనము. అట జీవనము భోజనార్థము. ఇట భోజనము జీవనార్థము. అట నంతర్జగత్తు బాహ్యజగద్వికాస సాధనము. ఇట బాహ్యజగత్తంతర్జగ దనుగామి. వారు నానా భావోపేత మృత్యుత త్త్వోపాసకులు. మృత్యుపుత్రులు. వీరు

ఏకత్వలక్ష్యణామృతపుత్రులు. ఈభేదము నెరుంగుచో చిరకాల మునుండి మరచియున్న "శ్రుణ్వంతువిశ్వే అమృతస్యపుత్రా ఆయే ధామాని దివ్యాని తస్థుః" అను మధురవాగ్రసము రుచి నెరుంగగలరు. ధర్మనీతుల సమన్వితరూపమే సిద్ధాంత మని యంగీకరింతురు.

## ఆర్షధర్మము - సంతమతములు

**సనాతనధర్మావలంబులమయ్యు సనాతనులమెకుట** నొక కటుసత్యము విన్నవించుకొనుట తప్పనిసరి యగుచున్నది. ఇందుచే వారప్రసన్నులగుదురు. అయినను వాస్తవికస్థితి స్పష్టీకరణముసేయ కున్నచో సనాతనధర్మ మూలప్రతిష్ఠయు నచల ముగ నుండదు. కనుక ఆర్షధర్మ సంతమతములం గూర్చి యించుక ప్రసంగించెదము.

శంకర రామానుజ వల్లభ మాధ్వ నింబార్క చైతన్య శైవ కాపాలిక శాక్త గాణాపత్య వైష్ణవాది మతవాదములు, సంప్రదాయము లన్నిటిని సంతమతము లందుము. ఇంకను కబీరు, సుందరదాసు, సూరదాసు, జ్ఞానేశ్వరుడు, రామదాసు రామకృష్ణాదుల యుపదేశముల నన్నిటిని ఈమతమునందె యంతర్భావములుగ నెంతుము. మహాభారతకాలమున కేవలనే ఆయా మతములు సంప్రదాయములును వికసిల్ల మొదలిడినవి. అంతకు బూర్వ మివి స్మృతిగర్భవిలీనములుగ నుండియుండును. భారతీయప్రజ వీని ననుగమింప మొదలిడగనే వీనికిమూల మగు నార్షధర్మము ఈమతకోశ విలీనమై పోయినది.

వర్ణాశ్రమధర్మములను పూర్తిగ నుపేక్షించు నర్వాచీన సంప్రదాయికుల వాక్కుల విచారింపబూనము. పైజెప్పిన శంకరాదులు వేదశాస్త్రానుగాములు. ప్రామాణికులు. వారిమతము లుపాదేయము లనుటకు సందియములేదు. వీరి యుపదేశములచే తత్కాలీన పథభ్రష్ట ప్రజకు సన్మార్గోపలబ్ధి యైనది. లుప్తవర్ణాశ్రమధర్మమునకు పునఃప్రాకట్యము కలిగెను. ధర్మవృషభరక్ష అధర్మపథ తిరస్కారము జరిగినది. కనుకనే యీ సాంప్రదాయవాదములు సామయికమతవాదము లయ్యును శాశ్వత సనాతన ధర్మాంగములుగ స్వీకరింపబడినవి.

తమ స్వాభావికదోషములను గప్పిపుచ్చుకొనుటకై భారతీయ నానామతములం గూర్చి యాక్షేపించువారి మాటలందు మనము విలువయుంచబనిలేదు. అన్యదేశములందువలె భారతవర్షమందును రాజ్య-సమాజ-ధర్మక్రాంతు లపుడపుడు వచ్చుటయు, అపుడు నూతన సామయిక మతవాదము లుద్భవించుటయు జరిగినను, వీని యన్నిటికి పరమలక్ష్య మార్షధర్మరక్షయే. కనుకనే ఈ మతవాదములెల్ల సనాతన శాస్త్రమూల సిద్ధాంతముల గొనియే, సామయిక దృష్టితో తమతమ వాదములను స్థాపించుకొన్నవి. కనుకనే యివి సామయికదృష్టిభేదము కలవయ్యును సనాతనశాస్త్రదృష్టిచే నేకలక్ష్యానుగాములుగనే యున్నవి. ఈ సమలక్ష్యము వలననే అనేకమతవాదములున్నను అన్యదేశము లందువలె నిందు పరస్పరసంఘర్షావసరము కలుగలేదు.

నేటి శైవ-వైష్ణవ మతవాదములం దగపడు కలహ కారణము లేమి ? అన్నచో:-మూలప్రతిష్ఠాపరిత్యాగము. మత వాదములెల్లను వేదశాస్త్రసిద్ధము లగుటచే ప్రమాణభూతములే యని యంగీకరించినను, కొన్నిశతాబ్దులనుండి మనము మతవా దాభినివేశమునం బడి వైదికతత్త్వవాదము నుపేక్షించుటచే పరస్పర సంఘర్ష కారణములమై పోయితి మనియు నంగీకరింతుము. ఇందువలన మూలోద్దేశ్యము మరచుటచే నీమతవాదములు లాభమునకు బదులు హాని జేకూర్చున వగుచున్నవి. ఏయార్ష ధర్మరక్షణకు మతవాదము జనించెనో ఆయార్షధర్మము పూర్తిగా నావృతమైపోయినది. అయినను ఈదోషము మత వాదములది కాదు. కారణము ? ఒక మందబుద్ధి యుపయోగ్య సత్పదార్థము నుపయోగించుకోజాలక అసత్పదార్థముగ జేసి వైచుచో నాసత్పదార్థముయొక్క దోషమేమి ?

భారతవర్ష మందలి మతవాదములెల్ల వేదభక్తిని చాటించుచున్నను కేవల మవి తమ సంప్రదాయ గ్రంథములను విస్తరించుకొనుటే గాని వేదస్వాధ్యాయ విముఖములే. వేద శాస్త్ర మన్నిటికి నభిన్న ధరాతలము. "నశ్యంతి బహునాయకాః" బహునాయక సమాదరణము నాశహేతువే. ఇందువలననే వేద శాస్త్రసిద్ధమగు నార్షధర్మము నుపేక్షించి నే డెల్లసంప్రదాయ ములును ఇతరదేశ మతవాదలక్షణ రిలిజియన్ యొక్క స్థానముం గ్రహించి భారతవైభవ నాశకారణము లగుచున్నవి. విభిన్న

సంప్రదాయముల విభిన్నదృష్టికోణములు, వేదధర్మసంబంధముచే నేకసూత్రబద్ధములుగ నుండి యున్న సంఘటనశక్తి నేడు విడిపోయినది. పిమ్మట సాంప్రదాయిక వ్యాఖ్యాతలు తమ యభినివేశముచే వానిని మరింత విడగొట్టి మలిన పరచివైచిరి.

ఈ యభినివేశానుగ్రహముచే మహాపూజా స్థానము నల్పపూజయు, ఈశ్వరీయ, ఆనందలక్షణ భూమాభావస్థానమును జీవానుబంధి దుఃఖలక్షణాల్పతయు వశపరచుకొన్నవి. సమష్టిపూజాస్థానమును, వ్యక్తిపూజ యాక్రమించుకొన్నది. "ఈసంత, ఈసంప్రదా యాచార్యుడు. నిరక్షరమూర్ధన్యుడు, విలాసి" అని యెరింగియు తచ్చరణములందు సర్వస్వ సమర్పణ గావించుటకు సిగ్గుపడ కుంటిమి! ధర్మరక్షయను నెపమున, శ్రద్ధాళువగు దేశముయొక్క విపులధనరాశిం దమకోశములను నింపుకొనుచున్నను, ధర్మరక్షకు లీసంప్రదాయాచార్యులవంక నౌదాసీన్యము వహించియున్నారు. ఈతాండవనృత్యముం జూచు తటస్థులు క్రమముగ ధర్మచ్యుతు లగుచున్నారు. సామాన్య జనతావిషయము విడువుడు. "మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" అను సిద్ధాంతమే వారికి సంతోషభూమి. కాని, వర్తమాన యుగము నందలి శిక్షితసమాజము నెదుట ధర్మము పేర పిట్టిసంప్రదాయవిభీషికలు వెలయునపుడు, ధర్మమున కిట్టి వికృతరూపములు కల్గునపుడు, ధర్మానుయాయుల పరస్పరసంఘర్ష లగపడునపుడు, వారికి ధర్మవైముఖ్య ముదయించుట స్వాభావికము. నేడిదే జరుగుచున్నది. కానిండు, ఎన్ని డీమత

వాదములు నురల వేదశాస్త్రమును తమయభిన్న ధరాతలముగ నాశ్రయించునో! సంప్రదాయ కలహము లేనాడు నశించునో! స్వార్థుల వైయుక్తికస్వార్థము దేశర క్తశోషణము నెప్పుడువద లునో! అది వేరువిషయము. ప్రస్తుతము "భారతీయ మతవా దము వేదధర్మావలంబనముకలది కనుక ప్రామాణికము నుపా దేయము" ననియే చెప్పదలచినది.

ఇక నీసంతమతముయొక్క రెండవదృష్టికోణ మేమనః- ప్రజలను లోకవైభ వాకర్షణ విముక్తము గావించుట. ఒకరు "జగత్తుమిథ్య" యని లోకవైభవమును తిరస్కరింతురు. వేరొకరు "జగత్తు బంధనకారణము" అని ఘోషింపుచు నీశ్వర భక్తి యశస్సును గానముసేయుదురు. అర్వాచీనులు కొందరు 'లోకసమున్నతి యెందుకును కొఱగాని' దనిపించునట్లు లోక భాషలో జనులందు నిరాశాభావము పూరింతురు.

"లక్షాధికారియు లవణమన్న మెకాని వెండిబంగారంబు మెక్కబోడు."

"ఎన్నాళ్లేలిన చివరకు పడకకు ఏడడుగులనేల."

"బొమ్మలాటరా మాయప్రపంచము నమ్మరాదు రన్న."

ఇత్యాది నిర్వీర్యపదములు విన్నపుడు ఆత్మనిర్భరత్వము విలుప్త మగుచుండును. "మన మెందుకు బనికిరానివార"మను భావము బలపడును. లోకసమున్నతిద్వార మవరుద్ధమగుచుం డును. కర్తవ్యపరాయణత శిథిలమగును. స్ఫూర్తియన్నది

తోచకుండును. పరలోకస్వప్నములను జూచుచు, నైహలౌకిక వైభవములకు దిలాంజలు లొసంగబడుచుండును. నేడీయభి నివేశ తాండవమే కన్పట్టుచున్నది.

ఈమతములందలి యార్ష ధర్మ దృష్టి పూర్తిగా లోపించి పోయినది. ఒకానొక విశేష, సామయికోద్దేశ్యముచే మొలకె త్తిన యీమతభావాంకురములు, నేడు పెరిగిపెద్దవృక్షములై త్రొలగింపరాక, దేశమంతట నావరించియున్నవి. అందరును పర మాత్మకు దగ్గరబంధువులు కాగోరువారే. ఎవరినోట విన్నను జీవితానిత్యతా యశోగానమే, లోకవైభవ తిరస్కృతియే. పదేపదే అల్పతాప్రకటనమే. ఆత్మనిర్భరత పలాయితమైనది. పరావలంబనాపేక్ష. ఇట్టిమతములు మనలను దేవతలను గావించి నైచినవి. మనము మనముగా లేక మరొకర మైతిమి. తత్త్వా న్వేషణము, లోకసంఘటనము, రాష్ట్రోన్నతి, లోకవైభవ ప్రాప్తి, సామ్రాజ్య సుఖోపభోగము, మొదలగు నైహలౌకిక వికాసమున కధికారమే లేకుండ బోయినది. ఇదే యీమత ముల దుఃఖపూర్ణేతివృత్తము.

ఆర్ష ధర్మోద్దేశ్యమేమి? అంతర్జగ ద్వికాసముతో లోక వైభవవికాసము. వ్యక్తి - కుటుంబ -సమాజ - రాష్ట్రములం దొక్కొక యావశ్యకతాపూర్తితో అధ్యాత్మసంస్థా పూర్ణవికా సము. "అజితంజేతు మనుచింతయేత్ నక్వచిద ప్యలంబుద్ధి మాదధ్యాత్" పిరికితనము వదలవలయును. వీరతాహ్వానము,

తత్త్వాన్వేషణము, నిశ్శ్రేయసగర్భి తాభ్యుదయవాంఛ, ఆత్మ నిర్భరత్వము, అభయపదోపాసన, అమృతభావచింతనము, శాశ్వతప్రత్యయ దృఢనిష్ఠ ఇత్యాదులు వేదశాస్త్రప్రతిపాదితార్ష ధర్మోపదేశములు.

భూతవైభవము బంధనమూలము, అశాంతికారణ, మన్నది యార్షధర్మము నంగీకరించును. గాని, దాని మూలమం దధ్యాత్మ సాధనలేనపుడే అది యట్టి దగు ననును. వ్యక్తిగత స్వార్థమును విడచి 'లోకకల్యాణహేతవే' అనుదానిని మూలముగ గొన్న వైభవకామన యశాంతి కారణమెన్నడునుగాదు సరిగదా, లోకశాంతికారణమే యగును. ఇదే ఆర్షధర్మసర్వోత్కర్ష. అన్యమతవాదములు, ఆత్మస్వరూపమును వికృతము గావించును. అశాంతిమూలక లోకవైభవములను సమర్థించును. నేటి యివి, కాయక్లేశసమర్థకములై నామమాత్రోదయ కారణములుగ నుండి యర్థతృష్ణావర్ధక సాంఘాతిక శస్త్రాస్త్ర జననహేతువులై యున్నవి. మానవరక్షార్థ మివి నిరర్థకము లని నిరూపింపనై మరల నార్షధర్మమును బ్రతిష్ఠించుటయే తగినపని.

## ఆర్షధర్మ భాగద్వయము

ఆర్షధర్మమే వైదికధర్మము, సనాతనధర్మము, అనబడును. దీనికి ఆత్మసంస్థ-బహిఃసంస్థ యను భేదముచే రెండుభాగములు. ఇందు మొదటిది పారమార్థికము, రెండవది వ్యావహారికము.

ఒకటి యాత్మసంస్థకు రెండవది విశ్వసంస్థకు జెందినవి. ఒకదానికి ధర్మనీతిసూత్రము, రెండవదానికి రాజనీతిసూత్రమును సంచాలకములు. రెండును భిన్న మార్గములుకల వయ్యును పరస్పర సహాయకములు. ఒకటి రెండవదానికి బ్రతిష్ఠ. రెండవది మొదటిదానికి సమర్థకము. రెంటికి నన్యోన్యాశ్రయ సంబంధము. ఒకటి యాత్మయందు, రెండవది శరీరమందు. ప్రత్యేక దృష్టిచే నివిరెండును స్వార్థములు, వ్యక్త్యుపకారకములు. "భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్" ఆత్మపచన లక్షణ మగు నీ వైయుక్తిక స్వార్థభావమువలన నివి రెండును ప్రత్యేకముగ నగు నపుడు పాప జనకములే. పారమార్థికము, వైదికము నగు రమణీయ కర్మయు, వ్యావహారికము యథాధికార సిద్ధము నగు లౌకికకర్మయు సామంజస్యము నొందుటే వాస్తవిక కర్మయోగము. ఈప్రకరణమున దీనినే మీమాంస సేయుదుము.

సాధనములు, స్వరూపనిర్మాణము, ఫలము అన్నియు నాధిభౌతిక పదార్థములనే యపేక్షించు కర్మలమొత్తమే కర్మయోగము. తదాదేశకము కర్మకాండ. ఇదే కర్తవ్యాత్మక వేదమందలి విధిభాగము. వైదికు లీ కర్మయోగమును యజ్ఞమందురు. అది వైజ్ఞానికకర్మ. అధికారి భేదనియతము. భారతవర్ష కర్మయోగ మేమి? యజ్ఞము. ఇయ్యది 'సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః" అను శ్లోకమందు వివృతము.

సమి దాజ్య వేది బర్హి పురోడాశ సోమరస ఋత్వి గ్యజమాన దక్షిణాది సాధనములెల్ల నాధిభౌతికములు. వీని సమన్వయరూపమే యజ్ఞము. శత్రునాశా న్న-యశో వీర్య శ్రీ లక్ష్మీ ప్రజాప శ్వాదులు ఫలములు. ఇవియు నాధిభౌతిక ములే. ఇ ట్లుభయతః ఆధిభౌతికమగు యజ్ఞము కర్మయోగము. లేదా మరొకదృష్టితో :-

సాధన ఫలములు రెండును, ఆధిభౌతికాధిదైవికములగు కర్మలసంగ్రహమే కర్మయోగ మనవచ్చును. ఈలక్షణము పై లక్షణమునకు భిన్న మయ్యును ఉదాహరణము దీనికిని ఆయజ్ఞ కర్మయే. పార్థివసంస్థ భూతప్రధానము "ఏషాంవై భూతానాం పృధివీ రసః" కనుక నిది యాధిభౌతికము. సౌరసంస్థ దేవ ప్రధానము. "చిత్రందేవానా ముదగా దనీకమ్" కనుక నిది యాధిదైవికము. యజ్ఞమం దీరెండు సాధనములును సమన్వయ మొందును. సమిదాజ్యాది పూర్వోక్త ద్రవ్యములు, పార్థివ ములు కనుక నాధిభౌతిక సాధనములు. ఋత్వి గ్యజనమాన పత్నుల యాత్మలు, (సూర్యఆత్మాజగస్థస్థుషశ్చ) ఉదాత్తాది స్వరసీమిత వేదమంత్రములు, సౌరసంస్థకు జెందిన సాధనములు ఆధిదైవికములు. "(స్వరహ దే-వాఃసూర్యః)" ఈరెండును, 'అయంలోకః, అసౌలోకః' అనుసారము ఐహలౌకిక, పార లౌకిక సాధనము లనియు ననవచ్చును.

ఫలాంశముం గూర్చియు నిట్లే:-యశోఽన్నాదులు పార్థి వములు. యజమానుని కర్మభోక్తయగు కర్మాత్మ. (ఇదే

యాజ్ఞికుల మానుషాత్మ) యం దుత్పన్నమగు 'యజ్ఞాతిశయ' మను దివ్యసంస్కార సాంస్కారిక దైవభావమును దైవాత్మ యందురు. అది సౌరసంస్థకు జెందిన త్రిణాచికేత నామక, సప్త దశ స్తోమావచ్ఛిన్న ప్రాణమూర్తి స్వర్గ్యాగ్నిచే నాకృష్ట మగును. దానితో యజమానుని మానుషాత్మ బద్ధమై యుం డును. ఆయుర్భోగము పూర్తికాగానే అదియు తదాకృష్టమై యాసప్తదశ స్వర్గ ప్రతిష్ఠనొందును. ఈస్థానము సూర్యునకు జెందిన దగుటచే నాధిదైవికము. కనుక ఫలమందును నైహ లౌకిక పారలౌకికము లను నాధిభౌతి కాధిదైవికములు సిద్ధించు చున్నవి.

"అయినచో ఈరెండుపక్షములందు ఏది సిద్ధాంతపక్షము" అన్నచో పరమార్థతః, కర్మయోగమునకు మొదట జెప్పినదే సిద్ధాంత లక్షణము. పై ననుకొన్న యాధిదైవికభావములు గూడ నాధిభౌతిక ప్రపంచాంతర్భావములే "పృథివిభూతప్రధా నము. సూర్యుడు దేవప్రధానుడు" అన్నంతమాత్ర మాధార ముగాగొని సాధనఫలము లాధిభౌతి కాధిదైవికము లనుకొనుట వైజ్ఞానికదృష్టి కుచితముగాదు. పిటకీ విజ్ఞానశాస్త్రపరిభాష వేరుగనున్నది.

ఆత్మ-విశ్వము లను నీశ్వరప్రజాపతి రెండువివర్తములను లక్ష్యములుగ గొని కర్మజ్ఞానోపాసనల సాధన ఫలవిచారణ సేయవలయును. ఇందు ఆత్మపర్వము, ఈశ్వర-జీవ భేదముచే

రెండు భావములగును అందుచే ఈరెండు పర్వములన్నవి ఈశ్వర-జీవ-జగత్తు లను మూడుపర్వము లగును. వరుసగ నివి యాధిదైవి కాధ్యాత్మి కాధిభౌతిక ప్రపంచములకు జెందినవి. జ్ఞానోపాస్తి కర్మ ప్రతిష్ఠలు. త్రివృద్భావమువలన నీ మూటను మూడునుండు, నైనను ప్రధానతలంబట్టి యాయా వ్యవహారము సంగత మగుచుండును. ఇందు, కర్మయోగము విశ్వానుబంధియగు నాధిభౌతిక ప్రపంచమునకు సంబంధముగలది. కనుక దాని సాధన-ఫలము లాధిభౌతికములే యంగము.

ఈశ్వర-జీవ-జగత్తు లందు మధ్యస్థము జీవాత్మ. తద్గమనమునకై అటు ఈశ్వరుడు, ఇటు జగత్తును ఉన్నవి. ఈశ్వరస్థాన మాలోకము. జగత్స్థాన మీలోకము. శ్రుతియు "ఇమం లోక మముంచ విజ్ఞానే నైవ విజానాతి" "అయంచలోకః పరంచలోకః" "ఇమంచలోకం పరంచలోకమ్" అనియెను. పరనామ కావ్యయేశ్వరుని స్థానము పరలోకము. జగత్స్థాన మిహలోకము. మధ్యస్థుడగు జీవుడు, ఈశ్వరానుగతు డగుచో పారలౌకిక నిఃశ్రేయససుఖము శాంతానందము. ఇది శ్రేయోభావము. ఇక విశ్వమందే సంసక్తుడగుచో సమృద్ధిలక్షణ విశ్వానందానుభవము. ఐహలౌకికసుఖము. ఇది ప్రేయోభావము. ఈశ్వ రానుగతి వలన లభించు నిశ్శ్రేయస సుఖ శాంతానందము. "ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః" అన్నట్లు కర్మకాండ యన్ననో కేవల మైహలౌకికము, ఆధిభౌతికము-అశాశ్వతము నగు సుఖసాధనము.

యజ్ఞములెల్ల నాధిభౌతిక సాధన-ఫలములు కలవే. ఆత్మసుఖమునకు, మోక్షమునకు, అమృతత్వమునకు, వీనితో సంబంధములేదు. కాని చయనయజ్ఞముచే మాత్రము, చిదాత్మప్రాప్తిలక్షణామృతత్వప్రాప్తి సంభవమని "నామృతత్త్వస్యతుఆశాస్తి ఋద్ధేచయనాత్" అని శ్రుతివచించెను. తక్కిన యజ్ఞములెల్ల నుభయథా, ఐహలౌకికసుఖ ప్రవర్తకములే.

"అయినచో యజమానాత్మ, మంత్రవాక్కులు, సప్తదశస్థానీయ నాచికేతస్వర్గము, ఇవి యాధిదైవికములుకావా?" అన్నచో నివియు నాధిభౌతికములే. ఎట్లన:-ఇవి సౌరసంస్థకు జెందినవి. సూర్యుడు స్వయముగ భౌతికపిండము. భౌతికవిశ్వతృతీయపర్వము. సౌరదేవతలును భూతవిశేషములే. కనుక 'దేవ' శబ్దమాత్రముచే నీసంస్థ యాధిదైవిక మనుకొనుట విజ్ఞానవిరుద్ధము. కనుక మొదటిలక్షణమే కర్మయోగమునకు సరియైనది. ఈకర్మయోగముం జెప్పు వేదగ్రంథము విధి యన బడు బ్రాహ్మణము. తైత్తిరీయాదులు శాఖాభేదములు. 1131 అందలి యవాంతరభేదములు.

అట్టి కర్మయోగమందలి కర్మకలాప మొక వైజ్ఞానిక కర్మ. అధికారిభేదముచే సువ్యవస్థితము. అధికారిభేదము వర్ణాశ్రమములకు జెందినది. అందరు నన్నికర్మలకు నధికారులు గాజాలరు. ఏవర్ణమందు పుట్టినవాడేని బీజభూతములగు శుక్ర శోణితములం దధికారస్వరూప సమర్పకములగు బీజములుగల

వాడు, తద్బీజానుబంధి కర్మలం దధికారము గలవాడగును. యథాధికార సిద్ధములును, స్వధర్మలక్షణములు అగు స్వస్వ కర్మలందు రతుడగువాడే నిజమగు కర్మయోగి.

ప్రస్తుత విచారణీయ వైదికకర్మయోగ మందు వ్యావహారిక పారమార్థికము లను రెండుకర్మవిభాగముచే కాక ప్రాతిభాసిక కర్మలను మరొక విభాగముగూడ కలదు. కర్మాభాసమే ప్రాతిభాసికకర్మ. కర్మవలెనున్నను అది కర్మనుర్యాదావంచితము. కర్మయొక్క కర్మత్వ నుభ్యుదయము. అది కలదే కర్మ. తక్కినది కర్మాభాసము.

ఊరక యిటునటు దిరుగుట, నిరర్థకవచనములు పలుకుచుండుట, పాదారవిందాది ముఖారవిందపర్యంతము సమయాసమయములతో బనిలేక యేదో యొకటి (విషయము-పదార్థము) ఆహుతము గావించుచుండుట, ఊరకకాలూపుట, ఈలవేయుట, చిటికెలువేయుట, అంగతాడనము, తృణచ్ఛేదము ఇత్యాదులు, నిరర్థకకర్మలు. వీనివలన శరీరము-ఆత్మ వీని కేయుపకారము లేకున్నను, కాలాంతరమునం దివి, స్వాస్థ్యము జెడగొట్టి యాత్మపతనహేతువు లగును. ఇట్టికర్మల 'నకర్మ' లందురు. వీనికి విధినిషేధములు శాస్త్రమందు లేవు. గాని వీనిని అవిహితా-ప్రతిషిద్ధకర్మ లని వ్యవహరింపబడెను. ఇవే ప్రాతిభాసికకర్మలు.

మద్యపాన, మాంసభక్షణ, అగమ్యాగమన, మిథ్యాభాషణ, ధూర్తతా, బకవృత్తి-హింసా-దేవ ద్విజ గురు వృద్ధ

పూజ్య శాస్త్ర నిందా-అస్పృశ్య స్పర్శాదులు శాస్త్రనిషిద్ధములు. ఇవి ప్రత్యవాయజనకములు. అభ్యుదయారూప కర్మసంపత్తి వంచితములు. కనుక నొకవిధముగ ప్రాతిభాసికములే. ఇట్టివానిని వికర్మలందురు. ఇవి అవిహితాప్రతిషిద్ధములగు నకర్మల ట్లతిశయ వంచితములు. ప్రత్యవాయజనకములు. కనుక కర్మాభాసములే యందురు. ఇట్లు ప్రాతిభాసికకర్మలు అకర్మ-వికర్మ భేదముచే రెండువిధములగును.

ఇక వ్యావహారికములు. ఇవే మున్ను చెప్పబడిన లౌకిక-వైదికకర్మలు. రాజనీతి-సమాజనీతికి జెందిన (ధర్మనీతి నవలంబముగా గొన్న) పార్థివకర్మలు, లౌకికకర్మ లనబడును. ధర్మనీతి ప్రధానములును, వర్ణాశ్రమనియంత్రణ నియంత్రితములు. అధికారభేదముచే సువ్యవస్థితములు, యజ్ఞతపో దానలక్షణములును నగు పౌరకర్మలు వైదికకర్మలు అనగా ప్రవృత్తిలక్షణ వైదికకర్మలు. ఈరెండును వ్యావహారికకర్మలు. చివరకు— ఐహాలౌకిక సమృద్ధిలక్షణాభ్యుదయముం గల్గించు, లౌకికవైదిక శాస్త్రీయకర్మలెల్లను వ్యావహారికకర్మలని నిష్కర్ష.

మూడవవిభాగము పారమార్థికకర్మలు. ఇవే జ్ఞానయోగలక్షణ నివృత్తికర్మలు. "ప్రవృత్తంచనివృత్తంచ ద్వివిధం కర్మవైదికమ్" అను మనుసిద్ధాంతానుసార ముపరినిర్దిష్ట యజ్ఞాదిలక్షణ వ్యావహారిక కర్మలును వైదికర్మలే. ఈనివృత్తి లక్షణ పారమార్థిక కర్మలును వైదికకర్మలే. కాని యీరెంటి

కిని భేదమేమన :-ప్రవృత్తిలక్షణ వ్యావహారిక వైదికకర్మలు వేదమందలి బ్రాహ్మణ భాగమునకును, నివృత్తిలక్షణ పారమార్థిక వైదికకర్మలు ఆరణ్యకములతోడి యుపనిషద్భాగమునకును జెందినవి. బ్రాహ్మణోక్త ప్రవృత్తిలక్షణ వైదికకర్మలు కర్మయోగము. ఉపనిషదుక్త నివృత్తిలక్షణ వైదికకర్మలు జ్ఞానయోగము. మొదటి దభ్యుదయమునకును రెండవది నిశ్శ్రేయసమునకును సాధకములు. మొత్తముపై నీ మూడు విధములగు కర్మలందును, అకర్మ-వికర్మలక్షణ ప్రాతిభాసిక కర్మలెప్పుడును త్యాజ్యములు. ఇక :-ధర్మానుబంధి వ్యవహారిక లౌకికకర్మలును, వ్యావహారిక వైదిక ప్రవృత్తికర్మలును, పారమార్థిక వైదిక నివృత్తికర్మలును యథాసమయముగ యథాధికారముగ గ్రాహ్యములు.

"కర్మణోహ్యపిబోద్ధవ్యం బోద్ధవ్యంచవికర్మణః
అకర్మణశ్చబోద్ధవ్యం గహనాకర్మణోగతిః"

అకర్మ :-అవిహితాప్రసిద్ధకర్మలు .... .... } ప్రాతిభాషికములు.
వికర్మ :-శాస్త్రవిరుద్ధకర్మలు .... .... }

కర్మ: { ధర్మానుబంధి లౌకికకర్మలు, కర్మలు } వ్యావహారికములు.
{ యజ్ఞాది వైదిక ప్రవృత్తికర్మలు-శ్రేష్ఠకర్మలు }
{ ఉపాసనాది వైదిక నివృత్తికర్మలు-జ్ఞానాత్మకకర్మలు పారమార్థికములు.

ప్రస్తుత ప్రకరణమున మనకు గ్రాహ్యకర్మలు మూటిలో లౌకిక-వైదిక వ్యావహారిక కర్మలతోడనే సంబంధము. వైదికములగు యజ్ఞ తపో దాన లక్షణ ప్రవర్తికర్మలు. రాజనీతికి

జెందిన రాష్ట్రీయ కర్మలు. సమాజవ్యవస్థకు జెందిన సామాజిక కర్మలు, వ్యక్తిగత జీవనమునకు జెందిన స్థూలశరీ రానుబంధి శారీరక కర్మలు. ఇవన్నియు బ్రవృత్తిమూలకములు, విశుద్ధ వ్యావహారికములు. వీనికి పరమార్థము (ఆత్మబోధలక్షణ ముక్తి) తో నేమియు సంబంధములేదు. అనగా :—విశ్వము-విశ్వాత్మయను నీ ప్రాజ్యాపత్యములు రెంటిలో గర్మప్రతిష్ఠా భూమి కర్మప్రధానమగు విశ్వమే అనిభావము.

విశ్వసంబంధి వ్యావహారిక వైదికకర్మ స్వరూపానుష్ఠానములు, అధికార మర్యాదకు జెందినవంటిమి. త్రిగుణప్రకృతి నుండి వెలసిన పాంచభౌతిక విశ్వము త్రిగుణమూర్తి గదా! ఇందలి ప్రత్యంశలచే పుట్టి, యిందేయుండు ప్రజావర్గము త్రిగుణభావ యుక్తమగుట నిత్యము. "లోకరుచిర్హిభిన్నా" "భిన్నరుచిర్హిలోకః" "రుచీనాంవైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషామ్" "ముండే ముండే రుచిర్భిన్నా" అను వచనములం బట్టి ప్రతిమనుష్యుని స్వభావము, గుణములు, మనోవృత్తులును సర్వథా నియతములుగ నుండును. ఎవనియోగ్యతవానిదే. కనుక నందరు నన్నికర్మలకు నధికారులు గాజాలరు. ఎవనియందే కర్మానుష్ఠాన యోగ్యతకలదో శక్తి (రజోవీర్యసంబంధపరంపర) కలదో, వాడు ఆకర్మకధికారి. వివశుడయ్యును వాడా స్వాభావిక కర్మనే చేయవలసి వచ్చును 'కరిష్యత్యవశోఽపితత్'.

అటుగాక దురాగ్రహమున నెవడేని తన యధికార విరుద్ధముగ బ్రవర్తించి పథభ్రష్టుడగుచో తన స్వరూపమునే

నాశము గావించుకొనును. స్వాధికార కర్మ ప్రవృత్తుఁడే తన పురుషార్థ సాధన సమర్థుఁడగును; మంచిదే. అట్లాచరించుటకు ప్రతిబంధక మేమి కలదు? మనుజుని అనృత స్వభావమే; దానింగూర్చి వివేచన సేయుదము.

## సత్యానృత వివేకము.

తప్పనిసరియగు స్వభావసిద్ధ స్వాధికార ప్రవృత్తి మనుజునెడ నపవాద రూప మగుటకే తత్స్వరూప నిర్మాణ కారణోపాదాన ద్రవ్యము ఋత మగుటయే కారణము. ఈశ్వర ప్రజాపతి రచనా వైచిత్ర్యమేమో! గాని పార్థివ ప్రాణు లన్నింటిలో మనుజుని జ్ఞానక్రియార్థ శక్తులం దగ్రేసరునిగ జేసియు, తదుపాదాన ద్రవ్యమందు (శుక్రమందు) ఋతభావముం జేర్చిన సత్య మర్యాదా చ్యుతుం గావించెను. దేవసృష్టి సత్యసంహితము. ఈ ఋతాత్మ కానృత భావము కృపవలననే మనుజుఁడు తన స్వాభావి కాధికాధికారిక కర్మ వంచితుఁడై పోవుచున్నాఁడు. కనుకనే శాస్త్రోపదేశావశ్యకత మనుజున కేర్పడినది. "మనుష్యా ఏవైకే ఽతిక్రామన్తి" అన్నట్లు దేవ - పితృ మనుష్య - పశు - అసురులను ప్రజాపతి పంచ సంతానములందు మనుజుఁడే యీ యనృత భావము వలన స్వాభావిక నియముల నుల్లంఘించును. ఇట నొక వైదికాఖ్యాన మరయఁదగినది:

"ఏకోఽహం బహుస్యామ్" అను బహుత్వ మూలక భూమాకామనాప్రేరిత ప్రజాపతి (సంవత్సర ప్రజాపతి) అసుర-

దేవ - పితృ - మనుష్య - పశువు లను పంచ ప్రజలను వెలయిం చెను. ఆ ప్రజ మాకు భోజనాది జీవన సాధనల నేర్పరచవలయు నని తమ తండ్రిం గోరెను. స్వాభావికార్థ లిప్సాపూర్ణు లసురులు పెద్దవారు. మొదటనేగాక తక్కినవారు గూడ ప్రజాపతినడుగు నపుడెల్ల వారివారితో వచ్చి యడుగుచువచ్చిరి. అప్పటప్పటికి వారికి బ్రజాపతి "మీరుపెద్దవారు ఇంచుకయోపికపట్టు"డనుచు గాలక్షేపము జేయుచు వచ్చెను. దేవతలు యజ్ఞోపవీతులై "నః-విధేహియథాజీవామః" అని నమ్రులై ప్రజాతి నడిగిరి. అతడు "యజ్ఞము మీయన్నము, నీరోగులు కండు, ఊర్క్ మీకు బలము, సూర్యుడు మీకుజ్యోతి" అని సెలవిచ్చుటయు వారు సంతుష్టులై యరిగిరి. పిదప ప్రాచీనావీతులై పితరులు వచ్చిరి. "ప్రతియమావాస్యకు మీకు భోజనము దొరకును. ఆ భోజనసాధనము స్వధ, మనోజవము మీకు - బలము. చంద్రుడు మీకు జ్యోతి" అని ప్రజాపతి యాదేశింప వారును సంతుష్టులై చనిరి. అనంతరమువచ్చిన మనుజులకు ప్రజాపతి యిట్లు వచించెను. "ప్రాతఃస్సాయఃకాలములందు రెండు మారులు మీకు భోజనము. ప్రజలు మీకు బలము. మృత్యువు మీస్వాభావికధర్మము. అగ్ని మీకుజ్యోతి" దానితో వారు సంతుష్టులై వెడలిరి. తరువాత పశువుల కిట్లాదేశించెను. "మీరు కాలనియమముతో బనిలేక యెప్పు డెక్కడ నేమి దొరకిన దానిం దినుడు, ఈ యమర్యాదిత వృత్తియే మీజీవన సాధనము." అంతటితో నవి తృప్తినొందినవి. చివర కసురులం

జూచి "తమస్సు (తమోగుణము - అంధకారము) మాయ (ధూర్తత-ఛలనము, బకవృత్తి-నాస్తిక్యము, అగమ్యాగమనము మొ॥గు మాయికసాధనములు) మీ జీవికకు సాధనములు"అను టయు వారు తమకోరిక నెరవేరుటకు బోంగిపోయిరి. అనంతరము:

"తాఇమాఃప్రజాః తథైవోపజీవన్తి యథైవాభ్యః ప్రజాపతిర్వ్యదధాత్ । నైవదేవాఅతిక్రామన్తి, నపితరః, నప శవః మనుష్యా వైకేఽతిక్రామన్తి । తస్మాద్యో మనుష్యాణాం మేద్యతి, విహూర్చ్ఛతిహి సహ్యాయనాయ చనభవతి, అనృతం హికృత్వా మేద్యతి".

"ఎవరి నియమములను వారనువర్తించుచున్నారు గాని మనుజులే వారినియమములను వారతిక్రమించుచున్నారు. కను కనే మనుజుడెవడు క్రొవ్వుపట్టి బలియునో, శరీరయష్టికంటె నెవనిపొట్ట ముందుకు వచ్చునో వాడశుభకర్మలను చేసినట్లును, పాపకర్మలచే నర్థసంచయము గావించినట్లును, వాడు మనుజత నుండి పతనము గాంచినట్లును, వాని యభ్యుదయ మార్గ మవ రుద్ధమైనట్లును, ఎరుంగవలయును. అనృతప్రవర్తన, వలననే వాడంత వాడయ్యెను." అని శ్రుతి చెప్పియున్నది.

ఇంతకు జెప్పదలచినది :-"మనుజులీశ్వరనియమముల నుల్లంఘించి స్వాధికారవంచితు లగుచుందు" రనియే. వారికి కర్తవ్య కర్మయందు ధ్యానముండదు. శాస్త్రోపదేశము, గురు సేవ, వృద్ధసేవ మొదలగు నియంత్రణలు లేకున్నచో వారికి

స్వాభావిక కర్తవ్యానుష్ఠాన ప్రవృత్తియే యుండదు. ఇంతకు గారణము "సత్యసంహితావై దేవాః అనృతసంహితావై మనుష్యాః" ఈ సత్యానృతములేమో చూతము.

సత్యాహింసలను సదా స్మరింతుము. కాని వీని పరిభాషయేమో విచారింపము. అహింసనుగూర్చి వెనుక కొంచెము ప్రసంగించితిమి. సత్యమననేమో, మనుజుడనృతసంహితుడను టేమో చూతము. సామాన్యముగ సత్యమన సత్యభాషణమను కొందురు. ఉన్న దున్నట్లు వస్తుతత్త్వరూపముం జెప్పుట అభినయించుట 'సత్య' మనుకొనుట వైదికపరిభాషకు సర్వథా విరుద్ధము. మనుష్యు డనబడు ప్రాణి సత్యమెన్నడును పలుకజాలదు. పలుకబోయిన మిథ్యయే పల్కును. 'మనుష్యుడు మనుష్యుడుగ నుండి సత్యముపల్కు' ననుట యసంభవము. పారమార్థిక సత్యముమాట కొంతతడ వటుంచి కేవలమింద్రియానుబంధి, వ్యావహారిక సత్యభాషణము నుదాహరణముగ విచారింపుదము.

"గడియారముం జూచి పదిగంటలయ్యె" ననువానివాక్యము సత్యమందుముగదా ! దృష్టియు వాణియు నేకక్షణ సమన్వితము లగుట సంభవమా? రెంటినడుమ నెంతవ్యవధాన ముండును ? ఇట్టిచో నీకథనము సత్యమనవచ్చునా ? దృష్టిక్షణమున బదియే, తదనుభూతి యంతర్జగత్తునం దాక్షణమున బడినది. దృష్టికాలము క్షణకాలముకంటె నెంతో సూక్ష్మతమము. భాషణ

సమయ-దృష్టిసమయములకు నడుమ నెన్ని సెకనులు గడచి నవి? ఇట్టిచో దృష్టసత్యము వాక్కు అభినయింపగల దన గలమా? ఇక సత్యభాషణము సత్యభాషణ మనుటెట్లు?

సత్యభావ మన్నది కేవలము అంతర్యామి యగు వాత్మకు జెందినది. సత్యమూర్తియగు నాత్మయే సత్యమునకు గ్రాహకమగును. ఆయాత్మ ఇంద్రియాతీతము, పరోక్షము. అట్టియాత్మయు, తదనుగామియగు సత్యమును ఇంద్రియవిషయ ములు గాజాలవు. అటవాక్కునకు గతిలేదు. "యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ" ఇంతకు దాత్పర్యము-సత్య మాత్మానుగామియగుచు కేవలము భావనకుజెందిన వస్తువు, అంతర్జగత్తునందు భావింపదగినది మాత్రము, దానిని వాక్కుతో నభినయించుట సర్వథా అసంభవము, ఆత్మయన్నది హృదయ మందు నిగూఢము ప్రచ్ఛన్నము.

"ఏషసర్వేషుభూతేషు గూఢోత్మానప్రకాశతే
దృశ్యతేత్వగ్ర్యాబుద్ధ్యా సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః
నాహంప్రకాశఃసర్వస్య యోగమాయా సమావృతః"

ఇక:-పరాంచిఖానివ్యతృణ త్స్వయంభూః తస్మాత్పరాజ్ పశ్యతినాంతరాత్మన్."

అనుటచే నింద్రియములు పరాఙ్ముఖములు. కనుక సత్యము చెప్పను, వినను, రుచిచూడను మూర్కొనను వలను పడు వస్తువుగా దనవలసియున్నది. ఇట్టిచో సత్యభాషణాగ్రహ

మెట్లు సంగతము ? సత్య మాగ్రహము గావించుటకు దగు వస్తువు గాదు. అంతర్జగత్తునందు భావింపదగినది మాత్రమే.

"సత్యము మనకు ప్రతిష్ఠ" "మనము సత్యముపై నిల్చి యున్నాము" "మనము సదా సత్యమునే వచింతుము" అను సత్యాగ్రహములు మూడును, సర్వనాశమును నిమంత్రించునవి. కారణము ? ఇవి మూలప్రతిష్ఠావిచ్యుతములు మననాశనమునకు గారణములు. అంతర్యామి యగు నాత్మదేవత సత్యమూర్తి యంటిమి. గర్భీభూత మగుటచే నది పరోక్ష మనియు నంటిమి. పరోక్షత్వము ధర్మముగాగలవస్తువును, ప్రత్యక్షముగావించుచో దాని యాధర్మము నిర్వీర్య మైపోవును. ఆత్మసత్యమునకు జెందిన సత్యభావనలను వాక్కుచే నభినయించు చుండుచో గాలాంతరమున, బరోక్షాత్మయొక్క పరోక్షసత్యబలము నిర్వీర్య మైపోవును. ఆత్మశైథిల్యము ప్రాప్తించును. కర్తవ్య శక్తి క్షీణించును. నిర్వీర్యాత్మ, నిర్బలత్వముచే మనలను బాహ్య వైభవ వంచితులను గావించివైచును. సత్యాచరణము వీర్య రక్షకు సాధనము. ఇక సత్యమును వాక్కుతో జెప్పుట సత్య మర్యాదకు వెలియైనది. అసత్యము. ఈయసత్యభావ పరిగృహీతైంద్రియక విషయములును అప్రతిష్ఠితములే యగును. కను కనే మహర్షులు, కర్తవ్యకర్మ ఫలింపవలయుచో 'మౌనవృత్తి' నవలంబముగా గొను మనిరి. ఇంతకు జెప్పదలచినది:-సత్యమును వర్ణించుట సత్యము నసత్యముగనే జేయుటయే. అదియాత్మ ధనముగ నున్నంతవరకే, సత్యము. సబలమును అగును. అటు

గాక ఆత్మస్థానము నుండి తొలగి యది వాక్కుం జేరుచో దాని స్వరూప బలములు రెండును బోవును. ఇదే సత్యాగ్రహ మందలి మొదటిదోషము.

ఏవస్తువునందైనను రాగాత్మకముగనో ద్వేషాత్మకము గనో అభినివేశముం గలిగి ప్రవృత్తుడగుట బంధనకారణ మగు నాసక్తియే. అది యాత్మయొక్క స్వాభావిక వికాసము నావృ తము గావించు నది యనుకొంటిమి. "మాకు సత్య మెంతో ప్రియము కనుక మేము సత్యమునే పల్కెద" మను రాగ పూర్వక సత్యప్రవృత్తి యాసక్తిజనకము. బుద్ధి నవిద్యాభా వావృతము గావించి వైచును. గీతానుసార మాసక్తిదోష మాత్మవికాస ప్రబలశత్రువు. ఇది ఈసత్యాగ్రహ మందలి రెండవదోషము. ఈసత్యాగ్ర హానుగ్రహముచే నొకమారు సత్యాత్మక దేవత లసురలచే బరాస్తులైరి. ఎట్లన :-

ప్రజాపతిసంతాన మగు దేవాసురులు తమ తండ్రి సంపత్తిం దమకు బంపకముసేయ గోరి యతని కడకరిగిరి. ఆయన తనకడగల అమృతలక్షణ సత్యమును, మృత్యులక్షణా నృతమును రెండు భాగములుగా జేసి సగముసత్యానృతములు దేవతలకును, సగము సత్యానృతము లసురులకును సమముగ బంచి యిచ్చెను. పిమ్మట:-

దేవతలు స్వభావముచే సత్యప్రియులు, తమకులభించిన యనృతము నుపేక్షించి తమ యర్ధసత్యమును బూర్ణముసేయ బూనిరి. అసురులు సహజముగ ననృతప్రియులు. వారు తమకు

లభించిన సత్యము నుపేక్షించి యర్థభుతమును బూర్ణము గావించుకొన బూనిరి. అపు డుపేక్షితభాగములందలి సత్యము దేవతలను, అనృత మసురులను జేరెను. కాగా దేవతలు కేవల సత్యానుగాములును, అసురులు కేవ లానృ తానుగాములును నైరి. పరిణామమున? కేవలసత్యాసక్తదేవతలు, వ్యవహార దృష్టిచే సర్వలోకవైభవముం బోగొట్టుకొనిరి. అనృతాసక్తు లగు నసురులు సుసమృద్ధులైరి. చివరకు:-దేవతలు సత్యాను గ్రహముచే ముక్తులైరి. అసురు లనృతా నుగ్రహముచే నధో లోకాధికారులైరి. (శత. 9-5-1)

ఈ వైజ్ఞానికాఖ్యానముచే శ్రుతి చెప్పదలచినది:-"పార మార్థిక కర్మయందు విశుద్ధసత్యాసక్తికి గొంచె ముపయోగ మున్నను, వ్యావహారిక కర్మలం దది యనుపయుక్తము. అట్లే విశుద్ధానృతము ననుపాదేయమే" అనియే. విశుద్ధసత్యమాత్మ. తదాసక్తిచే లోకవైభవము నష్ట మగును. విశుద్ధానృతము విశ్వము. తదాసక్తిచే ఆత్మశాంతి పూర్తిగా నుచ్ఛిన్నమగును. మనకు:-ఆత్మశాంతియు, బరలోకవైభవమును గావలయును. ఆత్మస్వరూపము సురక్షితము గావించుకొనుటకు, సామ్రాజ్య సుఖము ననుభవింపవలయును. అదియెట్లు సంభవము? అందుకు బ్రజాపతిప్రదత్తములగు సత్యానృతము లను రెండుదాయభాగ ములను సమాదరించుచు, తత్సమన్వితరూప వ్యావహారికకర్మల ననుగమింపవలయును. అనగా సత్యము ననృతగర్భితముగావించి యనుష్ఠింపవలయును. సత్యాసత్యసమన్వయముచే సంపన్న

మును, ఉభయలక్షణమును, ఉభయ ధర్మావచ్ఛిన్నమును అగు బుద్ధియోగమే పూర్వోక్తమగు నభ్యుదయనిశ్శ్రేయస ప్రాప్తికి ముఖ్యసాధనము అయీవిషయము బ్రహ్మకర్మపరీక్ష యందు వివృతమైనది.

ఆసక్తియన్నదిలేక అనృతము గర్భమందు గల సత్యమే యుపయోగి. ముక్తికిజెందిన పర (ఆత్మ) లోకము మాట యటుంచుడు. భుక్తికిజెందిన యిహలోకమందు ననృతగర్భిత సత్యమే మనకుపకారము. లేదా దీనినే ప్రకారాంతరముగ నిట్లన వచ్చును. విశుద్ధసత్యమునకు జెందిన విశుద్ధధర్మనీతి ననుగమించుటచే అనృతమునకు జెందిన విశ్వప్రాప్తి యుండదు. వ్యవహార కాండయం దనృతమూల రాజనీతిని ధర్మనీతిగర్భమం దుంచవలయును. "ఎట్టివానికట్లు" "యేయథామాంప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం" అను నాదేశము నాదర్శముగ గొని కర్తవ్య పథముం బట్టవలయును. నేడిదిమరచి మిగిలిన లోకవైభవ ముంగూడ బోగొట్టుకొను చున్నాము.

లోకవైభవ రక్షాపూర్వముగ ధర్మరక్షగావించు నవతారపురుషులును సత్యమున కనృతగర్భత్వమునే సమర్థించిరి. ధర్మత్రాత భగవంతుడు కృష్ణుడు భారతయుద్ధమందు అస్త్రము పట్టనను ప్రతిజ్ఞాలక్షణ సామాన్యధర్మమునకు బాధవచ్చినను లెక్క సేయక అస్త్రమును స్వీకరించుట, కర్ణార్జున యుద్ధ ప్రసంగమునందు, నిశ్శస్త్రుడగు కర్ణునిపై నస్త్రప్రహారముసేయ

నర్జునుం బ్రోత్సహించు పట్టున, గర్జునాక్షేపమునకు నాయన యిచ్చిన సమాధానము; దుర్యోధన భీమ గదాయుద్ధావసర మున గట్యధప్రదేశమునందు గదాప్రహారమునకై భీమునకు సూచనగావించుట మొదలగునవి యవలోకించుచో అనృత (రాజనీతి) గర్భితసత్యమే (ధర్మమే) యుపయోగి యని గోచ రించును. రాజనీతిగర్భిత ధర్మనీతితోడనే లోకరక్షగావింపవల యును. సత్యమెప్పుడును పరోక్షముగ ఆత్మవస్తువుగ నుండు టయే అభ్యుదయకారణము. కనుకనే శ్రుతియు "పరోక్ష ప్రియాఇవహి దేవాఃప్రత్యక్షద్విషః" అనియెను.

ఇంతటితో సత్యశబ్దమునకు బాహ్యమీమాంస యైనది. ఇక దానియంత రార్థముం గూర్చి యీ శబ్దమునే యడుగు దము. ఏలయన :- భారతీయసాహిత్య మందు తమ యర్థముం దామే చెప్పుకొనునట్టి శబ్దములే ప్రయుక్తములైనవి. ఈశ్రుతి వచనము లరయుడు:-

"ఆపఏవేదమగ్ర ఆసుః తా ఆపః సత్యమసృజన్త, సత్యం బ్రహ్మ, బ్రహ్మ ప్రజాపతిం, ప్రజాపతిర్దేవాన్, తే దేవా సత్య మిత్యుపాసతే, తదేతత్త్ర్యక్షరం, సత్యమితి, స ఇత్యేక మక్షరం ప్రథమోత్తమేఽక్షరే సత్యం, మధ్యతోఽనృతమ్, తదేత దనృ తమ్, సత్యేన పరిగృహీతం, సత్యభూయమేవ భవతి, నైవం విద్వాంస మనృతం హి నస్తి." (బృహదా)

మొదట నిది యంతయు సప్తపురుష పురుషాత్మక ప్రాణాత్మక సప్తప్రాణమూర్తి స్వయంభూ ప్రజాపతి తన

బ్రహ్మానిశ్వసిత నామ కాపౌరుషేయ త్రయీవేదమందలి యజుర్మయ వాగ్భాగముచే నుత్పత్తిగావించిన యాపోమయముగ నుండెను. తద్గర్భస్థిత ప్రజాపతి "యీ యప్తత్త్వమునుండి సత్యము నుత్పన్నముగావించెద ననుకొనెను. ఫలితముగః- జలము వెలసెను. అదిసత్యము (అంగిర స్తత్త్వము) నుత్పన్నము గావించెను. ఆపోమయ సముద్ర మందు బుతరూపమున నిటు నటు నవ్యస్థితములై తిరుగాడు నుత్తప్తాంగిరఃకణములు మెల్ల మెల్లగా కేంద్రము నందు సంచితములు, పుంజీభూతములు, కాగా నక్షణసమూహము సహృదయశరీరియై సత్యభావ పరిణతిగాంచెను. ఆ సత్యపిండమే "తద్యత్ తత్ సత్యం అసౌస ఆదిత్యః" అనుటచే సూర్యుడనబరగెను. ఇతనినుండి గాయత్రీ మాత్రిక వేదత్రయి యను బ్రహ్మ యుదయించెనుగదా! ఆబ్రహ్మలక్షణ త్రయీవేద ప్రసారముచే సౌరసంవత్సరనామక ప్రాజాపత్యసంస్థ యుదయించెను. రోదసీత్రైలోక్య మందలి దేవ-భూతప్రజల కుత్పాదక మదియే. కనుక నాసౌరసంవత్సరము బ్రజాపతి యనుట తగును. అందలి ప్రాణాగ్నినుండి 33 గురు సౌరప్రాణదేవత లుదయించిరి. తత్సంబంధముననే సత్యసూర్యుడు 'దేవానీక' మనబడును. ఆ సౌరప్రాణదేవతలు సత్యము (సూర్యు) నే యుపాసింతురు. అనగా సూర్యుడు వీరికి బ్రతిష్ఠాభూమి యని భావము.

"బ్రహ్మ (వేదము) నుత్పాదించినసత్యము, దేవతా

ప్రతిష్ఠాభూమి యగు సత్యము, త్ర్యక్షరము* (మూడక్షరముల సమష్టి) 'స' ఒకయక్షరము 'తి' ఒకయక్షరము, 'అమ్' ఒక యక్షరము. ఇకారమునకు యణాదేశముకాగా (సత్ య్ అమ్) అను రూపముకల్గెను. ఇదే త్ర్యక్షరభావము. ఇందు అనగా:- 'స, తి, అమ్' అనువానిలోని మొదటి దగు 'స' యును చివరి దగు 'అమ్' ను, సత్యములు. మధ్యదగు (అస్పష్టముగ కేవల ముచ్చారణయం దుపశ్రుతమగు) 'ఇ' కారము అనృతము. ఇరు గడలను సత్యపరిగృహీతమగు ననృత (విశ్వ) భావమును సత్య స్వరూపముగనే అగును. ఈ సత్యస్వరూపము నెరింగి తన యనృతభావమును నల్గడలను సత్యవేష్టితము గావించి ప్రకటించువాని ననృతభావ మించుకయు బాధసేయజాలదు."

తైత్తిరీయ మింతకంటె స్పష్టముగ స్వర్గమును సువర్గ మన్నట్లు సత్యమును స, తి, యమ్, అనియే వ్యవహరించినది. వాస్తవముగ శబ్దము సత్ యమ్ అనియే కాని, బ్రాహ్మణము, దానిని 'సతియమ్' అని చెప్పుచు "అం దికారములే కున్నను

* "స్వరోఽక్షరమ్" అను ప్రాతిశాఖ్యవచనముం బట్టి 'సత్యమ్' శబ్దమందు సత్ యమ్ అను రెండే అక్షరము లగుటచే దీనిని త్ర్యక్షర మనరా కున్నను, సత్య మెన్నడును విశుద్ధముగ నుండక అనృతగర్భముగనే యుండునని ఆశబ్దమందలి యప్రత్యక్ష 'ఇ' కారమువలన దోచుచున్నది. అనృతవిశ్వము నలుగడలను సత్య పరిగృహీతముగ నుండును. కనుక నదిస్పష్టముగాదు. ఈ రహస్యసూచనార్థమే విశ్వవిశిష్టసత్యమును వచించు సత్యశబ్ద మం దనృత విశ్వవాచక మగు ఇకారము నకు ప్రత్యక్షసమావేశము గావింపబడ దయ్యెను. కాని అక్షరముల లెక్కయం దదియు వచ్చును. కనుక "సత్యమ్" త్యక్షర మని శ్రుతి స్పష్టపరచెను.

వినబడుచున్నది. అది అనృతవిశ్వసూచక” మని తెలుపు చున్నది. విశ్వమసద్రూప మగుటచే ననృతము. స్వతంత్రసత్త లేనిది అయినను సత్తాలక్షణ సత్యాత్మగర్భప్రవిష్టమై సద్రూపమే యగుచున్నది, సత్-యమ్ రూపముచే సత్యాత్మ యవారపారీణము వ్యాపకము నై యున్నది. దీని గర్భమందు సత్ ఇ యమ్ రూపముగ ఇకారాత్మక-నావిశ్వము ప్రవిష్టమై యున్నది. ఇదే విశ్వోపాధిక వ్యావహారిక సత్యమ్ యొక్క సత్యమ్‌త్వము-

ఇంతకు దాత్పర్యము. “విశ్వలక్షణ వ్యవహారకాండ యందు విశుద్ధసత్యముగాక అనృతగర్భితసత్యమునే ప్రయోగింపవలయును. విశ్వమూల రాజనీతినెదుట నుంచికొని ధర్మనీతిప్రసారము గావింపవలయును. ఏలయన విశ్వసీమకు లోపల విశుద్ధ సత్యోపలబ్ధి యసంభవము. మన వ్యావహారిక దృష్టింబట్టి యీ శ్రౌతాదేశమునకు:-“మన యనృతివ్యవహారముచే సత్యతత్త్వరక్ష సంభవ మగుచో అనృతభావమునే నిస్సంకోచముగ నాశ్రయింపవలయు”నని సమన్వయము గావింపవచ్చును. కనుకనే స్మృతియు “వర్ణినాంహివధో యత్ర తత్రసాక్ష్యనృతం వదేత్” అనియెను.

అనృతభావమునే సమర్థించు ననృతము త్యాజ్యమే. సత్యాత్మకు బంధనము గల్పించు విశ్వవైభవము త్యాజ్యమే. సత్యాత్మపోషకమగు ననృతవిశ్వవైభవము నార్షధర్మ మాదరించును. కనుకనే యది ఆత్మనాధారముగగాని విశ్వవైభవ

మును సంగ్రహింపు మన్నది. అందువలన అనృతత్వముగూడ సత్యరూప పరిణతి నొందునన్నది. ఫలితము ? అనృతవిశ్వాజని తాసక్తిలక్షణ బంధనము నుండదు. తజ్జనిత వైభవ వంచనయు నుండదు. కనుకనే విశుద్ధాత్మమూల విశుద్ధసత్యాసక్తి దోషా వహామంటిమి.

ఇక ననృతశబ్దము:- దీనియర్థము 'మిథ్య' అనుకొనుచు అనృతలక్షణ విశ్వమభావలక్షణ మిథ్యాభావ మనుకొను చున్నారు. ఈవిషయముం గూర్చి బ్రహ్మకర్మ విజ్ఞానమందు విస్తరింపబడినది. ఇక పిష్టపేషణమనావశ్యకము. ఈశ్వరప్రజా పతియొక్క సదసల్లక్షణ ణామృతమృత్యునామక సర్వములే సత్యానృతములు. ఋతమునే ఒక కారణముచే అనృతమని వ్యవహరించిరి. సత్తు నసత్తని వ్యవహరించి వ్యాఖ్యయందు 'సదేవేదమగ్రేసోమ్య అసదాసీత్' అనిచెప్పిరి.

ఆత్మయమృతలక్షణము (ప్రధానము) విశ్వము మృత్యు లక్షణము.(ప్రధానము). ఆత్మసత్తు. విశ్వమసత్తు. ఆత్మసత్యము. విశ్వము ఋతము. ఇది "సామాన్యే సామాన్యాభావః" అన్న ట్లనృతభావ మనబడెను. అనగా ఋతరూప మగు ననృతభావ మొకవస్తుతత్త్వమే గాని అభావరూప మిథ్యాభావము కాదు. కనుక "(1) సత్యభాషణ మన సత్యమే కాదు. విశుద్ధసత్యము వాణీవిషయము కాజాలదు, దానిని వాణీవిషయము గావించు వారాత్మను నిర్బలముగావింతురు. ఇదే మూసక్తి. సత్యమందలి మొదటిదోషము. (2) ఇక నాసక్తి రెండవదోషము. (3) వాణీ

విషయము గాజాలని సత్యమును వాణీవిషయముగ జేయుట, మిథ్యాభాషణరూప మగు మూఁడవదోషము. సత్యముయొక్క చాటింపే సత్యనాశకారణము. శబ్దాత్మక మగు నీచాటింపు అనృతవిశ్వ మందలి యనృతపదార్థ మగును." అనవచ్చును. దీనినుండి తప్పించుకొను నుపాయ మేమి? సత్యకార్యము నన్నృత ముతో మూసి దానిని బరోక్షముగావించి (విశుద్ధసత్యము ననృతలక్షణ మృత్యుభావయుక్తము గావించి) వ్యవహారము నడుపవలెను. అది యభ్యుదయ జనకము. ఈశ్రౌతవచనము నవలోకింపుడు.

"తస్యవాఽతస్య బ్రహ్మణోనామ సత్య మితి తానివా ఏతాని త్రీణ్యక్షరాణి సతియ మితి తద్యత్ 'సత్' తదమృతమ్ అత్ర 'తి' తన్మర్త్యమ్ అథ యత్ 'యమ్' తేనోభే యచ్ఛతి య దనే నోభే యచ్ఛతి తస్మాత్ 'యమ్' అహరహః ర్వాప వంవిత్ స్వర్గంలోక మేతి. (ఛాందో)"

అనగా:-సత్యా-మృతలక్షణాత్మను, అనృతమృత్యు లక్షణ విశ్వమును, ఏకసూత్ర సమన్వయము గావించి లోక యాత్ర నడుపువాడు దినదినము సమృద్ధి నొందును, స్వర్గసుఖ మనుభవించును. అట్టివానిని సాంసారికాపత్తులు చెనకవు. అని భావము. మరియు:-

ప్రకారాంతరముగ సత్యానృత పరిభాషను విచారింతము. పైన:-అనృతవిశ్వమును ఋతమనియు తదధిష్ఠాత యగు నాత్మను సత్య మనియు ననుకొంటిమి. విజ్ఞానదృష్టిచే సత్యమునకు:-'సహ్యా

దయం సశరీరంసత్యం' అనియు ఋతమునకు:-'అహృదయంఅశ రీరంఋతమ్' అనియు లక్షణములు. సృష్టిమూలము లీరెండు తత్త్వములే "ఋతంచసత్యం చాభీద్ధా త్తపసోఽధ్యజాయత" అని ఋక్శ్రుతియు జెప్పినది. సత్యము సత్తురూపము కనుక సత్తు. ఋతము తనప్రతిష్ఠకై సత్తు నపేక్షించును కనుక నసత్తు. అసదృత మందు సత్సమన్వయముచే, ఋతసత్యమూర్తి యగు విశ్వము వెలసినది. విశ్వదృష్టిచే, నీ రెండు తత్త్వము లందును సత్యమే సర్వమునకు బ్రతిష్ఠ. 'సత్యేసర్వంప్రతిష్ఠితమ్' అని శ్రుతియు నన్నది. అయినను :—

మౌలిక(తాత్త్విక)దృష్టిచే, సాపేక్షము, సహృదయ శరీరియు నగు సత్యము, అహృదయము నశరీరియు నగు ఋతమునుండియే వికసిల్లెను. సూర్యపృథివీ - నక్షత్ర - గ్రహోప గ్రహాదు లగు సహృదయశరీర సత్యాత్మక సత్యమూర్తులెల్ల ఋతద్రవ్య జనితములే, స్వాయంభువ యజుర్వాగ్భావ జనిత మును, వ్యాప్తి-జనన-ధర్మయుక్తము నగు నప్తత్త్వమే ఋతము నకు ముఖ్యరూపము. ద్యులోక మనబడు మూడవలోక మగు సూర్యసంస్థకు నలుగడలను, ఈ యబ్లక్షణ ఋతతత్త్వసామ్రా జ్యమే శ్రుతియు "అస్తివై చతుర్థో దేవలోకఆపః" అని యెను. ఈ ఋతలక్షణా ప్తత్త్వము సూర్యునకు బర మగు స్థానము గలది కనుక "సూర్యాదపి పరమస్థానే- పారస్థానే వా తిష్ఠన్తి" అను నిర్వచనముచే 'పరమేష్ఠి' నాబడును - ఈశ్రుతివచన మిట నవధేయము :—

"తాభ్యామిష్ట్వా- అకామయత- 'అహమేవేదం సర్వం స్యామ్' ఇతి.స'ఆపోఽభవత్' 'ఆపోవాఇదంసర్వమ్' తాయత్ పరమే స్థానే తిష్ఠన్తి- పరమాద్వా ఏతత్ స్థానాత్ వర్షతి తద్దివః, తస్మాత్పరమేష్ఠీనామ, (శత)-ఇందలి "అహ మేవేదం సర్వం స్యామ్" "ఆపోవాఇదం సర్వమ్" అనువాక్యములచే-ఋతమగు సత్తత్వమే త్రైలోక్యస్వరూప సంపాదకమై త్రైలోక్యసత్య నిష్పాదకమై యున్నదని సిద్ధమగుచున్నది. ఆపోమయ పరమేష్ఠి యొక్క యీసర్వవ్యాప్తిని మరింత స్పష్టముగ శ్రుతి.

"ఋతమేవ పరమేష్ఠి ఋతం నాత్యేతి కించన
ఋతేసముద్ర ఆహితః ఋతే భూమి రియంశ్రితా." అన్నది.

ఈ ఋతాప్తత్వమునకు తేజ-స్నేహ నామకములు రెండు వివర్తములు. వానిని వరుసగ నంగిరో భృగువులందురు. (1) సావిత్రాగ్నిమయ సౌరరశ్మలచే నాకృష్టమై బాష్పరూప మున నంతరిక్షము వంకకు జను నాపస్సులే అంగిరోరూప తేజోమయ యాపస్సులు. (2) అంతరిక్షలోకమం దుండు నవియు జలవర్షకములు, పర్జన్య వాయ్వాఘాతముచే మేఘ ఖండముల నుండి ద్రుతములై వర్షరూపమున బృథివివంకకు వచ్చు నాపస్సులే, భృగురూపస్నేహము యాపస్సులు, 'వర్షము పృథివియందే' యని లోకు లనుకొందురు కాని వర్షణధర్మము ఇచటవలెనే ద్యులోకమందును గలదని వేదము చెప్పుచున్నది. రెండువిధముల వర్షములందును భేదమేమన (1) ఇటనుండి పోయి ద్యులోకమందు వర్షించు నాపస్సు లాంగిరసములు,

ఆగ్నేయములు. (2) అటనుండి వచ్చి యిట వర్షించు నాప స్సులు భార్గవములు సౌమ్యములు.

"సమానమేతదుదక ముచ్చైత్యవచాహభిః
భూమింపర్జన్యాజిన్వ న్తి దివంజిన్వంత్యగ్నయః" (ఋక్ సం.)

భృగ్వంగిరోమ యాప్తత్త్వమే స్వయంభూ బ్రహ్మ స్వేదస్థానీయము. సువేద-వేదము ఇదే అథర్వవేదము. (గోప థము 1-1-1) ఈ యథర్వవేదరూప భృగ్వంగిరోమయ ఋత పరమేష్ఠి గర్భమందు సత్య సూర్యాత్మక గాయత్రీమాత్రిక త్రయీవేదము నిత్యము ప్రతిష్ఠిత మైయుండును. "సర్వంహీదం బ్రహ్మణా హైవ సృష్టమ్" అన్నట్లు ఋతమూర్తి యగు నీయాపోమ యాథర్వ బ్రహ్మనుండి సౌర సత్య సంస్థ జనించి తదాధారముననే నిల్చియున్నది. ప్రతిసంచరకాలమం దీయా పోమయ పారమేష్ఠ్య సరస్వా న్నామక సముద్రమందే సౌర బ్రహ్మాండము విలీనమగును. భృగ్వంగిరోమయ మగు నీయప్ తత్త్వముయొక్క సత్యగర్భత్వమును ఋషి యిట్లు స్పష్టీక రించెను.

"ఆపోభృగ్వంగిరోరూప మాపోభృగ్వంగిరోమయం
సర్వమాపోమయం భూతం సర్వంభృగ్వంగిరోమయం
అంతరైతేత్రయోవేదా భృగూనంగిరసః శ్రితాః"(గోపథము)

అంగిరా-భృగువులందొక్కొక్కటియు ఘన - తరళ - విరళ భేదములచే మూడవస్థలనొందును. అందుచే అంగిరులు వరుసగ

అగ్ని-వాయుః (రుద్రవాయు-ఆగ్నేయసంతప్తవాయు) ఆదిత్యు లనియు, భృగువులు. ఆపః-వాయు (శివవాయువు, సౌమ్య శాంతవాయు) సోమము లనియు అనబడును. (వాయురాప శ్చంద్రమా (సోమః) ఇత్యేతేభృగవః) (గోపథము)

ఇందు అంగిరాత్రయి యనే యాగర్భిభూత సత్యవేదముం గొని సత్యస్వరూపము నొందును. ఆ సత్యభావములను భృగు త్రయి నలుగడలను వేష్టించును. ఇట్లు భృగ్వంగిరోమయ ఋత తత్త్వము తనయొక్క అంగిరాభాగముచే సత్యముగను, భృగు భాగముచే నాసత్యము నలుగడలును వేష్టించి తత్స్వరూప రక్షకముగను అగుచున్నది. కనుకనే "ఋతంనాత్యేతి కించన" అనుట చరితార్థ మగుచున్నది.

హృదయభావావచ్ఛిన్న సశరీర పిండములెల్ల నంగిరో మూర్తులు. కనుక సత్యము లందుము. హృదయభావము గల దగుటచే సత్యతత్త్వము 'ఋజు' వైనది. ఉదాహరణముగ: "తద్యత్ తత్ సత్యం అసౌసఆదిత్యః" సూర్యుడు సత్యపిండము. అతని సత్యరశ్మి లోక నూవుగింజ నడ్డముంచినను వచ్చినదారిం బట్టునేగాని మరొక వంకకు దప్పుకొని పోవుగాదా!

ఇక ఋతతత్త్వ మిందుకు విపరీతము. దాని కొక నియతమార్గము లేదు. జల - వాయు - సోమములు - ఋతములు గదా! అవి వాని కడ్డముగల వస్తువుం దాకి రశ్మివలె వెనుకకు బోక వచ్చినదారిం బట్టక ఇటునటు బోవును కారణము?

హృదయశూన్యత; కనుకనే అనియత మార్గావలంబనము. ఇది సత్య-ఋతములకు వైజ్ఞానికవ్యాఖ్య.

వీనిని వాగింద్రియముతో సమన్వయింతము. మనఃప్రాణ వాఙ్మయ మగునాత్మ సత్యము. దాని యామూడు పర్వములు సమానపథానుగాము లగుట సత్యభావము. అట్టివాణి హృదయానుగతము కనుక సత్యము. అటుగాక పై మూడుపర్వము లును వేరువేరు మార్గములను బట్టుచో నది ఋతభావము. అట్టిఋతభాషణ మనృతభాషణమే. దానికి హృదయావచ్ఛిన్న సత్యాత్మ మర్యాద యుండదు గదా కనుక నది అలగ్నము, అసంబద్ధము, అవ్యవస్థితము.

ఇట ఋతభావము సత్యమునకు వేరుగ నుండి యనృత మగునుగదా! దానినే సత్యయుక్తము గావించుచో సత్యమే యగును. ఆత్మసత్య మగ్ని. ఋతవాణి సోమము. ఈ రెంటిం గూర్చుచో సోమాహుతివలన యజ్ఞాగ్ని యుత్తరోత్తర మధికాధికముగ బ్రజ్వలిత మగునట్లు ఆత్మసత్య ముత్తరోత్తరము వికసిల్లును. సత్యానుగత ఋతము సత్యమై ఆత్మవికాసమునకు, సత్యవంచిత ఋతము ఋతముగనే యుండి యాత్మపతనమునకును, హేతువులగును. ఈ శ్రౌతవచన మీ వాక్సత్యానృతములను దెలుపును.

"సయఃసత్యంవదతి యథాగ్నిసమిద్ధంతం ఘృతేనాభిషించేత్ ఏవం హైనం సఉద్దీయతి తస్యభూయో భూయఏవ తేజో భవతి శ్వఃశ్వః శ్రేయాన్ భవతి అథయోఽనృతం వదతి యథా

గ్నిం సమిద్ధంతం ఉదకే నాభిషించేత్ ఏవంహైవం సజానయతి తస్యకనీయః కనీయఏవ తేజోభవతి శ్వఃశ్వః పాపీయాన్ భవతి తస్మాదు సత్యమేవవదేత్" (శత.)

"సత్య మంతర్యామియగు నాత్మధర్మము. పరోక్షము. కనుక భావనావస్తువుగాని పలుకదగినది కాదు. అన్నృతసంహితుడగు మనుష్యుడు సత్యము బలుక జాలడు. సత్యాగ్రహము కల్పితము-అసిష్టకరము" అని పూరంభమందే యనుకొంటిమి. కాని యీశ్రుతి 'తస్మాదుసత్యమేవ వదేత్' అనుచు పూర్వసిద్ధాంత విరుద్ధముగ, సత్యభాషణమును ప్రథమచేయుచున్నది. ఇట్టి యాదేశము లితరశ్రుతు లందును పెక్కులున్నవి. చూడుడు:-

(1) ఏవంహవాఽస్య జితమనపజయ్యం ఏవంయశో భవతి యఏవంవిద్వాన్ సత్యంవదతి.

(2) సమూలోవాఏషపరిశుష్యతి యోఽనృతమభివదతి తస్మాన్నార్హా మ్యనృతంవక్తుమ్.

(3) ఏకంహ వై దేవావ్రతంచరన్తి యత్ సత్యమ్ తస్మాదుసత్యమేవ వదేత్.

(4) తస్యైవాచః సత్యమేవబ్రహ్మ.

మరియు సత్యభాషణమునకు శిష్టవ్యవహారమున కెట్టి ప్రాముఖ్యము గలదో చెప్పబనిలేదు. స్మృతియు సత్యమున కెంతో ప్రాముఖ్యమిచ్చెను. హరిశ్చంద్ర యుధిష్ఠిర ప్రభృతు

లీసత్యానుగ్రహముచే నవురక్షింనంది యున్నారు. ఇట్టిచో సత్య భాషణకు విరుద్ధముగ మనుష్యుడు సత్యము జెప్పజాలడనుట, సత్యాగ్రహము దోషమనుట, యెట్లుపొసగును? ఈశ్రుతి వైరుధ్య మెట్లుతొలగును? అన్నచో:-

చూచెదము; యజ్ఞమునకు దొరకొను యజమానుడు తదధికారసిద్ధ్యర్థము దీక్షాకర్మ (దీక్షణీయేష్టి) ద్వారా దీక్షితుడై యజ్ఞసమాప్తిపర్యంతము తత్కార్యాతిశయముం గాపాడు కొనుటకు సత్యభాషణ, బ్రహ్మచర్య, పయోవ్రత అధఃశయనాది కతిపయ నియమవిశేషములను పాలింపవలయును. ఈపరిపాలనము వ్రతకర్మయందురు. ఇందు సత్యభాషణముత్కృష్టము. కనుకనే శ్రుతియు నిట్లనెను.

"ఋతంవావదీక్షా సత్యందీక్షా తస్మాద్దీక్షితేన సత్యమేవ వదితవ్యమ్ (ఐ. బ్రా.) "ద్వయంవాఇదం నతృతీయమస్తి సత్యంచైవానృతంచ సత్యమేవదేవాః అనృతంమనుష్యాః 'ఇదమహ మనృతాత్సత్యముపైమి' ఇతి తన్మనుష్యేభ్యో దేవానుపైతి సవైసత్య మేవవదేత్ ఏతద్ధవై దేవావ్రతంచరన్తి యత్ సత్యమ్ తస్మాత్తేయశశ యశోహవై భవతి యఏవంవిద్వాన్ సత్యంవదతి" ఈయాదేశమిట్లుండగ:-"అథోఖల్వాహుః కోఽర్హతిమనుష్యః సర్వం సత్యంవదితుం సత్యసంహితావై దేవాః అనృతసంహితామనుష్యాః" (ఐ.బ్రా.)

అనుట వలన నిట నిర్ణయ మొక జటిల సమస్యయే.

కాని స్వయముగ శ్రుతిన్నే యీ కార్యముం దానే కైకొని, యిట్లు వ్యవస్థ సేయుచున్నది :—

"విచక్షణవతీం వాచం వదేత్ - చక్షుర్వై విచక్షణం, విహ్యేనేన పశ్యతి, ఏతద్ధ వై మనుష్యేషు సత్యం నిహితం యచ్చక్షుః, తస్మాదాచక్షాణ మాహురద్రాక్ - 'అద్రాక్.' ఇతి స యది అదర్శమిత్యాహ, అథ శ్రద్దధతి - యద్యువై స్వయం పశ్యతి-నబహూనాంచ-నాన్యేషాం శ్రద్దధతి-తస్మా ద్విచక్షణవతీ మేవ వాచం వదేత్ - సత్యోత్తరావై వాస్య వాగుదితా భవతి." (ఐ. బ్రా)

అనగా : విచక్షణవతి యగు (కంటితో జూచిన) వాక్కును పలుకవలయును. అధ్యాత్మ సంస్థ యందు చక్షువే విచక్షణము (సత్యద్రష్ట - వస్తువుయొక్క విశేష భావము (సత్య భావము) ను జూడగలది. మనుజులం దుంపబడిన సత్యము చక్షువు. అది సత్యమూర్తి. ఏ విషయమునైన జెప్పువానిని 'నీవు దానిని చూచితివా' యన 'నా కనులతో జూచితి'ననును మనము నమ్మెదము. మన కంటితో జూచినదానిని వ్యతిరేక ముగా జెప్పువా డెంతవాడైనను, ఎంతమంది జెప్పినను నమ్మము. కారణము? ఈసత్యచక్షువే. కనుక విచక్షణవతి యగు వాక్కునే పలుకవలయును. ఫలితము? తానన్నట్లు జరుగును." అనిభావము.

వెనుక సత్యసృష్టిం జెప్పుచు, సూర్యుని సత్యమూర్తి యంటిమి. అతడు చక్షురింద్రి యోపాదానము. కనుక చక్షువు సత్యము. ఋతవాణి (అనృత) సత్యచక్షుయుక్త మయ్యెనా,

సత్యసాహసమున బరిణత మగును. ఇది వ్యావహారికసత్య మందు ప్రామాణికము. కాని ఇంత మాత్రమున మౌలికసత్యమును వాక్కు గ్రహింపగల దనను. ఆవిషయమున బరాఙ్ముఖ వాణీ గతి యవరుద్ధమే. అట్లే అట పరాఙ్ముఖ సత్యచక్షుర్గతియు నవ రుద్ధమే. అంతవరకేల? ఇంద్రియసంచాలక మగుమనస్సు, తత్సం చాలికబుద్ధి, మొదలగువాని సర్వవ్యాపారములును పారమార్థిక మౌలికసత్యము నెడ నవరుద్ధములే.

"నతత్రచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతినోమనో
నవిద్మోనవిజానీమః యథైతదనుశిష్యాత్
అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి
ఇతిశుశ్రుమధీరాణాం యేనస్తద్వ్యాచచక్షిరే."

కాని వ్యవహారకాండయం దవశ్యముగ సత్యచక్షు స్సహాయమున మనము అనృతవాణిని, సత్యముగావింపగలము. కేవల మీయాధారముననే శ్రుతిస్మృతులు సత్యభాషణమును సమర్థించినవి.

చక్షురింద్రియము బాహ్యజగదనుగామి. బాహ్యజగత్తు అనృతము మర్త్యలక్షణము, అసద్రూపము అనుకొంటిమిగదా! ఉన్న దున్నట్లు చెప్పుట సత్యమే కనుక అనృతవిశ్వముంగూర్చి జూచినట్లు చెప్పుట సత్యభాషణమే అగును. కనుకనే ధర్మా చార్యులు "ఏవిషయమున నైన నసత్యముపల్కి దానిని స్వీక రించుచుచో నాయసత్యము సత్యపూతమై విశేషప్రత్యవాయ కారణము కా ద"న్నారు.

ఈవ్యావహారిక సత్యభాషణ మెల్లయెడలను గ్రాహ్యము. ఉపకారకము. పారమార్థికసత్య మన్ననో వాక్కునకతీతము గదా! ఇంకను :-వ్యావహారికసత్యభాషణ మైన నెంతవరకు వాగభినయమునకు విషయము గాకుండునో అంతవరకది కల్యాణప్రదము. సత్యభాషణతో "మేము సత్యము జెప్పుచున్నాము. సత్యాహింసలు మనతోనున్నవి. మనము సత్యముపై నిల్చియున్నాము." అను నాగ్రహ వాక్యములను గూర్చుచో నీయాగ్రహయుక్త సత్యభాషణము పరోక్షమగు నాత్మయొక్క పరోక్షసత్యశక్తి వంచితమై 'అతిమాన' కోటికి జేరును. ఇది సత్యనాశమునకు హేతువు. దీనినే ఇంతవరకు ఖండించుచు వచ్చితిమి.

సత్యముపలుకుడు, 'సత్యముపల్కుచుంటి' మని చాటింపకుడు, నిశ్శబ్దముగ సత్యమార్గము ననుగమింపుడు. ఆగ్రహము వదలుడు, "మనుజు డనృతసంహితు" డన్నది మరువకుడు. ఆగ్రహముఫలింపక పోవచ్చును. ఆయాపరిస్థితుల నన్నింటి నవలోకించియే సత్యాసక్తి పతనకారణ మని యంగీకరింపబడినది. దేవత లభిమానింతురు. అతిమానము సేయరు. సత్యాభిమానము మంచిదే. అతిమాన మవనతికారణము. కనుకనే దేవతలకు విజయము, అసురులకు బరాజయము ఘటిల్లెను. ఇట:

అభిమాన - అతిమాన

భావములకు వివేచనసేయుటయు గావలసినదే, కనుక కొంచెము చూతము. తన్ను తనయాత్మను బహ్వంశముగ

మహాశక్తిశాలిగ ననుభూతిత్తో నెరెంగి శాస్త్రసిద్ధము యథాధికారసిద్ధము నగు కర్మమార్గమందు గుప్తముగ వర్తించుట ఆవూహునదగుట, ఆత్మాభిమానము. తాను తక్కువ వాడనను కొనుట, యాత్మగ్లానినొందుట కూడదు. ఇట్టి యాత్మాభిమానమును భగవంతుడుకూడ సమర్థించెను:-

"ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవరిపురాత్మనః
బంధురాత్మాత్మన స్తస్య యేనాత్మైవాత్మనాజితః
అనాత్మనస్తుశత్రుత్వే వర్తేతాత్మైవశత్రువత్" (గీతో.)

అటుగాక :-"మేము బ్రహ్మాంశలము నేర్చినవారము భగవంతుడు మనకు బుద్ధినిచ్చెను. సత్యాహింసలు మనపాణ్ములు మనవ్యవహారము సత్యము. ఇతరశక్తులు మనయెదుట నిలువజాలవు. సత్యము పత్కాదము. మనవాక్కు ఈశ్వరప్రేరణ" అను మొదలగు చాటింపు 'అతిమానము' ఫలము? పరాభవము - వైభవనాశము. అంతర్జగత్తు నందు మహాత్తభావధారణము, తదనురూప కర్మాచరణము, అభిమానము. ఆయంతర్భావనలను వాక్కుతో చాటించుట 'యతిమానము' అని పిండితార్థము.

"దేవాశ్చవాఅసురాశ్చ ఉభయే ప్రాజాపత్యాః పస్పృధిరే తత్తోసురా అతిమానేనైవ కస్మిన్ను వయం జుహుమామ?" ఇతి స్వేస్వే వాఽస్యేషు జుహ్వాతశ్చేరుః తేఽతిమానేనైవ పరా

బభూవుః తస్మాన్నాతి మన్యేత పరాభవస్య హైతన్ముఖం యదతి మానః." (శత)

కనుకనే అనృతసంహితులగు మనుష్యులకు సత్యాగ్రహము దోషావహమని చెప్పబడినది. చివరకు "అభిమానాత్మక సత్యాగ్రహ మావశ్యకము ఉపాదేయము. అతిమానాత్మక సత్యాగ్రహ మనావశ్యకము దోషావహము. కనుక త్యాజ్యము" అని నిష్కర్ష.

ఇక అనృతభావప్రశ్న అనగా "మనుజు డెందుకు అనృతసంహితు డనబడెను? అన్నది విజిజ్ఞాస్యము:- వెనుక ఋత సత్యవివేచనము నందు అంగిర సత్యమునకును, భృగువు ఋత మునకు, జెందిన దంటిమి. ఏ మనుష్యుల శారీరక కర్మాత్మయందు సత్కర్మజనిత సత్సంస్కారాతిశ యాధానమువలన నంగిర సత్త్వము ప్రధానముగ నుండునో వారు సామాన్య మనుజులు గాక దేవతలే యగుదురు. ఇక దివ్యసంస్కారశూన్యులు, యథాజాతులు, ఋత-భృగు ప్రధానులై అనృతసంహిత మనుష్యు లగుదురు. పుట్టుకతో నందరు నన్నృతసంహితులే. కారణము? ఆపోవాయుస్సోమ సమష్టి భృగువు. ఇదిఋతము. ఇందలి మధ్యస్థ ఋతవాయువే మనుష్యప్రజాపతిచేతన కాధార మగును. కనుకనే మనుజుని 'ఋతస్యప్రథమజా' అందురు. ఇట నీమంత్ర మవధేయము:-

"యోమాదదాతి సఇదేవమావ దహమన్న మన్నమదంత మద్మి
అహమస్మి ప్రథమజా ఋతస్య పూర్వందేవేభ్యో ఽమృతస్యనామ."

మనుజులకంటె సౌరమండల మందలి ప్రాణదేవతలు సత్యాంగిరోఽగ్ని ప్రాధాన్యముచే సత్యసంహితులు. "సత్యసంహితావై దేవాః" అనుచో నీసౌరప్రాణదేవతలే గ్రహింపబడిరి. దివ్యసంస్కారయుక్త భౌమమనుజ దేవతలు, యజ్ఞాతిశయ యుక్త యాజ్ఞికద్విజాతి వర్గమును ఈకోటికి జెందువారే. ఇంత కును, తనస్వాభావిక ఋతవాయువు నాధారముగాగల కారణముచే ఋతసంహితమనుజు డనృతసంహితుడయ్యెనని యే ఫలితార్థము.

మరియు :-మనుజస్వరూపనిర్మాణము శుక్రాహుతివలన గదా ! శుక్ర మోషధిరూపాన్నము శరీరాగ్నియందాహుతము కాగా కల్గును. ఓషధులు వృష్టిఫలములు. వృష్టిసోమరూపాంతరము. సోమము శ్రద్ధానామక చాంద్రాపో రూపాంతరము. ఇట్లు అప్తత్త్వమునే ఋత మనిచెప్పిరి. ఈదృష్టితోగూడ "ఇతి తుపంచమ్యా మాహుతావాపః పురుషవచసో భవన్తి" అను ఛందోగ సిద్ధాంతానుసారము ఋత-సౌమ్య-శుక్రజనిత ఋత సంహితమనుజు డనృతసంహితుడే యగును. ఋతభావము స్వభావతః సత్య మర్యాదా వంచితముగదా. ఇక ఇంద్రియ సంచాలకమగు ప్రజ్ఞాన మనస్సును అన్నమయము, సౌమ్యము, కనుక ఋతము. ఇన్ని యమృతభావములచే మనుజు డాత్మ సత్యమును త దనుగృహీత ప్రాకృతిక స్వాధికారసిద్ధకర్మను ఉల్లంఘించును. ఋత ప్రజ్ఞాపరాధముచే సత్యాత్మ యవిద్యా

ద్యనృతదోష యుక్తమై స్వాభావికవికాసము తగ్గిన దగును. కనుకనే 'మనుష్యా ఏవైకే ఉత్క్రామంతి' అని శ్రుతివచించెను.

సరియే :-ఈ యనృతభాష నియంత్రణకై అధికారసిద్ధ కర్మప్రవృత్తికై మనోబుద్ధులు స్వధర్మచ్యుతములు కాకుండు టకై యొక ప్రాకృతికమర్యాదా సూత్రముచే నియంత్రణము గావించుట యావశ్యకము. అందుకై మహర్షులు భిన్నభిన్న మర్యాదా దుర్గములను నిర్మించి వానివాని ద్వారములందు భిన్నభిన్న నియమములను పాలకులను నియమించిరి.

ఎట్లన :-బ్రాహ్మణుడు :-ఇతని యాధికారిక కర్మలు:- వ్యక్తి-సమాజ-రాష్ట్రములందుదయించు నాధ్యాత్మికదోషము లను జ్ఞానోపదేశముద్వారా తొలగించుట, దివ్యసంస్కారాను ష్ఠానముచే సమాజమందు నవీనజీవనసంచారము గావించుట, యజ్ఞకర్మలద్వారా ప్రాకృతికాధిదైవికమండలములను శాంత ముగనుంచుట, శాస్త్రలగు క్షత్రియరాజు లుత్పథగాములగుచో, తపోయుక్తజ్ఞానశక్తిచే వారి నణచుట, సత్పథగాముల గావిం చుట, ఇవి యన్నియు నుపదేశభావమునకు జెందిన కర్మలు. ఉపదేశ మూలాధారము జ్ఞానశక్తి. తదాలంబనము శిరోయం త్రము (మస్తిష్కము).

విశ్వమందలి కొన్ని సాత్త్విక పదార్థములు శిరోయంత్ర సంబంధినీ జ్ఞానశక్తి కుపకారకములు. కొన్ని రాజస తామస పదార్థము లందు కావరకములు. ఇట్టిచో తమ యధికార కర్మా రూఢముగ గావలయు బ్రాహ్మణ వర్గము అందుకు దగిన నియ

మములను, పదార్థములను సేవింపవలయును ; విపరీతములను త్యజింప వలయును. అటుగానిచో ధూమాది స్పర్శలచే విత్తనములు తమ ప్రజననశక్తిం గోల్పోవునట్లు బ్రాహ్మణ్యము నిర్వీర్యమైపోవును. తక్కిన వర్ణముల విషయమునను యిదేవిధముగ నెరుంగ వలయును. అన్నివర్ణముల యాధికారిక కర్మలును, అందు నియంత్రితములైన ధర్మములును భిన్నభిన్నములు. వర్ణ కర్మ ధర్మ సమష్టి రూపమగు నీవ్యవస్థయే చాతుర్వర్ణ్యము. దీనికి మూలభిత్తి సమాజము.

సమాజ సాపేక్ష వర్ణవ్యవస్థయే గాక, వ్యక్తిప్రాతిస్వికకల్యాణార్థమై కూడ నొక వ్యవస్థ యున్నది. అదే చతురాశ్రమ్యము. ఈ రెండు దుర్గములందును సురక్షితమైయుండు భారతీయవర్ణప్రజ యెన్నడును స్వాధికారసిద్ధ కర్మవిముఖము గాజాలదు. భారతవర్ష భారతత్వ, జగద్గురుత్వ-సర్వమూర్ధన్యత్వము లీ రెండు వ్యవస్థలపైననే యాధారపడియున్నవి. అటు గాని నాడు భారతము భూహతమై తన సర్వస్వము బోగొట్టుకొనుట తథ్యము. ఆస్థితిం దలపోసినంతనే హృదయము కంపించును.

ఇతి వైదికకర్మయోగ*

---

* (వర్ణాశ్రమసంస్కారవిజ్ఞానము వేరుగ నరయవలయును.)

# కర్మయోగవిజ్ఞానము.

## కర్మతంత్ర వర్గీకరణము

వర్ణాశ్రమానుబంధి శాస్త్రీయ కర్మసమష్టియే భారతీయ కర్మయోగము. అదే యిహ-పరలోక సుఖాధికారము గల్గించునది. వర్ణాశ్రమ సంస్కార పరిచయము గల్గించుకొనుటయే కర్మయోగ పరిచయము. ఆమాటికి జెందని మానవ బుద్ధికల్పిత కర్మలెల్ల 'వికర్మలు' (శాస్త్రనిషిద్ధ విరుద్ధకర్మలు) 'అకర్మలు' (అవిహితా ప్రతిషిద్ధ నిరర్థక కర్మలు) నై హేయ కోటికి జెందును. అట్టివి భారతీయ హితసాధనము లెన్నడును గాజాలవు. దురూహ్య కర్మతత్త్వనిర్ణయమునందు, గీత పరమ ప్రమాణ మనుట సర్వసమ్మతముగదా! తదుక్త కర్మానుగమనము కల్యాణహేతువే గదా! నేటి కర్మమార్గ విభీషికను రెండువాక్యములచే భగవంతు డెట్లు నిరాకరించెనో అవలోకింపుడు.

1. యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
   న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్
2. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ
   జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి.

కొందరు 'శాస్త్రీయకర్మలు పరలోకహితకరములు. అవి మంచివే, ప్రస్తుతము శరీర కల్యాణము కావలయును. ఆకలి

యున్నపు డాలోకసుమాట యెక్కడ? కనుక, ఇపుడు ఐహికాభివృద్ధి కలుగునంతవరకు నా కర్మలం గట్టిపెట్టవలయు" నందురు. ఆయవివేకుల దుర్బుద్ధి నిరాకరణమునకే భగవంతుడు 'న పరాంగతిమ్' తో 'న సుఖం' అని జేర్చవలసి వచ్చెను.

శాస్త్రవిరుద్ధ కర్మలు మొదట సిద్ధములేకావు. ఘుణాక్షరన్యాయమున నేదే నొకటి సిద్ధించినను ఆ లోకసుఖము మాట యటుగనే యక్కరలేదు. ఇక ఈ లోకమందైనను పట్టుమని పది దినములపా టుండునట్టి సుఖము నైన గల్గింపజాలక తదీయ సుఖాభాస రక్షణార్థము మరల నెన్నో శాస్త్రవిరుద్ధ కర్మలను గావింప దలంపులను రేకెత్తించును. కావింపజేయును. దుఃఖసంతానము నవిచ్ఛిన్నము గావించును.

శాస్త్రీయకర్మ లాత్మకు జెందునవి. పారలౌకిక సుఖకారకములు మాత్రమే యనుకొనుట మూర్ఖత. అవి యుభయ లోకతారకము లనియే భగవ దభిప్రాయము. ఉత్తమజ్ఞానము (బ్రహ్మబలము) ప్రవృద్ధపరాక్రమము (క్షత్రబలము) కృషిగోరక్షా వాణిజ్యములు, (విడ్బలము) సేవాధర్మము (శూద్రబలము) వ్యక్తిస్వాతంత్ర్యము, సామాజికవ్యవస్థ రాజనీతి, ఈ మొదలుగాగల వెల్లను శాస్త్రవిషయములే. వీనిని యథాశాస్త్రముగ ననుగమించిననే సుఖప్రాప్తి. (గీతావిజ్ఞాన మందలి శాస్త్రనిర్వచన మరయ దగినది.) శాస్త్రమనః-ప్రత్యక్షద్రష్టలు, ఆప్తులు, మహర్షులు, ప్రకృతిరహస్యము నాధారముగ నెరింగి

నిర్వచించిన విధినిషేధాత్మక, కర్తవ్యాకర్తవ్య వచనసంగ్రహముగదా! సామాన్యులు కర్మరహస్య మెరుంగజాలరు. కనుక వా రుభయవిధ కల్యాణములకై యామహర్షుల యాదేశముల ననుగమింప వలసినదే. (చూడుడు యోగసంగతి.)

లౌకిక పారలౌకిక కర్మలవిధి నిషేధములం గూర్చి శాస్త్రాదేశము లేమి? యన్నది శాస్త్రమునే యడుగవలయును. ప్రకృతము గీతానుబంధి కర్మయోగమును గూర్చి తెలిసికొందము. గీత విధి నిషేధాత్మక శాస్త్రముకాదు. అట్లనుకొని మన్వాది విధినిషేధాత్మక గ్రంథముల నుపేక్షించువారు పొరపడుచున్నారు. ఆ పొరపాటును గీత "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" "ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శిన" "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" ఇత్యాదులచే సవరించుచున్నది. ఏమి చేయవలయు? ఏమి చేయరాదు? అన్నది మన్వాది శాస్త్రవిషయము. గీతాప్రతిపాద్యవిషయ మదికాదు. ఎట్లు చేయవలయు నన్నదే గీతాప్రతిపాద్యము. అందు, ఎట్లు? అనగా బద్ధతి-కౌశలము (ఆచరణరహస్యము-కర్మసిద్ధి వెంటనే లభించుట కనువైన యుపాయము.) అను రెండు భావములు గలవు. అందును పద్ధతియన్నదియు ధర్మశాస్త్రవిషయమే. కౌశలముంగూర్చియే గీత వివరించును. ఈ కౌశలమే గీతయందలి బుద్ధియోగము. 'యోగః కర్మసు కౌశలమ్'.

## నేటి గీతాభక్తి.

మన్వాది శాస్త్రములు సామయికములు. వాని యాదేశములు స్వార్థమయము లనుకొనువారు గీతతో సంతుష్టు లగుదురు. కానిండు, గీతయు కర్తవ్య ప్రతిపాదన సేయుపట్టునందు ధర్మ శాస్త్రానుసారముగనే వ్యవస్థ సేయుచున్నది. చూడుడు 'మన మేమి చేయవలయు' నను ప్రశ్నకు సమాధానము గీతం బట్టియే చెప్పుకొందు మనుకొనువారు గీతోక్త కర్మ మార్గమే సర్వశ్రేష్ఠమని నిష్కామ కర్మం గూర్చి చాటించు మహానుభావులు, గీతా గ్రంథ పత్రములం దిరుగ వేయునపుడు, గీత యెట్టి నిష్కామకర్మ నాదేశించుచున్నదో, అధికారి భేద భిన్న స్వధర్మభేదము నాధారముగా గొని యెట్లు కర్మ వర్గీకరణ మాచరించుచున్నదో నిష్పక్షపాత దృష్టితో నవలోకించిరా? దయయుంచి చూచి యవధరించి యాచరింపుడు:

1. న తదస్తి పృథివ్యాం వా, దివి దేవేషు వా పునః
   సత్త్వం ప్రకృతిజైర్ముక్తం, యదేభిస్స్యా త్త్రిభిర్గుణైః
2. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప!
   కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః
3. శమోదమః తపః శౌచం శాంతిరార్జవమేవ చ,
   జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం, బ్రాహ్మం కర్మ స్వభావజం
4. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యంయు ద్ధేచాప్య పలాయనమ్,
   దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం,

5. కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజం
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్
6. స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరతః సిద్ధిం, యథా విందతి తచ్ఛృణు,
7. యతః ప్రవృత్తి ర్భూతానాం, యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః
8. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్
9. సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః
10. స్వభావజేన కౌన్తేయ! నిబద్ధః స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్య స్యవశోఽపితత్
11. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః."

అహర్నిశలు గీతాభక్తిం జాటించుకొనుచు కర్మసిద్ధాంత మందు గీత సర్వాగ్రణి యనుకొనువారు పై శ్లోకము లందలి యాదేశముల నాచరణయం దుంచుటకు స్వప్నమందైన ప్రయత్నించిరా? గీత యాదేశించు పరాగతి - సుఖముల రక్షింప గొంచెమైన యత్నించిరా? "యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్" అను నాదేశ పునరుజ్జీవనకై యించుక పశ్చాత్తాపమైన నొందిరా? "యజ్ఞాద్భవతి పర్జన్యః పర్జన్యా దన్న సంభవః" అను వచనమూల్య మెరింగి, రాష్ట్ర బుభుక్షాజ్వాల

శాంతింపజేయ దలపోసిరా ? అనావృష్ట్యతివృష్ట్యాదులవలన నగు నపాయశోధనకై ప్రకృత్యనుగ్రహము నొందు కోరిక యైన గలిగినదా ? "ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" అను నాదేశము శిరసావహించిరేనా నేడు గ్రహింపబడు చున్న జ్ఞానోపదేశములు వెలయుచున్నవి ?

ఆహా! గీతాభక్తి యనుపేర తత్సిద్ధాంతము లిచ్చవచ్చి నట్లు దంచివేయ, భగీరథయత్నము లాచరింపబడినవి. శాస్త్రములంగూర్చి యుపేక్షా-మిశ్రిత నిందలు గావింపబడుచున్నవి. వర్ణాశ్రమధర్మములు రాష్ట్రావనతి కారణములుగ నెంచబడు చున్నవి. బ్రహ్మ-క్షత్రియబలము లుపేక్షింప బడుచున్నవి, విట్శూద్రబలములకు సర్వోచ్చాసన మీయబడుచున్నది. స్వాతంత్ర్య మనుపేర, నాబాలవృద్ధ మందరు నమర్యాదితులు-ఉచ్ఛృంఖలులు గా గోరుచున్నారు. ఇదే స్వాతంత్ర్యమా? రాజనీతి కిదే భీభత్సరూపమా ? ఈ నీతిధర్మ బలముగొనియా హిందూత్వరక్షణ గావలసినది ? ఇదేనా గీతాదేశము ? ఇదేనా గీతోక్త కర్మతంత్ర వర్గీకరణము ? గీతాక్షరముల నవలోకింపుడు కనులు మూసికొని యీ యుద్దామ వాసనోదర్కములం గూర్చి మననము సేయుడు.

వర్ణా-శ్రమ-సంస్కార కర్మల మాటికంటె కర్మయోగ మందు విమర్శింపదగిన దేదియు లేదని మొదటనే చెప్పితిమి. దేశ-కాల-పాత్ర-ద్రవ్య - శ్రద్ధా - పద్ధతి - కౌశ లాది భేదములచే ఈమాటికి, భేదము లసంఖ్యములగును. అయినను ఇవి

యన్నియు నారుకర్మలం దంతర్భావములుగ నెన్నిరి. ఇదే భారతీయ, సుప్రసిద్ధ షట్కర్మవాదము, "షట్కర్మాణిదినేదినే" అన్నది అనుగమవచనము కనుక ఈ కర్మషట్కము ననేక వర్గములుగ విభజింపవచ్చును. అందు గొన్నివర్గముల నీప్రకరణమందు చూతము.

## 1. సంస్కారనిబంధన షట్కర్మలు.

సంస్కార తారతమ్యము :— లౌకిక-వైదికకర్మ లెల్ల నుపకారకములే, కాని, ఆ యుపకారకత్వము వాని యనుష్ఠానయోగతంబట్టియు, అధికారముంబట్టియు, నుండును. ఎట్టి యుత్కృష్ట-విశిష్టకర్మయేని, తత్కర్త కనుష్ఠానయోగ్యత లేని-చో చేతగానివాని వంటవలె నతిశయాధాయకము గాజాలదు. వర్ణకర్మలు వర్ణయోగత్వంబట్టి విభక్తములైనవి. వర్ణయోగ్యత ఆయా వర్ణములందు పుట్టువునుండియు నున్నను, నొకవిధమగు, విశేష సంస్కారిక కర్మలద్వారా ప్రస్ఫుటిత మగును. వాని 'నధికారసమర్పకకర్మ' లనవచ్చును. ఇందు గొన్ని- తలిదండ్రులును, కొన్ని విద్యాప్రదాతయగు నాచార్యుడును, కొన్ని తనంత దానును అనుష్ఠింప వలసి యుండును. "చేసినవా డనుభవించు" నను కర్మవాద సామాన్య సిద్ధాంతమున కీసంస్కారిక కర్మలందీయొకచోటనే అపవాదము. తలిదండ్రులు నాచార్యుడు కర్మ చేయగా తచ్ఛుభోదర్కము సంస్కార్య-(సంస్కృత) వ్యక్తి యనుభవించును.

సంస్కారకర్మలు లేక, ప్రకృతిప్రదత్త వర్ణబీజమును మరింత మలినపరచు కుసంస్కారజనక కుకర్మలాచరించి (పూర్వ) జన్మసిద్ధ సంస్కారాతిశయముం బోగొట్టుకొన్నవాడు వర్ణధర్మానుగాములగు నాధికారిక (స్వాభావిక) కర్మలందు బ్రవృత్తుడుగాజాలక మరింత యావరణ దోషముచే కలిగిన తమఃప్రధానమగు నిచ్ఛచే నంతకంటె నసత్కర్మలందే ప్రవృత్తుడగును. మలినకాచగతిచే వెడలు సూర్యప్రకాశము స్వతఃశుద్ధమయ్యు మలినముగనే ప్రవర్తించును గదా !

ఆత్మయందు కొలదిప్రకాశ మున్నంతవరకు నీవ్యక్తి యాగంతుక కుసంస్కారములకు రోతపడినను కుసంసర్గ దోషముచే ధారావాహికములగు నలవాటులకు లొంగిపోవును. అప్పు డాత్మజ్యోతి యుత్తరోత్తర మధికాధిక మలినముకాగా తానాచరించు దుష్టకర్మలే మంచి వని వాదించుటకు గూడ సిద్ధపడును. ధర్మకర్మలు కల్పితము లనియే వానికి దోచును. కారణము? అప్పు డతని యాత్మజ్యోతి పూర్వోక్త మలినకాంతిప్రసారమైనలేక పూర్తిగ నవరుద్ధమై పోవును. నేడు దేశము చాలవరకీగతినే పట్టినది.

మానవసమాజ త్రైవిధ్యము :— ఈ సంస్కార తారతమ్యములం బట్టి మానవసమాజమును భగవంతుడు మూడు శ్రేణులుగ నెంచెను. గీతానుసార మాశ్రేణులు (1) కృతాత్మ, (2) విధేయాత్మ, (3) అకృతాత్మ అను పేరుల నందెను.

1 శాస్త్రతత్త్వ పరపారగాములు, విదితవేదితవ్యులు, సిద్ధావస్థాపన్నులు అగు కర్మయోగు 'లారూఢులు' లక్ష్యముంజేరినవారు కృతకృత్యులు కనుక వారే కృతాత్ములు. యుక్తయోగులనియు వీరి నందురు. వీరు సర్వశ్రేష్ఠులు, కశ్చిన్మర్యాదాయుక్తులు (కశ్చిన్మాం వేత్తితత్త్వతః) ఇది మొదటి విభాగము.

(2) పూర్వసంస్కారములు శుభములు. ఇపుడును సుకృతకర్మప్రవృత్తి వర్ణానుకూలము. కనుక నాత్మయందలి ప్రకాశరశ్ములు ఆంశికరూపముచే వికసితములు. శాస్త్రశ్రద్ధయాస్తికతాపూర్ణము. ఆత్మోద్ధారమందిచ్ఛ; ఇవి కలవారారురుక్షులు, తమ జిజ్ఞాసా ప్రభావముచే శాస్త్రీయ కర్మానుష్ఠానము ద్వారా ఆత్మదోష పరిమార్జనము గావించుకొనుచు నొకనాడు ఆరూఢు లయ్యెదరు. ఈ శాస్త్రనిష్ఠులను, జిజ్ఞాసువులను, ఆరురుక్షువులను, గీత :-'విధేయాత్మ లన్నది' వీరే 'యుంజానయోగులు' ఇది రెండవ విభాగము.

(3) ఇక మూడవతరగతివారు సంఖ్యయందు పై రెండు తరగులను మించినవారు. కుసంస్కారవశమున నాత్మప్రకాశ మణగిపోగా, నా మాలిన్యమున నణుమాత్రమును సత్కర్మప్రవృత్తి లేక ఆత్మ - పరమాత్మ - స్వర్గ - నరక-ముక్తి-యజ్ఞ-దాన-తప-ఇష్టా-పూర్త-దత్త-దేవ-ద్విజ-గురుశుశ్రూష-శ్రాద్ధాది శాస్త్రీయకర్మలందు విలువయుంపక తత్త్వములను ఎరుంగవలయు నను నిచ్ఛయైన లేక ఘోరాతిఘోరానత్కర్మల గావించియు నాత్మపరితాప మన్నదిలేక మెలంగువారు. వీరి

యాత్మ సర్వానుభవశూన్య పాషాణాది జడపదార్థములందు వలె ప్రకాశరహితమై యుండును. అర్థసంచయ, కృపణతా, మోహాది వివిధపాశబద్ధులై యుండు వీరియందు దివ్యభావము మొలకయెత్తదు. గీత వీరి 'అకృతాత్మ' లన్నది. 'సర్వజ్ఞాన విమూఢు' లగు వీరిని సముద్ధరణ మసంభవము. 'జాయస్వ' 'ప్రాయస్వ' యను ధారావాహిక చక్ర మందు బడు పరచికిత్స్యులు.

"యే మేమతమిదంనిత్య మనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధావన్తో౽నసూయన్తో ముచ్యన్తే తే౽పికర్మభిః
యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మానవాః
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధినష్టానచేతసః"

సాంస్కారికకర్మలు :—ఆగంతుక-సంచిత దోషములం బోనడచి, యథాధికార శాస్త్రీయకర్మలందే యారూఢినొందించి, వర్ణధర్మచ్యుతి లేకుండ స్వరూపరక్ష గావింపనై షడ్విధ సాంస్కారిక కర్మవిధాన మేర్పరుపబడినది. అధ్యాత్మసంస్థయందున్న బ్రహ్మ-దేవ-భావములు రెండును సంస్కరింప బడవలయును గనుక సంస్కారములును, బ్రాహ్మ-దైవ భేదముచే రెండు విధములు. మొత్తమారు. ఇవి ముందు జెప్పనున్న-కర్మ షట్కములకు మూలప్రతిష్ఠలు. కనుక నీసాంస్కారిక కర్మ షట్కము ముందుగ జెప్పనయ్యెను. (వీనివివరణము సంస్కార విజ్ఞానమం దరయనగును.) ప్రస్తుతమీ 'సంస్కారనిబంధన షట్కర్మపరిలేఖ మాత్రము చాలును.

| | | | | |
|---|---|---|---|---|
| 1. గర్భసంస్కారములు | (8) | శోధకములు | బ్రాహ్మములు | షట్కర్మాణి దినేదినే. |
| 2. అనువ్రతసంస్కారములు | (8) | విశేషకములు | | |
| 3. ధర్మశుద్ధిసంస్కారములు | (5) | భావకములు | | |
| 4. పాకయజ్ఞసంస్కారములు | (7) | శోధకములు | దైవములు | |
| 5. హవిర్యజ్ఞసంస్కారములు | (7) | విశేషకములు | | |
| 6. సోమయజ్ఞసంస్కారములు | (7) | భావకములు | | |

## 2. ఉదర్కనిబంధనషట్కర్మలు

**కర్మలు** :- జ్ఞానపూర్వకములు, శుభసంస్కారములకు; అశుభసంస్కారములకును జనకములు. పరిణామమే యుదర్కము. ప్రకృత మేకర్మలవలన శుభాశుభవాసనా సంస్కారములుత్పన్నము లగునో అవి యేయే శ్రేణులుగ విభజింపబడినవో అట్టి పరిణామజనక కర్మలంగూర్చి విచారింతము. అందువలన దీని కీశీర్షిక తగును.

**పుణ్యపాపనిరుక్తి** :- కార్యస్వరూపముంబట్టి కారణము ననుమానింతురు. కర్మరూప కారణమునకు కార్యరూప ఫలములు శుభాశుభము లని రెండుభేదములు కనుక తజ్జనకమగు కర్మయు రెండు భేదములు కలదియే యగును. పుణ్యోదర్క (శుభఫలక) కర్మ పుణ్యకర్మ. పాపోదర్కజనకము పాపకర్మ. ఇందు మొదటి దధ్యాత్మసంస్థకుత్తరోత్తర వికాసమునకును, ఊర్ధ్వగమనమునకును, శ్రేయోభావమునకును గారణమగుటచే 'శ్వోవసీయసము' (శ్వఃశ్వఃవసీయాన్-ఉత్తరోత్తర వృద్ధింగతః) అనియు, రెండవది ఆత్మపతనకారణ మగుటచే పాతక మనియు ప్రసిద్ధము లైనవి. అదియు నిదియు గూడ మూడేసి విధములు.

ఇట్లుదర్క-నిబంధన పుణ్యపాప కర్తద్వయియు, నారుభాగ ములు. మొదటి మూటి పరిణామము శుభము. రెండవమూటి పరిణామ మశుభము. ఇంకొకవిషయ మిట జ్ఞప్తియుంపదగినది. మనజన్మాదికారణములు (జాత్యాయుర్భోగములు) పుణ్యపాప కర్మలు కావు. వానివలన గలిగి సంచితములైన శుభాశుభ సంస్కారములే వానికి ప్రవర్తకములు.

పుణ్యపాపము లతీంద్రియపదార్థము లని మున్ను యోగ సంగతి యందనుకొంటిమి. అంతర్దృష్టి యనబడు విజ్ఞానదృష్టి లేనిచో వాని నెరుంగుసాధనము లేదు. అది యాత్మకు జెంది నది. ఆత్మకు సూర్యునితో సంబంధము. కనుక పుణ్యపాప పరిచయము వలయుచో విజ్ఞానఘనుడు, ఆత్మప్రతిష్ఠయు, సహ స్రాంశువు నగు సూర్యునే శరణొందవలయును.

సూర్యుడే తనయందున్న జ్యోతిర్గా ఆయు నామక మనోతాత్రయి యందలి ఆయు నామక మనోతాద్వారా, మన యాత్మకు ప్రతిష్ఠ యని యాత్రేయవిజ్ఞానమునం జెప్పి యుంటిమి. ఈ ఆయుఃప్రాణమునుండియే ఆత్మస్వరూపము వెలసినది. అనగా: ఆయుఃప్రాణమే మనోవాగ్గర్భితమై మనప్రజ్ఞానాత్మ యగును. ఈవచనము నరయుడు:-

"యోవై ప్రజ్ఞా సప్రాణః యఃప్రాణః సాప్రజ్ఞా-సహ హ్యేతావస్మిన్ శరీరేవసతః-సహోత్క్రామతః- ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మాం ఆయు రమృత మిత్యుపాస్వ" (కౌషీ)

దీనిచే ప్రాజ్ఞలక్షణ భూతాత్మ సూర్యోత్పన్నము సూర్యాంశ యని తేలును. ఇంకను "సూర్యఆత్మా జగత స్తస్థుషశ్చ" అనియు గలదు గదా! ఇక:—ఆత్మఘనుడు సూర్యు డంశి, జీవాత్మ తదంశ- అంశ అంశి కనుగత మగుచో వృద్ధ్యున్ముఖము విపరీతగతి నొందుచో అంశియొక్క ఘన భావము నొందక హ్రాసోన్ముఖమునగును. చివరకు:— మనభూతాత్మ స్వప్రభవ మగు సూర్యతత్త్వము ననుగమించుచో శ్వః-శ్వః(దినదినము-ఉత్తరోత్తరము) శ్రేయోభావము, వృద్ధి-వికాసము నొందును. విరుద్ధది గనుగామి యగుచో నుత్తరోత్తరము పతనోన్ముఖ మగును. మొదటి దభ్యుదయము. రెండవది ప్రత్యవాయము. ఇవి ఫలము లయ్యెను తజ్జనకములగు కర్మలను గూడ అభ్యుదయకర్మలు ప్రత్యవాయకర్మలు అందురు.

ఇందు మొదటివానిచే నిహమందు ప్రజ్ఞానాత్మసంశ్లిష్ట విజ్ఞానాత్మ వికాసము కలుగును. అందు వలన సర్వవైభవ సమృద్ధియు స్థూలశరీర పరిత్యాగానంతరము సూర్యాది గుపలక్షిత దేవయాన మార్గానుగమనముచే పారలౌకిక స్వర్గసుఖాధికారమును. రెండవవానిచే:— నిహమున బుద్ధివికాసము లేమియు లోకవైభవవంచనయు పరమున సూర్యప్రతిది గుపలక్షిత పితృయానమార్గానుగమనము నరకాధికారముగా లభించును. ఇట్లు వానియం దుభయలోక కల్యాణము వీనియం దుభయతఃపతనమును సిద్ధము.

అభి=ఎదురుగ ఉత్=పైకి అయ=పోవుట= సూర్యుని కెదురుగ పైకిపోవుట= అభ్యుదయము ప్రతి=విపరీతముగ అవ=క్రిందికి అయ=పోవుట= సూర్యునకువిరుద్ధముగ క్రిందికి బోవుట=ప్రత్యవాయము అని పదార్థములు. (1) తేజోమయేంద్రప్రధాన దేవతాయుక్త సౌర (అదితి) మండలము ప్రకాశమయము జ్యోతిర్ఘనము—తదనుగృహీత గగనమార్గము దేవయానము శుక్లమార్గము అభ్యుదయ సంస్కారయుక్తాత్మ దీని ననుగమించి దేవస్వర్గప్రతిష్ఠితమగును. (2) వృత్రప్రధానాసుర యుక్త విరుద్ధభాగము దితిమండలము అంధకారపూర్ణము తమోమయము, తదనుగృహీత గగనమార్గము, పితృయాణ మార్గము, కృష్ణమార్గము. ప్రత్యవాయ సంస్కారయుక్తాత్మ దీని ననుగమించి నరకమునకు బాత్రమగును. ఇట్లు అభ్యుదయ ప్రత్యవాయ నిమిత్తక పుణ్య పాప భేదములచే నాత్మగతియు రెండు విధములు. కర్మతారతమ్యమున నీ రెండు గతులును 108 భాగములుగ నున్నవి. వాని వివరణమున కిది తావుగాదు. శ్రుతియు - గీతయు, నీ గతుల నిట్లు సూచించెను :

"ద్వేసృతీఅశ్రృణవం పితౄణామహం దేవానా ముతమర్త్యానాం తాభ్యామిదం విశ్వమేజత్ సమేతి యదంతరా పితరంమాతరంచ" (యజు)

"శుక్లకృష్ణే గతీహ్యేతే జగతః శాశ్వతీ మతే
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః" (గీత)

ఒకపు డభ్యుదయ ప్రత్యవాయ సంస్కారములు పుణ్య పాప కర్మజనితము లగుటచే పుత్రస్థానీయము లగుయు, అవియే

మరొకపు దుక్థ రూపమునుండి పుణ్యాపాప కర్మలకు బీత్ర స్థానీయము లనియు జెప్పబడును. శుభకర్మ జనిత శుభోదర్క లక్షణ శుభవాసనయే అభ్యుదయ సంస్కారము. ఇది కాలాంత రము నందు దుక్థరూపమై శుభకర్మ ప్రవృత్తి కల్గించును. ప్రత్య వాయ విషయమునను యిట్లే యూహింప వలయును. సంచిత వాసనా వ్యూహామే సంచిత కర్మ. సంస్కారాత్మకము. ఇది పూర్వజన్మ సంచిత ముత్తరజన్మ శుభాశుభ కర్మప్రవృత్తి కారణ మగును. భారతీయుల అదృష్ట (భాగ్య) వాదమున కీ సంచిత వాసనా వ్యూహామే మూలము.

భాగ్యానుసారము కర్మ సేయుదుమా ? కర్మానుసారము భాగ్య మేర్పడునా ? భాగ్యమున కధీనులమా? స్వతంత్రులమా? అన్నదొక జటిల సమస్య. కనుకనే 'కవయోఽప్యత్ర మోహితాః' "గహనాకర్మణో గతిః" అను వచనములు వెలసినవి. 'అత్యాజ్య కర్మోపనిషత్తు'నందు గీత యీ ప్రశ్నలకు నిశ్చిత సమాధానము లిచ్చినది. ఈ జన్మమం దాచరించు కర్మలు ముందు జన్మకు సంస్కారరూప భాగ్య నిర్మాణముం గావించును. పూర్వజన్మ కర్మ సంచిత భాగ్యపరిణామ మీ జన్మకర్మలు. ఈ రెండును రథచక్రముల ట్లన్యోన్యాశ్రితములు.

ఇందు, కుసంస్కార దోష నిరోధార్థమే గర్భాధానాది సంస్కారములు వెలసినవి. ఇట్టిచో, కర్మ, భాగ్యమును నిర్మిం చును అందుము. భాగ్యము కర్మప్రవృత్తికి గారణము. గర్భా

ధానాది సంస్కారములు, శాస్త్రీయాచార వ్యవహారానుగమ నము, మొదలగు వానిచే సంచిత కుసంస్కార (భాగ్య)బలము నిర్వీర్య మగును. ఇంతకు అభ్యుదయరూప శుభవాసన శ్రేయసము. దీనివలన నాత్మ యుత్తరోత్తరము వికసిల్లును. ప్రత్యవాయరూపాశుభవాసన పాతకము. ఇది యాత్మ పతనకారణము. అది పుణ్యము, ఇది పాపము. తత్తత్సంస్కార జనకములు పుణ్యపాపకర్మలు. వీని వలన నాత్మయు, పుణ్యాత్మయో, పాపాత్మయో యగును. ఇది పుణ్య పాపశబ్ద రహస్యార్థము.

ఇక నిరుక్తి: పవనార్థక పూఙ్ లేక శుభార్థక పుణ్ (పూఙ్ పవనే క్ర్యాది - పుణ కర్మణిశుభే తుదాది) ధాతువుల నుండి పుణ్యశబ్దము వెలసినది. ఇందు మొదటిదాని యర్థము (పునాతి-ఆత్మానం, యత్, తత్) ఆత్మస్వరూపముం బవిత్రము గావించుకర్మ. సంస్కారము, ఫలము, పుణ్యము. రెండవదాని యర్థము:-పుణ మర్హతి లేదా పుణే సాధు ర్యత్తత్=శుభభావ మునకు దగిన-సమర్థమైన కర్మ పుణ్యము. చివరకు:-ఏకర్మ-సంస్కార ఫలముల ననుగమించుటచే ఆత్మ స్వరూపరక్షయగు ఆత్మయందు శుభసంస్కారాధాన మగు ఆత్మకు శుభఫల ప్రాప్తి యగు నట్టి కర్మ పుణ్యకర్మ యని తేలును.

ఇక పాప:-శబ్దము. దీని నిర్వచనము కొంచెము చిక్కుగ దోచును. పా+అపః సముచ్చయము పాపము. పా=రక్షాభావ సూచకము, అపః=రక్షావృత్తిం గొట్టివేయుటను సూచించును.

వస్తుస్వస్వరూప సుస్థితి స్వాస్థ్యము అసత్కర్మల వలన నాస్థితి చెడును. కనుక నా యసత్కర్మ :-పా=(స్వాస్థ్యం, ప్రతిష్ఠా-ఆత్మనః స్వాభావికీస్థితిః) తతః; అపగ=(అపగమగ) యస్యాత్మనో యేనకర్మణా తత్ పాపమ్ అను నిర్వచ నానుసారము పాపము. పా (రక్షా) విఘాతము పాపము. అప శబ్ద మపగ మార్థ సూచకము. 'యేనకర్మణా ఆత్మనః పా=రక్షా; అపగతా భవతి" అన్నదే పాపము.

ఇంకొకవిధముగ :-ఏకర్మ ఆత్మయొక్క పాభావమును (ప్రతిష్ఠాభావమును స్వరూపరక్షక భావమును) రక్షింప సమర్థము కాదో అదే "పాం=ఆత్మరక్షకం ప్రతిష్ఠాభావం నపాతి నరక్షతి" అన్నచో పాప మనబడును. ఆత్మస్వరూప రక్షా సాధక శుభసంస్కారమును నష్టపరచుకర్మ పాపము.

వేరొకవిధముగ :-'అపగతా ఆపః=పాపః' అనవచ్చును. ఇదే విజ్ఞానసమ్మతము. ఆపః=అన్నది ఆత్మయొక్క స్వాభావిక జీవనప్రవాహ సూచకము. ఏకర్మచే నిది యవరుద్ధము, నష్టము, దూషితము అగునో అది 'అపగతా-ఆపః=అను నిర్వచనానుసారము' 'అపాపము' ఇదే యాదృచ్ఛిక భావప్రధానతచే స్థితి విలోప సూచ కాకార లోపముకాగా 'పాప' ముగా బరిణమించును. ఏశబ్దముచేనైన నా శబ్దవాచ్యపదార్థ మూల (స్వాభావిక) స్థితిం జెప్పవలయుచో నా పదార్థవాచకశబ్ద మూలస్వరూపమునకు దదనురూప నిర్వచనము సేయుటయు, పదార్థమూలస్వరూప వికృతిం జెప్పవలయుచో తద్వాచక శబ్ద

మూల స్వరూపమును గూడ వికృతముగావించుటయు, నిరుక్తి శాస్త్ర నియమము. 'అపాప' శబ్ద మాత్మస్వరూప వికృతి సూచక మగుటచే నా శబ్దముగూడ వికృతమై 'పాప' మునఁ బరిణతమైనది. ఈకర్మ ఆత్మయొక్క మూలస్థితి విఘాతకము.

మఱొకవిధముగ :-ఆత్మ స్వాభావికప్రకృతియే 'ఆపః' “ఇతితు పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవన్తి” అన్నట్లు ఆత్మకు భోగాయతనరూపమగు లింగశరీరము ఆపుస్సులవలననే నిర్మితమైనది. 'అప' శబ్దము. నిమ్నభావమును, నిమ్నగతిని, పతనమును, సూచించును. ఏకర్మచే బైనిచెప్పబడిన యాపోమయ శరీరము నీచగతినొందునో ఆకర్మ 'అఘగతా ఆపః” అను నిర్వచనముంబట్టి 'అపాపము' అకారలోపము కలుగగా 'పాప' మనబడును.

## శ్వః శ్రేయస-ఏనస్-నిరుక్తి

సాధారణముగ ఏనస్, ప్రత్యవాయ, అఘ, దుష్కృత-కిల్బిష మొదలగు శబ్దములును, శ్వఃశ్రేయస, అభ్యుదయ, ప్రాయశ్చిత్త, సుకృత, కల్యాణ మొదలగు శబ్దములును, సమానార్థము లనుకొందురు గాని, విజ్ఞానదృష్టి కవి దేని కదే వేరైనవి. మొదట ఏనస్ శబ్దము గైకొందము. ఇందు :-'ఆ-ఇన్-అస్' అను మూడుభాగము లున్నవి. 'నామైకదేశే నామగ్రహణమ్' అను న్యాయముచే ఇణ్ అనగా ఇనః అనగా స్వామి అధిపతి అని యర్థము రోదసీత్రైలోక్యాధిపతి సూర్యుడు కనుక నతఁడు

'ఇనః' అనబడెను. 'అ' యన నభావము (లేదు) 'అస్' అనగా భావము సత్త అస్తిత్వము కాగా :—ఏ కర్మచే ఆత్మ తన ప్రభు వగు స్వామివంక కనుగతము కాదో ఆకర్మ 'ఏనస్' అనబడును. ఆత్మసత్తను సూర్యుని వంకనుండి తొలగించుకర్మ 'ఏనస్' దీనికి ప్రతిద్వంద్వి 'శ్వశ్శ్రేయస్' శబ్దము. ఇవిరెండు నొకజంట. అభ్యుదయ - ప్రత్యవాయము లొకజంట. మొదటిజంట కర్మ రూపము. దానివలన నగు సంస్కారరూపము రెండవజంట. అయినను 'తాచ్ఛబ్ద్య' న్యాయముచే నాయాసంస్కారము గల్గించుకర్మలకు నాయా సంస్కారనామములే యిడబడినవి. మొదటిజంట స్థూలకర్మలు. రెండవజంట సూక్ష్మములగు కర్మ సంస్కారములు. కార్యములు. ఉదర్కములు. ఇదే ఈజంటల పార్థక్యవివేకము.

## అఘ - ప్రాయశ్చిత్త - అభ్యుదయ - ప్రత్యవాయనిరుక్తి.

అఘమునకు శ్వశ్శ్రేయసము, ప్రత్యవాయమున కభ్యుదయము వలె అఘశబ్ద ప్రతిద్వంద్వి ప్రాయశ్చిత్తశబ్దము. ఈరెండును కర్మవిశేషములు. అభ్యుదయనామక శుభసంస్కార జనక కారణాత్మక స్థూలకర్మలను శ్వశ్శ్రేయసము లంటిమి గదా! అనుకూలనిమిత్తము లున్ననే యవి నిర్విఘ్నములుగ నెరవేరును. "కారణ మున్నను ప్రతిబంధకసామగ్రి యుండుచో కార్యముజరుగదు" అను న్యాయమున్నదికదా! అట్టి శ్వశ్శ్రే యస ప్రతిబంధకమగునది అఘము. 'నామైకదేశ'న్యాయప్రకా

రము అ=అభ్యుదయమును, ఘ=హంతి=పోగొట్టునది అఘము. అకారం=అభ్యుదయసంస్కారాభిభవద్వారా అభ్యుదయజనక కర్మనిమిత్తం హంతీతి అఘః అని నిర్వచనము. దీనికి ప్రతిద్వంద్వి ప్రాయశ్చిత్తశబ్దము దీనికంటె విపరీతార్థముకలది.

ఏనస్నామ కాశుభకర్మనుండి ప్రత్యవాయరూపాశుభ సంస్కారము కల్గు నంటిమిగదా! దీనికి బలముగూర్చునిమిత్తములు వెనుకటివి, యిప్పటి జన్మసంచితము లుపస్థితములగుచో శ్వఃశ్రేయసప్రవృత్తి యవరుద్ధముకాగా ప్రత్యవాయసంస్కారములే పెరిగిపోవును. కనుక నావిపత్తి తొలగింపనై 'ప్రాయశ్చిత్త'మను నుపాయ మేర్పడినది. ఇది ప్రత్యవాయజనక కర్మనిమిత్త ప్రతిబంధకము. అభ్యుదయసంస్కారాధాయకము నగు కర్మవిశేషమునని దీని పేరే చెప్పును: ప్రాయః=గతావస్థాసూచకము. అట్టి గతభావచయనము (చితి, సంగ్రహము, ఆధానము) చిత్తము. ప్రాయోభావ పునశ్చయనమ్ ప్రాయశ్చిత్తమ్.

మరొకవిధముగ:— శ్వఃశ్రేయస కర్మానుగమనముచే నాత్మయం దభ్యుదయసంస్కార ముత్పత్తిల్లినది. ఆత్మవికాసము కల్గినది. ఆభ్యుదయిక కర్మగావింపబడినది. కాని అందలి శుభసంస్కారము నష్టమైనది. తదభ్యుదయనిమిత్త ప్రతిబంధకము (శుభసంస్కార ప్రతిబంధకము) ఏదో ఆ కర్మయే అఘము. దీనిచే అభ్యుదయనిమిత్తక శుభసంస్కార మున్నను ఫలింపదు. పారమేష్ఠ్య సోమాహుతిరూప శ్వఃశ్రేయస కర్మనుండి వెలసిన సావిత్రాగ్నియందు సంస్కారరూపమున నున్న ప్రకాశప్రసార

రూపాభ్యుదయనిమిత్తము, మేఘాత్మక ప్రతిబంధకము ప్రాప్తింపగా స్వప్రకాశప్రసారక్రియ యందసమర్థమైనట్లు ఇట నభ్యుదయమును ఆత్మాభ్యుదయమాసమర్థమై యుండును.

ప్రాయశ్చిత్త మీయఘకర్మకు బ్రతిద్వంద్వి. అఘము మేఘ మన్నచో నిది వాయువువంటిది. దీనిచే నామేఘరూపాఘము పోగా ఆత్మసూర్యాభ్యుదయ మెప్పటియట్లు వికసించును. ఇది యావరక (కర్మ) నాశకము. ఎట్లన :- ప్రత్యవాయనిమిత్తకములగు దేవస్కర్మలచే ప్రత్యవాయసంస్కారము కల్గి ఆత్మయొక్క స్వాభావికవికాస మణగిపోగా నా ప్రత్యవాయమునకు బ్రత్యవాయ మగుటచే బ్రత్యవాయ మనిపేరు చెప్పబడుకర్మ (ప్రత్యవాయనిమిత్త ప్రతిబంధక, అశుభసంస్కార ప్రతిబంధక కర్మ) యే ప్రాయశ్చిత్తము. అనబడును.

ఇంకొకవిధముగ :—అభ్యుదయ-ప్రత్యవాయము లను సంస్కారములు రెంటికిని సాక్షాత్తుగ (ప్రజ్ఞానాత్మ) ఆత్మతో సంబంధము (లేపనము) కలదు. ఇక తత్ప్రతిబంధకము లగు నఘ ప్రాయశ్చిత్తములకు ఆత్మతో సాక్షాత్సంబంధములేదు. ఆత్మాభ్యుదయమే ఆత్మోదయము. ఇక ఆత్మోదయకారణభూత శుభసంస్కారము (శుభోదర్కము) కూడ నభ్యుదయ మనబడును. ఈదృష్టితో శుభోదర్కరూప శుభసంస్కారము లభ్యుదయనిమిత్తము లనియు ననవచ్చును. ఇక 'తాచ్ఛబ్ద్య' న్యాయముచే అభ్యుదయము లనియు ననవచ్చును. వస్తుతః శుభసంస్కారము లభ్యుదయ (ఆత్మోదయ) నిమిత్తములే

కనుక, అఘమున కాత్మతో గాక అభ్యుదయనిమిత్తక శుభ సంస్కారముల తోడనే సంబంధము.

ఇట్లే :-ఆత్మప్రత్యవాయ మాత్మపతనము. ఇందుకు గారణములగు నశుభసంస్కారములును ప్రత్యవాయములే యనబడును. ఇట్లు అశుభోదర్కరూ పాశుభసంస్కారము ప్రత్యవాయనిమిత్త మగును. తాచ్ఛబ్ద్యన్యాయముచే ప్రత్య వాయమే నాబడును. వస్తుతః అశుభ సంస్కారమే ప్రత్యవాయ నిమిత్తము. కనుక ప్రాయశ్చిత్తమున కాత్మతో సాక్షాత్సంబం ధముగాక ప్రత్యవాయనిమిత్తములగు అశుభ సంస్కారముల తోడనే సంబంధము.

ఆత్మోదయ హేతువులగు అభ్యుదయనిమిత్తరూప శుభ సంస్కారముల స్వరూపమును దూషితముగావించునదే 'అఘ కర్మ' పని. ఆత్మపతనకారణములగు ప్రత్యవాయనిమిత్తరూ పాశుభసంస్కారస్వరూపముం జెడగొట్టుటయే ప్రాయశ్చిత్త కర్మపని. అఘకర్మ ఆత్మపతనమునకును ప్రాయశ్చిత్త మాత్మో దయమునకును సాక్షాత్కారములు కావు. ఆత్మోదయావరణ కారణములు శ్వాశ్శ్రేయసేనస్సుల వలన గల్గు శుభాశుభసంస్కార ములే. ఇందు ఆత్మవికాసక శుభసంస్కారబలము నావృతము గావించుటయే అఘకర్మపని. ఆత్మపతన హేతువులగు ప్రత్యవా యజన కాశుభసంస్కారములను నిర్బలముగావించుటే ప్రాయ శ్చిత్తము పని. ఈదృష్టితో నీయఘ-ప్రాయశ్చిత్తము లను మూడవజంటను వెనుకటి రెండుజంటలకు వేరుగా నెన్నవచ్చును.

## వి వ ర ణ ము లు

(1) మిథ్యాభాషణ మఘకర్మ. అందుచే అభ్యుదయ నిమిత్తరూప శుభసంస్కారము అతిశయశూన్య మగును. ఏతన్నివృత్తికిని చాంద్రాయణాది వ్రతలక్షణ ప్రాయశ్చిత్తము గావలయును. గోమయలిప్త యవచూర్ణ (నియత) గ్రాసాహారముచే నఘజనిత దుష్టవాసన తొలగును. పోయినయాత్మ శక్తి మరల (సం) చిత మగును. ప్రాయశ్చిత్తార్థ మిదేగదా! అఘబలముం బట్టి ప్రాయశ్చిత్త మంతగనో, అంత కెక్కుడు గనో బలముగ నుండును.

(2) ఉదాహరణము :-స్వార్థపరాయణ=తనకర్మ - విత్తములం దానే యుపయోగించుకొనుట. 'చిన్నినాబొజ్జకు శ్రీరామరక్ష' అనుకొనుట అఘపాత్రుడగుట. స్వార్థమూలకము లగు కర్మ, విత్తాదు లఘరూపములు. స్వార్థి అఘరూప పాపాన్నభోక్త. 'భుంజతే తేత్వఘంపాపా యేపచంత్యాత్మకారణాత్.'

ఇందుకు ప్రాయశ్చిత్తము:-తనకర్త సంపత్తులను, పర-మార్థములకు వినియోగించుట. అందువలన గతించిన యాత్మ శక్తి మరల సంచిత మగును. ఇక :-అఘము లనేకవిధములు. ప్రాయశ్చిత్తములు ననేకవిధములు. కనుకనే ధర్మాచార్యులు, అఘకర్తలను పాతకాతిపాత కోపపాతక మహాపాతకా ద్యనేక భేదములుగ నెంచిరి. ఇందు కొన్ని మలినీకరణములు, కొన్ని సంకరీకరణములు, కొన్ని జాతిభ్రంశకరములు. వానివాని స్వరూపములనుబట్టి ప్రాయశ్చిత్తవిధానము లేర్పడియున్నవి.

(3) మాతృగమనాదు లతిపాతకము లను నఘములు. వీనికి అగ్నింబడుట తప్ప నింకొక ప్రాయశ్చిత్తములేదు. "మాతృగమనం దుహితృగమనం స్నుషాగమన మి త్యతి పాతకాని.

శ్లో. "అతిపాతకినస్త్వేతే ప్రవిశేయుర్హుతాశనమ్

న హ్యన్యా నిష్కృతిస్తేషాం విద్యతేహి కథంచన" (విష్ణుస్మృ)

(4) బ్రహ్మహత్యాదులు మహాపాతకము లను నఘములు. ఇవి యాచరించు వారి సహవాస భోజ నాదులు గావించువారును మహాపాతకులే. అశ్వమేధయజ్ఞానుష్ఠానము భూమియందలి యెల్లతీర్థములను సేవించుట వీనికి ప్రాయశ్చిత్తములు.

"స్తేనో హిరణ్యస్య సురాంపిబంశ్చ గురో స్తల్పమావసన్ బ్రహ్మహా చైతే పతంతిచత్వారః పంచమశ్చాచరం స్తైరితి అథహ యఏతానేవం పంచాగ్నీన్ వేద నసహ తైరప్యాచరన్ పాప్మనా లిప్యతే శుద్ధః పూతః పుణ్యలోకోభవతి యఏవం వేద" (ఛాందో)

"బ్రహ్మహత్యా, సురాపానం, బ్రాహ్మణసువర్ణహరణం, గురుదారగమన మితి మహాపాతకాని, తత్సంయోగశ్చ, సంవత్సరేణపతతి, పతితేనసహాచరన్ ఏకయాన భోజన శయనైః, యానస్రావమౌఖైః సంబంధైస్తుసద్యఏవ,

శ్లో. అశ్వమేధేనశుద్ధేయుః మహాపాతకినస్త్విమే

పృథివ్యాం సర్వతీర్థానాం తథానుసరణేనచ" (విష్ణుః)

(5) మహాపాత కాఘతుల్యములే అనుపాతకనామ

కాఘములును అగుటచే వానికిని యజ్ఞ-తీర్థాటనములే ప్రాయశ్చిత్తములుగ నెన్నబడినవి.

"యాగస్థస్య క్షత్రియస్యవైశ్యస్యచ రజస్వలాయాశ్చ అంతర్వత్న్యాశ్చ అత్రిగోత్రాయాశ్చ అవిజ్ఞాతస్యగర్భస్య శరణాగతస్యచఘాతనం బ్రహ్మహత్యాసమాని కౌటసాక్ష్యం సుహృద్వధః, ఏతౌసురాపానసమౌ, బ్రాహ్మణస్యభూమ్యపహరణం సువర్ణస్తేయసమం పితృవ్య మాతామహ మాతుల శ్వశుర నృపప త్న్యభిగమనం గురుదారగమనసమమ్ పితృష్వసృమాతృష్వసృ స్వసృగమనంచ శ్రోత్రియ ర్త్విగుపాధ్యాయ మిత్ర పత్న్యభిగమనంచ స్వసుః సఖ్యాః సగోత్రాయాః ఉత్తమ వర్ణాయాః కుమార్యాః అత్యజాయాః రజస్వలాయాః శరణాగతాయాః ప్రవ్రజితాయాః నిక్షిప్తాయాశ్చ అభిగమనం గురుదారగమన సమమేవేతిభావః.

"అనుపాతకినస్త్వేతే మహాపాతకినోయథా
అశ్వమేధేనశుద్ధ్యన్తి తీర్థానుసరణేనచ."

(6) మిథ్యాభాషణ విశుద్ధతా వేదనింద గురునింద వేద స్వాధ్యాయపరిత్యాగము. గృహ్యాగ్నిపితృమాతృపుత్రాదిసంబంధ విచ్ఛేదము, పలాండులశునగృంజనమద్యమాంసాద్యపేయాభోజ్య పదార్థభక్షణము, ఇత్యాదు లుపపాతకములు. వీనికి జాంద్రయణాదులు ప్రాయశ్చిత్తములు.

(7) బ్రాహ్మణపీడ, మద్యపానము, కౌటిల్యము, పశుమైథునము మొదలగునవి జాతిభ్రంశకరములు. 'సాంతపన

ప్రాజాపత్య కృచ్ఛ్ర కర్మ ప్రాయశ్చిత్తము. ఇట్లే సంకరీకరణా దులను తత్తత్ప్రాయశ్చిత్తములను స్మృతులవలన నెరుంగవల యును. ఇక్కడకే విస్తర మయినది.

"ప్రకీర్ణ పాతకేజ్ఞాత్వా గురుత్వమథలాఘవమ్
ప్రాయఃచిత్తం బుధఃకుర్యాత్ బ్రాహ్మణానుమతః సదా."

ఇక :-సుకృత దుష్కృత కల్యాణకిల్బిషములను గూడ జూతము. అందు సుకృత దుష్కృత ద్వంద్వము వెనుకటి మూడు యుగ్మములకంటె విశేషమహాత్వయుక్తముగ నెన్నబడి నది. శ్వశ్శ్రేయసకర్మజని తాభ్యుదయనామక శుభసంస్కారో త్పత్తిని నిరోధించు కర్మవిశేషము దుష్కృతము. యవల కంకురోత్పత్తిశక్తి యున్నను ధూమసంసర్గముచే నాశక్తి మూర్ఛితమగును. ఎంతచేసిన నిక నవి మొలకెత్తవు. నీటితో తడిపెదము. అది శ్వఃశ్రేయసకర్మ. కాని ధూమసంబంధరూప దుష్కృతము యవబీజనాశము చేసినది. కనుక నాకర్మ ఫలిం చదు. జలసేచనమువలన నెత్తిన మొలకం బాడుసేయు రుద్ర వాయు సంచారాదిరూప కర్మ 'అఘము' బీజనాశమువలన నంకురోత్పత్తికే మోసము తెచ్చిన ధూమాది సంసర్గరూపకర్మ దుష్కృతము. వస్త్రమునకు రంగునుబోగొట్టి దాని నతిశయ శూన్యము గావించు కర్మ అఘము. మొదట నావస్త్రమునకు రంగేయంటకుండ జేసిన తైలలింపనాది కర్మ దుష్కృతము. ఇదే యీరెంటికిని భేదము.

ఈ దుష్కృతకర్మసంస్కారముచే నెంతో పుణ్యకర్మలు, తదతిశయములు నష్టములగును. పూర్వజన్మముననో ఈజన్మముననో గోబ్రాహ్మణాది వధరూప మహాదుష్కృతకర్మ యాచరించినవాని వీర్యము దగ్ధమగును. ఉత్తరజన్మమం దిట్టివాని కెంతబోధించినను ఎట్టి దివ్యసంస్కారములను గావించినను వర్ణధర్మానుకూల సత్కర్మప్రవృత్తియే కలుగదు. అట్టి దుష్కృతులకు ఎంతచెప్పి బోధించినను కుసంస్కారములు పోవు. శుభసంస్కారము లంటవు.

ఏనస్కర్మనుండి కలుగు ప్రత్యవాయనామ కాశుభసంస్కారోత్పత్తిని నిరోధించు కర్మవిశేషము సుకృతము. దీనివలన ఏనస్కర్మవలన నగు కుసంస్కారములు తొలగును. దివ్యసంస్కారములే బలవంతములగును. సుకృత-దుష్కృత 'సంస్కారములు రెండును సంచితములై యున్నపుడు దుష్కృతవశమున క్రోధాదులు కల్గి దుష్కార్యము నారంభింపబోయినను సుకృతసంస్కారాతిశయముచే విచారపరివర్తన కల్గి పూర్వముకల్గిన కువిచారము సువిచారముగ బరిణత మగుటయు గలదు. ఇందువలన నావరకు నాస్తికులుగ నున్నవా రాస్తికు లగుటయు, ఆస్తికులుగ నున్నవారు నాస్తికు లగుటయు నగపడుచున్నది.

అభ్యుదయనిమిత్తభూత శుభసంస్కారము నభ్యుదయమన్నట్లే కల్యాణనిమిత్తభూత సుకృతకర్మను కల్యాణమందురు. సుకృతమువలన నగు నాత్మపరిపూర్ణతయే కల్యాణము. సుకృతము తండ్రి. కల్యాణము పుత్రుడు. సుకృతము వృక్షము.

కల్యాణము ఫలము. శుభఫలానుగామియగు సంస్కారమే ఆత్మకు ప్రాతిస్వికకళ. దానిప్రభావమువలననే మనుజుడు* పుణ్యాహలక్షణ బ్రాహ్మాదినమందు శబ్ద ముచ్చరింప-(జీవనసంచాలమందు) సమర్థు డగుచున్నాడు. అవయవరూప కళలచే అవయవియగు శరీరస్వరూపము సురక్షితముగ నుండును. అట్లే అనేకవిధ శుభఫ లానుగాములగు కళల సహాయోగముచే నాత్మస్వరూపము ప్రతిష్ఠితముగ నుండును. ఈకళాత్మకసంస్కార ప్రవర్తకము-రక్షకమునగు నతిశయవిశేషమే కల్యాణము.

ప్రత్యవాయనిమిత్తభూ తాశుభసంస్కారమును ప్రత్యవాయ మన్నట్లే కిల్బిషనిమిత్తభూత దుష్కృతమును గిల్బిష మందురు. దుష్కృతము వృక్షము. కిల్బిషము ఫలము. కళాసమృద్ధి వంచితమగు నాత్మయొక్క అశాంతిలక్షణాపరిపూర్ణతయే కిల్బిషము. కల్యాణము సుఖ-సంపత్తి-స్వాస్థ్యరూపము. కిల్బిషము దుఃఖ విపత్తి రోగాత్మకము.

నిష్కర్ష :-పాడైనవస్త్రముం బాగుసేయుట ప్రాయశ్చిత్తము. మొదటనే వస్త్రముం బాడుగాకుండ రక్షించుకొనుట సుకృతము. ఈ సుకృతభావముచే ఆత్మకు స్వస్తి (కల్యాణ) భావ పూర్వక గమనము కల్గును. ఆత్మస్వరూపరక్షయగును. దానికి మలిన మంటదు. కనుక సుకృతమును శాంతిస్వస్త్యయన మనియు నందురు. ఉత్పన్నరోగచికిత్స ప్రాయ

* యజమాన కల్యాణ-స్వస్తిభావములకై యుచ్చరింపబడు మంత్రములు పుణ్యాహవాచనము ఇదే స్వస్తివాచనము నాబడు.

శ్చిత్తము. రోగోత్పత్తినిరోధము స్వస్త్యయనము. స్వాస్థ్యము. ఇదే సుకృతము. శాస్త్రము లీసుకృతమునే యెక్కుడుగ మీమాంస సేయును. ఏలయన:-ఈ స్వస్త్యయనకర్మలకు మన దైనికజీవనముతో ఘనిష్ఠసంబంధము. (వీనినిగూర్చి ముందు ప్రకరణమున ప్రసంగింతము) ప్రకృతము:-పుణ్యాహస్వరూప సమర్పకము స్వస్తిభావప్రవర్తకము నగు కర్మయే సుకృతమని వివరణము.

ఇట్లు శ్వశ్శ్రేయస, ఏనస్-అభ్యుదయ, ప్రత్యవాయ, అఘ, ప్రాయశ్చిత్త, సుకృత, దుష్కృత, కల్యాణ కిల్బిష, భేదముచే పుణ్యపాపకర్మలు అయిదుజంటలు. ఇందు శ్వశ్శ్రేయసాభ్యుదయ ప్రాయశ్చిత్త సుకృత కల్యాణములు పుణ్యాత్మకములు, ఉపాదేయములు. తక్కినవి పాపాత్మకములు నికృష్టములు, హేయములు. ఈపరిలేఖ నవలోకింపుడు.

{ 1. శ్వఃశ్రేయసం అభ్యుదయప్రవర్తకశుభసంస్కారజనకం, సత్కర్మ-పుణ్యమ్
{ 2. ఏనస్, ప్రత్యవాయప్రవర్తకాశుభసంస్కారజనకం, అసత్కర్మ-పాపమ్

{ 1. అభ్యుదయః-శ్వఃశ్రేయసకర్మజనిత శుభసంస్కారాత్మకం అభ్యుదయప్రవర్తకత్వా దభ్యుదయ నామకం కర్మ-పుణ్యం
{ 2. ప్రత్యవాయః-ఏనఃకర్మజనిత అశుభసంస్కారాత్మకం ప్రత్యవాయప్రవర్తకత్వా త్ప్రత్యవాయ నామకం కర్మ-పాపమ్.

{ 1. ప్రాయశ్చిత్తమ్-ప్రత్యవాయనిమిత్త కాశుభసంస్కార ప్రతిబంధకం-కర్మ పుణ్యం
{ 2. అఘమ్-అభ్యుదయనిమిత్త శుభసంస్కారప్రతిబంధకం కర్మ-పాపం

{ 1. సుకృతమ్-ప్రత్యవాయనిమిత్త కాశుభసంస్కారవిఘాతకమ్ కర్మ-పుణ్యమ్
{ 2. దుష్కృతమ్-అభ్యుదయనిమిత్తక శుభసంస్కారవిఘాతకమ్ కర్మ-పాపం

{ 1. కల్యాణం-సుకృతజనిత లోకవైభవలక్షణ కర్మ-పుణ్యం
{ 2. కిల్బిషం-దుష్కృతజనిత దారిద్ర్యాదిలక్షణ కర్మ-పాపమ్.

ఈయైదు జంటలును పారస్పరిక సమన్వయమువలన మూడుజంట లగును. ఎట్లన :-శ్వఃశ్రేయసనామక శాస్త్రసిద్ధ సత్కర్మలకు తజ్జని తాభ్యుదయ ప్రవర్తకములై యభ్యుదయ నామ మొందిన శుభోదర్క లక్షణ శుభసంస్కా రాత్మక కర్మలం దంతర్భావము. ఇట్లే ఏనోనామక శాస్త్రనిరు ద్ధాసత్క ర్మలకు తజ్జనిత ప్రత్యవాయ ప్రవర్తకములై ప్రత్యవాయ నామమొందిన అశుభోదర్కలక్ష ణాశుభసంస్కా రాత్మక కర్మలందే అంతర్భావము. ఈ యంతర్భావ రహస్య మేమన:-

శుభకర్మ-శుభసంస్కారములు రెండును శ్రేయోభావ ప్రవృత్తికారణము లగుటచే శ్వశ్శ్రేయసము లనవచ్చును. ఇట్లే :-అశుభకర్మ-అశుభసంస్కారములు రెండును ఏనోభావ ప్రవృత్తికారణము లగుటచే ఏనస్సులే యనవచ్చును. ఇక :- సంస్కారాత్మక కర్మలను అభ్యుదయ ప్రత్యవాయ శబ్దములచే 'తాచ్ఛబ్ద్య' న్యాయాధారముచే వ్యవహరించి యున్నాము వస్తుతః అవి కర్మలే కావు గదా! అవి శుభాశుభ సంస్కార ఫలములు. ఫలోత్పాదకత్వముచేతనే సంస్కారకర్మల కాపేరులు వెలసినవి. అభ్యుదయ ప్రత్యవాయశబ్దములు సంస్కారఫల వాచకములు. వీనికి వేరుగ బే రుండవలయుచో శ్వఃశ్రేయసేన శ్శబ్దములే ఎదుటికి వచ్చును. కర్మ-కర్మజనిత సంస్కారములు రెండును అభిన్నము లగుటయే ఈసమన్వయమునకు మూలము.

ఇట్లే కల్యాణకిల్బిషములకు సుకృతదుష్కృతములం దంతర్భావము. సుకృతఫలము కల్యాణము. దుష్కృతఫలము

కిల్బిషము. ఈ రెండు నొక తెగలోని జంటలు కనుక నీయంత ర్భావము తగును. ఇట్లు పాప-పుణ్యములకు మూడేజంటలు. ఇదే రెండవ షట్కార్మ వర్గీకరణము.

ఇందు పుణ్యములు మూడును ఉదయానుగాములు. క్రమముగ శుభసంస్కార ప్రవర్తకములు. ప్రత్యవాయనిమిత్త ప్రతిబంధములు. ప్రత్యవాయనిమిత్త విఘాతకములు. కనుక ఆత్మాభ్యుదయసాధకములు. అభ్యుదయ కర్మలు.

ఇక :- పాపములుమూడును, పతనోన్ముఖములు. క్రమముగ అశుభసంస్కారప్రవర్తకములు. అభ్యుదయనిమిత్త ప్రతిబంధకములు. అభ్యుదయనిమిత్తవిఘాతకములు. కనుక ఆత్మకు ప్రత్యవాయసాధకములు. ప్రత్యవాయకర్మలు. ఇందు పుణ్య (సత్) కర్మలుపాదేయములు. తక్కినవి త్యాజ్యములు.

### ఉదర్కనిబంధన షట్కర్మపరిలేఖ

1. శ్వఃశ్రేయసమ్-అభ్యుదయమూలక శుభసంస్కారప్రవర్తకం—సత్కర్మ
2. ఏనః-ప్రత్యవాయమూల కాశుభసంస్కారప్రవర్తకం—అసత్కర్మ
1. ప్రాయశ్చిత్తం-ప్రత్యవాయనిమిత్త ప్రతిబందకం—సుకర్మ
2. అఘం-అభ్యుదయనిమిత్త ప్రతిబంధకం—వికర్మ
1. సుకృతం-ప్రత్యవాయనిమిత్త విఘాతకం—కర్మ
2. దుష్కృతం—అభ్యుదయనిమిత్త విఘాతకం—అకర్మ.

ఇందు మూడు పాదేయములు. మూడు త్యాజ్యములు. 'షట్కార్మాణిదినేదినే' జ్ఞానసహాకృతకర్మయే గీతోక్త కర్మ యోగము. జ్ఞానము నాధారముగా గొనక యే కర్మయు నిష్ప

న్నమే కాదని గీతదృష్టి. కర్తృప్రవర్తకజ్ఞానము :-సద్జ్ఞానము, విరుద్ధజ్ఞానము, అజ్ఞానము అను మూడుభాగములు కనుక తత్తదాధారమున నగు కర్మలును, సత్కర్మ-వికర్మ-అకర్మ లను మూడు భేదము లగును. ఉన్నదున్న ట్లెరుంగుట సద్జ్ఞానము. విరుద్ధముగ నెరుంగుట విరుద్ధజ్ఞానము. ఏమియు నెరుంగ కుండుట అజ్ఞానము. జ్ఞానకర్మల యీరెండు వివర్తములందును సద్జ్ఞాన సత్కర్మలు దైవీసంపత్తులు. తక్కిన నాల్గును ఆసుర సంపత్తులు. విశ్వమందు దైవీసంపత్తుల కంటె ఆసురీసంపత్తు లధికము. (దేవతలు 33 గురు, అసురులు 99 గురు. జ్ఞానప్రధాన దేవతలు ప్రజాపతికి గనిష్ఠసంతానము. బలప్రధానాసురులు జ్యేష్ఠసంతానము) కనుకనే మనుజులందును దుఃఖవంతు లెక్కుడు. దుఃఖవిము క్త్యుపాయము సద్జ్ఞాన సత్కర్మ లక్షణ బుద్ధియోగానుష్ఠాన మొకటే.

శాస్త్రసిద్ధకర్మలకు మూల మా మహర్షుల సద్జ్ఞాన వ్యవస్థిత సత్కర్మ. సురాపాన బ్రహ్మహత్యా గమ్యాగమనాది శాస్త్రవిరుద్ధ కర్మ విరుద్ధజ్ఞానమూలక వికర్మ. శాస్త్రమందు విధాన నిషేధములులేని నిరర్థకకర్మ లజ్ఞానమూల కాకర్మలు. వీని వలన సాక్షాత్తుగ బాపపుణ్యములు లేవు. వికర్మలు ప్రత్యవాయ జనకములు, పాపములు. సత్కర్మ లభ్యుదయ జనకములు. పుణ్యోదర్కములు. తృణచ్ఛేద, వృథాహాస్య, వృథా భ్రమ ణాదులు నిరర్థక కర్మలు. ఇవే అకర్మలు. పుణ్యకర్మల (సత్కర్మల) కు నిమిత్తభూతము లగు శుభోదర్క (శుభసం

సార)ములకు ఆవరకములు. అవిద్యామూలకములు. ఈమూడు కర్మలను భగవంతు డిట్లు స్పష్టీకరించెను.

"కర్మణోహ్యాపిబోద్ధవ్యం బోద్ధవ్యంచవికర్మణః
అకర్మణశ్చబోద్ధవ్యం గహనాకర్మణోగతిః."

అభ్యుదయజనకము ప్రత్యవాయవినాశకము నగునది సత్కర్మ. అభ్యుదయవినాశకము ప్రత్యవాయజనకము నగునది వికర్మ. అభ్యుదయ నిమిత్త ప్రతిబంధక మగునది అకర్మ. ఈమూడును పై జెప్పినట్లు 6 భాగము లగును. లేదా మరొక దృష్టితో :-సత్కర్మలు మూడు, అసత్కర్మలు రెండు, అకర్మ యొకటి, మొత్త మారనవచ్చును.

(1) అభ్యుదయజనక శ్వఃశ్రేయసకర్మసత్కర్మ. సత్త నగా సత్తాభావము, ప్రతిష్ఠాతత్త్వము, సత్ కర్మవలన నీయాత్మయొక్క సత్తాభావము వికసిల్లును. కనుక వీనిని సత్కర్మలు (సత్తానుబంధికర్మలు) అన వచ్చును. (2) ప్రత్యవాయ విఘాతక మగు ప్రాయశ్చిత్తకర్మ సుకర్మ. దీనివలన అఘముచే జెడిన యాత్మశాంతి మరల బ్రతిష్ఠిత మగును. అది సుఖము కనుక దీనిని సుకర్మ (శాంతి-సుఖప్రదకర్మ) యనదగును. (3) ప్రత్యవాయనిమిత్త ప్రతిబంధక స్వస్త్యయనకర్మ (సుకృత కర్మ) కర్మ. ఇట్టి కర్మలచే నున్నతి-పతనములు లేవు. స్వరూప స్థితి మాత్రమే. కనుక వీనిం గేవల 'కర్మ' శబ్దముచే వ్యవహరింప వచ్చును. ఇట్లు సత్త-శాంతి-స్వరూపస్థితులంబట్టి సత్క-

ర్మలను సత్కర్మ-సుకర్మ-కర్మ లను మూడు విభాగము లను కొనవచ్చును.

ఇక :-1 ప్రత్యవాయ జనకములగు నేసఃకర్మలచే నాత్మ తనయొక్క స్వాభావికగతికి విరుద్ధముగ బోవును. 2 అభ్యుదయ విఘాతక మగు నఘకర్మయు ఆత్మవిరుద్ధ గమనమునకే నిమిత్త మగును. కనుక నీ రెంటిని వికర్మ లందుము. పోగా :-అభ్యుదయనిమిత్త ప్రతిబంధక కర్మలు నిరర్థకకర్మలు. వీని నకర్మలు (కర్మసంపత్తి వంచితకర్మలు) అనవచ్చును. ఇందు సత్కర్మ-సుకర్మ-కర్మలను 'రమణీయకర్మ' లనియు, దుష్కర్మ-వికర్మ-అకర్మలను 'కపూయకర్మ' లనియు వ్యవహరింతురు. సత్కర్మ త్రయి సకామ వృత్తిచే స్వర్గకారణము. నిష్కామవృత్తిచే ముక్తికారణము నగు. తక్కిన మూడు నే స్థితియందైన 'నరకాయైవ' ఇది యుదర్కనిబంధన షట్కర్మమీమాంస.

## స్వస్త్యయనకర్మలు

వెనుక పాపపుణ్య మీమాంసావసరమున 'స్వస్త్యయన కర్మ'లం గూర్చి కొంచెము చెప్పితిమి. మనము నేడు ఇతరములగు శాస్త్రీయకర్మలవలె అభ్యుదయ ముఖ్యకారణములగు వీనిం గూడ విడిచితిమి. ఏమి చేయవలయును? శాంతి యెట్లు లభించును? ఇత్యాదులకు సమాధానములు చాలవరకు నీకర్మలకు జెందినవే. యోగ్యత లేమిచేతను, దేశకాల దోషములచేతను ఇతరములగు శాస్త్రీయకర్మల ననుగమింప జాలము. ప్రస్తుత

సాధ్యములకు ఆవరకములు. అవి వ్యాపారాలకములు. ఈమూడు కర్మలను భగవంతు డిట్లు స్పష్టీకరించెను.

"కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచవికర్మణః
అకర్మణశ్చబోద్ధవ్యం గహనాకర్మణోగతిః."

అభ్యుదయజనకము ప్రత్యవాయవినాశకము నగునది సత్కర్మ. అభ్యుదయవినాశకము ప్రత్యవాయజనకము నగునది వికర్మ. అభ్యుదయ నిమిత్త ప్రతిబంధక మగునది అకర్మ. ఈమూడును పై జెప్పినట్లు 6 భాగము లగును. లేదా మరొక దృష్టితో :- సత్కర్మలు మూడు, అసత్కర్మలు రెండు, అకర్మ యొకటి, మొత్త మారనవచ్చును.

(1) అభ్యుదయజనక శ్వఃశ్రేయసకర్మసత్కర్మ. సత్త నగా సత్తాభావము, ప్రతిష్ఠాతత్త్వము, సత్ కర్మవలన నీయాత్మయొక్క సత్తాభావము వికసిల్లును. కనుక వీనిని సత్కర్మలు (సత్తానుబంధికర్మలు) అన వచ్చును. (2) ప్రత్యవాయ విఘాతక మగు ప్రాయశ్చిత్తకర్మ సుకర్మ. దీనివలన అఘముచే జెడిన యాత్మశాంతి మరల ప్రతిష్ఠిత మగును. అది సుఖము కనుక దీనిని సుకర్మ (శాంతి-సుఖప్రదకర్మ) యనదగును. (3) ప్రత్యవాయనిమిత్త ప్రతిబంధక స్వస్త్యయనకర్మ (సుకృత కర్మ) కర్మ. ఇట్టి కర్మలచే నున్నతి-పతనములు లేవు. స్వరూప స్థితి మాత్రమే. కనుక వీనిం గేవల 'కర్మ' శబ్దముచే వ్యవహరింప వచ్చును. ఇట్లు సత్త-శాంతి-స్వరూపస్థితులంబట్టి సత్క

ర్మలను సత్కర్మ-సుకర్మ-కర్మ లను మూడు విభాగము లను కొనవచ్చును.

ఇక :-1 ప్రత్యవాయ జనకములగు నేనఃకర్మలచే నాత్మ తనయొక్క స్వాభావికగతికి విరుద్ధముగ బోవును. 2 అభ్యుదయ విఘాతక మగు నఘకర్మయు ఆత్మవిరుద్ధ గమనమునకే నిమిత్త మగును. కనుక నీ రెంటిని వికర్మ లందుము. పోగా:-అభ్యు దయనిమిత్త ప్రతిబంధక కర్మలు నిరర్థకకర్మలు. వీని నకర్మలు (కర్మసంపత్తి వంచితకర్మలు) అనవచ్చును. ఇంక సత్కర్మ-సుకర్మ-కర్మలను 'రమణీయకర్మ' లనియు, దుష్కర్మ-వికర్మ-అకర్మలను 'కపూయకర్మ' లనియు వ్యవహరింతురు. సత్కర్మ త్రయి సకామ వృత్తిచే స్వర్గకారణము. నిష్కామవృత్తిచే ముక్తికారణము నగు. తక్కిన మూడు నే స్థితియందైన 'నర కాయైవ' ఇది యుదర్కనిబంధన షట్కర్మమీమాంస.

## స్వ స్త్య య న క ర్మ లు

వెనుక పాపపుణ్య మీమాంసావసరమున 'స్వస్త్యయన కర్మ'లం గూర్చి కొంచెము చెప్పితిమి. మనమునేడు ఇతరములగు శాస్త్రీయకర్మలవలె అభ్యుదయ ముఖ్యకారణములగు వీనిం గూడ విడిచితిమి. ఏమి చేయవలయును? శాంతి యెట్లు లభిం చును? ఇత్యాదులకు సమాధానములు చాలవరకు నీకర్మలకు జెందినవే. యోగ్యత లేమిచేతను, దేశకాల దోషములచేతను ఇతరములగు శాస్త్రీయకర్మల ననుగమింప జాలము. ప్రస్తుత

స్థితిగతులంబట్టి అందుకు దగినంత తీరికయు లేదు. యోగ్యత లును లేవు. ఇక గత్యాంతరోపాయమేమి ? అన్నచో సమాధాన మీ ప్రకరణము.

మన శారీరక, మానసిక, బౌద్ధ పరిస్థితులను శాంతి స్వస్తి భావములం దుంచుకో వలయుచో రాత్రింబవళ్లు కొన్ని విశేష నియమముల ననుగమింప వలయును. అవియే 'స్వస్త్యయన ములు.' వీనివలన నాత్మస్వరూపస్థితికి బతనము లేక అది శాంతి సుఖసమృద్ధముగ నుండును. ఉదయాదిగ మరల నుదయపర్యం తము గావించు భోజన శయ నోపార్జ నాదులం దెట్లు ప్రవర్తిం పవలయును ? ఎవరితో నెట్లు వ్యవహరింపవలయును ? అను ప్రశ్నలకు సమాధానము లీ ప్రకరణము నందు విచార్యములు. స్థాలీపులాక న్యాయమున గొన్నింటిని మాత్రమే యిట జూపె దము. వివరములు పెద్దలవలనను ధర్మశాస్త్రముల వలనను ఎరుంగ నగును.

(1) ఉత్థానము :-బ్రాహ్మముహూర్తమందు మేల్కొన వలయును,

"రాత్రేశ్చపశ్చిమేయామే ముహూర్తోయ స్తృతీయకః
సబ్రాహ్మ ఇతివిఖ్యాతో విహితః సంప్రబోధనే". (నిర్ణయామృత)

ఇది శారీరక స్వాస్థ్యదృష్టితో గూడ నుపకారమే. "బ్రాహ్మేముహూర్త ఉత్తిష్ఠేత్ స్వస్థో రక్షార్థ మాయుషః" మరియు అపుడు ప్రాతస్సవనీయదేవతలు దివ్యశక్తులను మన కిచ్చెదరు. సవిత, అశ్వినులు, బ్రహ్మాదులు 'ప్రాతర్యావాణ'

దేవతలు. తమప్రేరణ చక్షుర్బలము, జ్ఞానబలము, మనశ్శక్తియునై, త్రైలోక్యమందును రశ్మిప్రసారము గావింతురు. ఈ ప్రాకృతిక శక్తిగ్రాహక పాత్ర బుద్ధియుక్తమనస్సే. కనుక నపుడు నిద్రించుట, పాత్రను బోరగించినట్లే. దివ్యదానవిభూతివంచితుల మగుదుము. కనుక నపుడు శయ్యాపరిత్యాగ ముచితము. పిమ్మట గావింపబోవు కర్మలందెల్ల నిది పరమప్రధానము. ఇది లేని నిద్రాప్రియులు, దివ్యశక్తివంచితు లగుట యటుంచ స్వాస్థ్యము నకుగూడ దిలాంజలులు విడచి స్వార్థసాధక లౌకికకర్మలందు గూడనపూర్ణులే యగుదురు.

ఫలన :-పూర్ణతాప్రవర్తక మగు ప్రేరణాత్మక సవితృబల వంచితులగు నీ శయానులు, భాగ్యశాలురు, తమ యంతర్జగత్తున కరుదెంచిన చిరచిర అసత్కర్మప్రవృత్తి-అకర్మణ్యత-ఆలస్యము దీర్ఘసూత్రత తంద్రా అనునీ మొదలగు ననేకాతిథులను సత్కరింపనే బ్రొద్దుపుచ్చెదరుగదా! నేటిపెద్దలు, సంపన్న నవయువకులు. "కవిః శయానోభవతి" యనుట పూర్తిగ జరితార్థము గావించు చుండుట శోచనీయ విషయము. కనీస మీయొకవిషయ (నియమ) మునైన బాటించినచో నాసురభావము తొలగి స్వాస్థ్య ఉత్సాహ-ధైర్య-కర్మపరాయణతా-కాంత్యాది దివ్యశక్తులు మరల జాగృతి నొందగల వని విన్నవింతుము.

(2) ఇష్టదేవతాస్మరణము :-నిద్రనుండి మేల్కొనగనే కావలసిన రెండవ స్వాస్థ్యయనకర్మ యిది. సమాజ-లోక-రాజ

స్థితి పరిజ్ఞానము కావలయును, సామయికము, ఇందుకు సాధక ములు సామయిక సమాచారపత్రములు. (News Papers) ఈవ్యసనపరిత్యాగచేష్ట వ్యర్థము. కాని పవిత్ర బ్రహ్మముహూర్త మందు మేల్కొనగనే ఆత్మశక్తిలాభార్థ మిష్టదేవతాస్మరణ సేయవలయు నని మనవి. ఎవరియందు వారైన కరుణజూపి కొని దైనికచర్యయందు యీమాత్రపు సంస్మరణము గావించు కొనుట యావశ్యకము.

ఖండప్రళయోపలక్షితము తమోబహుళము నగు రాత్రి యను వారుణపాశవిముక్తి నొంది సృష్టికాలోపలక్షిత బ్రాహ్మ పుణ్యాహ మందు నవీనజీవనధారం బ్రవహింపజేయ మనల నను గ్రహించిన వానిని ఎవని ప్రాకృతికసామ్రాజ్యమునం దుండి మనము మన కర్తకలాపము నెరవేర్చుకొనవలసియున్నదో ఎవడు మన యింద్రియ మనోబుద్ధిశరీ రాత్మాదు లగు నాధ్యాత్మిక పర్వములకు బలప్రదానము గావించుచున్నాడో ఏబలా ధారమున మనము జ్ఞానకర్త (జానామి, పశ్యామి, గచ్ఛామి, పఠామి) ల యొక్క శుభోదర్కముల కర్తల మగుచున్నామో అట్టి సర్వజ్ఞాన-కర్మార్థ బలఘనుని జగదీశ్వరుని స్మరించినచో నా ఘనబలము నుండి మనకు రాదగిన బలాంశము లభించును. దినమంతయు సుఖశాంతి పూర్వకముగ గడచును. చిత్తము ప్రసన్న మగును. అది బుద్ధిప్రసాదకారణము. ప్రసన్నబుద్ధి ఆత్మలక్షణ పారలౌకిక సుఖమునకును, లోకలక్షణ భౌతికసుఖ మునకును హేతువగును. కనుక : ఇష్టదేవతాస్మరణ మవశ్య

కర్తవ్యము. శాస్త్రకారులు దీనికి ముందనిష్ట స్మరణముగూడ కర్తవ్య మనిరి. సంసారయాత్రయందు మనసు మరణవ్యాధి శోకాది లౌకిక భయముల నెదుర్కొన వలయును. అర్థోపార్జనయు జేయవలయును. పారలౌకికశాంతికొరకు ధర్మాకర్మలను గూడ యథాశక్తిగ ననుగమింపవలయును. కనుక నైహికాముష్మిక కర్మలంగూర్చియు, కానున్న విఘ్నములను (సాధక బాధకములం) గూర్చియు, ప్రాతఃకాలమందె యోచింపవలయును. జరుగనున్న దినచర్యానూచిక ఇపుడే నిర్ణయించుకోవలయును. ఈ వ్యాసవచనము లిట నవధేయములు.

1. బ్రాహ్మేముహూర్తే ఉత్థాయ ధర్మమర్థంచచింతయేత్
కాయక్లేశేతదుద్భూతే ధ్యాయీతమనసేశ్వరమ్.

(కూర్మపురాణము)

2. బ్రాహ్మేముహూర్తేస్వస్థేచ మానసేమతిమాన్నరః
విబుద్ధఃచింతయేద్ధర్మ మర్థంచాస్యావిరోధినమ్
అపీడయాతయోఃకామ ముభయోరపిచింతయేత్.

(విష్ణుపురాణము)

ఇవిగాక దుఃస్వప్నములేమేని వచ్చినచో కొన్నివిశేష ప్రయోగములంగూడ నపుడే యాచరింపవలయును.

అహా! ఆస్తికులయొక్క మంగళభావనలు! స్మరించినమాత్రనే యెంతయానందము! ఎట్టిదివ్యభావనలు! వారి యీశ్వరపరాయణత యెట్టి యలౌకికము! ఇట్టివానినెల్ల నుపహాసించి ధన్యులము కృతకృత్యులము నగుచున్నా మనుకొను

చున్నాము ! కానిండు, (సౌరసంవత్సరరూప ప్రజాపతి) ఈశ్వ రుడు, మనకు బరోక్షముగ నున్న తండ్రిని ధ్యానించి, ప్రత్యక్ష ముగ దనయొడిలో బెట్టుకొని మనల నన్నివిధముల బెంచు తల్లి (భూదేవిపై) నడుగిడ నున్నాము. ఆతల్లిని స్మరించు టావశ్యకము గదా !

"సముద్రవసనే దేవి ! పర్వత స్తనమండలే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే"

శౌచకర్మ :—పిమ్మటిది ( మూత్రపురీషోత్సర్జనకర్మ ). ఇందును గొన్ని విశేషనియముల ననుగమింప వలయును.

(1) "ఉభేమూత్రపురీషేతు దివాకుర్యా దుదఙ్ముఖః
రాత్రౌకుర్యాద్దక్షిణాస్య ఏవంహ్యాయు ర్నహీయతే"

ఆయుఃస్వరూపసంపాదక సౌరప్రాణవ్యాప్తి పగ లుత్తర భాగమునకును, రాత్రి దక్షిణమునకును వెలిగ నుండును. గనుక (గ్రామ్యజీవనమునందే వీలువడు) నీ నియమము అనుగమింప దగినది.

(2) "పరివేష్టితశిరా మూత్రపురీషేకుర్యాత్" (మహాన ఉత్సృజేత్) కేశాంతస్థాన మాయురక్ష కేంద్రప్రాణావాసభూమి. మల పరిత్యాగమునందు బ్రహ్మ గ్రంధిస్థమగు నపానప్రాణ వ్యాపారమునకు బ్రధానత, అదివారుణము, మృత్యుసమ కక్షము. వరుణేంద్రుల కశ్వమాహిమ్యము గదా! ఈవరుణప్రాణ మా యింద్రప్రాణము నాక్రమింపకుండ శిరోవేష్టనవిధి వెలసి నది. దీనిం బాలించుచో నర్థాంగవా తాద్యాశంక యుండదు.

చేతనాశైథిల్య మర్ధాంగవాతము గదా! ఇంద్రుడే చేతనాలక్షణాయుఃస్వరూపమును రక్షించు దివ్యప్రాణము. దీని సహాన మాక్రమించుచో నిది శిథిలమగును. కనుక నీ నియమపాలన మావశ్యకము. ఇక మౌనము:- ఇంద్రప్రాణము వాగధిష్ఠాత. వాఙ్మయము. మాట్లాడుచున్నచో నిది చెదరిపోవును. కనుక మౌన మావశ్యకము.

(3) 'పవిత్రం దక్షిణేకర్ణే కృత్వా విణ్మూత్ర ముత్సృజేత్' దీనింగూర్చి యుపనయనసంస్కార ప్రకరణ మందు చెప్పబడినది. ఇంక నీకర్మయందుగల తక్కిన నియమములు శాస్త్రములం దరసి యనువర్తింపవలయును.

దంతధావనము:- తరువాతిది. ఇందలి విధులనెల్ల ధర్మశాస్త్రములనుబట్టి చూచుకొని యాచరింపవలయును. ఆరంభమం దీమంత్ర మవధేయము.

"ఆయుర్బలంయశోవర్చః ప్రజాఃపశువసూనిచ
బ్రహ్మప్రజ్ఞాంచమేధాంచ త్వన్నో ధేహివనస్పతే"

స్నానము:- పిమ్మటిది. ఇందు 6 విధములు. "నిత్యం నైమిత్తికం కామ్యం క్రియాంగం మలకర్షణం క్రియాస్నానం తథా షష్ఠం షోఢాస్నానం ప్రకీర్తితమ్" ఇందు నిత్యస్నానమే స్వాధ్యాయనకర్మలందలిది. ఇది మంత్ర-భూమి-అగ్ని-వాయు-దివ్య-జల మనో భేదములచే నేడువిధములు. ఆయా స్నానవివరణములు, విధులు శాస్త్రములం దరయనగును. స్నాన మన్నదొక్కయావ

శ్యకమగు ధార్మికకర్మమే గాని బాహ్యామల విశోధన లక్ష్య మాత్రము కాదు. కనుకనే యిది నిత్యకర్మలందు జేరినది. రోగార్తాదులకు తక్కినస్నానములు విధింపబడినవి. ఇంకను ఈకర్మకు జెందిన సామాన్య విశేషవిధులు శాస్త్రములం దరసి యనుష్ఠింపవలయును.

వస్త్రధారణ మాపిమ్మటిది :-బ్రహ్మ-క్షత్ర-విట్-శూద్ర భావ రక్షకములు. సత్త్వ-సత్త్వరజ-రజస్తమ-తమో సూచక ములు. వరుసగ శ్వేత రక్త పీత నీల వస్త్రములు. శాస్త్రము లందు విధించిన ప్రకారము ధరింపవలయును.

సంధ్యాదినిత్యకర్మ:-తరువాతిది. అనగా:- సంధ్యా-తర్పణ-బలి-వైశ్వదేవ పంచమహాయజ్ఞాదులు. సంధ్య యెందుకన్న సమాధానము ప్రత్యేకగ్రంథముగా నుండదగినది. ప్రస్తుతమిట:- "గాయత్రీతత్త్వము ద్విజాతిమూలప్రతిష్ఠ. అయ్యది సవితృదేవత ద్వారా సంధ్యాకాలోపలక్షిత పృథివీద్యులోక వివహన కాల మందు అతిశయముగ భూతలమునకు వచ్చును. దాని నాత్మీ యము గావించుకొను మంత్రయుక్త వైజ్ఞానికప్రక్రియయే సంధ్యాకర్మ. గోపథాదులం దియ్యది మాధ్గల్యవిద్య యని పేర్కొండినది" అని మాత్రమే చెప్పెదము. నిత్యకర్మ యగుటచే నియ్యది పోషకము కా దందురు. అయినను అతిశయోపకారక మగుటచే మన్వాదులు కామ్యకర్మలట్లు పోషకముగనె దీని నెంచిరి.

"ఋషయోదీర్ఘసంధ్యాత్వా ద్దీర్ఘ మాయు రవాప్నుయుః
ప్రజ్ఞాంయశశ్చ కీర్తించ బ్రహ్మవర్చసమేవచ" (మనువు)

భోజనకర్మ :-ప్రజాపతి తనప్రజలకు పితృ, దేవా, సుర, పశు, మనుష్యులకు భోజనవ్యవస్థ నేర్పరచుచు మనుజులకు సాయం ప్రాతఃకాలము లందు రెండుమారులు భోజనముసేయు డని యాదేశించెను. కనుక 'హితాశీ మితాశీ స్యాత్' అను విధిం బాటింపవలయును. పశువులు నసురులు వలె నేదిలభిం చిన దానినే నమలుచుండక భోజ్యపదార్థములందును, పద్ధతు లందును సావధానతమై వర్తింపవలయును. భోజనకర్మయన్నది మన స్థూల సూక్ష్మ కారణ శరీరములకు బ్రతిష్ఠగ నున్నది. ధర్మశాస్త్ర నిబంధన షట్కర్మలం దీవిషయము విస్తరింప బడును.

అర్థోపార్జనకర్మ :—"భుక్త్వాశతపదంగచ్ఛేత్" అన్నట్లు భుజించిన పిదప యించుక యిటునటు నడచి విశ్రమించి పరి వార భరణపోషణార్థము నియతకాల మర్థచింతాప్రవృత్తుడు గావలయు. కాని ఈవిషయమున నొక విశేషధ్యానదృష్టి యావశ్యకము. ఏమన :-కాలమంతయు నర్థార్జనయందే గడు వదు. (2) మిథ్యాభాషణమువలననే యీకర్మసాగదు. (3) వర్ణ స్వరూపముం దుడిచివేయు నకర్మ వికర్మ లక్షణ నింద్యకర్మలనే చేయవలసి యుండదు. (4) మన స్వాభావిక దివ్యశక్తులను నిరో ధించు మలినార్థములనే కోరబనిలేదు. ఇట్టి విశేషనియమము లను పాటింపవలయును. ఇందుకు భూతప్రపంచమునకు జెందిన

నావశ్యకతలను కుంచించుకొనుట మేలు. ప్రవృద్ధకాంక్షలే అర్థలాలసత్వమునకు దల్లులు. ఆయర్థలాలసత్వము చేయరాని పనులం జేయించి యిహ పర దూరుల గావించును.

అర్థ మవశ్యముగ జీవనకారణమే అయినను అర్థమే జీవన పరమపురుషార్థముగాదు. ధర్మ-కామ-మోక్షములుగూడ జీవనమున కవశ్య కర్తవ్యములే యనుకొని ధర్మమూలములుగ గాని ననుగమింపవలయును. అటుగానిచో నివియెల్ల నిహాప రాశాంతులకే హేతువులగును. ధర్మమూలములై నియత మర్యాదితములై నపుడే యివి శాంతిహేతువు లగును.

ఈ స్వస్వయనకర్మలం గూర్చి కొందరు మహాను భావులు "ఏమిసేయుదు ముదరపూరణకే సమయము చాల కున్నది. అర్థోపార్జనయందే కాలమంతయు గడపుచున్నను పనిజరుగుటలేదు." అందురు. ఆ మహారథులకు మా సమాధా నము:-వారు ధర్మమును, ఆపేరుతో తమ్మును ఈశ్వరుని మోస గింప జూచుచున్నారు. వారికి గేవలము కావలసినవి యోగ క్షేమములు కావు. సాటివారిలో కోటీశ్వరు లగుటయే వారి కోరిక. అంకుచే పాపము! వారు 'ధనసంచయకర్త్రాణి భాగ్యాని పృథగేవహి' అను వాక్యార్థము నెరుంగలేకున్నారు. ధర్మపూర్వకముగ జీవనయాత్రను సాగించుకొనుచు నియమిత యోగక్షేమపూర్త్యై నియమితరూప సువ్యవస్థల ద్వారా అర్థోపార్జన సేయువారికి నాల్గుపురుషార్థములు సిద్ధించును. తప్పక సిద్ధించును.

నే యర్థసమస్యలుగల రాజనైతిక కారణము లుపేక్షింప జాలము. మన మీక్షేత్రమందితరుల కృపాఫల (కుఫల) మను భవించుచున్నాము. అర్థోపార్జన పద్ధతులంతగా జెరిచివైచితి మన్నను సత్యదూరముకాదు. దీనికిని నియతకర్త లేదు. నియత కాలము లేదు. నేటి చదువులశాలలం జూడుడు. సౌభాగ్యమో, దౌర్భాగ్యమో అనుడు. ఏడాది కంతకును 4, 5 మాసములు చదువు. అందును నియమిత స్వాధ్యాయముకాదు. ఆటపాట లకే సమయమధికము. ఎన్నో పరీక్ష యొకటి రెండు మాసము లున్న దనగనే అందలి మేధావులు జాతరవలె పిష్టపేషణ మాచ రించి తృతీయాంశయోగ్యత సంపాదించి ధన్యు లయ్యెదరు. తల్లిదండ్రులు సత్యనారాయణవ్రత మాచరించి ప్రసాదము పంచిపెట్టెదరు. మిత్రులకు విందు లాచరించెదరు. మన యీపీర పరిశ్రామికు లారోగ్యము బోగొట్టుకొందురు. విద్యాదృఢ సంస్కార మెగిరిపోగా గొన్నదానిలో మిగిలిన దొక నిరర్థక దురభిమానము మాత్రమే. ఈ విడంబన మంతయునేల? నియత స్వాధ్యాయమువలన నన్నియు బాగుండును గదా!

ఇక అర్థక్షేత్రమందు నిజదశ చూడుడు: 'మే మర్థ మార్జింతుము' అనుటలో 'మే' మన నేమి? దార్శనికులు: "ఆత్మ-బుద్ధి-మనః-శరీరములను నాల్గింటి సమష్టి యందురు. ఇం దొక్కొక్కటియు మే మే. అన్ని మేములు కలసిన మహా మేమే మేము. ఈ మేము బాగుండ వలయుచో నిందలి యన్ని మేములును, సువ్యవస్థితములు, సురక్షితములు, సుపుష్టములు,

సువికాసములుగ నుంచవలయును. ఇం దొకటి చెడినను, 'మేము' సుఖముండము. అయినచో యీ యన్నిటికిని ఏవేవి సుఖసాధనములు ? వానిని సంపాదించు టెట్లు ?

1. మొదటి సుఖము స్వస్థశరీరము. 'శరీర మాద్యం ఖలుధర్మసాధనమ్' గదా ! ఈ శారీర సుఖప్రాప్తి సాధనములు, నియత సమయ, హిత, మిత, పౌష్టికాహారము, వ్యాయామము, పరిభ్రమణము, మొదలగునవి. వీని కన్నిటికి నర్థ ముండవలయును. లేనిచో నివి యసంభవములే, కనుక యీ దృష్టితో అర్థమును శరీరపర్వ ముఖ్యపురుషార్థ మనవచ్చును. అందుకే గదా మన మర్థోపార్జన సేయుచున్నాము.

2. రెండవసుఖము స్వస్థమనస్సు : "మనసిచ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః" కదా ! మనస్సు సర్వేంద్రియము. ఇంద్రియాధ్యక్షము. ఇక శోక, మోహాది వియుక్తి శ్రద్ధా వాత్సల్య కామ రతి భావములను సమయానుకూలముగ ననుగమించుట కోరిన కోరిక లప్పటప్పటి కీడేరుచుండుట యివే మనస్సుఖములు. ఇందుకు ప్రధాన సాధనము కామము, ఇచ్ఛా విజయ ప్రాప్తియే మనోరాజ్య శాంతి కుపాయము. "స శాంతి మాప్నోతి నకామకామీ" అని గీతయు చెప్పినది. యథా సమయ కామపూర్తియే కామమును వశపరచుకొనుటకు యుక్తి సాధకము. కామ విజయముచే నుత్థాప్యాకాంక్ష యుత్థితాకాంక్షగ మారి, నిష్కామ భావమూలక తృప్తికి గారణ

మగును. ప్రజ్ఞాప్రతిష్ఠ గల యిట్టి వ్యక్తియొక్క మనస్సునుండి శ్రద్ధా వాత్సల్యాది గుణములు స్వభావ వికసితము లగును. అల్పసిద్ధి హానులందును పూర్ణసిద్ధులందును సంతుష్టుడుగనే యుండును. సంగీతమునుగూడ మనఃశాంతికి ప్రధాన సాధనముగ నారదాదు లంగీకరించిరి. ఏలయన శ్రుతి నాద స్వర భావయుక్త సంగీత లహరి అప్సరస ప్రాణయుక్త గంధర్వ ప్రాణయుత మనస్సుయొక్క స్థిరతకు గారణ మగునట! మనఃపర్వ సంరక్షక మగు నీ రెండవది కామపురుషార్థము.

3. మూడవసుఖము బుద్ధిస్వస్థత. విపత్తులందు ధైర్యము. సదసద్వివేకము "ఇద మిత్థమేవ నాన్యథా" అను నిశ్చయాత్మక నిర్ణయముం జేరుట. దివ్యభావానుగతిచే స్వస్వరూప వికసితుడై ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్య లక్షణ భగ సంపత్తుల సుశాంత, నిరుపద్రవ, వాతావరణమునందు చరించుట, ఇవి బుద్ధికి జెందిన సుఖములు. ఇందుకు సాధకములు శాస్త్రోక్త ధర్మ కర్మ నియమ పాలన, దేవ ద్విజ గురూపాసనల సేయుట, తత్త్వ విమర్శక గ్రంథపఠన శ్రవణ మనన నిదిధ్యాసనము, చివరకు బుద్ధియోగ మార్గము ననన్య నిష్ఠనెయి ననుసరించుట. ఇదే ధర్మ పురుషార్థము. ఇది కామార్థ సాఫల్యకారణము కూడను. మోక్ష పురుషార్థముకూడ దీనికే బల మిచ్చును.

(4) నాలవసుఖము ఆత్మదేవతను గుర్తించుట, అనుమానించుట. మనో బుద్ధీంద్రియము లీవిషయమున నేమియు

జేయజాలవు. సర్వాతీతము సర్వానుస్యూతము నగు నీమూర్తి దేవత ప్రధానసుఖము, శాంతిలక్షణానందము. ఇం దుచ్చ్వాసచ భావములకు తావేలేదు. తత్స్వరూపముగ "ఉదాసీనవదాసీనమ్ అసక్తం త్త్రేషుకర్మసు" అని చెప్పబడును. అందు శోక వ్యంజక హాహాకారములును లేవు. హర్షవ్యంజక ఆహాకారము లును లేవు. పూర్ణసమత్వలక్షణ మగునీ సమత్వలక్షణాత్మ సుఖ ముఖ్యసాధనము మూర్ఖత. "పాండిత్యంనిర్విద్య బాల్యేనతిష్ఠాసేత్" పాండిత్యగర్వమును విడచి బాలు నట్లుండుట. శ్రద్ధా విశ్వాస పూర్వకముగ నంధుడై తన మనోబుద్ధ్యాదులు సర్వము దానియం దర్పించివేయవలయును. అపుడే నిఃశ్రేయ సల లక్షణ అద్వయభావాపన్న మోక్షనామ కానందోపలబ్ధి. ఇదే చివరిపురుషార్థము. ఇట్లు నాలు గధ్యాత్మసంస్థలకును నాల్గుపురుషార్థములను గూర్చుకొని కృతకృత్యత నొందుట కావలసినది.

క్లుప్తముగ నీ పైవిషయములను "(1) శరీరమునకు సర్వోత్తమ వినోదము వ్యాయామము. దీని సాధనఫల మర్థము. (2) మనోవినోదము సంగీతము. దీని సాధనఫలము కామము. (3) బుద్ధికి వినోదము శాస్త్రపరిశీలన. తత్ఫలము ధర్మము. (4) ఆత్మవినోదము మూర్ఖత. తత్సాధనము బుద్ధియోగము ఫలము మోక్షము." అనుకొనవచ్చును. గీతానాయకుడు, ఈ నాల్గింటి నభినయించిన విధము గమనింపదగినది. (1) బాల లీల శరీరవినోద సూచకము. (2) వంశీవాదనము మనోవినోద

పరిచాయకము. (3) గీతోపదేశము బుద్ధివినోద ప్రదర్శనము. (4) శ్రద్ధావిశ్వాసములతో సాందీపని యొద్ద విద్యాధ్యయనము గావించుట ఆత్మవినోద పరిచాయకము. మన మన నేమి? మన కేమివలయును? అందుకు సాధనము లేమి? అనువాని కీధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థ వర్గీకరణమే భారతీయ వైజ్ఞానికుల సమాధానము.

## పురుషార్థచతుష్టయ పరిలేఖ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఆత్మ | శాంతి | ఆత్మసమర్పణమ్ | శ్రద్ధాశ్రయము | మోక్షము |
| 2. | బుద్ధి | వికాసము | బుద్ధియోగానుష్ఠానమ్ | తత్త్వదర్శనమ్ | ధర్మము |
| 3. | మనస్సు | తృప్తి | కామానుగతి | సంగీతము | కామము |
| 4. | శరీరమ్ | స్వాస్థ్యమ్ | అర్థానుగతి | వ్యాయామము | అర్థము |

ఈనాల్గుపురుషార్థముల నాధారముగా గొనియే భరత వర్షమునందు నాల్గుశాస్త్రములు వెలసినవి అవి:-అర్థశాస్త్రము, కామశాస్త్రము, ధర్మశాస్త్రము, మోక్షశాస్త్రము అనునవి. ఇయ్యవి పరస్పరోపకారకములు కనుకనే ఒక్కొక్కటియు తన ప్రధానవిషయముతో తక్కిన మూడు శాస్త్రవిషయము లనుగూడ గౌణముగ జెప్పుచుండును.

మోక్షశాస్త్ర మాత్మను ప్రధాన లక్ష్యముగ గొన్నను, "బుద్ధి మన శ్శరీర పర్వముల స్వరూపములు చెడిన ముక్తియే శాంతికారణ"మను ప్రమాదమునకు లోబడలేదు. క్షీణోదర్క లేక భూమోదర్క పరాముక్తి (క్రమ ముక్తి) యందొకనాడు బుద్ధ్యాది పరిగ్రహములను ఆత్మ విడువవలసి యుండుగాక.

ముక్తిశ్రద్ధాగ మాదశయందే చరితార్థమగుగాక. అయి నను శరీరేంద్రియ మనో బుద్ధ్యాది ప్రపంచ మున్నంత వరకు నాత్మ పరిగ్రహ శూన్య లక్షణ పరాముక్తి కనుగావి గాజాలదు. కాయక్లేశ పూర్వకముగ నొకవేళ శరీరముం గష్ట పెట్టి మనసుం జంపి బుద్ధిని నిశ్చేష్టము గావించి సంసారమును విడచి లోకసంగ్రహ విఘాత మాచరించి సన్యాసమార్గ మను పేర ముక్తి పథముం బట్టితి మనుకొన్నచో నది సన్యాసమును గాదు, ముక్తియుగాదు. ఇక జీవిత దశయందే తక్కిన మూడు సంస్థలను రక్షించుకొను ధ్యానముంచి, లోక సంగ్రహ దృష్టితో నిష్కామ భావముతో యావజ్జీవము విహితకర్మ ప్రవృత్తిమై నుండి, యుదాసీనవదాసీనుడుగ నుండుటయే 'ఇహచేదవేది' త్తను విదేహ ముక్తి. అందుకు సఫలోదాహరణము "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"

ధర్మశాస్త్ర ప్రధాన లక్ష్యము బుద్ధియైనను, తద్వికాసముతో నాత్మ మన శ్శరీరములపై గూడ నది దృష్టియుంచును. ఇహమునకేగాక పరమునకుగూడ నుపయోగించు కర్మలనే యది విధించును. "యతోఽభ్యుదయ నిఃశ్రేయసిద్ధిః స ధర్మః" ధర్మమన కేవలము పరలోక సుఖస్వప్న ప్రలోభనము కాదు. మనము, మనపరివారము, బంధువర్గము, సమాజము, దేశము, రాష్ట్రము మొదలగు నైహలౌకిక సంపత్తు లన్నియు సమృద్ధములు గావలయును. అర్థ కామ బలములు సురక్షితములుగ నుండవలయును. పిమ్మట పారలౌకిక దివ్యభావముల వంక కగ్రే

సరులము గావలయును. ఇదే మన ధర్మమునకు ధర్మప్రతిపాదక శాస్త్రమునకు మూలమంత్రము. ఇది నేడు పూర్తిగా మరపున బడినది. సర్వాశూన్యాశ లభించినది.

ఇక :-కామశాస్త్రోద్దేశ్యము కామమయజగత్తు. అయి నను ఇదియు ఆత్మబుద్ధి శరీరముల రక్షణకు ప్రయాసపడ కుండదు. కామాదేశములందు పడేపడే ధర్మనియంత్రణము తప్పదు. ఈ క్రింది **కామ**సూత్రముల నవలోకింపుడు. కామ మొకటియే శతాయుఃపురుషుని ప్రధానపురుషార్థము కాదు. ఆశ్రమానుసార మాయుర్విభజన గావించి, ధర్మార్థమోక్షము లనుగూడ సంగ్రహింపవలయును గదా! చూడుడు :-

1. శతాయుర్వై పురుషో విభజ్య కాల మన్యోన్యానుబద్ధం, పరస్పరానుపఘాతకం త్రివర్గం సేవేత,
2. బాల్యేవిద్యాగ్రహణాదీ నర్థాన్,
3. కామంచ యౌవనే,
4. స్థావిరేధర్మం-మోక్షంచ,
5. అనిత్యత్వాదాయుషో యథోపపాదం వా సేవేత. (వా. కా. సూ)

కామశాస్త్రము ప్రత్యక్షముగ కామవిషయికమువలె దోచినను ఒక విధముగ నది ధర్మశాస్త్రమే. పశుస్వభావ త్రోదీయమానోచ్ఛృంఖల కామప్రవృత్తి మర్యాద కొరకే కామారియగు శంకరుని అనుచరుడు నందీశ్వరు డీశాస్త్రమును వెలయించెను. "మహాదేవానుచరశ్చ నందీ సహస్రేణాధ్యాయా

ం పృథక్కామసూత్రం ప్రోవాచ" తదనుగమనముచే ఆయు రారోగ్య బలవీర్య పరాక్రమములు సురక్షితము లగును. త్తమ ప్రజాసంపత్తి లభించును. రాష్ట్రీయసమాజమును బల మునొందును. ఇది యెఱుంగక (కామమును) కేవలమైంద్రికవిషయ రాయణ మనుకొని మన సర్వస్వము జెరుపుకొను చున్నాము. ఈ సూత్రము లిట నవధేయములు.

. శ్రోత్ర త్వక్ చక్షు ర్జిహ్వా ఘ్రాణానా మాత్మసంయుక్తేన మనసాఽధిష్ఠితానాం, స్వేషుస్వేషు విషయే ష్వానుకూల్యతః ప్రవృత్తిః 'కామః.'

౨. ఏకమర్థం చ కామం చ ధర్మం చోపచరన్నరః
ఇహాముత్ర చ నిఃశల్య మత్యంతం సుఖమశ్నుతే

3. ధర్మార్థాంగ విద్యా కాలా ననుపరోధయన్
కామసూత్రం, తదంగ విద్యాశ్చ పురుషోఽధీయీత

4. తదేతత్ బ్రహ్మచర్యేణ పరేణ చ సమాధినా
విహితం లోక యాత్రార్థం న రాగార్థోఽస్య సం విధిః

5. రక్షన్ ధర్మార్థ కామానాం స్థితిం స్వాం లోకవర్తినీం
అస్య శాస్త్రస్య తత్త్వజ్ఞో భవత్యేవ జితేంద్రియః

6. తదేతత్ కుశలీ విద్వాన్ ధర్మార్థా వవలోకయన్
నాతి రాగాత్మకః, కామీ ప్రయుంజానః ప్రసిద్ధ్యతి.

వా. కా. సూ.

ఇపుడు క్రమప్రాప్త మర్థశాస్త్రము. దీనిం గూర్చి విశే షముగ జెప్ప బనిలేదు. ధర్మానుశాసన మీ శాస్త్రమునం దెట

జూచిన నగపడుచునే యుండును. మనోబుద్ధ్యాత్మ మూలక కామ ధర్మ మోక్ష మార్గములకు బాధకములగు నర్థములు, తదుపార్జన పద్ధతులును నికృష్టములు త్యాజ్యములు ననియే చెప్పబడినవి. శరీర సుఖముకంటె మానస సుఖము ముఖ్యము. అది లేనినా డెంతటి వైభవమైనను వేదనలకు హేతువేయగును. సుఖోపభోక్త, లేదా అర్థానుగతేంద్రియక విషయోపభోక్త. ఇంద్రియాధ్యక్ష మగు మనస్సే కదా! దాని స్వాభావిక శాంతికి భంగముకల్గు పద్ధతులపై యర్థసంగ్రహము గావింపగ బ్రోగు పడిన యర్థము పరితాపవృద్ధికే హేతువగును.

మనస్సుకంటెను బైది బుద్ధి. ఇందు బ్రమాణము: మూర్ఖుడు సామాన్యాపత్తికే వ్యాకులుడగును. ఎంతేసి యాపదలనైన బుద్ధిమంతు డోర్చికొనును. బుద్ధి నావృతముచేసి దాని దివ్యభావ వికాసమణంచు నర్థప్రవృత్తి సర్వనాశమును గూడ దోపసీయదు. అట్టి యసదర్థ ప్రవృత్తికి దూరముగ నుండియో యొక నమస్కారము సేయుట మేలు.

బుద్ధికి బరమం దాత్మదేవత యున్నది. తదానంద మాత్రలం గొనియే దానికి క్రిందనున్న వన్నియు నానంద కారణము లగుచున్నవి. ధర్మమార్గము నుపేక్షించి ప్రవృద్ధ కామ నానుకూలాసదర్థ సంగ్రహము గావించుచో నాపెరిగిన యవిద్యా కామ సంస్కారములు మనస్సును, తద్వారా బుద్ధిని మలిన పరుపగా, తత్సహకృతాత్మ నిష్కామ భావము కామావరణముచే తన స్వాభావిక శాంతి ప్రతిష్ఠా ప్రసాదాది వంచితమై

పోవును. ఇట్లు జఘన్యా ధర్మమయార్థ లిప్సా కుచక్రమంకుబడి స్వాస్థ్యముం జెడగొట్టుకొని మనోరాజ్యము నశాంతము గావించు కొని, బుద్ధి పంచక్లేశములకు బలిగావించి, చివర కీశ్వరదత్త శాశ్వతాత్మశాంతి ప్రణాశముం జేసికొందుము. నేడీ స్థితికి జెందిన త్రాహిత్రాహీతి కరుణాక్రందనములే యెల్లెడ వినిపించుచున్నవి. ఈ సూత్రము లిట మననము సేయదగినవి :

1. నీతేః ఫలం ధర్మార్థ కామావాప్తిః, ధర్మేణ కామార్థా పరిక్ష్యౌ, ధర్మంధర్మేణ, అర్థమర్థేణ కామంకామేన, మోక్షం మోక్షేణ.

2. ఐశ్వర్యం మదమత్తేన సలోభమానినా సంచితం వినశ్యతి.

3. ధర్మఏవ ప్రధానఃపురుషార్థః అధర్మేణభుజ్యమానం సుఖ మనుహ్యాత్.

4. ఏవం ధర్మమూలం విద్యామర్థంచ అర్జయేత్- విద్యామూలంజగత్ విద్యాపునః సర్వ మిత్యాహ గురుః.

(బార్హస్పత్యసూత్రాణి)

1. ఏషత్రయీధర్మః చతుర్ణాం వర్ణానాం ఆశ్రమాణాంచ స్వధర్మస్థాపనా దౌపకారికః.

2. స్వధర్మ స్స్వర్గా యానంత్యాయచ తస్యాతిక్రమే లోకః సాంకర్యా దుచ్ఛిద్యతే-తస్మాత్ స్వధర్మం భూతానాం రాజా నవ్యభిచారయేత్ - స్వధర్మం సందధానోహి ప్రేత్యచేహచ నందతి వ్యవస్థితార్యమర్యాదః కృతవర్ణాశ్రమస్థితిః త్రయ్యాహి రక్షితోలోకః ప్రసీదతి నసీదతి.

3. సుఖస్యమూలంధర్మః, ధర్మస్యమూలమర్థః, అర్థస్య మూలంరాజ్యం, రాజ్యమూలమింద్రియవిజయః, ఇంద్రియవిజయ స్యమూలంవినయః, వినయస్యమూలంవృద్ధసేవా, వృద్ధసేవయా విజ్ఞానమ్, విజ్ఞానే నాత్మానం సంపాదయేత్, సంపాదితాత్మా జితాత్మా భవతి, జితాత్మా సర్వార్థైః సంసృజ్యేత, అర్థసంప త్ప్రకృతిసంపదం కరోతి. స్త్రీణాంభూషణంలజ్జా, విప్రాణాం భూషణం వేదః, సర్వేషాంభూషణం ధర్మః. (కౌటిల్యార్థశాస్త్రము)

ఇట్లు నాల్గుశాస్త్రములును పరస్పరోపకారకములై ఆధ్యాత్మిక పర్వములగు శరీరమనోబుద్ధ్యాత్మలను రక్షించుకొన నాదేశించుచున్నవి. నేడు అర్థకామశాస్త్రముల ప్రచారము లోపించినట్లే, ధర్మ-మోక్షముల (అందును మోక్షప్రచారమధి కము) ప్రచార మున్నది. ఇది యెంతవర కుపకారక మున్నది. నేటి ముముక్షువులును, ధర్మాచార్యులును జెప్పవలసియున్నది.

ఇట మాయభిప్రాయ మిది :-అర్థకామసహాయోగ వంచిత ధర్మ-మోక్షమార్గములును, ధర్మమోక్షవంచితార్థకామ ములును నపూర్ణములే. మనము సుఖులముగావలెను. మన మనగా :-ఆత్మబుద్ధిమనఃశరీరసమష్టి గదా! కనుక నీనాల్గు సంస్థ లకును వినోదసాధనము లుండవలయును. మన ఆయువును ఆయువునందలి ప్రతిక్షణమును యథానియమముగ చతుర్విధ పురుషార్థయుక్తముగ నుండునట్లు వ్యవస్థితము గావించుకో వలయును.

ఒకపక్షమునే పట్టుకొని తక్కిన పక్షము లుపేక్షించి యొంటికన్ను గొరకాకుండ బోవు తప్పుమార్గము మనకు బరిపాటియైపోయినది. ఒక చక్కనివ్యవస్థతో సమత్వయోగము నడపునలవాటునకు బొప్పుకలేకున్నాము. ఈ యీపురుషార్థ సాధనకీయిది కాలముకాదు అనుకొనుచుండుట నిజమే. మన యాయుఃపరిమితియెంత? నూరువత్సరములా? మొదట నంత వరకు బ్రతుకుదు మను నమ్మకమేమి? పోనిండు! అభ్యుపగమ వాదార్థ మొప్పుకొన్నను అందర్ధభాగము రాత్రులూరకబోవు నవే గదా! మిగిలిన 50 వర్షములందును, అజ్ఞానప్రధానలక్షణ ముగల బాల్యావస్థయందు 10-12 సంవత్సరములును, శక్తి హ్రాసలక్షణ వృద్ధావస్థయందు 10-12 సంవత్సరములు మొత్త మెట్లయిన నిరువదియైదు సంవత్సరము లూరక ద్రోచివేయ వలసినదే, ఇక మిగిలిన 25 సంవత్సరములందు నీరోగము లేకున్నచో (అదికూడ సంభవించిన నన్నియు నుండును) జ్ఞాన సంచయము ధర్మానుష్ఠానము లోకసుఖము, ప్రజాసుఖము, అర్థ సంగ్రహము, సమాజసేవ, రాష్ట్రసేవ, దేశసేవ మొదలగు నెల్ల పురుషార్థములను సాధింపవలసి యున్నది.

ఇంతకు జెప్పదలచిన దేమనగా:-ఏపురుషార్థసాధనకైన రేపు రేపనుకొనుచు గాలక్షేపము సేయుట వ్యర్థము. భూత భవిష్యత్తుల మధ్యనుండు వర్తమానమే మనసర్వస్వము. ఇందే మన మన్నియు నిర్వర్తించుకొనవలయును. రాత్రిం దివములం దరువది గడియ లున్నవి. వీనిని నాల్గుభాగములు గావించి

ఆయా సమయానుకూలముగ చతుర్విధపురుషార్థములను సఫల ములను గావించుకోవచ్చు ననియే.

శౌచ స్నాన సంధ్యాది నిత్యకర్మలకై ప్రాతఃసాయంకాలము లందు 15 గడియలు, వినియోగించుకోవచ్చును. మరి 15 గడియలు ధర్మావిరోధముగ నర్థోపార్జన కుపయోగించుకొన నగును. ఇంకొక 15 గడియలు. విహారము శిష్టాచారసమ్మతము లగు నుపహాసాది మనోవినోదములు తత్త్వదర్శనము మొదలగువానికై వెచ్చబెట్టుకొనవచ్చును. మిగిలిన 15 గడియలు విశ్రమింపవచ్చును ఈ విభాగము చతుర్థవర్ణమున కిరువదేసి గడియలచొప్పున మూడుభాగము లగుట యుచితముగ నెన్నబడినది. 20 గడియలర్థోపార్జనకు, 20 గడియలీశ్వరస్మరణ మనోవినోదాదులకు, తక్కిన 20 గడియలు విశ్రాంతికి ఉపయోజ్యములు. ఎట్లయినను సమయవర్గీకరణము లేనిచో అధ్యాత్మసంస్థకు సుఖములభింపదు. ఇందు ప్రధానముగ అర్థప్రవృత్తిని సీమితముగావించుకొనక తప్పదు. అట్టి ప్రవృత్తియే స్వస్త్యయనకర్మ. జీవితమును (స్వ) స్తిభావ పూర్వకముగ సాగించునవి యగుటచే స్వస్త్యయనము లని పేరువడిన కర్మలందింతవరకు జెప్పబడినవే కాక, శయన గమన వ్యవహార శిష్టాచారాము లెన్నో యున్నవి. షట్కర్మలంగూర్చి చెప్పుచు ప్రసంగవశమున వీనింగూర్చి చెప్పవలసి వచ్చినది. ఇక్కడకే చాల విస్తారమైనది. ధర్మశాస్త్రములం దారసి యాయాకర్మలంగూర్చిన యాచార వ్యవహారముల నెరుంగ వలయును.

ఇట్టి నత్యావశ్యకములును మంగళప్రదములును అగు నిన్ని స్వస్త్యయనకర్మలంగూర్చి ముచ్చటింతుము. వీనిని పరిత్యజించుటవలననే దేశము నేడు వైభవశూన్యమై పోయినది. 1) తనయొక్కయో, తనపూర్వులయొక్కయో ప్రజ్ఞాపరాధముచే గాని, పుట్టుకచేగాని నిర్ధనుడైనపుడు నేను దురదృష్టవంతుడను, పేదను, కూలివాడను, మొదలగు నశుభభావనలుంచుకొనరాదు. నకారోపాసనవలన నాత్మదేవతావికాసము ణాగును. రానున్న భాగ్యదేవతాగమనముకూడ నవరుద్ధమగును. మనవారెన్నడును సత్తాలక్షణాస్తి బ్రహ్మోపాసకులు ఏదశయందైనను నిత్యసంతుష్టులు ఇదే మనకు ప్రతిష్ఠయగు ఆస్తికత, వికాస హేతువు "యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః" పారలౌకికపు సంపత్తి యెడల నిదే విధముగనుండవలయును. "నేనానందఘన పరిపూర్ణబ్రహ్మాంశను నాకేమియు లోపములేదు. "మనసిచపరితుష్టే కోఽర్థవాన్ కోదరిద్రః ? సుఖదుఃఖములు దారిద్ర్యసంపన్నతలు మొదలగునవెల్ల భావనామయ మనోరాజ్యమునకు జెందినవి" అనుకొనుట మేలు. "శ్రద్ధామయోఽయంపురుషః యోయచ్ఛ్రద్ధః సఏవసః" అన్నది గురుతుంచుకోవలెను. లేకయో, ఉన్ననూ నధికస్వార్థసాధనకో దరిద్రతను ఘోషింపుచు నకారోపాసనసేయుట దౌర్భాగ్యమూలము.

1. నాత్మానమవమన్యేత పూర్వాభిర సమృద్ధిభిః
ఆమృత్యోః శ్రియమన్విచ్ఛేన్ నైనాంమన్యేత దుర్లభాం.

2. అసన్నేవ సభవతి అసద్బ్రహ్మేతి వేదచేత్
అస్తి బ్రహ్మేతిచేద్వేద సంతమేనం తతోవిదుః

3. సుఖంవా దుఃఖంవా కిమిదమిహ జగత్యస్తినియతం ?
వివేకప్రధ్వంసాద్భవతి సుఖదుఃఖవ్యతికరః
మనోవృత్తిః పుంసాం జగతిజయినీకాపి మహతాం
యయాదుఃఖందుఃఖం సుఖమపిసుఖం వా నభవతి.

(2) రెండవది 'సత్యభాషణము.' ఏవో కొన్ని యపవాద స్థలములం దప్ప సదా సత్యమునే యనుగమింపవలయును. లోక లజ్జా భయములచే సత్యము నావృతము గావింపరాదు. లోపలివ్యవహారము మహాకలుషము. మెరమెచ్చులు, కల్పిత ప్రేమ ప్రదర్శనము అసత్యరూపాంతరములే. 'మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్' అన్నదే అసత్యమునకు ప్రతిమ. దీని వలన నగు ననిష్టములంగూర్చి వెనుక సత్యానృత వివేకావసరమున* వివరింపబడినవి. ఇట నీవిషయమున గొన్ని విశేష నియమములం గూర్చి తెలిసికొందము.

'సత్యంబ్రూయాత్' ఇది సామాన్యాదేశము. "ప్రియంబ్రూయాత్" అనుట మొదటి సంశోధనము. "నబ్రూయాత్ సత్యమప్రియమ్" అనుట రెండవసంశోధనము. సామాన్యదృష్టికి ఈ సత్యాదేశములందు విప్రతిపత్తి తోచును. కటుత్వములేని సత్యము వచించుట కష్టమే. 'హితం మనోహారి చ దుర్లభం

* చూ. బ్రహ్మ కర్మవిజ్ఞానము.

చః తత్త్వవేత్తయగు వక్తయు తత్త్వజిజ్ఞాసు వగు శ్రోతయు త్యానుగాములు కానేర్తురు.

అయినచో 'సత్యంబ్రూయాత్' అనుటలో మహత్వ మేమి? ప్రియంబ్రూయాత్తన నర్థమేమి? "నబ్రూయాత్సత్య మప్రియ" మనుటలో తత్త్వమేమి? యనుకొని యంతర్దృష్టి నవలోకించుచో తేలునది:-"సత్యము పల్కుటయన్న దొక యావశ్యకధర్మము. ఇట రెండుదృష్టులు.

1. వ్యక్తిగత దుర్భావనగల దృష్టియొకటి, 2. రెండవది సత్యము నభినయించు తెరం గెరుంగలేని అయోగ్యత, ఎట్లన:-

1. మన మొకనియందు దుర్భావన గలిగియుంటిమి. అపు డావ్యక్తిని సమాజదృష్టికి నీచునిగా దోపజేయనై (ఆదోషిని దోషములను సంస్కరింపవలయు నను నుద్దేశ్యము లేకుండ) "అయ్యో! రామ! రామ! అత డెట్టియనర్థము గావించెనో తామే యోచింపుడు. చెప్పుట కేని సంకోచకము కల్గుచున్నదే! ఏమిసేయుదుము సత్యమును మూసిపెట్టజాలము గదా!" అనుటలో భావనయు వాణియు గూడ నప్రియములు (కలుషితములు) గావించుకొనుచు ఆసత్యము నుద్ఘోషించుట యున్నది. 2. ఇక రెండవపర్వము, ఇందు వ్యక్తిగత ద్వేషభావనతో పల్కునది లేదు. కాని సత్యముజెప్పు తీరెరుంగక ఆ సత్యము నప్రియముం గావించివైతుము. సామాజిక కురూఢివాదము లందు క్రాంతిగావింప నెంచువారిలో కొంద రిదేతీరు ననుసరిం

తురు. రూఢి వాదానుయాయులతో వారికి వ్యక్తిగత ద్వేష భావ మేమియు నుండదు. కాని వారు చెప్పు సత్యము కర్కశ పద్ధతిలో చెప్పెదరు. "ఈరూఢివాదులు సమాజమునకు వేరు పురుగులు. వారిమాటలు వినరాదు. సత్యముపై నిలువుడు! మనము సత్యముపై నున్నచో మన కేభయములేదు." అను నిట్టి అప్రియభాషలచే వీరి యీ నిస్స్వార్థ సత్యమును అప్రియముగ నగుచున్నది.

ఇక నిందు :- మొదటిదృష్టికిఫలము :— దుర్భావనతో సత్యము చెప్పబడినందున ఎదుటివాడు అభినివేశముచే మరింత యసత్య పథానుగామియు, ఈ దుర్వాసనావాసిత సత్యవక్తకు పరమశత్రువుగ నగుటయు నేర్పడును. రెండవదృష్టికి :- దోషి యగు సమాజ మీయప్రియసత్యవక్తకు ప్రబలవిరోధియగును. అందువలన లోకరక్ష-లోకసంగ్రహము అనుదానికి బదులు, లోకహాని యేర్పడును. ఆ యభినివేశమే తుదకు ఈ యప్రియ సత్యముచే నుత్తరోత్తరము దృఢమూల మగుచుండును.

ఈ రెండుదృష్టులను స్మరించి మనువు, 1. ప్రియంబ్రూయాత్, 2. నబ్రూయాత్సత్యమప్రియమ్, అని సంశోధనపూర్వకముగ జెప్పెను. ఇందు 'ప్రియంబ్రూయా' త్తన్నది వ్యక్తిగత సత్యమునకు జెందినది. మనమొకనికి సత్యస్థితిం జెప్పి చూపి సన్మార్గమునకు గొని తే నున్నచో, నతనియెడ ప్రియభావన యుంచి సత్య స్వరూపమును వాని యెదుట నుంచవలయును. కటుభావ మిశ్రితము, దుర్వాసనా వాసితము నగు అప్రియ

సత్యము మన యాత్మవికాసమునకును గాదు. దానివలన శ్రోతకు నుపకారమేమియు జరుగదు. ఉభయత్రోఽనిష్టము. కారణము? దుర్వాసనామూల కాప్రియభావ మట్టిసత్యము ననృతరూపము నొందించి నిర్బలము గావించును.

ఇక "నబ్రూయా త్సత్యమప్రియమ్" అన్నది సామాజిక సత్యఘోషణకు జెందినది. ఇటః సత్యా-సత్య నిరూపణ సేయకూడ దని మనువు నభిప్రాయము కాదు. 'ఎన్నికష్టము లనుభవింప నున్నను సదా సత్యమే పల్కవలెను' అనుటకు సంశోధనగ నాయన "మంచిది, నీవవశ్యము సత్యము చెప్పుము. ఆ తీరు మధురముగ నుండవలయును. సమాజ ముద్వేగము నొందకుండవలయును. కర్ణములకు కటుత దోపరాదు. గర్వగర్భితము గారాదు. సౌమ్యభావముతో హానిలాభముల నెంచి "నిజమే, మన మనుచితమార్గము బట్టియున్నా" మని శ్రోతలు విశ్వాస పూర్వకముగ ననుకొనునట్లు పల్కుము" అని పల్కుచున్నాడు.

కటుసత్యము జెప్పరాదనుదానికి సత్య మాడుట మాని ప్రియముగ నుండు ననృతమునే పల్కవలయు నను నర్థము దీయరాదు. కనుకనే మనువు "ప్రియం చ నానృతం బ్రూయాత్" అని చెప్పవలసి వచ్చెను. "నబ్రూయా త్సత్యమప్రియమ్' అనుదానికి బై తాత్పర్యము నెఱుంగలేని మనము చాలవరకు సామాజిక వైయక్తిక, ప్రాతిస్విక దోషములను వినము, వినిపింపను జాలము. ఎవనికిని స్పష్టముగ జెప్పజాలము.

ఒకడు స్పష్టముగ జెప్పిన వినజాలము. ఈ సత్యహనన దోషము త్తరోత్తరము పెరిగి మన యామూలచూడ పతనకారణమగుచున్నది. ఇతడు ధనికుడు, ఇతడు విద్వాంసుడు, ఈయన యాచార్యుడు వీరికి మన మేమి చెప్పగలము? అను భావనయే నేడు మన నైతికబలము సర్వనాశకారణ మగుచున్నది. స్వార్థరక్షాదృష్టితో గొంత, సామాజిక ప్రతిష్ఠావిచ్యుతి భయమున గొంత, మనము రాత్రింబవళ్ళనృతము నాశ్రయించి సత్యహత్య గావించు చున్నాము. "ఏషధర్మః సనాతనః" అను మనువచనము నుపేక్షించి ధర్మవృషభమును బ్రహరించు చున్నాము. 'సత్యస్థితి నెదుట బెట్టుకోవలయును. శిష్టభాషలో శిష్టపద్ధతిపై దుర్భావన విడచి యవశ్యముగ సత్యము నాశ్రయింపవలయును.' ఇదే సనాతన ధర్మ మూలప్రతిష్ఠకు గారణము. అట్టి ధర్మము మన ప్రతిష్ఠకు గారణ మగును. నేడు అనృతాప్రియ మూలక ముఖస్తుతు లాచరింపుచు, మన యాత్మ వికాసమును, ఆర్పివైచికొంటిమి. ప్రతిష్ఠితులగు విద్వాంసుల, మహంతుల, ఆచార్యుల ధనికుల యలవాటులకు జేటుదెచ్చితిమి. వారిప్పు డణువంతయేని తమ దోషస్పష్టీకరణమును సహింపజాలరు. ఫలము? సమాజమున కేవిధమగు వాలిక హిత సాధనమును లేకుండుటయే. కనుకనే మనువు :-"సత్యంబ్రూయా త్ప్రియంబ్రూయాత్, నబ్రూయా త్సత్యమప్రియమ్ ప్రియంచ నానృతంబ్రూయాత్- ఏషధర్మ స్సనాతనః" అనియెను.

(3) మూడవ స్వస్త్యయనకర్మ "భద్రవాదనము"-

చాలమంది అరిషడ్వర్గా ద్యశుభ భావముల నాశ్రయించి పదే పదే అశుభములనే పల్కుచుందురు. "ఇదియాగునా! ఏమగునో, ఎట్లగునో, అయినగదా! అట్లయిననో? ఇట్లు గానిచో, రోగము రాకున్న, బ్రదుకు నిజమైన, కరువు రాకున్న, భూకంపమువచ్చినచో" ఇత్యాద్యమంగళభావ శబ్దములు పల్కుచు దోషైకదృక్త్వమున మెలంగుదురు. ఇట్టి భావములు శబ్దములు. ఆత్మ శ్రేయోభావ విఘాతకములు, అనిష్టములు. తనకు, నితరులకు నెప్పుడు భద్రములను గోరుటయే యుక్తము. "భద్రం భద్రమితి బ్రూయాత్ భద్రమిత్యేవ వాదయేత్."

(4) కొందరూరక వివదింతురు. అదివారికలవాటుగ నుండును. ఏవో కుతర్కములకు దిగి యెవరితోనైన విరోధము గూర్చుకొనుట, పరప్రతిష్ఠా వికాసముల కోరువలేమి, ఇతరులను దోషులుగ జూపనే బ్రయత్నము, అసత్కల్పనా ప్రచారము, ఇట్టి యవగుణములు విడుచుకొనుట మంచిది. "శుష్క వైరం వివాదం చ నకుర్యాత్కేనచిత్సహ"

ఇంకను ఇట్టిస్వస్త్యయనకర్మ లెన్నో! అనంతప్రకృతి, అనంతశాస్త్రములు అనంతాదేశములు అంతట నానంత్యలక్షణ భూమయే మనప్రధా నోపాస్యదేవత. అదియమృతము, స్వస్తి భావకారణము. మృత్యులక్షణాల్పతోపాసకు లగు ననార్యుల కీకర్మ లెల్ల నాడంబరములుగ దోచుగాక! ఆర్షసంతతి కీయానంత్యము మంగళప్రదము. ఇవి స్వాభావిక స్వస్తిభావములు గాపాడునవి. స్వరూపరక్ష గావించునవి. పుష్టికరములు గాను

న్నను పతనము నుండి రక్షించును. స్వాస్థ్యాచార్యుల యీ క్రిందివచనములు గూడ నిటననధేయములు.

1. నరో హితాహార విహారసేవీ సమీక్ష్యకారీవిషయేష్వసక్తః, దాతాసమః సత్యపరః క్షమావాన్ ఆప్తోపసేవీచ భవత్యరోగః.

2. మతిర్వచఃకర్మ సుఖానుబంధి సాచంవిధేయం విశదాచ బుద్ధిః జ్ఞానంతప స్తత్పరతాచయోగే యస్యాస్తి తం నానుతపన్తి రోగాః.

3. ఆదితస్ వాచార్యాభిగమనం, తస్యోపదేశానుష్ఠానం, అగ్నేరేవోపచర్యా, ధర్మశాస్త్రానుగమనం, తదర్థావబోధః తేనావష్టంభః, తత్రయథోక్తాః క్రియాః, సతాముపాసనం, అస తాంపరివర్జనం, అసంగతిర్దుర్జనేన సత్యం, సర్వభూతహితం, అపరుషం, అనతికాలే, పరీక్ష్యవచనం, సర్వప్రాణి ష్వాత్మనీ వాపేక్షణం, సర్వాసాం, అస్మర ణాసంకల్ప నాప్రార్థ నాభిభాష ణంచ స్త్రీణాం,......ఇత్యాదయనాని వ్యాఖ్యాతాని.

ఆచారాత్మకములగు నీస్వస్త్యయన కర్మల ననుగమించు టెంత యావశ్యకమో చెప్ప బనిలేదు. ప్రజా, సంపత్త్యనుచర యశః కీర్తి విద్యాఽరోగ్యాయువులు గావలయు వారికెల్ల నివి యాచరింప దగినవి. అక్కఱ లేనివారు పరిత్యజింతురుగాక! రెండు మార్గములను జెప్పుట శాస్త్రముపని. శాస్త్రముఃతప్ప మరెవ రీసంబంధము నందు ఆదేశించువారు? 'యథేచ్ఛసితథా కురు'

"శ్రుతిస్మృత్యుదితం సమ్యక్ సాధుభిశ్చ నిషేవితం
తమాచారం నిషేవేత ధర్మకామో జితేంద్రియః"

## 4. ఆత్మనిబంధన షట్కర్మలు

మున్ను చెప్పిన ముందు జెప్పబోవు నెల్లకర్మలకును ఆత్మతోడనే ప్రధానసంబంధము. ఆత్మయే (భూతాత్మ-కర్మాత్మ-భోక్త్రాత్మ* యే) ఇంద్రియవర్గము. ప్రజ్ఞానజ్ఞానలక్షణ సర్వేంద్రియమనస్సు విజ్ఞాన జ్ఞాన లక్షణ బుద్ధిపాంచభౌతిక శరీరము అను వీని సహయోగముచే సర్వకర్మ స్వరూపనిష్పత్తి కారణమగుచున్నది. ఆదృష్టితో నన్నిటిని 'ఆత్మనిబంధన కర్మ'లే యనవచ్చును. కాని ఒక విశేషదృష్టితో నీ ప్రకరణమందు జెప్పనున్న యారుకర్మలనే ఆత్మ నిబంధన కర్మ లందుము. ఆదృష్టి సూచన:—

ఏ కర్మానుష్ఠానమున కేని సిద్ధి వలయుచో నాకర్మానుష్ఠాన యోగ్యత ఆత్మకు గావలయును. అది లేనినా డేకర్మానుష్ఠానమైనను వ్యర్థమే. కనుక నట్టియోగ్యతను మొదట నాత్మకు గూర్చునవే ఆత్మకు ప్రాతిస్వికకర్మ లగును. బాహ్యకర్మలందు ప్రవృత్తమగు నాత్మయొక్క యే అంతర్వ్యాపారము కలదో అదియే ఆత్మయొక్క ప్రాతిస్వికకర్మ యనియు, ననవచ్చును. ఈయాంతర వ్యాపారమునకు గలయవాంతర పర్వము

---

* "ఇంద్రియాణిహయానాహు ర్విషయాం స్తేషుగోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః" (కఠ)

లాంటింటను గొన్ని యాభ్యంతర కర్మల కపోత్పలకములుకాగా, గొన్ని బాహ్యకర్మరూప పరిణతి గనును. కనుక ఈ యారిటిని ఆత్మనిబంధన షట్కర్మ లనియు అనుకోవచ్చును. తక్కిన ప్రతి కర్మయందును ఆత్మయొక్క యీ యారుకర్మలు నుండు చుండును. ఉదాహరణము:-గర్భాధానసంస్కార కర్మం గైకొనుడు. ఎంతవరకు నాత్మకు తన యారుకర్మల సహయోగ ముండదో అంతవరకు 'సత్వ' లక్షణ గర్భాధాన స్వరూప నిష్పత్తియే యుండదు. ఇట్లే ప్రతి కర్మవిషయమునను ఎరుంగ వలయును. కనుకనే ఈ యారుకర్మలను వేరుగా జెప్పనయ్యెను.

## ఆత్మయొక్క కర్మత్రయి

విద్యాకర్మల రెంటి సమన్వితస్వరూపము వేరే యాత్మ. విద్యాప్రధానమగు యాత్మయే, ఆనంద విజ్ఞాన మనోమయము. కర్మప్రధాన మగు నా యాత్మయే మనః ప్రాణ వాఙ్మయము. విద్యామయము జ్ఞానాత్మ. కర్మమయము కర్మాత్మ. హృదయ స్థము జ్ఞానగర్భితము నగుకర్మాత్మ (అవ్యయాత్మ లేదా అవ్యయ కర్మభాగము)కు భూతాత్మపై ననుగ్రహము కలుగగా నదియు జ్ఞానకర్మమయమై 'జ్ఞాయతే-క్రియతే' రూపముచే జ్ఞానకర్మ ప్రవర్తక మగుచున్నది. ఇంతకు మూలమగు కర్మాత్మ మనః ప్రాణ వాగ్భేదముచే త్రికలము కనుక తత్సంబంధి కర్మయు త్రికలము గావలయును. ఆ మూడాత్మకర్మలే వరుసగ మానస కర్మ-ప్రాణకర్మ-వాచికకర్మ నాబరగును.

## ఆత్మకర్మషట్కము

ఈమూటనొక్కొక్కటియు రెండేసి భాగము లగును. క్రతు-చేష్టాకర్మలు మానసములు. భావసంస్కారకర్మలు ప్రాణకర్మలు. వికార-సత్వకర్మలు వాచికములు. ఇట్లు మొత్త మారు ఆత్మకర్మలు. ఈయాత్మనిబంధన షట్కర్మల స్వరూపముల నిట పరిచితములు గావించుకొందము. కామము (ఇచ్ఛ) మనస్సునకు, తపస్సు ప్రాణమునకు, శ్రమ వాక్కునకు, రేతస్సులు. ఇందు కామమునుండి క్రతువు, చేష్ట యను రెండు మూలకర్మలు వెలయును. ఇందును క్రతువు సర్వప్రతిష్ఠ. సర్వమూలము. ప్రతిష్ఠాలకర్మకు మొదట నొక యంతర్వ్యాపారము జరుగును. అదే చేష్ట (కృతియత్నము). దానికి ప్రథమావస్థ, ప్రభవము, ఉద్ధము, క్రతువను నంతరతమ వ్యాపారము. ఈ క్రతుచేష్ట లన్నవి రెండును మనోమయ మగు నొకేయంకురమునకు ద్విదళములు. కనుకనే యీరెంటికి బర్యాయసంబంధము గూడ కన్పట్టుచుండును.

చేష్టాకర్మకు మొదట కర్మ, ముగ్ధావస్థ (ముకుళితావస్థ) యందుండును. చేష్టానంతరమే అది భావదశ (అస్తిదశ) నొందును. ముగ్ధదశాపన్న మానసచేష్టాకర్మయే, ప్రాణబలముం బొందును. ఈభావకర్మయే ప్రాణకర్మ. దీనివలననే ప్రజ్ఞానాత్మయందు అతిశయాధాయక 'సంస్కార' రూప కర్మ యుదయించును. అందుచే ప్రజ్ఞానమందు 'అహంకరోమి' అను భావము

జాగృత మగును. సంస్కారకర్మకు ప్రథమావస్థ భావకర్మ. దీని యుత్తరావస్థయే సంస్కారకర్మ. ఈ రెండును ప్రాణాత్మక మగు నొకే యంకురమునకు రెండు వృంతములు.

సదా యొక యుద్దేశ్యముం గొని కర్మ ప్రవర్తించును. ఆ యుద్దేశ్యము పదార్థస్వరూపనిష్పత్తియే. అర్థము వికారసా పేక్షము. వికార సంఘమే. వైకారి కార్థస్వరూప నిష్పత్తికి హేతువు భావకర్మజనిత సంస్కారకర్మయే. వాగ్బలసహయో గముచే స్థూలరూపము నొంది వికారోత్పత్తియోగ్య మగు నుక్థముగ నై వికారప్రవృత్తి కారణ మగును. ఈ వికారసం ఘమే ఆత్యంతిక స్థూలావస్థకు వచ్చి, 'సత్త్వకర్మ' రూపము నొందును. ఇదే పదార్థమనాబడును. వికారకర్మ సత్త్వకర్మకు ప్రథమావస్థ. ఈ రెండును ఒకే వాఙ్మయాంకురమునకు రెండు పత్రములు.

"అర్థక్రియాకారిత్వంసత్" అన్నట్లు స్థూలపదార్థము లెల్ల కర్మపుద్గల మాత్రములు. వికారకర్మపుద్గలము (సంఘము-రాశి) అర్థము (పదార్థము.) ఇది మూలభూతమగు క్రతుకర్మ పరిణామము చరమవికారము. ఆత్మకర్మసంతానమున కుపక్రమ స్థానము క్రతువు. నిధనస్థానము పదార్థరూప సత్త్వకర్మ. ఏ భౌతికపదార్థముం గొన్నను, అది సత్త్వకర్మ. దానికి మూలము వికారకర్మ. ఇట్లు పోగా పోగా సర్వమూలము క్రతు కర్మ. ఈయారు కర్మలకు మూలము కర్మాత్మ కామన. దానికి జ్ఞానజనితేచ్ఛ మూలము. అందీయారుకర్మలు నిమిడియున్నవి.

జ్ఞానము మొదలుగ సత్త్వకర్మపర్యంతము గల-జ్ఞాన-ఇచ్ఛా-క్రతు-చేష్టా-భావ-సంస్కార-వికార-సత్త్వ-ములను నెనిమిదిపర్వములను విద్వాంసులు జ్ఞాన-ఇచ్ఛా-క్రతు-కర్మ లను నాల్గుపర్వములందె యంతర్భావములుగ నెంచిరి. ఎట్లన :—

"జ్ఞానజన్యా భవేదిచ్ఛా ఇచ్ఛాజన్యం క్రతుర్భవేత్
క్రతుజన్యం భవేత్కర్మ తదేత త్కృత ముచ్యతే"

## 1. ఆత్మనిబంధనషట్కర్మలు

1. క్రతు-చేష్టలు, మానసములు, కామప్రధానములు, మనోమయమనస్సు
2. భావ-సంస్కారములు, ప్రాణకర్మలు, తపఃప్రధానములు, ప్రాణమయప్రాణము
3. వికార-సత్త్వములు, వాచికకర్మలు, శ్రమప్రధానములు, వాఙ్మయవాక్కు

1. జ్ఞానమ్........................జ్ఞానమ్........................జ్ఞానజన్యంభవేత్
2. ఇచ్ఛా........................ఇచ్ఛా........................ఇచ్ఛా-ఇచ్ఛాజన్యం
3. క్రతు-చేష్టా-భావములు-క్రతు- క్రతుర్భవేత్, క్రతుజన్యంభవేత్
4. సంస్కార-వికార-సత్త్వములు-కర్మ- కర్మ-తదేతత్కృతముచ్యతే.

## 5. లోక-వేదనిబంధనషట్కర్మలు

### విద్యాసాపేక్షసాంకర్మలు

విద్యాస్థితి. కర్మగతి. ఇవి యవినాభూతములు. విద్యాకర్మమ యాత్మయే తన క్రతు-చేష్టాది షట్పర్వములచే కర్మకు ప్రతిష్ఠాభూమి యై యున్నది కనుక నేతత్కర్మయు, విద్యాసాపేక్షము, విద్యానిరపేక్షము నను రెండు భాగములగును. (1) విద్యాభాగము ప్రధానముగ కర్మభాగము గౌణముగ నగు

కర్మలు విద్యాసాపేక్షములు. (2) తద్విపరీతములు విద్యానిర పేక్షములు. లేదా (1) విద్యాగర్భిత కర్మప్రధానకర్మలు విద్యా నిరపేక్షములు. (2) కర్మగర్భిత విద్యాప్రధాన కర్మలు విద్యా సాపేక్షములు. ఈ రెంటికి వరుసగ ఇహపర లోకములతో సంబంధము.

కర్మకర్తయు, ఫలభోక్తయు నగు జీవాత్మకు 'ఇదంచ-పరలోకంచ' స్థానములు. ఇవి పృథివీ-సూర్యులు. సూర్యుడు, త్రయీవిద్యాఘనుడు. "సైషాత్రయ్యేవవిద్యాతపతి" "త్రయీవా ఏష విద్యాతపతి" "త్రయీమయోయం త్రిగుణాత్మనేనమః" అని శ్రుతిస్మృతులును వచించును. అతడు తన జ్యోతిర్నామక మనోతా ద్వారా తన 12 ప్రాణములందలి ప్రేరకమగు సవితా ప్రాణ సహయోగముచే మన విజ్ఞానాత్మిక విద్యాబుద్ధికి ప్రవర్తకు డగు నని 'తత్సవితుః......ధియో యో నః ప్రచోదయాత్' అను దానిచే స్పష్టము. సౌరమండల మందు జ్ఞానప్రధాన దేవభాగము వికసితము. బలప్రధాన భూతభాగము మూర్ఛితము. ఇక సూర్యోపగ్రహ భూత పృథివియందు భూతభాగము వికసితము. దేవభాగము మూర్ఛితము. కనుక పృథివి భూతలోకము. సూర్యుడు దేవలోకము అందురు. వరుసగ నీరెంటను అవ్యయుని విద్యాకర్మభాగములు వికసితములు. ఒకటి భూతక్షేత్రము లేక కురుక్షేత్రము. రెండవది దేవయజన భూమి లేక ధర్మక్షేత్రము. సౌరమండలము విద్యాక్షేత్రము. పృథివీమండలము కర్మక్షేత్రము. విద్య స్థిరతత్త్వము. స్థితి.

కనుక తత్ప్రధానుడు దేవఘనుడు సూర్యుడు స్థిరుడు. 'నైవో దేతా నాస్తమేతా మధ్యే ఏకలఏవస్థాతా" (ఛాందో) కర్మ గతితత్త్వము, చరము. కనుక తత్ప్రధానము భూతప్రధానము, కర్మాత్మకము నగు పృథివి పరిభ్రమణ శీలము.

వేద - విద్యా - బ్రహ్మ లోకశబ్దభావము గలవి. కనుకనే విద్యనే వేద మనవచ్చును. సూర్యుడు విద్యాత్మకుడు. అనగా త్రయీవేదమూర్తి. ఈ సౌరవేద (గాయత్రీ మాత్రికవేద) పరిచాయకము లీ వచనములు చూడుడు:

1. తదేతన్మండలం తపతి తన్మహదుక్థం తా ఋచః సఋచాం లోకః.
2. యదేతదర్చిర్దీప్యతే తన్మహావ్రతం తాని సామాని స సామ్నాం లోకః.
3. అథ య ఏష ఏతస్మిన్ మండలే పురుషః సోఽగ్నిః తాని యజూంషి సయజుషాం లోకః.
4. సైషా త్రయ్యేవ విద్యా తపతి. (శత)

ఈ సౌరవేద త్రయ్యాధారముననే సౌర మండల మందున్న జ్యోతిర్మయ అగ్ని వాయ్వాదిత్యాది త్రయస్త్రింశత్ ప్రాణదేవతల యజనరూప (సంగమన రూప) యజ్ఞకర్మకు (నిత్యమగు నాధిదైవిక యజ్ఞకర్మకు) వికాసము కల్గెను. ఈ ప్రాకృతిక నిత్య యజ్ఞమందగ్ని హోత, వాయు వధ్వర్యుడు. ఆదిత్యు డుద్గాత. రోదసీ త్రైలోక్యము వేది. సర్వతోవ్యాప్త

నిక్సోమ లిత్త్వ మాహుతి ద్రవ్యము. సౌర గాయత్రీమాత్రిక మాలిక వేద తత్త్వము గాయత్రీమంత్రము. సంవత్సర ప్రజాపతి యజమానుడు. ప్రాణదేవతలు యాజనీయులు. ఈ యుస్లి పరిగ్రహముల సమన్వయము వలనను వేదమూలకముగు నానాధి దైవిక యజ్ఞవితానము జరిగినది. అదిప్రజోత్పత్తికి గారణమై ప్రజాపతి కిష్టకామధుక్కుగ సిద్ధమైనది. వేద విద్యామూలకము కనుకనే విద్యాసాపేక్షము నాబడు. నీయజ్ఞకర్మ ప్రభావముచే నేడు త్రైలోక్యము వెల్లెడను, అందలి ప్రజలందును యజ్ఞకర్త యగు సంవత్సర ప్రజాపతి యేకచ్ఛత్ర సామ్రాజ్యము ప్రతిష్ఠిత మగుచున్నది. 'సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః".

ఈ యజ్ఞకర్మప్రభావముచే మర్త్యభూలోక మండలి మృత్యుధర్మములతో నిరంతరసంయోగ మున్నను, సౌరయాజ్ఞియ ప్రాణదేవతలు మృత్యుధర్మాసంస్పృష్టు లయి అమర పదాధికారులుగనే యుందురు. (1) ఈ యజ్ఞాతిశయముననే త్రయీమయుడు సూర్యభగవానుడు జ్యోతిర్ఘనుడై తన సహస్రరశ్ములచే త్రైలోక్యమంతు లోకాలోకపర్యంతము వ్యాప్తుడగుచున్నాడు. (2) ఈ సోమాహుతిరూప యజ్ఞానుగ్రహముచే ప్రజ్వలిత సౌరప్రాణము తపశ్చర్యానుగామి యగుచు, 'తపః' నామము నొందుచున్నది. (3) ఈ యజ్ఞ కోశాధిపత్య బలము నుండి సౌరప్రాణదేవతలు, తమ ప్రవర్గ్యమాత్రా ప్రదానముచే త్రైలోక్యప్రజలను ఋణులను గావించుచున్నారు. ఇట్లు విద్యా

(త్రయీవేద) సాపేక్షకర్మను క్రమముగ యజ్ఞ-తపో-దానము లను మూడుభాగములుగ జేసి సంవత్సరప్రజాపతి సర్వము నగుచున్నాడు. ఇదే పారలౌకిక నిత్యకర్మ వేదసాపేక్షము. కనుక విద్యాసాపేక్షము. ఇయ్యది దేవభూమి నాక్రమింపబోవు తమో మయ బలప్రధా నాప్యాసుర మూర్తులగు అసురులకు బరాభవ కారణమగుచున్నది. విద్యానిరపేక్ష పార్థివకర్మలు :-పాంచభౌతిక శరీరధారు లగు పార్థివ ప్రాణులెల్లను, కర్మల నొనరించును, కాని ఈ ప్రాకృతిక కర్మలు విద్యానిరపేక్షములు. అనగా సంను విద్యాసహయోగము లేదని భావింపరాదు. ఏలయన :-'జ్ఞాన జన్యాంభవేదిచ్ఛా ఇచ్ఛాజన్యాంభవే త్కృతిః క్రతుజన్యం భవే త్కర్మ' అనునట్లు విద్యా (జ్ఞాన) సహయోగములేని కర్మప్రవృ త్తియే అసంభవము కదా! మరేమన :-ఈ పార్థివకర్మలప్రవృత్తి ముఖ్యముగ ప్రజ్ఞాన మనస్సునకు జెందినది. విద్యాసాపేక్ష కర్మ ప్రవృత్తియన్ననో సౌర విజ్ఞానాత్మ (బుద్ధి) సంబంధముగలది. విజ్ఞాన జ్ఞానప్రతిచ్ఛాయచే జ్ఞానయుక్తమగు ప్రజ్ఞానజ్ఞానము మన (పార్థివప్రాణుల) కర్మలకు బ్రతిష్ఠ. ప్రజ్ఞానమనస్సు అన్న మయము. అన్నము భూతమయము. భూతవర్గము తమఃప్రధా నము. ఆవరకము. కనుక ప్రజ్ఞామన స్సంయుక్త కర్మలు, భూతోన్నతికి పార్థివసంపత్తివృద్ధికే గాని పురుషార్థమునకు బనికిరావు. మనుజుని స్వాభావికప్రవృత్తి భూతముల (పార్థివసంప దల) వంకకే వంగును. ఇందు కనేక హేతువులు కలవు.

ప్రధానహేతువు, భూతప్రధాన సృష్టిలోకము. మనుష్యశరీరము దీనియంశలచేతనే నిర్మితము. కనుక నది పార్థివభూతాకృష్ట మగుట స్వాభావికము. రెండవకారణము మానసజ్ఞానము. మనస్సు పార్థివౌషధిరసాన్నగత సోమతత్త్వ నిర్మితము. ఇందువలన గూడ భూతాకర్షణ తప్పదు. జన్మకారణములుగ సంచితములైన కర్మసంస్కారములు పార్థివములు కనుక పృథివీభూత ప్రవృత్తికే యుపోద్బలకము లగును. కర్మప్రవృత్తికారణము లగునింద్రియములు "పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్" అన్నట్లు బహిర్ముఖములు. భౌతిక విషయానుగతములు కనుక భూతాకర్షణ తప్పదు. ఇట్టి ప్రాకృతిక కారణములే కాక దౌర్భాగ్యముచే శిష్టాన్నాచార వ్యవహార సంగాది కృత్రిమ భౌతిక ధర్మములతో డయ్యెనా ఇక వేరే యడుగ నక్కరలేదు. ఇన్ని కారణములచే యథాజాత మానవుని సహజసిద్ధకర్మ పార్థివభూతానుగామియై సారవిజ్ఞాన వంచితమై విద్యానిరపేక్షముగ నుండును. అట్టిది యుండియు లేనిదానితో తుల్యము. కనుక నట్టి పార్థివ కర్మలను విద్యానిరపేక్షము లనవచ్చును.

## ఆశ్వత్థికజీవులు - కర్మ

మహాకదృష్టితోగూడ నీ విద్యాకర్మల స్వరూప తారతమ్యము లరయుదము. అవ్యయమూర్తను విద్యాకర్మలు రెండును స్వాభావిక ధాతువులు. అవ్యయ మశ్వత్థమూర్తిగదా! విద్యా

కర్మల ప్రధాన తాప్రధానతలచే నీ యవ్యయాశ్వత్థవృక్షము బ్రహ్మాశ్వత్థము, కర్మాశ్వత్థము నని రెండురూపములు గలదగును. ఈయుభయమూర్తియే సర్వప్రతిష్ఠ. "తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన" అని శ్రుతియు వాకొన్నది. తదంశభూతము జీవవర్గము. "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః" కనుక నదియు విద్యాకర్మ-లేదా బ్రహ్మకర్మ విభూతియుక్తము.

ఇందును బ్రహ్మకర్మల ప్రధానతాప్రధానతల బట్టి బ్రహ్మాశ్వత్థికజీవులు కర్మాశ్వత్థికజీవులు నని జీవులు రెండు విధములు. మొదట నచేతనవర్గము గొందము. పరమేష్ఠి సూర్య చంద్రగ్రహ నక్షత్ర వాయ్వగ్ని జలాదులు బ్రహ్మాశ్వత్థిక జీవులు. వీనియందు వేదమూలక విజ్ఞానమునకే ప్రాధాన్యము. వీని కర్మకలాప మంతయు విజ్ఞానానుమోదితము. సత్యాత్మకాంతర్యామియొక్క సత్యాత్మక నియతిసూత్ర సంచాలితము వఠాలిక వేదత్రయీసమర్థకము నై ప్రకృతిసిద్ధమై యున్నది. ఇవి వెలసినది కర్మభోగార్థము కాదు. అధికారవిశేషముం గొని కర్మసంచాలనము సేయుటకే. అనగా :-ఈశ్వరాజ్ఞాసిద్ధ కర్మసంచాలనము కొరకే యివివెలసినవి. తత్తన్నియతినమాప్తి కాగానే "పరేఽవ్యయే సర్వఏకీభవన్తి" అను నట్లు స్వప్రభవము, అంగిరూపము నగు నా యవ్యయాశ్వత్థము నందు లీనములగును. కనుకనే వీని నాధికారికజీవులనియు నందురు. "యావదధికార మవస్థితి రాధికారిణామ్" అని వ్యాససూత్రము. ఇవి యెన్నడును కర్మబంధన లిప్తములుగావు. ఇవి తమతమ

యిచ్ఛంబట్టి వెలయక ఆయా వస్తుప్రాప్తికో, కర్మప్రాప్తికో అగునా యవసరములందు అవ్యక్తేచ్ఛాప్రేరితములై వెలసి యభికృతకర్మలను నిష్కామభావముచే నిర్వర్తించును.

ఇక:- రెండవవిభాగము. అచేతనకర్మజీవులు. సృష్టిప్రవాహామునంబడి కర్మజాలమందు చిక్కి 'జాయస్వమ్రియస్వ' అనుచు కర్మభోక్తలగు చేతనజీవులు, తమోభాగాతిశయ వృద్ధిచే మనుజయోని నుండి క్రమముగ పశుపక్షిక్రిమికీటాది నికృష్ట చేతన జీవయోనులనొంది తమశ్చరమావస్థంజేరి చివరకు వృక్షలతాగుల్మతృణపాషాణలోష్టాది జడజీవములుగ పరిణతు లగుదురు. ఇట్లు అశ్వత్థముయొక్క బ్రహ్మ-కర్మభాగ తారతమ్యముచే అచేతన జీవవర్గమునకు అధికారి నాచేతనజీవులు, కర్మభోక్తలగు సచేతనజీవులు నను రెండు భేదములు కల్గును.

ఇదేవిధముగ చేతనజీవసృష్టియు రెండు భాగములే. స్వాయంభూ మను రామ కృష్ణ వ్యాసాది మహాపురుషు లాధికారిక కోటిలోని బ్రహ్మాశ్వత్థిక జీవులు. వీరి యావిర్భావ తిరోభావము లీశ్వరేచ్ఛకు జెందినవి. వీ రవతరించుట కర్మభోగార్థము గాదు. కర్మాశ్వత్థి కాస్మదా ద్యస్మృతసంహిత చేతనజీవుల ప్రజ్ఞాపరాధముచే కల్గిన ప్రాకృతిక క్షోభశాంతికొరకు; ధర్మగ్లాని నుపశమింపజేసి సృష్టికర్మవ్యవస్థ సరిసేయుటకు నియత సమ యాధికారముగాని యవతరింతురు. ఆయా కార్య సమాప్త్యనంతరము లీలాసంవరణము గావించివైతురు. ఇట్టి వారియం దప్పటికి వలయు నీశ్వరత్వ వికసన ముండుచుండును.

కనుక వీరిని సామాన్యజీవు లనక అవతారపురుషు లందురు. 'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం' ఈ చేతనులు, ఆధికారికు లగు అవతారపురుషులకు మూలాధారము వేదశాస్త్ర పరిశీలనసిద్ధ బ్రహ్మాశ్వత్థరూప విజ్ఞానమే. ప్రకృతి నిత్యనియమము. ఈ నియతికి క్షోభ లేకుండ జేయుటకే వీరు ప్రాదుర్భవింతురు. తద్వ్యవస్థయే మన మౌలిక వేదవిద్య. తత్ప్రతికృతియగు శబ్దాత్మిక వేదవిద్యయును, "వేదాద్ధర్మోహినిర్బభౌ" అన్నట్లు ఇదే వేదధర్మమున (ప్రాకృతికవ్యవస్థ) కు ప్రతిష్ఠాపక మగును.

ఇక :- రెండవవిభాగ మస్మదాది కర్మాశ్వత్థికజీవులు, సంస్కారాత్మక శుభాశుభ సంచితకర్మఫల భోగార్థ ముత్పత్తిస్థితి భంగ ప్రవాహపతితులే కర్మాశ్వత్థికజీవులు. ప్రజ్ఞానానుమోదిత కర్మచే వాసనాసంస్కార ముదయించును. తద్భోగార్థము జన్మ మెత్తవలయును. మరలనాసక్తి-మరలసంస్కారసంచయము, మరలజన్మ. ఇట్లు పూర్వోత్తరకర్మజనిత వాసనాసంస్కారమయము లుక్థములుగా గల కర్మల పరంపరంబడి ప్రజ్ఞానమూలక స్వాభిరుచింబట్టి కర్మజాలబద్ధు లగుచుందురు. ఇట్లు పునరపిజననం పునరపి మరణం 'జాయస్వ మ్రియస్వ' యగువారే కర్మాశ్వత్థికజీవులు. వీరి నుద్ధరింపనే పైజెప్పబడిన బ్రహ్మాశ్వత్థి కాధికారిక జీవుల యావిర్భావములు.

## మానవవర్గ కర్తృత్వము.

నియతి చక్రమునందలి యీ విద్యాకర్మ లక్షణ వివర్తన్యాయముం బట్టి మానవ కర్మలును రెండు భాగములు. కొందరు పురుష పుంగవులు మహర్షుల దివ్యదృష్టిచే సాక్షాత్కృతములును వేదవిద్యా సిద్ధములును, ఆధికారికములును, అగు విజ్ఞానానుమోదిత దివ్య (సౌర) కర్మల ననుగమించుచు, కర్మబంధన విముక్తు లగుటకు బ్రయాస పడుచున్నారు. ఇతర సామాన్యులు స్వాభావిక భౌతికాకర్షణ వలనను, శిక్షణాది ఆగంతుక దోషముల వలనను, ఆ ఋషిదృష్టిసిద్ధ విజ్ఞానానుమోదిత దివ్యకర్మల నుపేక్షించుచు, స్వాభిరుచికి చెందిన కల్పితాసత్కర్మ లక్షణ కర్మల ననుగమించుచు నుత్తరోత్తర కర్మబంధనములందు బద్ధు లగుచున్నారు. ఇందు, విజ్ఞానానుమోదితములు, వేదశాస్త్రసిద్ధములు, నగు కర్మలు విద్యాసాపేక్షములు. స్వరుచి వశమున క్రియమాణాలు, విజ్ఞాన విరుద్ధములు నగు కర్మలు విద్యానిరపేక్షములు. అవి బంధన విమోకమునకును, ఇవి బంధనమునకును గారణములు.

విద్యాసాపేక్ష కర్మలకు స్వరుచితో సంబంధము లేదు. ఇవి యీశ్వరాజ్ఞారూప వేదసిద్ధ విజ్ఞానానుమోదితములు. తనరుచి నొకచోనుంచి, (లెక్కసేయక) కేవలము కర్తవ్య బుద్ధితోడనే ఈకర్మల ననుగమింపనగును. వీనికార్యకారణ రహస్యము ఎఱింగినను నెఱుంగకున్నను, ఎఱుంగుటకు బ్రయత్నించుచుందురు గాక!

ఎరుకపడునంతవరకు కర్మప్రవృత్తిని వదలక యథోద్దేశ పక్షము ననుగమించుచు, కేవలము వేదాజ్ఞనే నమ్మి యాచరించుటమేలు. వేద విహితము లగుటచే నీ విద్యాసాపేక్ష కర్మలను వైదిక కర్మలందురు. వీనికి మూలప్రవర్తకము మన విజ్ఞానాత్మయే.

రెండవ విభాగము లౌకిక కర్మలు. ప్రజ్ఞాన మనస్సుం గొని ప్రత్యక్షసిద్ధ భౌతికఫల ప్రలోభనమునం బడి కావింప బడునవి. వీని కధికారమర్యాదా నియంత్రణమేమియు లేదు. మనుష్యమాత్రునకును వీనియం దధికార ముండును. ప్రకృతి కార్యకారణభావ సంబంధము వీనికి లేదు. కనుక నివి విద్యా నిరపేక్షములు. వ్యక్తికో, సమాజమునకో ఆవశ్యకతానుసారము కర్మసేయుటయే ఇందలి కర్తవ్యము. వీనికి వేదవిద్య మూలాధారముగ నుండ నావశ్యకము లేదు. ఇది వైదిక, లౌకిక కర్మవిభాగము. ఇందు మొదట విద్యాసాపేక్షములు, అధికార సిద్ధములునగు వైదికకర్మలను మీమాంస సేయుదము.

సంవత్సర ప్రజాపతి నిత్యవేదము నాధారముగాం గొని, యజ్ఞ తపో దాన లక్షణ, విద్యాసాపేక్ష ప్రాకృతిక కర్మల ననుగమింపుచు సర్వము నగుచున్నాడు గదా ! ఆ ప్రకృతిసిద్ధ కర్మత్రయిని, తన్మూలక వేదవిద్యను తమ యోగదృష్టిచే భారతీయ వైజ్ఞానికు లన్వేషింప మొదలిడిరి. తత్ఫలమే యా మౌలిక వేదాభిన్నమగు నీ వేదచతుష్టయి. ప్రకృత్యనురూపముగ యజ్ఞవిద్య ఆవిష్కరింప బడినది. తదనురూపముగనే తపఃకర్మయు, దానకర్మయుగూడ వెలసినవి.

మనము ప్రకృత్యంశలమే. కాని కొన్ని యాగంతుక ప్రతిబంధకములచే ప్రకృతి ప్రవర్తనము, నా స్వాభావిక పరమైశ్వర్య వంచితుల మగుచున్నాము. ఆ ప్రతిబంధకములు తొలగి స్వప్రభవ దేవతలతో గూడుటకు నేదేని యుపాయము లభించినచో తద్విజ్ఞాన స్రోతస్సు మనయం దవిచ్ఛిన్నముగ ప్రవహింప మొదలిడును. చివరకు మన మా శాశ్వత పదాధికారుల మయ్యెదము. ఆ యుపాయమే వేదములందు యజ్ఞము నాబడినది. మన యాధ్యాత్మిక ప్రాణాగ్ని నాధిభౌతిక భూతాగ్ని ద్వారా ఆ యాధిదైవిక దివ్యాగ్నితో యుక్తము గావించి యా ప్రభూత దైవబలమును ఆధ్యాత్మిక ప్రాణాగ్నియందు జ్వలింపజేసి తద్ద్వారా మనః ప్రాణ వాఙ్మయాత్మను సబలము గావించు నొక వైజ్ఞానిక విశేష ప్రక్రియయే యజ్ఞము. ఈ యజ్ఞకర్మయందు మన కల్పనలకు (రుచులకు) లేశమును సంబంధము లేదు. పాశ్చాత్యమత ధర్ములు యజ్ఞవిద్యావిస్మారకులు. ఏ వైజ్ఞానికులు ప్రాకృతిక యజ్ఞేతి కర్తవ్యతానుసారము ఈ వైధానుష్ఠేయ యజ్ఞేతి కర్తవ్యతకు ప్రక్రమములు, పద్ధతులు పదార్థములు, మంత్రములు ఋత్విక్సంపత్తి, యేర్పరచిరో ఆ యా విధముల ననుసరించుటవలననే యజ్ఞకర్మ స్వరూపము సంపన్న మగుచున్నది. అటుగాక మనుష్య బుద్ధి సమావేశము కల్గినా, అది అభ్యుదయ స్థానమందు ప్రత్యవాయకారణ మగుచున్నది. "వ్యృద్ధం వై తద్యజ్ఞస్య యన్మానుషమ్" అని శ్రుతియు జెప్పినది. "యద్వై దేవా అకుర్వం స్తత్కరవాణి,

ఎరుకపడునంతవరకు కర్మప్రవృత్తిని వదలక యథోద్దేశ ఫలము ననుగమించుచు, కేవలము వేదాజ్ఞనే నమ్మి యాచరించుటమేలు. వేద విహితము లగుటచే నీ విద్యా సాపేక్ష కర్మలను వైదిక కర్మలందురు. వీనికి మూలప్రవర్తకము మన విజ్ఞానాత్మయే.

రెండవ విభాగము లౌకిక కర్మలు. ప్రజ్ఞాన మనస్సుం గాని ప్రత్యక్షసిద్ధ భౌతికఫల ప్రలోభనమునం బడి కావింప బడునవి. వీని కధికారమర్యాదా నియంత్రణమేమియు లేదు. మనుష్యమాత్రునకును వీనియం దధికార ముండును. ప్రకృతి కార్యకారణభావ సంబంధము వీనికి లేదు. కనుక నివి విద్యా నిరపేక్షములు. వ్యక్తికో, సమాజమునకో ఆవశ్యకతాను సారము కర్మసేయుటయే ఇందలి కర్తవ్యము. వీనికి వేదవిద్య మూలాధారముగ నుండ నావశ్యకము లేదు. ఇది వైదిక, లౌకిక కర్మవిభాగము. ఇందు మొదట విద్యాసాపేక్షములు, అధికార సిద్ధములునగు వైదికకర్మలను మీమాంస సేయుదము.

సంవత్సర ప్రజాపతి నిత్యవేదము నాధారముగా గొని, యజ్ఞ తపో దాన లక్షణ, విద్యాసాపేక్ష ప్రాకృతిక కర్మల నను గమించుచు సర్వము నగుచున్నాడు గదా! ఆ ప్రకృతిసిద్ధ కర్మ త్రయిని, తన్మూలక వేదవిద్యను తమ యోగదృష్టిచే భారతీయ వైజ్ఞానికు లన్వేషింప మొదలిడిరి. తత్ఫలమే యీ మౌలిక వేదాభిన్నమగు నీ వేదచతుష్టయి. ప్రకృత్యనురూపముగ యజ్ఞ విద్య ఆవిష్కరింప బడినది. తదనురూపముగనే తపఃకర్మయు, దానకర్మయుగూడ వెలసినవి.

మనము ప్రకృత్యంశలమే. కాని కొన్ని యాగంతుక ప్రతిబంధకములచే ప్రకృతి ప్రదత్తమగు, నా స్వాభావిక పరమైశ్వర్య వంచితుల మగుచున్నాము. ఆ ప్రతిబంధకములు తొలగి స్వప్రభవ దేవతలతో గూడుటకు నేదేని యుపాయము లభించినచో తద్విజ్ఞాన స్రోతస్సు మనయం దవిచ్ఛిన్నముగ బ్రవహింప మొదలిడును. చివరకు మన మా శాశ్వత పదాధికారుల మయ్యెదము. ఆ యుపాయమే వేదములందు యజ్ఞము నాబడినది. మన యాధ్యాత్మిక ప్రాణాగ్ని నాధిభౌతిక భూతాగ్ని ద్వారా ఆ యాధిదైవిక దివ్యాగ్నితో యుక్తము గావించి యా ప్రభూతదైవబలమును ఆధ్యాత్మిక ప్రాణాగ్నియందు జ్వలింపజేసి తద్ద్వారా మనః ప్రాణ వాఙ్మయాత్మను సబలము గావించు నొక వైజ్ఞానిక విశేష ప్రక్రియయే యజ్ఞము. ఈ యజ్ఞకర్మ యందు మన కల్పనలకు (రుచులకు) లేశమును సంబంధము లేదు. సాక్షాత్కృత ధర్ములు యజ్ఞవిద్యావిష్కారకులు. ఏ వైజ్ఞానికులు ప్రాకృతిక యజ్ఞేతి కర్తవ్యతానుసారము ఈ వైధానుష్ఠేయ యజ్ఞేతి కర్తవ్యతకు ప క్రమములు, పద్ధతులు పదార్థములు, మంత్రములు ఋషిస్వీకృతి సంపత్తి, యేర్పరచిరో ఆ యా విధముల ననుసరించుటవలననే యజ్ఞకర్మ స్వరూపము సంపన్న మగుచున్నది. అటుగాక మనుష్య బుద్ధి సమావేశము కల్గినా, అది అభ్యుదయ స్థానమందు ప్రత్యవాయకారణ మగుచున్నది. "వ్యృద్ధం వై తద్యజ్ఞస్య యన్మానుషమ్" అని శ్రుతియు జెప్పినది. "యద్దైవ దేవా అకుర్వం స్తత్ కరవాణి,

కీవా ననువిధా వై మనుష్యాః" "యదేవేహ తదముత్ర యద ముత్ర తదన్విహ" ఇది యజ్ఞకర్మ మూలప్రతిష్ఠ. ఇదే యజ్ఞ కర్మ సంక్షిప్త పరిచయము.

రెండవ విద్యాసాపేక్షకర్మ 'తపస్సు'. ఇది ఆత్మ యందు బలాధానము సేయుటకైన వైజ్ఞానికప్రక్రియ. ఇందొకవిధముగ ప్రాణాదానము గావింపవలయును. ప్రకృతియం దొకస్వాభావిక నియమమున్నది. ఏమన:-దాని (ప్రకృతి) ఆయతన (ఉదర) మం దేవస్తువుంచిన నది దానిని పూర్ణసమృద్ధము గావించి తిరిగి యిచ్చును. చల్లినవిత్తనములను పృథివి యెన్నోరెట్లుగ జేసి మనకిచ్చును. ప్రాణదానరూప వ్యాయామముచే ప్రాణశక్తి మరింతవృద్ధి నొందును. తపఃకర్మ (ప్రాణవ్యయము) లేకుండ బలాధాన మెన్నడును జరుగదు. "ఏతద్వై తప ఇత్యాహు ర్యత్ స్వం దదాతి" (తై. బ్రా.) విశ్వసంపత్తి మనప్రాణమున కన్నము గాగోరెదము. అందుకు మన ప్రాణము నర్పింపవల యును. అనగా విశ్వసంపత్తి నన్నముగా జేసికొనుటకు ముందు తానే స్వయముగ విశ్వమున కాహుతి గావలయును. అటు గాక విశ్వసంపత్తి తన కన్నముగావలయు ననుకొనువాడు విశ్వమున కన్నముగ మాత్రమే (భోగ్యము-పరముఖాపేక్షి) యగును. ప్రజాసేవకు డగు రాజు ప్రభువు కాగలడు. స్వామి పదమున కధిష్ఠాత సేవకుడే. వ్యయమే ఆగమన ద్వారము. చివరకు బలాధాన ముఖ్యద్వారము తపస్సే అని ఫలితార్థము.

మూడవ విద్యాసాపేక్షకర్మ దానము. యజ్ఞపరిభాషలో [illegible] యందురు. అది లేని యజ్ఞకర్మ స్వరూపమే

యుచ్ఛిన్నమగును. 'హతయజ్ఞమదక్షిణమ్'. యజ్ఞకర్మ యొక మహాకర్మ. తత్స్వరూప సంపాదన కేవల మొక యజమానుని వలస గాదు. అందుకు అధ్వర్యుడు, హోత, ఉద్గాత-బ్రహ్మ మొదలగు వారి సాయముం గొనవలయును. ఈయందరికర్మయే యజమానుని యజ్ఞకర్మకు సంపాదకము. ఈ విషయము వర్ణవ్యవస్థా విజ్ఞానమందు జెప్పబడినది. కర్మద్వారా ఋత్విజుల యాత్మాగ్నియు (ఆత్మప్రాణము) ను, యజ్ఞాగ్నియందు ప్రవేశించియుండును. ఇట్టిచో యజ్ఞకర్మజనిత యజ్ఞాతిశయము కర్తయగు యజమానునకు జెందవలయుచో నాఋత్విజుల కర్మానుగ తానుశయమును యజ్ఞాతిశయమునుండి వేరుగావింప వలయును. అందు కుపాయము దక్షిణ. క్షతయజ్ఞ పునఃసంధాన కారక మగుటచే నీకర్మ దక్షిణా శబ్దముచే వ్యవహరింపబడుట యుక్తమే.

స్మార్తదృష్టితో నీవిషయమునే చూతము:-స్వాధ్యాయ కర్మ యొక యజ్ఞము. మహాయజ్ఞము, (మహాసత్రము) అని సంస్కారవిజ్ఞాన ప్రకరణ మందు జెప్పబడినది. ఈ స్వరూప నిష్పత్తి యాచార్యునివలన నగును. ఆచార్యుడే అధ్యాపనకర్మ ద్వారా శిష్యుని స్వాధ్యాయకర్మయందు గృతకృత్యుం గావించును. ఆకర్మద్వారా ఆచార్యుని యాత్మప్రాణమును శిష్యుని స్వాధ్యాయ యజ్ఞమందు ప్రవిష్టమగును. తదనంతరము బ్రహ్మచారియగు శిష్యుడు సమావర్తన సంస్కారమునకు బిదప ఆచార్యు ననుజ్ఞగొని గృహస్థు డగుటకు మరలును. గార్హ

ష్యమం దితడు సంచిత స్వాధ్యాయయజ్ఞము (విద్యాబలము) ద్వారా జీవనపథ యాత్రం గావింపవలసియున్నది. ఈమార్గ మందు నిర్ద్వంద్వత తప్పక యపేక్షితమై యున్నది. ఇది స్వసంచిత స్వాధ్యాయమునకు తానే భోక్తయగునపుడు సంభవమగును. అందుకు దనయందున్న యాచార్యప్రదత్త ప్రాణమును మరల త్రిప్పిపంప వలయును. ఈ సంభావనా పూర్తి కొరకు బ్రహ్మచారి స్వాధ్యాయ యజ్ఞానంతరము గురుదక్షిణ యీయవలసి యున్నది.

లోకదృష్టితో:-(i)ఒకబ్రాహ్మణుడు వేదవిద్యనో, శాస్త్రములనో అధ్యయనము సేయును. అపుడితని గృహస్థాశ్రమాను బంధు లగు నవసరములను సమాజము పూర్తిగావించును. పుస్తకములు, వస్త్రములు మొదలగు పరిగ్రహములనుకూడ సమాజమువలననే యతడుపొందును. వానిద్వారా సమాజాత్మ ప్రాణ మీతని యధ్యయన యజ్ఞమందు బ్రవేశించియుండును. దాని నీతడు మరల సమాజమునకు దిరిగి యీయకుండినచో నాయజ్ఞము హతము. దక్షిణారూపమున నీయజ్ఞములో గొంత భాగము (విద్యా-జ్ఞానము) సమాజమునకు బంచవలయును. ఈ విద్యావినిమయముచే నీతని విద్యాయజ్ఞము పుష్పితము, పల్లవితము నగుచు సమృద్ధ మగుచుండును.

(ii) సమాజముయొక్క యర్థసహయోగముచే నొక ధనికు డర్థయజ్ఞమున కధిష్ఠాత యగును. కాని కేవలము తన [illegible] వలననే తా నింతవాడనైతి ననుకొని ఆ యజ్ఞాం

శము దక్షిణారూపమున సమాజమునకు గొంత తిరిగి (సామాజికకార్యములకు) యిచ్చుకొను చుండక మదాంధుడై తానొకడే దానికి భోక్తయగుచో "హతయజ్ఞమదక్షిణం" అయి ఆయజ్ఞము ఆనందదాయిగాక కొలదికాలములోపలనే అంతరించును.

(iii) ఒకయంత్రాధికారి కర్మచారుల సహయోగముచే కాలాంతరమున విపులోదరార్థయజ్ఞ పాత్రుడగును. ఆయజ్ఞమందు కర్మచారుల రక్తమాంసము లాహుతము లగును గదా! తమ స్వాస్థ్య మాహుతిగావించి యీకర్మచారి ఋత్విజులు తన యజమానుని అర్థయజ్ఞము బూర్తిగావించిరి. ఆయజ్ఞము కణకణమందును కర్మచారి ఋత్విజుల ప్రాణములు వ్యాప్తములై యున్నవి. వాని నాతడు తిరిగియీయడా? అట్టి రుధిరప్రదగ్ధ భాగములచే ఆ యజమాని యెన్నడును సుఖింప జాలడు. అతడు తన యర్థయజ్ఞమును సుఖశాంతి కారణముగ జేసికొనుటకు ముందాయనసమర్థులును, బలిదానమునందాదర్శమూర్తులు నగు కర్మచారుల క్షతిని బూరించవలయును. వారి స్వాస్థ్యరక్షణకు వలయు దక్షిణ యిచ్చినపిదపనే ఆతడు తన యజ్ఞమునకు ముఖ్యభోక్త కాగలడు.

దక్షిణలేనియజ్ఞము చెడుననుటకు గొన్ని లోకదృష్టాంతముల జూపితిమి. ఇక ప్రకృత మనుసరింతము. యజ్ఞదక్షిణ యన వేదసిద్ధ యజ్ఞానుబంధి దక్షిణయే అభిప్రేతము. వేదవిద్వాంసులు పడిన శ్రమకు ప్రతిఫలముగ శాస్త్రవిహితము

లగు గో-వాసో-హిరణ్యా-రజ తాదులు దక్షిణగ నిచ్చుటచే వారి స్వత్వ మీయజ్ఞాతిశయమునుండి తొలంగును. అది యజమానులకు ప్రాతిస్వికసంపత్తి యగును. దక్షిణాదాన మొక శాస్త్రీయకర్మ. కనుకనే అధికారిభేదముచే పాత్రవ్యవస్థ జరిగినది. హీనాంగులు, అధికాంగులు, రోగార్తులు, వామనులు, షండులు, మూర్ఖులు మొదలగువారు దక్షిణకు పాత్రులుగారు. సంపన్నుడో, దరిద్రుడో దానాధికారియే దానపాత్రుడు. "మాప్రయచ్ఛేశ్వరేధనమ్" అన్నది దక్షిణా విషయమున నపవాదముగ నెంచబడును. దానఫల మతీంద్రియము గాని లౌకికఫలము గాదు. కనుక యజ్ఞకర్మ కధిష్ఠాతలగు ప్రాణదేవతల భేదముంబట్టి దక్షిణాద్రవ్యముల వ్యవస్థయు గావింపబడినది. యజ్ఞము జేయించు ఋత్విజుల యావశ్యకతలనుబట్టి దక్షిణాద్రవ్యములు కల్పింపబడవు. యజ్ఞాభిపూజిత ప్రాణదేవతానురూప దక్షిణాద్రవ్యములనే యనుగమింపవలయును. కనుక దక్షిణాదానమందు స్వరుచికి ప్రాధాన్యమేమియు లేదు.

తపఃకర్మ ఆత్మదానము (ప్రాణదానము) కనుక అంతర్దానము. దక్షిణాద్రవ్యము ద్రవ్యదానము కనుక బహిర్దానము. మన ద్రవ్యమందు మనయాత్మ అర్క- (రశ్మి) సంబంధమున నుండును. కనుకనే మమకార ముండును. దీని బట్టియే విత్తపర్యంతము నాత్మవ్యాప్తి యంగీకరింపబడినది. "యతద్విత్తం [illegible]" స్వసంపత్తి క్షయమం దాత్మక్షుబ్ధ మగుటయే

యిందుకు నిదర్శనము. దక్షిణాద్రవ్యమందు దక్షిణాదాత యగు యజమానుని యాత్మ రశ్మిరూపమున నుండును. అది గ్రహీత యాత్మతో జేరి వికాసభావము నొందును. భూమాభావము నొందును. ఎట్లన:-

సూర్యకేంద్రమునుండి వెలువడురశ్మలు దర్పణ జల స్ఫటి కాది రశ్మిగ్రాహక పదార్థములందు బ్రతిబింబితములై యొక్కొక నవీన సూర్యుని గల్గించుచున్నవి. ఆ యా సూర్యు నుండి స్వతంత్ర రశ్మిప్రసారము జరుగుచుండును. చివర కీప్రతి బింబ భావముచే రశ్మలు భూమాభావము నందును. సూర్యుడు నేడు, త్రైలోక్యమందు ప్రకాశరూపమున వెలుంగుచున్న దీదక్షిణాదానము వలననే. ప్రతిబింబభావము వలననే. స్వయం సూర్యుని ప్రత్యక్షమే దక్షిణాదానమువలన నగుచున్నది. సూర్యరశ్మి మనకను లందు ప్రతిబింబ రూపమున బ్రతిఫలితము గాకున్నచో సూర్యదర్శనమే అసంభవము. ఇదే విధము. ఇదే భూమాభావము ఈ దక్షిణాకర్తయందు నెరుంగవలయును.

దక్షిణాదానమునందు స్వసత్త్వ నివృత్తియు పర సత్త్వస్థాపనయు నగును. దక్షిణం గొనువాని ప్రజ్ఞానమనస్సు సోమమయము. కనుక వీర్యము, రశ్మిగ్రాహకము, చిద్గ్రాహకము నగును. దానద్రవ్యమం దున్న యజమానుని యాత్మ రశ్మలు గృహీతయొక్క యా మనస్సునందు బ్రతిబింబిత ములై సూర్యరశ్మివలె భూమాభావము నొందును. దాంపత్య

యజ్ఞకర్త యందు శుక్రశోణిత దక్షిణ యున్నది. ఈ దానముచే దానదాతృ (మాతాపితలు) ప్రజ సంతతిలక్షణ భూమాభావము నొందుచున్నది. కన్యాదానముచే దాత అన్యవంశ భూమాభావ కారణు డగుచు, తానుగూడ పరంపరగ భూమాభావమున కధికారి యగుచున్నాడు.

దానద్రవ్యముద్వారా దాత యాత్మ గృహీతయందు ప్రవేశించు చున్నది కనుక దాతృగుణదోషములు గ్రహీత యందు ప్రవిష్టము లగుట కలుగును. కనుకనే ధర్మశాస్త్రము అసత్ప్రతిగ్రహములను హేయ మన్నది. ఇట్లే గ్రహీతృ గుణ దోషముల నుండి దాతయు దప్పించుకోజాలడు. కనుకనే సత్పాత్రదానము ఆదేశింపబడినది. కుపాత్రదాన ప్రతిగ్రహము లనిష్టములు. ప్రతిగ్రహముం జీర్ణించుకొనుటకు గ్రహీతకు జాలి నంత బలముండవలయును. లేనిచో స్వాభావికబ్రహ్మవీర్య ముచ్ఛిన్న మగును. అష్టదాన, తులాదాన, తిలదా నాదుల పరిగ్రహములు మహాభయంకరములు వానింజీర్ణించుకొనుట సాధారణపుబని కాదు. అట్టి ప్రతిగ్రహీతల వంశోచ్ఛేదము కనబడుచున్నది. అట్టివారు బ్రహ్మవీర్యమునకు దిలాంజలు లిచ్చి వైతురు. బ్రాహ్మణపతనమునకు గారణము లెన్నియున్నను అసత్ప్రతిగ్రహ మొక ముఖ్యకారణము. కావుండు:-ఇంతకును జెప్పదలచినది యజ్ఞ తపస్సులవలె దానము నొక శాస్త్రీయ కర్మ. విద్యాసాపేక్షము. మానవీయ కల్పనకు అధికారములేని [illegible]వన్న. అనియే.

యజ్ఞతపోదానములు మూడును, వేదవిజ్ఞాన సాపేక్షములు కనుక విద్యాసాపేక్షములు. వీని యుదర్కము (ఫలము) పరోక్షము. వీని పరిజ్ఞానము సామాన్య విశేషభావములచే రెండు విధములు. శాస్త్రములవలన కేవలము వీని పద్ధతులెరింగి యాచరించుట సామాన్యపరిజ్ఞానము. శ్రద్ధా విద్యా ఉపనిషత్తుల యనబోధచే గావింపబడిన యాకర్మ, విశేషాతిశయకారణమై విశేషపరిజ్ఞానమునకు జెందును. వస్తుతః శ్రద్ధాది విరహితకర్మ యిష్టమునకుబదులు అనిష్టకారణమును గావచ్చును. ఏలయన నప్పుడు కర్మేతికర్తవ్యతలపై సంపూర్ణవిశ్వాసముండకపోవచ్చును. అందువలన కర్మప్రవృత్తి బలము శిథిలమగుట స్వాభావికము. అభినివేశ ముండదు. చివరకంశతః ఉపేక్షాధర్మ యుక్తమై యనిష్టకారణ మగును.

శ్రద్ధాది పరిజ్ఞానము లేనందున నేటిద్విజాతి యజ్ఞకర్తను ప్రదర్శనమాత్ర మనుకొను చున్నది. అందువలన యజ్ఞకర్మకు నూతనపద్ధతుల గల్పింప సాహసించుచున్నది. ఇందు కుపపత్తి జ్ఞానము లేమియే హేతువు. చివరకు కర్మశ్రద్ధ దినదినము తగ్గుచున్నది.

ఇది యిట్లే యేలచేయవలయును? దీని యుదర్కమేమి? అను కార్యకారణరహస్యము పేరే విద్య. కార్య-ఫలముల కేమిసంబంధము? కర్మకు మూలప్రతిష్ఠ యేమి? అనుటకు సమాధాన ముపనిషత్తు. ఈ ఫలసంబంధి విజ్ఞానముచే కర్మయందు విశ్వాస ముత్పన్న మగును. ఉపనిషత్సమ్మత

కర్మతో నాత్మసంబంధము కలుగుటయే శ్రద్ధ. ఇది మధ్యస్థమై ఆత్మకు గర్మతో సంబంధము (గ్రంథిబంధనము) గూర్చుచున్నది. శ్రద్ధలేని కర్మ వ్యర్థము. మొత్త మీమూటి సమన్వయము వలనను కర్మ, వీర్యవత్తర మగుచు సఫల మగుచున్నది. "యదేవ విద్యయాకరోతి శ్రద్ధ యోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి"

1. కార్య కారణ రహస్య పరిజ్ఞానం-విద్య.
2. కార్యేణ ఫలాభిసంబంధ పరిజ్ఞానం-ఉపనిషత్.
3. ఆత్మనః కార్యేణ సంబంధః-శ్రద్ధా.

వేదశాస్త్ర మార్షఋషులదృష్టి. కనుక వైదికకర్మల నార్షధర్మ మందుము. ఆర్షధర్మము వెనుక జెప్పబడిన సంతమతము వీనియందు పరస్పరవిరోధము లేదా? యన్న దటుంచుడు. రెంటిలక్ష్యమును లోకకల్యాణమే. కాని ఆర్షధర్మము శాశ్వతధర్మము. సంతమతము సామయికమతము. అది యాప్రళయాంతమును సమానరూపము. ఇది ఆయా సమయ విశేషములం దుపకారము. ఆర్షధర్మము ప్రాకృతికధర్మము. ప్రకృతియొక్క నిత్య నియతిసూత్రము. సంతమతము సామయిక శ్రేష్ఠపురుషుని దేశ కాల పాత్ర ద్రవ్య శ్రద్ధానుగత యోగ్యతకు జెందినది. కాని ఉపకారకములు, తథ్యపూర్ణములు నగు నుపదేశముల సంగ్రహము అగు ఆర్షధర్మ మవిచ్ఛిన్నధరాతలము. సంతమతములు వీనిపై నున్న ఖండఖండాత్మక సామయిక భవ్య ప్రాసాదములు. సమయానుకూలముగ వానియం దుచ్చావచ భావ సమావేశ మగుచుండును. ఆర్షధర్మ మేకరూప ప్రతిష్ఠి

తము. దీనిని నాధారముగా గొనివచ్చిన సంతమతము నార్ష ప్రజ స్వీకరించును. అటుగాని మతము నది పరిత్యజించును.

కాని కొన్ని శతాబ్దములనుండి సంతమతము లార్ష మతము నుపేక్షించియుండుట శోచనీయము. అందువలన లభించిన లాభములేదు గాని కలిగిన భీషణపరిణామములం గూర్చి వర్ణించుట కిదియదనుగాదు. ఒక కటుసత్యము మాత్రము పల్కుటకు వెనుదీయము. ఆర్షప్రజ యార్షధర్మము ననుగమింప నంతవరకు నభ్యుదయము లేదు.

ఆర్షధర్మ మన్నిటికంటె మొదట ఈశ్వరసత్త ఈశ్వరోపాసన, దేవోపాసన, యజ్ఞ తపో దానా ద్యాత్మోపకారక, ఆత్మవికాస సిద్ధాంతములను వెలయించినది. కాని నేదృష్టితో? అన్నచో ఆర్షధర్మ సంతమతములం బోల్చునపుడు కొంచెము హృదయమునకు గష్టకారణము కావచ్చును.

ఋషి-పితృ-దేవ-అసుర-గంధర్వ పశ్వాది ప్రాణవిశేష తారతమ్యముచే ప్రజాపతి, విశ్వరచనా సమర్థు డగుచున్నాడు. ప్రాణగర్భిత భూతాత్మికయగు నీ ప్రాజాపత్యసృష్టి కొక నిశ్చిత క్రమ మున్నది. నిశ్చిత సంస్థాన మున్నది. ఈ ప్రాజాపత్యప్రాణముల ప్రాకృతిక యజ్ఞమందు విషమత వచ్చినపుడెల్ల ప్రాణకృతమూర్తి యగు ప్రజావర్గ స్వరూపమందు విషమత వచ్చుచుండును. తద్దూరీకరణమునకు యజ్ఞియప్రాణదేవతల విషమత దొలగించుట యావశ్యకము. ఏ వైజ్ఞానికప్రక్రియచే తత్తత్ప్రాణదేవతాగర్భిత, తత్తద్భౌతికపదార్థ సంయోగముచే

కృతరూపమగు నే యజనప్రక్రియచే దేవక్షోభశాంతిపూర్వక ముగ ప్రకృత్యనుగ్రహప్రాప్తి కలుగునో ఆప్రక్రియావిశేషమే యజ్ఞకర్మ. దైవీవిపత్తులకు, శారీరకవిపత్తులకు జికిత్సయు ప్రజా-లోక-విత్త-సామ్రాజ్యాది లోకవైభవములకు రక్షయు వికాసమును మొదలగున వన్నియు యజ్ఞకర్మచే సిద్ధములు.

సంతమతానుయాయివలె ఆర్షమతానుయాయి తన యుపాస్యదేవతయెదుట కాతర భావమున నిలువబడి దయాభిక్షం గోరడు "పాపాత్ముడను, పాపకర్ముడను, పాపసంభవుడను" అని తన యాత్మవీర్యపతనము గావించుకొనడు. తన యుపాస్యదేవతను యజ్ఞకర్మద్వారా ఆహ్వానించి తన యుద్దేశ్య సిద్ధికై దానిని వివశముజేసి వేయును. సరిగాజేసిన యజ్ఞకర్మ యెన్నడును వ్యర్థముగాదు. యజ్ఞసూత్రాకృష్టదేవత వివశయై ఫలప్రదానము గావించితీరవలయును. యజ్ఞకర్మచే బ్రహ్మాండాధిపత్యమునే పొందవచ్చును. పూర్వులట్లు పొందిరి.

కాని నేడాయజ్ఞకర్మను విద్యాసాపేక్ష వైదికార్ష ధర్మమును బరిత్యజించి ఆర్షధర్మప్రతిష్ఠావంచితములగు సంత మతములను స్వీకరించి మనము సర్వస్వమును బోగొట్టుకొంటిమి. ఋషులద్వారా భగవంతుడు మన కన్నిసాధనములను బ్రసాదించి యున్నాడు. వాని నుపయోగించుట మరచి బిచ్చమునకు సిద్ధమయితిమి. అన్నియెడలను బిరికితన మలవడినది. కానిండు, ఇక :-

విద్యానిరపేక్ష లౌకికకర్మల వంక జూతము :- భూత ప్రధాన లౌకికకర్మలను, (1) రమణీయాకర్మలు, (2) కపూయ కర్మలు నని రెండుభాగములు గావింపవచ్చును. మొదటివి శుభోదర్కములు. రెండవవి యశుభోదర్కములు. కపూయ కర్మలు, అవిద్యామూలకములు కొన్ని, అవిద్యాజనకములు కొన్ని. హింస సాస్తేయ మద్యపాన మిథ్యాభాష ణాగమ్యాగమ నాదు లవిద్యాజనకములు. వీనివలన గలిగిన మాలిన్య మిను మును త్రుప్పువలె నావరించును. అవిహితాప్రతిసిద్ధము లవిద్యామూలకములు. నిషిద్ధకర్మలు కపూయకర్మలకు బ్రాధ మావస్థలు. అవిహితాప్రతిషిద్ధకర్మలు కపూయకర్మల కుత్త రావస్థలు. కనుక మొదటి వానిని వదలి శాస్త్రసిద్ధకర్మల ననుగమించి రెండవవియు వదలును. అటు గాని నాడీపరంపర కంతము కన్పట్టదు. అవిద్యాసంస్కారనిరోధము సెడి, శుభ సంస్కారనిరోధము సబలము గావలయును. అప్పుడు కర్మబంధము విడచును. అవిద్యాజనకములు వికర్మలు. అవిద్యామూల కములు అకర్మలు. వైదిక లౌకికదృష్టులం దీరెండును హేయ ములె. ఇవి సామాజిక వైయక్తిక వికాస విఘాతకములు. ఇంతకు వైదిక లౌకిక కర్మలు ఈ క్రిందచూపినట్లు నాల్గుభాగ ములుగనో మూడుభాగములుగనో అనుకొనవచ్చును. ప్రపంచ మందలి మంచిచెడ్డలగు లౌకిక వైయక్తిక సామాజిక పార లౌకిక రాష్ట్రీయాది కర్మలెల్ల నీ నాల్గు విభాగములందె అంత ర్భావము లనవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. వైదికకర్మ | (1) విద్యాసాపేక్షము, శాస్త్రసిద్ధసత్కర్మ. | 1 | కర్మ |
| 2. లౌకికకర్మ | (1) విద్యానిరపేక్షము, రమణీయము, శాస్త్రానుమోదితము, శుభకర్మ | | |
| | (2) అవిద్యాజనకము, కపూయకర్మ శాస్త్రనిషిద్ధము అశుభము, వికర్మ | 2 | |
| | (3) అవిద్యామూలకము, కపూయము, శాస్త్రోపేక్షితము. అశుభము అకర్మ | 3 | |

"కర్మణోహ్యపిబోద్ధవ్యం, బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః"

ఈ కర్మవిభాగము లందలి విద్యాసాపేక్ష వైదిక కర్మావాంతరములగు యజ్ఞతపోదానలక్షణ సత్కర్మలంగూర్చి ముచ్చటించుకొనుట యైనది. తక్కినవాటిలో చివరి రెంటిని గూర్చియు జెప్పవలసిన పనిలేదు. నేడు చాలవరకు నీకర్మల సజీవప్రతిమలే మనకు దర్శన మిచ్చుచున్నవి. ఇక విద్యానిరపేక్ష రమణీయ కర్మలంగూర్చి యించుక తెలిసికొందము.

విద్య-కర్మ అనునివి సౌరతత్త్వము, పార్థివతత్త్వమునని పైని జెప్పియుంటిమి. దేవప్రధాన మగు మొదటిది విద్యాప్రధానము. భూతప్రధాన మగు రెండవది కర్మప్రధానము. కనుక సౌరవిద్యామూలక కర్మలు విద్యాసాపేక్షము లనియు, పార్థివ (భూత) మూలక కర్మలు విద్యానిరపేక్షము లనియు నంటిమి. మొదటివి విజ్ఞానసహకృతములు, ఆధికారికములు. రెండవవి భూతానుగత ప్రజ్ఞానసహకృతములు. యథారుచి సంభవములు. వేదవిద్యానియంత్రణ లేనివి. లోకరుచియే వీనికి మూల

ప్రతిష్ఠ. కనుకనే మొదటివి వర్ణసంపత్తియుక్త ద్విజాతివర్గమునకు జెందినవి. రెండవ తరగతి వన్నియు మనుష్యమాత్రులెల్లరు నాచరింపదగినవి. కనుక యీ లౌకికరమణీయకర్మలు ఏదో యొక రూపమున నన్ని దేశములందును సులభ్యము లగుచున్నవి. యావశ్యకతం గుర్తించి తారతమ్యమున యథాశక్తిగ నందరును వాని ననుగమించుచున్నారు. ఇవి శుభకర్మ లనుటకు సందేహము లేదు. స్మృతియు వీనియుపాదేయతయు, శుభోదర్కతయు స్వీకరించినది.

ఈ లౌకిక రమణీయ కర్మలు ముఖ్యముగ (1) ఇష్టా, (2) పూర్త, (3) దత్తము లను మూడుభాగము లనవచ్చును. అర్థసాధక కర్మలే లౌకికకర్మలు మనోవృత్తిభేదముంబట్టి యీ యర్థతంత్రము, (i) స్వార్థము, (ii) పరార్థము, (iii) పరమార్థము నని మూడు విధములు. ఇందు మొదటితరగతికి జెందిన కర్మలను ఇష్టకర్మలందురు. ఇవి కర్తయొక్క వైయక్తిక స్వార్థమునకు జెందినవి. రెండవ తరగతివానిని దత్తములందురు. ఇవి కర్తకేకాక కొంతమంది యితరులకును లాభముగూర్చునవి. ఇక మూడవతరగతివానిని ఆపూర్తము లందురు. ఇవి కర్త ద్వారా అగణితవ్యక్తులకు సమాజమునకు హితసాధనములు.

మరియు కొన్నికర్మ లీమూడుతరగతులకు జెందియుండును. చూడుడు :- చికిత్సాకర్మయందు స్వార్థ పరార్థములు రెండును సిద్ధించును గదా! రాజనీతికర్మ లందు స్వార్థ పర

మార్గములు రెండును గలవు. వస్తుతః కేవలపరార్థములు, కేవల పరమార్థములు నుండవు. అన్నిటను స్వార్థ ముండును. "మనము మనకొరకు మేమియు జేయుటలేదు. అనుకొను పరార్థ పరమార్థవృత్తియు, ఆత్మశాంతికి గారణ మగుచు స్వార్థసిద్ధికి ద్వార మగుచున్నది.

తన యిష్టదేవతను లౌకికముగా నుపాసించుట ఆగతాతిథిసత్కారము, శ్రమలక్షణ బ్రహ్మకర్మయగు తపస్సు, సత్యభాషణము, అస్తేయము, అహింస ఇత్యాదులు ఆత్మతుష్టి హేతువులు. ఆత్మహితసాధనములు. ఇవి యిష్టకర్తలు. అన్ని దేశములవారు, అన్ని ధర్మములవారు స్వస్వాభిమతలౌకికోపాసన కనుగాములే. ఈ సామాన్యధర్మము లందరును పరిగ్రహించి యే యున్నారు.

ఇట ముఖ్యముగా గుర్తింపదగిన దొకవిషయము, ఏమన:- భారతీయఋషుల విజ్ఞానానుమోదిత శాస్త్రీయప్రతిభ, ఈ లౌకి కేష్టకర్మ లందును, పారలౌకిక కర్తనమావేశము గావించి వైచినది. మరియు అపూర్వ దత్తనామకములందును, శాస్త్రనిష్ఠ ప్రవిష్టమైనది. ఇదే మనపూర్వుల శాస్త్రైకశరణ మూల కానన్యనిష్ఠ. వీరి యాధ్యాత్మికోపాసన ప్రకృతిభేద ముపై బ్రతిష్ఠితమై యున్నది. వీరి యతిథిసత్కారకర్తయు నొక పరిష్కృతపద్ధతిపై సర్వోత్కృష్టముగ వెలయుచున్నది. వీరి సత్యభాషణ అహింస మొదలగు నిష్టకర్తలెల్ల ప్రకృతి సూత్రబద్ధములై లోకభక్తితో పరాభక్తికిగూడ ననుగాము

లగుచున్నవి. తత్త్వతః జన్మక్షణము మొదలు నిధనక్షణ పర్యంతమును, ఈ శాస్త్రనిష్ఠుల వైదిక లౌకిక కర్మలెల్లను శాస్త్రాదేశమును మూలప్రతిష్ఠగా గొని యున్నవి. ఇదే వీరి శాస్త్రములయొక్క ధర్మకర్మలయొక్కయు సనాతనత్త్వము. ఇదే వీరి యమృతోపాసన. ఈబలముననే వీ రమృతపుత్రులు. 'అమృతస్యపుత్రా అభూమ' ఎట్టిమర్త్యపదార్థము లందును, వీరు మర్త్యవ్యాజముచే అమృతమునే యన్వేషింతురు. లోక విభూతులందు నమృతాన్వేషణమే. ఈబలమువలననే వారు సఫలురు. "భూతేషుభూతేషు విచిత్యధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవన్తి" ఈసౌభాగ్యము కేవలము మృత్యుధర్మాను యాయులగు నన్య లౌకికపురుషులకు లేదు. పారలౌకికమును, అమృతవిభూతి ప్రతిచ్ఛాయా యుక్తము నగు భారతీయుల యీ యిష్టకర్మంగూర్చి యీ వచనము లరయుడు.

"అధ్యాత్మదేవతాపుష్ట్యై యత్కర్మవిధివత్కృతం
వాచాప్రాణేనమనసా తదిష్టమభిధీయతే
అగ్నిహోత్రంతపఃసత్యం దేవానాంచానుపాలనం
ఆతిథ్యంవైశ్వదేవంచ ఇష్టమిత్యభిధీయతే.

స్మృతికారులు ఇష్టాపూర్తదత్తముల కనేకలక్షణములు చెప్పియున్నారు. అర్షధర్మానుగాము లీమూడులౌకికకర్మలను ప్రకృతిసిద్ధ నిత్యవిజ్ఞాన ప్రతిచ్ఛాయా యుక్తములగు శాస్త్రీయ కర్మలుగనే యెంచిరి. కనుకనే కొందరు స్మృతికారులు, 'వీని

యందును వర్ణనియంత్రణం జొప్పించిరి. ఇంతేగాక యజ్ఞీయ దానాతిరిక్తములగు ఉపవాస - సూర్యగ్రహణ - సంక్రమణ- ద్వాదశ్యాదులం దగు తిథి దానాదులను పూర్త (అపూర్త) ములని యంగీకరించిరి. శాస్త్రీయపద్ధతిబద్ధములగు నీస్మార్త సిద్ధాంతము లెల్లను, శాస్త్రనిష్ఠకారకము మాన్యములే. ఈక్రింద వచనము లీలౌకికకర్మల యలౌకికత కుదాహరణములు.

"ఇష్టాపూర్తౌస్మృతౌధర్మౌ శ్రుతౌ తౌశిష్టసమ్మతౌ
ప్రతిష్ఠాద్యంతయోఃపూర్త మిష్టంయజ్ఞాదిలక్షణం
భుక్తిముక్తిప్రదంపూర్తం ఇష్టంభోగార్థసాధనమ్.
(కాలికాపురాణ)

ఏకాగ్నికర్మ-హవనమ్ త్రేతాయాంయచ్చహూయతే
అంతర్వేద్యాంచయద్దానం ఇష్టంతదభిధీయతే
వాపీకూపతటాకాని దేవతాయతనానిచ
అన్నప్రదానమారామః పూర్తమిత్యాచచక్షతే. (భారతము)

ఆతిథ్యంవైశ్వదేవంచ ఇష్టమిత్యభిధీయతే
గ్రహోపవాసేయద్దానం సూర్యసంక్రమణేతథా
ద్వాదశ్యాదౌచయద్దానం తత్తత్పూర్తమిహోచ్యతే
అధికారీభవేచ్ఛూద్రః పూర్తేధర్మేణవైదికే. (నారదః)

ఇక రెండవది దత్తనామక పరార్థకర్మ. ఈదానము విద్యాసాపేక్ష, దక్షిణాలక్షణ, శాస్త్రీయ దానకర్మప్రతిద్వంద్వి. హీనాంగులు, అసమర్థులు, దరిద్రులు, బుభుక్షితులు మొద లగు వారికి యథాశక్యముగ అన్నవస్త్రపాత్రాదు లిచ్చుటయే

దత్తకర్మ. ఇందు గ్రహీతను దాత ప్రత్యుపకృతి గోరడు. దక్షిణాదానమందు ప్రత్యుపకార మున్నది. దక్షిణ యీయ నిచో యజ్ఞమునష్టమగును. దక్షిణాదాన ముపకారముకాదు. స్వరూపరక్ష కావశ్యకమగుకర్మ. ఇందు 'నేనింతయిచ్చుచున్నా' నను భావము దాతకు గల్గినచో నా దానకర్మ వ్యర్థమగును. ఆదర శ్రద్ధావినయములతో శిష్యుడు గురువునకువలె 'త్వదీయం వస్తుగోవింద తుభ్యమేవసమర్పయే' అన్నది లక్ష్యముగాగాని దక్షిణాదానము జరుగును. ఇందు దైవకర్మయందు 'పూగీఫల-దక్షిణాం సమర్పయామి' అను నప్పటివలె నాత్మసమర్పణభావ ముండును. ఇటః-గృహీత కుచ్చాసనము, దాతకు నీచాసనము, కొనువానిచేయిపై నుండును ఇచ్చువానిచేయి క్రిందనుండును.

దత్తకర్మయం దిదియంతయు విపరీతము. దాతచేయి పైని గ్రహీతచేయి క్రిందుగ నుండును. ఇచ్చిన నీయకున్నను బాధలేదు. ఇది యొకవిధమగు నైచ్ఛికకర్మ. ఇట్టి దత్తలక్షణ పరిగ్రహము బ్రాహ్మణునకు మృత్యుతుల్య మట! బ్రాహ్మణుడు కేవలము దక్షిణాలక్షణదాన పరిగ్రహమునకే యధికారి యట. ఆయధికారమైనను ఆయల్పపరిగ్రహముచే యజ్ఞసిద్ధి-విద్యాదానాదులచే నధికముగ నీయగలిగినపుడే. ఆశక్తి లేనివాడాదక్షిణాదాన పరిగ్రహమునకును దగడు. దక్షిణాలక్షణదాన మంతర్వేదిలక్షణము. దత్త మనునది బహిర్వేదిలక్షణము. దత్తముం గూర్చియే, దరిద్రాన్ భరకౌన్తేయ' అను నాదేశము. ఈ పరార్థలక్షణ దత్తకర్మగూర్చి యీవచనము లరయుదగినవి.

"బహిర్వేదిషుయద్దానం తద్దత్తమభిధీయతే
శరణాగతసంత్రాణం భూతానాంచాప్యహింసనమ్
ససాధనంసోపభోగం స్వమర్థంయఃసమర్పయేత్
పరస్మైతద్దరిద్రాయ తద్దత్తమితికథ్యతే
భూమిం సువర్ణం గాం వస్త్రం ఉద్యానంపుస్తకంగృహం
ఔషధంభాజనందద్యాత్ తద్దత్తమితికథ్యతే.

మూడవదగు లౌకికకర్మ ఆపూర్తము. పై రెండును స్వల్పద్రవ్యాపేక్షకములు, సర్వజనీనములు, వీనిని కొలదిగనో గొప్పగనో అందరు ననువర్తింపగలరు. కాని పరమార్థ (సముదాయార్థ) సాధక మగు నాపూర్తకర్మ బహుద్రవ్యాపేక్షము. సమాజమందలి ధనికవర్గముపై నాధారపడి యున్నది. ఈవచనము లరయుడు.

"సర్వసాధారణార్థాయ ప్రవర్తయతియశ్చిరమ్,
బహుద్రవ్యవ్యయాపేక్షం కర్మతత్పూర్తముచ్యతే
వాపీకూపతటాకాది దేవతాయతనాదిచ
అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే
పాఠశాలాంవాటశాలాం, మఠంశ్రీతేఽనలంప్రపాం
వాటంవాటీమన్నసత్రం, కుల్యాంవాటద్రుమాంస్తథా
పణ్యశాలాంచ-భైషజ్య శాలాంపుస్తకశాలికాం
నౌకాంసేతుంఘట్టబంధం కుర్యాత్ పూర్తం వదన్తితత్.

ఇట్లు వైదికములు విద్యాసాపేక్షములు నగు యజ్ఞ తపో దానములు మూడుసత్కర్మలును లౌకికములు విద్యానిర పేక్షములునగు, ఇష్టా పూర్త దత్తములు మూడు రమణీయ కర్మలును, మొత్త మారుకర్మలు. ఇందు మొదటిత్రయము ద్విజాతులకు మాత్రమే సంబంధముకలది. రెండవత్రయము సర్వత్ర నేదో యొకరూపమునం దుపలబ్ధ మగుచున్నది.

కర్మతంత్రము వైదికమైనను లౌకికమైనను తత్త్వదర్శులు, కర్మలందు మహర్షులు అధికారి యధికారయోగ్యతకే ప్రాధాన్య మిచ్చిరి. కనుకనే ఇష్టాది సామాన్యకర్మకును వర్ణభేదానుసార ముగ వర్గీకరణ ముపలబ్ధ మగుచున్నది. మొదట వైదికకర్మలం జూడుడు. యజ్ఞతపోదానములు, మూటను, త్రైవర్ణికులును సంస్కారప్రద త్తాధికార యోగ్యతచే నధికృతు లైనను యజ్ఞము బ్రాహ్మణులందును, తపస్సుక్షత్రియులందును, దానము వైశ్యులందును, ప్రాధాన్యముగ నున్నది.

కారణము ? స్పష్టమే. యజ్ఞతపోదానములు విద్యాసాపే క్షములు. వీనికిమూలప్రతిష్ఠ మనఃప్రాణవాఙ్మయ కర్మాత్మ (కర్మావ్యయుడు) తన్మనోభాగము జ్ఞానప్రధానము. దీనికి యజ్ఞ ముతో సంబంధము. వర్ణములందు బ్రాహ్మణుడు జ్ఞానశక్తిప్రధా నుడు గదా ! ఇట్లే ప్రాణభాగము క్రియాప్రధానము. దీనికి తపస్సుతో సంబంధము. క్షత్రియుడు క్రియాప్రధానుడు - ఇక వాగ్భాగ మర్థప్రధానము. దీనికి దానముతో సంబంధము.

వైశ్యు డర్థప్రధానుడు. ఈ త్రైవర్ణికసముచ్చిత రూపమే సమాజ శరీరమునకు గర్మాత్మ. సమాజాత్మకు మనోమయ భాగము బ్రాహ్మణుడు. ప్రాణభాగము క్షత్రియుడు. వాగ్భాగము వైశ్యుడు కనుక బ్రాహ్మణవర్ణము యజ్ఞకర్మయందు నిష్ణాతము కాగలట్లు ఇతరవర్ణము కాజాలదు. ఒక క్షత్రియుడు ప్రాణ వ్యాపారసాపేక్ష పరాక్రమమందు సఫలతనొందునట్లితరవర్ణము పొందజాలదు. ఇట్లు వాగ్వ్యాపారముద్వారా అర్థసంపత్తి సంచయముచే దానకర్మయందు వైశ్యుడొందు సాఫల్యమితర వర్ణము పొందజాలదు.

లౌకికకర్మలయెడలను నీవ్యవస్థనే యెరుంగవలయును. మూడు కర్మలను మూడువర్ణములవారు ననుగమింపవచ్చును. అయినను ఇష్టకర్మయందు బ్రాహ్మణునకు బ్రాధాన్యము. అతడు జ్ఞానోపాసకుడుగదా ! జ్ఞానము సరస్వతీప్రతిమ. అర్థము లక్ష్మీప్రతిమ. ఈ రెంటికి అశ్వమాహిష్యము. ఇక దత్తాపూర్తములు, రెండును ద్రవ్యవ్యయ సాపేక్షములు. కనుక వీనియందు బ్రాహ్మణుడు సఫలత నొందజాలడు. ఆపూర్తము సామాజిక కర్మ. సామాజిక నియంత్రణము క్షత్రబలము నపేక్షించును. ఒక వైశ్యుడు పాఠశాల, మందిరము, ధర్మశాల మొదలగు వానిని నిర్మింపవచ్చును గాని వాని వ్యవస్థకారకు రాజాశ్రయము కావలయును. ఈదృష్టితో ఆపూర్తకర్మయందు క్షత్రియునకు బ్రాధాన్యము సిద్ధించుచున్నది. మిగిలిన దత్తకర్మయందు వైశ్యవర్ణమే సమర్థమనుట ప్రత్యక్షమే.

(i) వైదిక యజ్ఞకర్మయు, లౌకిక ఇష్టకర్మయు నొక శ్రేణివి. యజ్ఞము వైదికయజ్ఞము. ఇష్టము లౌకికయజ్ఞము. (ii) వైదిక తపఃకర్మయు, లౌకిక ఆపూర్తకర్మయు నొక శ్రేణివి. తపము వైదికతపము. ఆపూర్తము లౌకికతపస్సు. (iii) వైదికదానకర్మయు, లౌకికదత్తకర్మయు నొకశ్రేణివి. దానము వైదికదానము. దత్తము లౌకికదానము. ఇది యీరు కర్మలకును వర్ణానుసార వర్గీకరణము. ఈ పరిలేఖనరయుకు:-

## వేదలోకనిబంధన షట్కర్మపరిలేఖ

1. యజ్ఞః-మనోమయః-జ్ఞానప్రధానః-బ్రాహ్మణానాం
2. తపః-ప్రాణమయం-క్రియాప్రధానం-క్షత్రియాణాం
3. దానం-వాఙ్మయం-అర్థప్రధానం-వైశ్యానాం

} వైదికాని సత్కర్మాణి.

1. ఇష్టకర్మ-స్వార్థ (ఆత్మ) ప్రధానం-బ్రాహ్మణానాం
2. పూర్తకర్మ-పరమార్థ-(సముదాయ)ప్రధానం-క్షత్రియాణాం
3. దత్తకర్మ-పరార్థ-(వ్యక్తి) ప్రధానం-వైశ్యానాం

} లౌకికాని రమణీయాని.

1. { (1) (1) యజ్ఞః-వైదికయజ్ఞః / (2) (2) ఇష్టకర్మ-లౌకికయజ్ఞః } యజ్ఞః-మనోయజ్ఞః
2. { (3) (1) తపః-వైదికంతపః / (4) (2) పూర్తమ్-లౌకికంతపః } తపః-ప్రాణయజ్ఞః
3. { (5) (1) దానమ్-వైదికందానం / (6) (2) దత్తమ్-లౌకికందానం } దానమ్-వాగ్యజ్ఞః

} యజ్ఞఏవై తత్సర్వం
యజ్ఞోవై శ్రేష్ఠతమం
కర్మ యజ్ఞేనయజ్ఞం
అయజంత దేవాః

## ఫలాఫలవిచారము

ఇక నీ వైదిక లౌకిక కర్మల ఫలమేమి? అన్నది సంగ్రహముగ జూతము. భారతీయదృష్టిచే ఫలపదార్థము మూడు విధములు. 1 ఐహలౌకికసుఖము, 2 పారలౌకికస్వర్గసుఖము,

3 ముక్తిలక్షణ సమువలయభావము. వీనివివరణము మరొకచో జూచుకోవచ్చును. ప్రకరణసంగతికొరకిట గొంచెము చూతము. మొదట వైదికకర్మలం గైకొందము. ఇవి ప్రవృత్తి భేదముచే 1 విద్యాసాపేక్ష ప్రవృత్తికర్మలు 2 విద్యాసాపేక్షనివృత్తికర్మలు నని రెండువిధములు. ఫలకామన - ఆసక్తి - యే ప్రవృత్తి. ఈ యాసక్తింగొని వైదికకర్మల ననుష్ఠించుచో ఇహలోక సుఖభోగానంతరము శరీరమువిడిచి, యజ్ఞీయ సంస్కారా కర్షణ ద్వారా కర్త యాత్మ దేవయానపథానుగామియై ఆసం స్కార తారతమ్యముంబట్టి అహోదకాది సప్తదేస్వర్గములం దేదో యొక స్వర్గముం జేరును. ఆ యజ్ఞసంస్కార మున్నంత వర కట స్వర్గసుఖము లనుభవించి యా పుణ్యాతిశయ సమాప్తికాగానే మృత్యులోకమునకు మరలివచ్చును. ఈవచ నముల నరయుడు.

1. త్రైవిద్యామాం, సోమపాఃపూతపాపాః యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తేపుణ్య మాసాద్య సురేంద్రలోక మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్.

2. తే తంభుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణేపుణ్యే మర్త్యలోకం వసంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః గతాగతం కామకామా లభన్తే.

"మమేదంకర్తవ్య" మను కర్తవ్యభావనతో లోకసం గ్రహదృష్టితో నిష్కామ భావముతో వైదికకర్మల ననుష్ఠించినచో నిష్కామభావ ప్రభావముచే వానివలన బుట్టిన సంస్కార మాత్రముతో గ్రంథిబంధనము నొందదు. చివరకు ఫలము ? అభ్యుదయసుఖవంచనయు లేదు. అపునర్మారకలక్షణ అపరాముక్తియు బ్రాప్తించును. "అసక్తోహ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః" అని గీతయు జెప్పినది !

విద్యానిరపేక్ష లౌకిక గమణీయ కర్మలకును ప్రవృత్తి నివృత్తి భేదముచే రెండు విభాగములు. ఫలము ? ప్రవృత్తిప్రధానములకు :— ఐహలౌకిక సుఖభోగానంతరము పితృయానము ద్వారా పితృస్వర్గప్రాప్తి. తత్సంస్కారాతిశయము క్షీణముకాగా మరల మర్త్యలోకమునకు వచ్చుట. నివృత్తిప్రధానములకు :— ఐహలౌకిక సుఖపూర్వకముగ నపరాముక్త్యధికారప్రాప్తి.

ఇక వికర్మలకు :— జీవితకాలమునందు అరిషడ్వర్గపీడ బడుచు సంతపించుట శరీరత్యాగానంతరము కృష్ణమార్గము ద్వారా శనికక్ష్యకు జెందిన 84 నరకములం దేదో యొకదాని కర్హుడగుట. అకర్మలకు నిదే ఫలము. కాని భేద మేమన అవిద్యాజనక మగు వికర్మ సాక్షాత్తుగ నసద్గతికి గారణ మగును. అవిద్యామూలకము లగు నకర్మలవలన గాలాంతరము నందు అవిద్యాసంస్కార ముగ్ధరూప పరిణతిగాంచిన పిదప నవిద్యాజనక నిషిద్ధకర్మ ప్రవృత్తి కల్గుచున్నది. త దుత్పన్న మతిసం

స్కారము లనద్గతికి కారణము లగుచున్నవి. కనుక అవిద్యా మూలక కర్మలు పరంపరగ నసద్గతి ప్రవర్తకము లగుచున్నవి.

1. విద్యాసాపేక్షనివృత్తికర్మ-బుద్ధియోగాత్మక-వైదికకర్మ-యోగము-ముక్తి-సర్వవైభవములు
2. విద్యాసాపేక్షప్రవృత్తికర్మ-కర్మయోగాత్మక వైదికకర్మ-సత్కర్మ-దేవస్వర్గము-వైభవము
1. విద్యానిరపేక్షనివృత్తి కర్మ-బుద్ధియోగాత్మక లౌకికకర్మ-యోగము-ముక్తి వైభవము
2. విద్యానిరపేక్షప్రవృత్తి కర్మ-కర్మయోగాత్మక- లౌకికకర్మ-రమణీయకర్మ-పితృస్వర్గము వైభవము
1. అవిద్యాజనకవికర్మకర్మ-బుద్ధివంచితలౌకికకర్మ-కపూయకర్మ-నరకము,సంతాప
2. అవిద్యామూలక అకర్మకర్మ-కర్మవంచితలౌకికకర్మ-కపూయకర్మ .. ..

## వైదిక-లౌకికములు-గీతాశాస్త్రము

"ఇదియేమి? చేయబోయినది గీతాకర్మయోగ విచారణ; చేసిన దేమేమో. 'వినాయకంప్రకుర్వాణో రచయామాస వానరమ్' చరితార్థ మయినది" అనుకొనవచ్చును. కాని, శాస్త్రసిద్ధ వర్ణాశ్రమ సంస్కారకర్మలను దృఢశృంఖలలచే బద్ధమయిన కర్మయోగమే గీతా కర్మయోగ మయినపుడు ఆయా కర్మలను మీమాంస సేయక యుండు టెట్లు? మరి విచారణ సేయదగు కర్మయోగమేది?

గీత నిష్కామకర్మయోగమును సామ్యవాదలక్షణ సమత్వయోగమును ప్రతిపాదించు ననుట నిజమే; కాని, ఎట్టి నిష్కామ కర్మయోగమును? ఎట్టి సమత్వయోగమును?

అన్నచో సమాధానము గీతనే చెప్పినది. "శాస్త్రీయకర్మలను కామసంబరిత్యజించి యనుష్ఠించుటే నిష్కామకర్మయోగము; సర్వత్ర సమదర్శనముచే (వస్తువచేకాదు) ఆత్మైక్యభావన యుంచుటే సమత్వయోగము లేక సామ్యవాదము."

ఇప్పుడువచ్చినట్లు అశాస్త్రీయకర్మలను జేయుట, అందరితో గలసి యన్నపానాదులం గొనుట, వర్ణాశ్రమ మర్యాదల నుపహసించుట, ఇట్టి పాతకకర్మలనే నిష్కామకర్మయోగము, సమత్వయోగము నని యెంచి, ఇదే గీతోపదిష్టార్థ మనుట కేవలము గీతనే నమ్మువారి భ్రాంతి. గీతకు తదుపదిష్టయోగమునకును కళంకదాయకము. ఎంతగాజూచినను గీతయందెచటను సంస్కార-ఆత్మ-ఉదర్క-వేద-లోక సంబంధన కర్మ సంపర్కములేని నిష్కామకర్మయోగ మగపడదు. మన గీతా భక్తులు, ఏదివ్యదృష్టిచే శ్రుతి స్మృతి దర్శన పురాణేతిహాసాదులనుమించిన యీనవీన మగు కర్మయోగముం గనుగొనిరో! ఈ నవీనకర్మయోగియొక్క కర్మ, వర్ణ ధర్మ సంబంధములేకయే ఆశ్రమ మర్యాద నాదరింపకయే శాస్త్రనిష్ఠ ననుసరింపకయే రాష్ట్రోన్నతికి గారణమగుచున్నది! కానిండు మా యపరాధమును మేము గాపాడుకొనుచు గీతాశక్తి ప్రవేశద్వారమున దానిం బుష్టముగావించుకొనుటకు మరల నా కర్మజాలమువంకకు పాఠకులధ్యాన మాకర్షించెదము.

భగవంతుడు కర్మయోగసంబంధమున గీతాశాస్త్ర

ందు విద్యాసాపేక్షములకు యజ్ఞతపో దాన లక్షణ వైదిక ర్మల ననుగమించుటయందే తన దృఢనిష్ఠను ప్రకటించి యున్నాడు. అంతర్గగత్తును పవిత్రము గావించుకొనువారు ర్మాసక్తి-ఫలాకాంక్ష-విడచి కర్తవ్యబుద్ధితో వాని నవశ్య మాచరింపవలయు ననియే అతని నిశ్చితోత్తమ మతము.

"యజ్ఞోదానంతపఃకర్మ నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞోదానంతపశ్చైవ పావనానిమనీషిణాం"
"ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వాఫలానిచ
కర్తవ్యానీతిమేపార్థ నిశ్చితంమతముత్తమం."

ఈ మూడును ప్రాకృతిక నిత్యకర్మలు; ఇందు తగ్గింపను హెచ్చింపను, మార్పను, గూర్పను (తనకల్పన యేమియు) ునికిరాదు. అటుగావించుచో నాకర్మ అభ్యుదయనాశ హేతు గును. విద్యుద్యంత్ర సంచాలనమునందు యథోక్తనియమ వైపరీత్య మాచరింప దగదుగదా !

## కర్మమూల ప్రతిష్ఠ

కనుకనే ఈ మూడువైదికకర్మల ప్రయోగమునకు ముందు వీనిమూలాధారము బ్రహ్మ (విద్యా) తత్త్వముగా నంగీక రింపబడినది. ఉదాహరణమునకు యజ్ఞకర్మం గైకొనుడు. ఋత్విజులు, వేదమంత్రములు, యజ్ఞసామగ్రియను నీమూటితో బ్రహ్మకు (విద్యకు) సంబంధము, యజ్ఞకర్మసహాయకులు, హోతా, అధ్వర్యుడు, ఉద్గాత-బ్రహ్మ యను నలువురును

ఋత్విక్కులు. వీరి వరుస హోత్ర-అధ్వర్యవ-ఔద్గాత్ర-బ్రహ్మత్వము లను కర్మలను సంచాలనముచేయు, ఋగ్యజుసామాథర్వణమంత్రములు మంత్రములు. వ్రీహి యవ పాత్ర వేది కుండ జూ హూపభృ దాదులు ద్రవ్యములు. ఈ మూడు యజ్ఞసాధనములకును మూల నుందు ఓం-తత్-సత్-లక్షణ బ్రహ్మ (విద్య) ప్రతిష్ఠిత మైయున్నది. ఈ బ్రహ్మనిర్దేశమును, మూల మం దుంచికొనియే బ్రహ్మవాదుల యజ్ఞ తపో దానము లను మూడు కర్మలును సంపన్నము లగుచున్నవి. ఈప్రతిష్ఠా బ్రహ్మను స్పష్టీకరించుచు భగవంతుడు చెప్పుచున్నాడు.

"ఓమ్ త త్స దితి నిర్దేశో బ్రహ్మణః త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితా పురా
తస్మాదో మి త్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం
తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః
సద్భావేసాధుభావేచ సదిత్యేతత్ప్రయుజ్యతే
ప్రశస్తేకర్మణితథా సచ్ఛబ్దః పార్థఉచ్యతే (యుజ్యతే)
యజ్ఞే తపసి దానేచ స్థితిఃసదితిచోచ్యతే
కర్మచైవతదర్థీయం సదిత్యేవాభిధీయతే
అశ్రద్ధయాహుతందత్తం తపస్తప్తంకృతంచయత్
అసదిత్యుచ్యతేపార్థ! నచతత్ప్రేత్యనోఇహ"

ఓమ్-తత్-సత్ అని త్రివిధముగా జెప్పబడిన యాబ్రహ్మ సర్వోపాధిప్రవర్తకము, స్వయముగ సర్వోపాధివినిర్ముక్తము నగు

జ్ఞానమే 'తద్జ్ఞానంబ్రహ్మసంజ్ఞితమ్' ఇత్యాదిగా బ్రహ్మవిజ్ఞానావసరమున జెప్పబడినది. ఉపాధిసంసర్గముచే నీ బ్రహ్మలక్షణ నిరుపాధిక జ్ఞానమే, పిదప పంచవివర్తము లొందును, 1 సత్యజ్ఞానము, 2 యోగజజ్ఞానము, 3 విజ్ఞానజ్ఞానము, 4 ప్రజ్ఞానజ్ఞానము, 5 ఐంద్రియకజ్ఞానము.

(1) సత్యజ్ఞానము :- ఏకాంతతః విషయ వినిర్ముక్తము, నిర్వికల్పకము, ఏకరూపమున (అఖండరూపమున) విశ్వవ్యాప్తము, అనిర్వచనీయము, అనుభవ మర్యాదా బహిర్భూతము. ఈశ్వరస్వరూపాత్మకము, జ్యోతిర్ఘనము, సర్వాలంబనము, నిరాలంబము, నిరాధారము నగు జ్ఞానమే మొదటి దగు సత్యజ్ఞానము. దీని యంశప్రత్యంశలం గానిమే విశ్వమును, అందలి యవయవరూపము లగు సూర్య చంద్ర విద్యుత్తార కాగ్న్యాద్యచేతనాధికారిక జీవులు, అవతారపురుషలక్షణ రామకృష్ణాది చేతనాధికారికజీవులును, కర్మఫలభోక్త లగు కర్మాశ్వత్థిక చేతన జీవులును, కర్మఫలభోక్త లగు కర్మాశ్వత్థికాచేతన జీవులును, అందరును ప్రకాశితులై స్వస్వరూపమున బ్రతిష్ఠితులై యున్నారు.

"నతత్రసూర్యోభాతి నచంద్రతారకం నేమా విద్యుతోభాంతి
కుతోఽయమగ్నిః
తమేవ భాంత మనుభాంతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి."

సవికల్పకములు, సోపాధికములు నగు ఖండఖండాత్మిక జ్ఞానజ్యోతులును, భూతజ్యోతులును ఆసత్యజ్ఞానమే మూలస్రోతస్సుగాగలవి. "తస్యైవమాత్రాముపాదాయసర్వాణ్యుప

జీవన్తి" కనుకనే యిది 'జ్యోతిషాంజ్యోతి' యనబడును. సర్వ విషయములను బ్రోచినదై యొప్పు డిది నిర్విషయకమై తన స్వాభావిక వ్యాపకరూపమున బరిణతమై యనుభవమర్యాదా బహిర్భూతమగును. పరిచ్ఛిన్న పాంచభౌతిక స్థూలవిషయముల యొక్కయు, అంతర్జగత్ప్రతిష్ఠిత, మాత్రారూప సూక్ష్మభౌతిక విషయములయొక్కయు, సంబంధమువలననే యీ వ్యాపకజ్ఞాన మంశప్రత్యంశ రూపమున సోపాధికము సీమితము నగుచు 'అహంజానామి' 'మయాజ్ఞాయతే' 'నవిజానామి యదివేద మస్మి' 'నతం విదాథయ ఇమాజజాన' ఇత్యాకారక సవికల్పక భావ పరిణతి నొందుచున్నది. సదా యొక విషయముం గొనియే మన జ్ఞాన మీయభినయములను గావించును. విషయ నివృత్తి యగుచో జ్ఞాన మభినయ మర్యాదకు వెలియగును. ఆధ్యాత్మికము, సర్వవ్యాపకము నగు నీశ్వరయజ్ఞానమే సత్య జ్ఞానము. ఇదే నిర్వికల్పక సమాధికి మూలము.

(2) యోగజజ్ఞానము:-సత్యజ్ఞానఘనుడగు నాయీశ్వరావ్యయాంశ జీవాత్మ. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" ఈ జీవావ్యయుడవిద్యాదిదోషముల ద్వారా తన యీ స్వాభావిక స్వప్రభ వేశ్వరావ్యయ జ్ఞానానుగ్రహ వంచితముగ నుండి వికాసపృథగ్భూతుడగును. బుద్ధియోగాది ప్రక్రియలచే నవిద్యావరణము తొలగగా 'మేఘాపాయేంశుమానివ' ఆసత్యజ్ఞానము తనంత దాను బ్రకటమగును. యోగ సాధన ద్వారా ప్రాదుర్భూతమగు నీజ్ఞానప్రభావముచే కర్మాత్మ

(జీవాత్మయు) నీశ్వరు నట్లు 'అతీ తానాగతజ్ఞు డగును' యోగ శాస్త్రోక్తోపాయవిశేషములచే నీ యోగజ జ్ఞానము కల్గినపుడు ఇతడు 'యోగి' నాబడును. జన్మనుండియు నీ జ్ఞానముండెనా ఆమహాపురుషు డీశ్వరావతారము లేదా ఈశ్వరుడు అనబడును. ఇదే జ్ఞానమునకు రెండవవివర్తము.

(3) విజ్ఞానజ్ఞానము :—సదసద్జ్ఞానము, శుభాశుభవివేకము, శ్రేయఃప్రేయో వివేచనము, కలిగి మంచిని గ్రహించి చెడ్డను పరిత్యజించు నదియు, సూర్యునిద్వారా ప్రాప్త మగు నదియు నగు బౌద్ధజ్ఞానమే, విజ్ఞానజ్ఞానము. ఇదే బుద్ధియోగ ప్రతిష్ఠాభూమి. నవీనగ్రంథరచన, నూతనావిష్కారము మొదలగు నవెల్ల నీ విజ్ఞానమహిమలు. ఈ విజ్ఞానవికాసము గలవారే సమాజమం దాదరణీయులు. విద్వాంసుడు మూర్ఖుడు, రాజు ప్రజ, స్వామి, సేవకుడు అను మొదలగు విశేషతలకు సంపాదక మీ విజ్ఞానజ్ఞానమే, మనుష్యత్వముచే నందరు సమాను లగుదురు గాక ! విజ్ఞాన తారతమ్యముచే ఉచ్ఛనీచశ్రేణు లేర్పడుచున్నవి. విజ్ఞానము లేనపు డాకారభేదముతప్ప మనుష్యునకును, బశువునకును భేద ముండదు.

(4) ప్రజ్ఞానజ్ఞానము :—ఏజ్ఞానముచే నింద్రియసంచాలన జరుగుచున్నదో, దేని సహయోగము లేకున్నపు డింద్రియములు నేనుచూడలేదు, వినలేదు, అన్యమనస్కుడనై తిని మరల జెప్పు మనునో, ఆ మానసజ్ఞానమే ప్రజ్ఞానజ్ఞానము. ఇంద్రియ

పాశబద్ధులై వివేకము నాశ్రయింపక నిటునటు దిరుగుచు, నశుభ కర్మాభిరుచి కలిగి యుండుట ఇతరుల యావిష్కృతులకు బ్రతి కృతులు రచించుట- ఇతరుల వైభవముంగాని లాభము నొంద వలయు నను రోత్సనులం దిగుట, పదేపదే పరముఖాపేక్షి యగుట, ఇవన్నియు నీ జ్ఞానమహిమలు. ఇది, అన్నముద్వారా చాంద్రసోమమునుండి సంపన్న మయినది. విజ్ఞానజ్ఞానమునకు సూర్యుడు దీనికి జంద్రుడును వికాసభూములు.

(5) ఇంద్రియజ్ఞానము :— ఆయా యింద్రియములచే నగు, శబ్దస్పర్శ రూప రస గంధరూప విషయముల బాహ్య జ్ఞానము. ఇదే ప్రత్యక్షజ్ఞాన మందురు. 'ప్రత్యక్ష మవైతి చార్వాకాః' అన్నట్లు చార్వాకులకు ముఖ్య ప్రమాణము. వాక్ప్రాణ చక్షుఃశ్రోత్ర మనో (ఇంద్రియమనస్సు) భేదములచే నిది యైదుభాగములు. కౌషీతకి; దీని కవాంతరములు పదిభేద ములను జెప్పెను. ఈ పంచజ్ఞాన మూలప్రతిష్ఠలు, అగ్ని వాయ్వాదిత్య దిగ్భాస్వర సోమములను పంచప్రాణదేవతలు, ఉపనయనసంస్కారమునం దియ్యవి వివృతములు.

ఈ పంచజ్ఞానములందును పూర్వపూర్వ ముత్తరోత్తర మున కనుగ్రాహకములు. ఉక్థములు. ఉత్తరము లనుగ్రాహ్య ములు. అర్కలు (రశ్ములు). ఇందుచే పూర్వపూర్వజ్ఞానము ప్రబలము, ప్రామాణికము నగుచుండును. ఉత్తరోత్తర ముపే క్షింపబడుచుండును. కాని యిందు సత్యజ్ఞాన మన్నిటి కంటె

ప్రబల మయ్యును, వ్యాపకత్వముచే నది వ్యవహారబహిర్భూతము. కనుక మనకు యోగజజ్ఞానమే ప్రమాణమూర్థన్యము. దీనిముందు విజ్ఞానజ్ఞానము (బుద్ధివాదము) ప్రజ్ఞానజ్ఞానము (స్వస్యచప్రియమాత్మనఃలక్షణరుచిభావము) ప్రత్యక్షనిర్ణయాత్మక మగు నైంద్రియకజ్ఞానము నిర్బలములు, ఉపేక్షణీయములు. యోగులగు మహర్షుల దృష్టిరూపశ్రుతి (వేద) ఈశ్వరజ్ఞానమే యోగజజ్ఞానశిక్షక శబ్దాదేశమే ఈశ్వరాదేశము. కనుక భారతీయదృష్టిలో యోగజదృష్టిప్రధాన వేదము, ఈశ్వరుడు అను వానియందు భేదములేదు. అందువలననే ఈశ్వరాజ్ఞా పత్రరూప వేదమును వా రపౌరుషేయమనియు స్వతఃప్రమాణ మనియు, తర్కజ్ఞానము లెల్ల పరతఃప్రమాణములనియు జెప్పిరి. యోగజజ్ఞాన ప్రతికృతి రూప వేదశాస్త్రము నిరపేక్షరవ మగుటచే స్వతఃప్రమాణము. 'నిరపేక్షరవఃశ్రుతిః' సాక్షా దీశ్వరాదేశము. యోగజజ్ఞానముయొక్క యీతాత్త్విక రూపము నెరుంగని భ్రాంతులు బుద్ధివాదగర్వమునంబడి వేదాజ్ఞకు విరోధముజూపువారు ఘోరనాస్తికులు, పతితులు. 'విద్ధి నష్టానచేతసః'.

జ్ఞానఘనబ్రహ్మయొక్క పంచవివర్తముల నెరింగితిమి. బ్రహ్మ, అవ్యయపురుషుడు. సర్వదా ప్రకృతియుక్తుడై యుండువాడు. 'ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీఉభావపి' ప్రకృతిదేవి సత్త్వరజస్తమోనామక త్రిగుణయుక్త యయ్యు, గుణములు శుద్ధసత్త్వ-మలినసత్త్వ-రజ స్తమో భేదముచే నాలు గగును.

కనుక త్రిగుణప్రకృతి చతుర్గుణగ మారును. దురత్యయ యగు దీని సహయోగముచే నిర్వికల్పక నిర్గుణ సత్యబ్రహ్మ సగుణ భావము నొందును. పురుష-ప్రకృతిమర్యాదలకు బహిర్భూతు డగు పరాత్పరు నటులుండుడు. మాయావచ్ఛిన్న పురుషుడును మొదట నిర్గుణుడయ్యు ప్రకృత్యనుగ్రహముచే సగుణరూపము ధరింపవలసి యుండును. ఈసగుణతచే నిష్కలుడయ్యును చతుష్కలుడు గావలసియుండును. బ్రహ్మవివర్తము లైదుకనుక ప్రకృతియు బంచధా విభక్తము. ప్రకృతిసంబంధముచే ప్రతి వివర్తమునకును నాలుగేసికళలు. చివరకు పంచజ్ఞానవివర్తములకును మొత్త మిరువది కళ లగును.

ఈ యిరువది కళలందును 4 విజ్ఞానకళలు, 4 ప్రజ్ఞాన కళలు, 4 ఐంద్రియకజ్ఞానకళలు, మొత్త మీపండ్రెండును ప్రకృతిసిద్ధములు. ప్రతిమనుజునందును పుట్టుకనుండియు (బాలుడైనను, వృద్ధుడైనను) మాత్రా తారతమ్యముచే నుండు చుండును. తక్కిన యోగజజ్ఞాన, సత్య జ్ఞాన కళలెనిమిదియు ప్రయత్నవిశేషము వలనను బ్రాప్తించును. అనగా, నుండు టన్న దెప్పుడు నున్నది. కాని యావరణ సామ్రాజ్యము తొలగినచో ప్రకాశించు నని భావము. ఆ యావరణ దూరీకరణ ప్రధానోపాయము గీతోక్త బుద్ధియోగము. ఒక్కొక శ్రేష్ఠ జీవునందు సంస్కారాతిశయానుగ్రహముచే గలిగిన బుద్ధియోగముచే నీకళ లగపడుటయు దోషసంసర్గముచే తిరోభావము నొందుటయు గలుగుచుండును.

సత్యజ్ఞాన, నిత్యజ్ఞానము లను రెంటిని నిత్యవిజ్ఞాన మన వచ్చును. గాని ఈజ్ఞానము (వివిధ) పంచరూప పరిణతినొందును గనుక 'నిత్యవిజ్ఞాన' మని వ్యవహరించిరి. 'నిత్యంవిజ్ఞాన మానందంబ్రహ్మ' అని శ్రుతియు జెప్పెను. ఇక మూడవదగు విజ్ఞానజ్ఞాన మన్ననో క్షణిక-నిత్య-రూపములచే రెండు భేదము లగును. మనవిజ్ఞానజ్ఞానము (బుద్ధి) బుద్ధియోగానుగ్రహముచే యోగజజ్ఞానము ద్వారా సత్యజ్ఞానానుగామి యగుచో ఆ నిత్యధర్మానుగ్రహముచే నిదియు నిత్యభావ పరిణత మైపో వును. అటుగాక :-ఈశ్వరీయ జ్ఞానలక్ష ణేశ్వరసత్తను, యోగజ జ్ఞానలక్షణ వేదశాస్త్రసమ్మత, జ్ఞానసహాకృత, కర్మమార్గము నను నిత్యవిజ్ఞానము నుపేక్షించి ప్రజ్ఞా నైంద్రియక జ్ఞానములకు లోబడి మృత్యులక్షణ క్షణిక భూతవాద సమృద్ధి వంకకు వంగి నచో క్షణికవిజ్ఞానమై మృత్యుబంధన కారణముగ నగును.

(1) సత్యజ్ఞాన మీశ్వరభావముతో ప్రధానసంబంధము గలదై యాధిదైవిక జ్ఞాన మనబడును. (2) యోగజజ్ఞానము జీవభావముతో ప్రధాన సంబంధము కలదై ఆధ్యాత్మికజ్ఞాన మనబడును. (3) విజ్ఞానజ్ఞాన మీవంకనుండి యాధ్యాత్మిక జ్ఞానము, నావంకనుండి యాధిభౌతికజ్ఞానము ననబడును. (4) ఇక ప్రజ్ఞా నైంద్రియకజ్ఞానములు రెండును, విశుద్ధాధి భౌతిక జ్ఞానములే యనబడును. ఈదృష్టితో అయిదుజ్ఞానము లకు ఆరువివర్తము లగును. ఇందు మూడు వైదికజ్ఞానములు, మూడు లౌకికజ్ఞానములు ననబడును. ఈ పరిలేఖ నరయుడు :-

| | | |
|---|---|---|
| 1. సత్యజ్ఞానమ్ (ఈశ్వరావ్యయాత్మకమ్) ఆధిదైవికమ్ | | వైదికజ్ఞాన త్రయీ |
| 2. యోగజజ్ఞానమ్ (జీవావ్యయాత్మకమ్) ఆధ్యాత్మికమ్ | | |
| 3. నిత్యవిజ్ఞానజ్ఞానమ్ (బుద్ధియోగాత్మకమ్) ఆధ్యాత్మికమ్ | | |
| 1. క్షణికవిజ్ఞానమ్ (బుద్ధిరూపమ్) ఆధిభౌతికమ్ | | లౌకికకర్మ త్రయీ |
| 2. ప్రజ్ఞానజ్ఞానమ్ (మనోమయం) ఆధిభౌతికమ్ | | |
| 3. ఐంద్రియకజ్ఞానమ్ (విషయాత్మకం) ఆధిభౌతికమ్ | | |

## బ్రహ్మనిర్దేశ త్రైవిధ్యము

వైదికజ్ఞానత్రయి, వైదిక యజ్ఞ తపో దాన కర్మలకు ప్రతిష్ఠ. లౌకికజ్ఞానత్రయి, లౌకికము లగు నిష్టా పూర్త దత్త కర్మలకు మూలము. రెండును సత్కర్మలే. శుభోదర్కములే. వైదికకర్మలకు మూలాధారము వైదికజ్ఞానము. కనుక వాని యారంభ మందే దానిం బ్రతిష్ఠింపవలయును. ఎట్లు? ఆ జ్ఞాన లక్షణబ్రహ్మ (వైదికజ్ఞానము) ఏ ప్రక్రియచే వైదిక కర్మల కాలంబన మగును? అన్నచో సమాధానము 'శబ్దబ్రహ్మ'నే యడుగుడు. జ్ఞానలక్షణబ్రహ్మ పరబ్రహ్మ. శబ్దబ్రహ్మ దానికి బ్రతికృతి ప్రతిమ. దీని ద్వారానే పరబ్రహ్మను మూలాధారముం గావింప గలము. ఎట్లన :-

నిత్య (సత్య) విజ్ఞానఘన, బ్రహ్మ సర్వవ్యాపక మంటిమి. ఈ పూర్ణేశ్వరునకు 'విశ్వాత్మ-విశ్వాతీత' భేదముచే రెండు వివర్తములు. తన విద్యాభాగముచే నతడే విశ్వాతీతుడు. తన కర్మభాగముచే నతడే విశ్వాత్మ. ఇట నొకటి గుర్తింపదగిన దేమన :- వెనుక సత్యజ్ఞానముంగూర్చి చెప్పుచో విశ్వాతీతముగా

జెప్పిన మాయావిరహిత పరాత్పరలక్షణ బ్రహ్మ యొకస్వతంత్ర బ్రహ్మ. ఇచ్చట నిపుడు విశ్వాతీతముగా జెప్పబడునది దాని కంటె భిన్నము. ఆ మాయావిరహిత విశ్వాతీతబ్రహ్మ విశ్వము నకు వెలుపలను లోపలను గలదు. ఈ విశ్వాతీత బ్రహ్మ యన్ననో మాయోపాధికమై విశ్వసీమకు లోపల నుండు చున్నది. కాని విశ్వప్రపంచమునకు వేరుగా నుండు చుండును. మాయోపాధి కావ్య యేశ్వరుడే సగుణ నిర్గుణ భేదముచే ద్విరూపుడు. ఆ విశ్వాతీతపరాత్పరుడు నిత్యనిర్గుణుడు. ఈవిశ్వాతీతావ్యయలక్షణ బ్రహ్మ సగుణనిర్గుణములు రెండును, అతని నిర్గుణరూపమే. ప్రస్తుతము విశ్వాతీతము :-

"అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌన్తేయ నకరోతి నలిప్యతే"

ఇక సగుణరూపమే విశ్వాత్మ.

"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః"

మాయోపాధిక సత్యజ్ఞాన ఘనానన్యయలక్షణ బ్రహ్మ తన యవిద్యాభాగముచే విశ్వ కర్మప్రపంచమునకును వేరై విశ్వమందుండియు విశ్వాతీతమే యగుచున్నది. కర్మభాగముచే విశ్వ కర్మప్రవర్తమగుచు నదే విశ్వాత్మయు నగుచున్నది. ఆనంద విజ్ఞానమనోమయ విద్యామూర్తి యా పూర్ణేశ్వరుడే విశ్వాతీతుడు. మనగ ప్రాణ వాఙ్మయ కర్మమూర్తి యతడే విశ్వాత్మ. విశ్వాతీతము ముక్తికి, విశ్వాత్మ సృష్టికి ఆలంబనము.

అది జ్ఞానాధ్యక్షము, ఇది కర్మాధ్యక్షము. అది శాంతానందము, ఇది సమృద్ధానందము. విద్యాసాపేక్ష యజ్ఞ తపో దానములు కర్మలు. కనుక వీని కవలంబనము ప్రధానముగ మనః ప్రాణ వాఙ్మయ విశ్వాత్మయే. (కర్మాత్మయే.) జ్ఞానాత్మగర్భిత (ఆనంద విజ్ఞాన మనోమయ విశ్వాతీతబ్రహ్మ గర్భిత) మగు నీకర్మాత్మకు (మనః ప్రాణ వాఙ్మయ కర్మాత్మకు విశ్వాత్మకు) వాచకము ప్రణవము నాబడు ఓంకారము. 'తస్యవాచకః ప్రణవః".

దీనికిని విశ్వేశ్వరునకు వలెనే స్వరూపము, అవయవ విభాగములును దెలియనగును. కనుకనే పతంజలి విశ్వేశ్వర వాచక మిది యనెను. "ఓమిత్యేవంధ్యాయథ ఆత్మానం" 'ఓ మిత్యేతత్' 'ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ' 'ఏతద్వై సత్య కామ! పరంచాపరం చ బ్రహ్మ య దోంకారః' ఇత్యాది శ్రుతి స్మృతులు నోంకారము నాపూర్ణేశ్వర వాచక మనుచున్నవి. వాచ్యవాచకములను బోల్చి చూతము.

పరబ్రహ్మలక్షణ వాచ్యాత్మయందు ఆనందవిజ్ఞానమనో మయ విద్యారూప విశ్వాతీతబ్రహ్మ యొక స్వతంత్రవిభాగము. మనఃప్రాణవాఙ్మయ కర్మరూప విశ్వాత్మబ్రహ్మ యొకస్వతంత్ర విభాగము. ఇట్లే శబ్దబ్రహ్మలక్షణ, వాచక-ఓంకారము నందును అర్ధమాత్ర యొక స్వతంత్రవిభాగము. మూడుమాత్రలు(అకార ఉకార మకారములు) ఒక స్వతంత్రవిభాగము. అర్ధమాత్రచే స్ఫోటనామకా నిర్వచనీయ-అమాత్ర-ప్రపంచోపశమ,అద్వయ, తురీయ తత్త్వ మభిప్రేతము. ఆ యఖండధరాతల మాధార

ముగ నా మూడు మాత్రలును నిల్చియున్నవి. పరబ్రహ్మను నిర్దేశించెను. అర్థమాత్రస్థానీయా నిర్వచనీయ విశ్వాతీతము నాధారముపై నిర్వచనీయమనఃప్రాణవాఙ్మయ విశ్వాకృతినిలచియున్నది. మనస్సు సుసూక్ష్మము. మధ్యస్థమగు ప్రాణము మనస్సుకంటె స్థూలమును, వాక్కుకంటె సూక్ష్మమును. కనుక స్థూలసూక్ష్మము. వాక్కు స్థూలము. ఇక వర్ణప్రపంచమంద సంస్పృష్టమగు అకారము సుసూక్ష్మము కనుక మనోవాచకమనియు, ఉకారోచ్చారణయందు ఓష్ఠసంకోచమే కాని స్పర్శ లేదు. కనుక దానిని స్థూలసూక్ష్మ మగు ప్రాణవాచక మనియు, మకారోచ్చారణయందు ఓష్ఠములకు బూర్ణస్పర్శ యుండుటచే స్థూలము కనుక నది వాగ్వాచక మనియు ననవచ్చును. కనుక నీ యానుపూర్వ్యముంబట్టి యోంకారము పరబ్రహ్మవాచకమనవచ్చును.

ప్రణవమూర్తియగు పూర్ణేశ్వరునకే రెండవపేరు సచ్చిదానందుడు. మహర్షి పతంజలి కేవలము ప్రణవమునే తదీయ వాచక మనెను. గాని గీతాచార్యుడు, తత్-సత్ అన్నవిన్నూడ తదీయవాచకములే యనెను. అట్టిచో నీ విషయమున "తస్య వాచకః ప్రణవః" 'తస్యవాచకస్తత్' 'తస్యవాచకః సత్' అను మూడు వాక్యము లేర్పడును. ఇందు మొదటివాక్యనిర్వచన మయినది. ఇక గ్రమప్రాప్తమగు 'తత్' శబ్దమునకు సంబంధించిన వాక్యముం-జూతుము.

ప్రణవమూర్తి యగు పూర్ణేశ్వరుచే (ఈశ్వరావ్యయుచే) ప్రత్యక్షదృష్ట మగు నీవిశ్వవితానము జరిగినది. విశ్వ మాతని 'యాతానయజ్ఞము' లేదా 'సర్వహుద్యజ్ఞము' తన యక్షర-క్షరప్రకృతులం గొని యతడే విశ్వ మగును. 'జన్మాద్యస్య యతః' అన్నట్లు అతడే విశ్వ స్థితి భంగ కారణము 'పురుషఏవేదంసర్వం' 'ఏకంవా ఇదం విబభూవ సర్వం' 'బ్రహ్మైవేదం సర్వం' 'ప్రజాపతి స్త్వేవేదం సర్వం యదిదం కించ' 'ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరితాబభూవ- "ఈశావాస్య మిదంసర్వం" ఇత్యాదులు విశ్వ మాయన వితానరూప మను చున్నవి. ఈ విషయమున గృష్ణభగవానుడును :—

1. యతఃప్రవృత్తిర్భూతానాం. యేనసర్వ మిదంతతమ్.
   స్వకర్మణాతమభ్యర్చ్య సిద్ధిందవిందతిమానవః
2. మయాతతమిదంసర్వం. జగదవ్యక్తమూర్తినా.
3. అవినాశితుతద్విద్ధి యేనసర్వమిదంతతం.

ఈ తననభావముంబట్టి ఆయనను తత్ అనియు నన వచ్చును. మరియు అనిరుక్తభావముంబట్టియు 'తత్' అన వచ్చును. తత్ అనగ 'అది' అనగా ననిరుక్తభావవాచకముకదా! విశ్వ మాయన నిరుక్తము, మూర్తము, స్థూలము నగు రూపము. స్వయముగ నాయనయో, అనిరుక్తుడు, అమూర్తుడు, సూక్ష్ముడు. కనుక ఈ యనిరుక్త భావ సూచకముగ తత్ అని వ్యవహరించుటయు దగును.

ఇక 'సత్' అనుదానిం గూర్చి చెప్పదగినదియే లేదు. బ్రహ్మయొక్క సత్ చిత్ ఆనందము లందది యొక పర్వమే. అది సత్తాభావమును వచించును. చిత్=విజ్ఞానద్యోతకము, ఆనందము, శాంతిభావ సూచకము. మనః ప్రాణ వాక్కుల యున్మగ్నావస్థయే (నామ రూప కర్మాత్మక విశ్వప్రాగవస్థయే) సత్ లేక సత్త. ఈ మనః ప్రాణ వాఙ్మయ త్రిమూర్తి బ్రహ్మనే పైని విశ్వాత్మ యనుకొంటిమి. చిదంశ విజ్ఞానము. ఆనందము రసము. ఆనంద విజ్ఞాన మన (అంతర్మన) స్సులు మూడును విశ్వాతీతములు. మనః (బహిర్మనః) ప్రాణ వాఙ్మయియా సత్త విశ్వాత్మ. అది తన సద్రూపము వలననే అస్తి లక్షణ (బలలక్షణ) విశ్వమునకు గారణమయినది. విశ్వమందు దాని యస్తి లక్షణ సత్తారూపమే ప్రధానముగ వికసితమై యున్నదని "అస్తీత్యేవోప లబ్ధవ్యః" అను శ్రుతియు స్పష్టపరచెను. సర్వోపాధి వినిర్ముక్త సామాన్యసత్తయే సాక్షాద్బ్రహ్మయని అభియుక్తవచనము.

ప్రత్యస్తాశేషభేదం యత్ సత్తామాత్ర మగోచరం
వచసా మాత్మ సంవేద్యం తత్ జ్ఞానం బ్రహ్మ సంజ్ఞితమ్."

'సదేవేదమగ్ర ఆసీత్' అను శ్రుతి సద్వాదమునే సమర్థించును. విశ్వాత్మయొక్క యీ సత్తారూపముం బట్టియు 'సత్' తదీయ వాచక మనవచ్చును. ఇట్లు విశ్వమం దంతటను ఏక రూప వ్యాప్తమును సత్యజ్ఞానఘనము, విద్యా కర్మమయము, ముక్తి సృష్టి సాక్షి జ్యోతిషాంజ్యోతియు నగు నా బ్రహ్మను ఓమ్ తత్ సత్ అని నిర్దేశింపవచ్చును. కనుకనే ఈ మూడు

తద్వాచక శబ్దములును, ఆర్ష ప్రణాళికయందు మహా మాంగళిక ములుగ నెన్నబడినవి. గ్రంథారంభమందు స్మరింపదగినవి. అందు వలననే భగవంతుడును "ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణః త్రివిధః స్మృతః" అనియెను.

ఈ మూడు శబ్దములు నేకవాచకము లగుటచే పర్యాయ సంబంధము గలవనుకొనవచ్చునైనను, లోక వ్యవహార మర్యాద యందా యొకే విజ్ఞానమూర్తి బ్రహ్మ మూడు స్థానము లందు విభక్తమై మూడు వాచకములచే వేర్వేరుగ బిలవబడుచున్నది. ఎట్లన :-

## వేద బ్రాహ్మణ యజ్ఞ సంపత్తి.

శబ్దశ్రవణమున కవ్యవహితోత్తర కాలమందు కలుగు విజ్ఞానావిర్భావ పర్వమును వేదమందురు. ఆ విజ్ఞాన బ్రహ్మశబ్దా వచ్ఛిన్న మగుచు, వేదమనబడునని రాబోవు ప్రకరణమం దెరుంగ గలము. శబ్దము వింటిమి. సామాన్య జ్ఞానము కల్గినది. ఇదే వేద మనబడును. ఈ శాస్త్రజ్ఞానాత్మక వేదాధారముపై వేదార్థ పరిశీలన యారంభించితిమి. ఈ చిరకాల పరిశీలన వలన నాశాస్త్రజ్ఞానము సంస్కార రూపముగ, నాత్మయందు నాటు కొనెను. ఆ సంస్కారావచ్ఛిన్న జ్ఞానమే విద్య. ఇది బ్రాహ్మణ ప్రాతిస్వీక ధనము. 'విద్యాహవై బ్రాహ్మణ మా జగామ.'

విద్యా- బ్రాహ్మణులకు తాదాత్మ్య సంబంధము. కనుక నాత్మస్థితియు, విజ్ఞానరూపయు, సంస్కారాత్మికయునగు నీ వి

నవశ్యము బ్రాహ్మణ శబ్దముచే వ్యవహరింపవచ్చును. బ్రాహ్మణు డీ విద్యాత్మక సంస్కారముచే గావించిన పురుషార్థ మేమి? యజ్ఞవిద్య. ఈ సంస్కృతజ్ఞానము నాధారముగా గొని యతడు యజ్ఞసాధక ప్రాకృతిక పదార్థముల నన్వేషించెను. ఆసామగ్రితో ప్రక్రియా విశేషము ననుగమించుచు, యజ్ఞవిజ్ఞానము నావిష్కరించెను. ఆయజ్ఞ ప్రక్రియా విషయము యజ్ఞస్వరూప సమర్పక మగుచు, బిదప వైధ-యజ్ఞ నామము నొందెను. తత్త్వతః బ్రాహ్మణగృహీత విషయజ్ఞానమే యజ్ఞ మనబడియెను. ముందు ప్రకరణమందా విషయజ్ఞానమే బ్రహ్మయనుపేర మనకు దెలియగలదు.

ఇట్లు శబ్దము, సంస్కారము, విషయము అను మూడుపాధి భేదములచే ఆ యొకేవిజ్ఞానఘనబ్రహ్మ, వేద - విద్యా - బ్రహ్మరూప పరిణతి నొందుచు, మంత్ర-బ్రాహ్మణ (ఋత్విక్) యజ్ఞ (యజ్ఞోపకరణ) ములను మూడు భాగములైనది. ఈ మూటి సమన్వయముననే వైదిక యజ్ఞకర్మ స్వరూపము సంపన్నమయినది. ఫలతః వేద-ఋత్విక్-యజ్ఞములు మూటితో బ్రహ్మసంబంధము చక్కగా సిద్ధమగుచున్నది. మరియు బ్రహ్మయాధారముపై బ్రహ్మయొక్క మాత్రతోడనే సర్వారంభమందు, వేదబ్రాహ్మణ యజ్ఞములను మూడు యజ్ఞకర్మ పర్వముల ప్రవృత్తియు నైనది. ఈ రహస్యమును లక్ష్యమందుంచి కొనియే భగవంతుడు "బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా" అనియెను.

1. శబ్దస్థానం విజ్ఞానం, శబ్దావచ్ఛిన్నం - తదేవ విజ్ఞానం వేదః — వేదాః.
2. ఆత్మస్థానం విజ్ఞానం, సంస్కారావచ్ఛిన్నం, తదేవ విజ్ఞానం విద్యా-బ్రాహ్మణాః.
3. ప్రక్రియావిషయం విజ్ఞానం, విషయావచ్ఛిన్నం, తదేవ విజ్ఞానం బ్రహ్మ-యజ్ఞాః.

## కర్మత్రుటి సంధానము.

1. వేదాత్మక విజ్ఞానాయతన, 2. బ్రాహ్మణాత్మక విజ్ఞానాయతన, 3. యజ్ఞాత్మక విజ్ఞానాయతన లక్షణములు గల, శబ్ద, సంస్కార, విషయములను మూటి సమన్వయముచే విద్యాసాపేక్ష యజ్ఞకర్మ స్వరూపము నిష్పన్నమగు నంటిమి గదా? ఇంక బ్రాహ్మణులే మంత్రప్రయోగము గావింతురు. వారే ఆత్మస్థ సంస్కార జ్ఞానము ద్వారా కర్మకు కర్తృత్వము నడపుదురు. వారే యజ్ఞపాత్ర, హవిర్ద్రవ్యాది యజ్ఞోపకరణముల నుపయోగింతురు. స్వభావముచే మనుజుఁ డనృత సంహితుడు గదా! అందువలన నెంత సావధానముగ నున్నను పొరపాటు కలుగవచ్చును.

లౌకిక కర్మలందలి తప్పులకంత ప్రభావ ముండదు గాని, వైజ్ఞానిక ప్రక్రియకు జెందిన యజ్ఞకర్మయం దగు తప్పు యజ్ఞ స్వరూపమునే చెఱచి యజమానుని కభ్యుదయమునకు బదులు, నాశనము నొడగూర్చునని 'యథేంద్ర శత్రుః స్వరతోఽపరాధాత్' అను గాథామంత్రము జెప్పుచున్నది. ఈ యనిష్టమునకు జికిత్స యేమి? ఓంకారపూర్వక యజ్ఞారంభము. పైజెప్పిన మూడు విజ్ఞానాయతనములకును మూలము ప్రణవమూర్తియగు బ్రహ్మమే. ఆ యఖండ ధరాతలాధారము ననే మంత్ర

ములు, బ్రాహ్మణకర్మలు, యజ్ఞోపకరణములు అను మూడును నిలిచియున్నవి. తద్వాచక ప్రణవస్మరణముద్వారా ఆ పూర్ణేశ్వరునితో మన యాత్మకు యోగముకల్గెనా, ఆ యజ్ఞానజనిత తృటి, ఆ మహావిజ్ఞానాలంబనముచే దానంతనదే పూర్తినొందును. ఈ యభిప్రాయము తోడనే 'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః' అను వచనము వెలసినది.

కర్మవలన సిద్ధికల్గును. కాని త్రుటి జని తానిష్టభావము దానికి విఘాతకము. దానిం దప్పించుకొనుటకు తత్ (బ్రహ్మ) అర్చన (సంస్మరణలక్షణోపాసన) యావశ్యకము. అపుడాకర్మ నిర్విఘ్నముగ నెరవేరును. ఆ సర్వధాత్రుస్మరణమే (అర్చనయే) కర్మసిద్ధికి ముఖ్యద్వారమని యీవచనములు తెల్లముసేయును:

"కవింపురాణం అనుశాసితారం అణోరణీయాం స మనుస్మరేద్యః
సర్వస్యధాతార మచింత్యరూపం సతం పరం పురుష ముపైతిదివ్యం
అనన్యచేతాః సతతం యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభఃపార్థ ః నిత్యయుక్తస్వ యోగినః"

శ్రుతియు :-"ప్రజాపతి రూనాతిరిక్తయోః ప్రతిష్ఠా" అని ప్రజాపతిని త్రుటిసంధానకర్తగా జెప్పినది. తత్స్మరణముచే మనకర్మయందలి మన ప్రభుత్వము తొలగును. ఆ స్మరణకర్మయే గీతసిద్ధాంతముం బట్టి ఆత్మసమర్పణ యోగము.

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసికౌన్తేయ తత్కురుష్వ మదర్పణం"

మన మాయన యందే యజ్ఞము నడపు భారము వైచి

తిమి. ఈ యాత్మప్రవృత్తి కనంతర మజ్ఞానవశమున నేమేని హెచ్చు తగ్గులు వాటిల్లినను వాసిం బ్రజాపతియే సంబళించుకొనును. ఆ దోషము మనకంటదు. ఈ ప్రతిష్ఠా ప్రాప్తికై విజ్ఞానాయతన రూప, వేద, ఋత్విక్, యజ్ఞోపకరణ సంపదల కాలంబనభూత బ్రహ్మనే కర్మారంభమందు ప్రతిష్ఠితము గావింపవలసి యుండును. అందు కుపాయ మోంకార పూర్వకముగ యజ్ఞాది కర్మల వితానము.

"తస్మాదో మిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం"

## ప్రవృత్తి - నివృత్తులు.

బ్రహ్మయొక్క యీ ఓమ్-తత్-సత్ అను మూడు నిర్దేశముల నాధారముగా గొని గీతాదృష్టిచే వైదిక - లౌకిక కర్మలను మూడు విధములుగ వర్గీకరణము చేయవలయును. అది బ్రహ్మనిర్దేశ స్వరూప పరిచయము లేకున్నచో నపూర్ణమగునని యెంచి, ప్రకరణ సంగతికొరకు ఆ యా విషయములు చెప్పవలసి వచ్చెను. ఇక వర్గీకరణము వంకకు మరలుదము.

వెనుక విద్యాసాపేక్ష కర్మలకు ప్రవృత్తి నివృత్తి భేదముచే రెండు భేదములను జెప్పుచు, ప్రవృత్తి మూలక యజ్ఞతపోదానములు మూడును అభ్యుదయ లక్షణ దేవస్వర్గ ప్రాప్తికిని, నివృత్తి మూలకములైనచో నివే నిశ్శ్రేయస లక్షణ ముక్తికిని గారణములు, సాధకములు నగునని చెప్పబడినది. ఈ విషయమున నీ మనువచనము లరయదగినవి :-

సుఖాభ్యుదయికంచైవ నైఃశ్రేయసికమేవ చ
ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మవైదికమ్
ఇహచాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే
నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్త ముపదిశ్యతే
ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానామేతి సామ్యతాం
నివృత్తం సేవ్యమానస్తు భూతాన్యత్యేతి పంచవై [మను12-88,89,90

ఈ ప్రవృత్త నివృత్త కర్మలకు మూలములు దేవ, బ్రహ్మ సత్యములు. సంస్కార విజ్ఞానమందు అధ్యాత్మ సంస్థకు, బ్రహ్మ (కారణశరీర రూపాత్మ) దేవత (సూక్ష్మశరీర రూప సత్త్వము) భూత (స్థూల భూతాత్మక పాంచభౌతిక శరీరము) వివర్తములను మూటిని జెప్పి, 21 బ్రాహ్మ సంస్కారములచే అధ్యాత్మ సంస్థ యందలి బ్రహ్మభాగము సంస్కృత మగుననియు, 2 దైవసంస్కారములచే దేవభాగ ముపకృత మగుననియు జెప్పియుంటిమి.

## బ్రహ్మ సత్య - దేవ సత్యములు.

ప్రవృత్త నివృత్త కర్మలు రెంటికిని ప్రతిష్ఠ యీ బ్రహ్మ దేవ వివర్తములే. బ్రహ్మభాగము బ్రహ్మసత్యము. దేవభాగము దేవసత్యము. 'యదస్య చ త్వం (బ్రహ్మ) యదస్య చ దేవేషు' (కేన) అని శ్రుతియు జెప్పినది. మన బ్రహ్మసత్యమున కీశ్వరీయ బ్రహ్మ సత్యముతోడను, దేవసత్యమున కీశ్వరీయ దేవ సత్యముతోడను సంబంధము. బ్రహ్మ సత్యమునకు బ్రహ్మాశ్వత్థము, దేవసత్యమునకు గర్మాశ్వత్థమును, ప్రతిష్ఠలు. మొదటి

దాత్మ వైభవ లక్షణ నిశ్శ్రేయస భావమునకును, రెండవది విశ్వవైభవ లక్షణాభ్యుదయమునకును మూలములు. నిశ్శ్రేయస భావము శాశ్వత ధర్మయుక్తము, అమృత లక్షణము. అభ్యుదయ భావము స్వర్గాది క్షణిక సంస్కారానుగ్రహముచే మృత్యు లక్షణము. అమృతలక్షణమగు నీశ్వరీయ బ్రహ్మసత్యమునకును మృత్యులక్షణమగు దేవసత్యమునకును (చంద్ర పృథువులకు) మధ్యనున్న సూర్యదేవతవలె సూర్యాంశభూతమగు మధ్యస్థ విజ్ఞానాత్మ (బుద్ధి) రెంటికిని విభాజకము, వ్యవస్థాపకము నగుచున్నది. 'నివేశయన్నమృతం మర్త్యం చ'

వైశ్వానర తైజస ప్రాజ్ఞులతోడి ప్రజ్ఞానాత్మయే కర్మాత్మ. కర్మకర్త, యజమాని. దీనికి వైపున (అంతర్ముఖమున) ప్రజ్ఞాన సంపరిష్వక్త విజ్ఞానము (బుద్ధియు), ఆవంక (బహిర్ముఖమున) ఐంద్రియక కామమయ విషయములు నున్నవి. రెంటి నడుమ నున్న కర్మాత్మ కర్మాశ్వత్థము. "ఇపుడే విజ్ఞానాత్మను మధ్యస్థముగ జెప్పి, ఇట గర్మాత్మను మధ్యస్థమనుట పూర్వాపర విరోధము కాదా?" అనుకొందురేమో, కాదు. నిత్య (స్వాభావిక) స్థితిం బట్టి విజ్ఞాన మీ వంకనుండి మధ్యస్థముగ ఎంచబడును. అనిత్య స్థితింబట్టి యింద్రియానుగామి యగుచు కర్మాత్మయొక్క మధ్యస్థతకును గారణమగును. చివరకు పూర్వాపర విరోధావసర ముండదు అని భావము.

విజ్ఞానాత్మ ప్రజ్ఞాన మనోఽనుచర మగుచో బ్రహ్మాశ్వత్థోపయిక జీవావ్యయ జ్ఞాన (యోగజజ్ఞాన) వంచితమైపోవును.

అపుడు ప్రజ్ఞాన ప్రభుత్వముచే దేవసత్యలక్షణ కర్మాత్మ ఇంద్రియారామ మగుచు, కామనానుగ్రహముచే విశ్వసంపత్తి వంకకు వంగును. ఇందువలన నది దేవసత్య లక్షణ విశ్వసంపద కధికారి కాగలదు. ఈ కామనామయ కర్మప్రవృత్తియందు ప్రజ్ఞానము ప్రబలము. విజ్ఞానము దుర్బలము. ఈ స్థితిలోని యజ్ఞాది కర్మలు వేదసత్య విజయ కారణములు, ఇహ పర లౌకికానిత్య దేవ స్వర్గాది సుఖములకు గారణములు నగును. ప్రవృత్తి కర్మ లన బడును కనుక నివి శాశ్వతానంద ప్రాప్తి కారణములు కాజా లవు. కనుక నివి యవరకర్మలు "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త మవరం యేషు కర్మ" అనియు జెప్పబడినవి. భగవంతుడుగూడ కామనామయములు, త్రిగుణభావాపన్నములు నగు నీ ప్రవృత్త వైదికకర్మలను బుద్ధియోగ నిష్ఠకు విరోధములుగ నెంచి 'త్రైగుణ్య విషయా వేదా, నిస్త్రైగుణ్యో భవార్జున!' అని వచించెను. ఇంతేకాదు, ఆయన యన్నమాటలివికూడ గమనింపదగినవి:

1. యామిమాం పుష్పితాంవాచం ప్రవదంత్యవిపశ్చితః
   వేదవాదరతాఃపార్థ ! నాన్యద స్తీతివాదినః
2. కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం
   క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతింప్రతి
3. భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం
   వ్యవసాయాత్మకాబుద్ధిః సమాధౌనవిధీయతే.

## వేదవాదరతి

పై వచనము లాధారముగా గొని కొందరు జ్ఞానాను యాయులు కర్మకాండను ఖండింప సాహసించుచున్నారు. అది విలువయుంప దగినదికాదు. వేదవాదరతులకు భగవంతు డవశ్యము విరోధియే. ఏలయన రతి బంధనకారణము గదా! వేద మన్ననో భగవంతుని ప్రాతిస్వికస్వరూపము. అట్టిచో వేద సిద్ధ కర్మవాదమును భగవంతుడు నిరసించు ననుట యెట్లు? ఎట్లు? సంభవము? భగవంతుడు కేవలము కామఫలమయ ప్రవృత్తివిరోధి. అతడు వేదసిద్ధ యజ్ఞాదులకే విరోధియగుచో 'యజ్ఞోదానంతపశ్చైవపావనాని' 'కార్యమేవ' "కర్తవ్యా నీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమం" అని యాదేశించునా? కానిండు ప్రస్తుతము జూచుకొందము. కామనచే ప్రజ్ఞానబలము ప్రబలమగును. దానిచే కర్మాత్మ దేవసత్యమును (విశ్వసంపదను) అనుగమింపనై తద్వీజ యూపయికి వైదిక యజ్ఞతపోదాన కర్మలం బ్రవర్తు డగును. ఇవే ప్రవృత్తికర్మలు.

కామనం ద్యజించిన ప్రజ్ఞానమనస్సు విజ్ఞానానుచరమగును. విజ్ఞానబలము వికసిల్లును. అపుడు త్రిగుణజని తావరణము పూర్తిగా దొలంగును. ఈ సత్వాత్మక విజ్ఞా నానుగ్రహముచే దేవసత్యలక్షణ కర్మాత్మ గుణపాశము క్తమై బ్రహ్మసత్యలక్షణ యోగజజ్ఞానఘన జీవావ్యయ యుక్తు డగును. ఈ యోగము ద్వారా బ్రహ్మశ్వత్థ విజ యాధికారి యగును. ఇట్టి నిష్కామ

కర్మచే (కర్మ లాచరించుచు భోగము లనుభవించు చున్నను) సంస్కార లేప వినిర్ముక్తుడై నిఃశ్రేయసలక్షణ ముక్తిపాత్రు డగును. ఇవే వైదిక నివృత్తికర్మలు. ఇట్లు బ్రహ్మాశ్వత్థ మూలక బ్రహ్మసత్య (దేహస్థిత పరమాత్మ) దేవసత్య (దేహాభి మాని జీవాత్మ) తారతమ్యముచే విద్యాసముచ్చిత వైదిక కర్మ లకు ప్రవృత్త-నివృత్త భేదముచే రెండు విభాగము లగును. ఇవి అధ్యాత్మసంస్థకు జెందిన బ్రహ్మ-దేవభాగములకు జెందిన వని పైని జెప్పియుంటిమి గదా! ఇక :-

విద్యానిరపేక్ష లౌకికకర్మలు :-ఇవి భౌతికశరీరమునకు జెందినవి. వీనియందు కేవలము ప్రజ్ఞానము (మానసరుచి) ప్రధానము కనుక నివి ఐహలౌకిక సుఖ సాధకములు. 1 యోగజజ్ఞానానుగృహీత (ఆత్మానుగృహీత) విజ్ఞానమందు నిష్కామ యజ్ఞతపోదానములు మూడును బ్రహ్మాశ్వత్థము నకును, 2 యోగజజ్ఞానానుగత (ఆత్మజ్ఞానానుగత) విజ్ఞాన సహాకృత, (సౌరవిజ్ఞాన సహకృత) సకామ యజ్ఞతపోదాన ములు మూడును కర్మాశ్వత్థమునకును, 3 విజ్ఞానవంచిత ప్రజ్ఞా నానుగత సకా మేష్టాపూర్తదత్తనామక కర్మలు మూడును, లౌకికవైభవ సంపాదనకును ఉపకారకములు. ఇట్లు ఒకే విజ్ఞా నముయొక్క తారతమ్యముచే మొదట రెండుభాగములుగ విభక్తము లయ్యెను, వైదిక లౌకిక కర్మలు పిదప మూడు శాఖలుగ విభక్తము లగుచున్నవి.

అనగా :-1 వైదిక ప్రవృత్తికర్మలు కేవలము స్వర్గాది పారలౌకిక సుఖములకే, 2 వైదిక నివృత్తికర్మలు కేవలము ముక్తికే, 3 లౌకికర్మలు కేవలము లౌకికసుఖములకే యని తాత్పర్యము కాదు. అట్లయినచో లోక సుఖానుయాయి యగు నేవ్యక్తియు వైదికకర్మల వంక జూడడు. లోకసంగ్రహ దృష్టియు నీ వైదికకర్మ ప్రవృత్తికి విరోధి యగును. చివరకు శాస్త్రోపదేశము కేవలము వ్యర్థమగును. వాస్తవ మేమన :- 1 లౌకిక కర్మలవలన కేవలము లౌకిక సుఖములే లభించును. వీనిచే నాత్మ-దేవభాగముల కే యుపకారము నుండదు. స్థూల శరీర భరణ పోషణ మాత్రము చక్కగా జరుగును. ఈస్థితి ఉదరపరాయణ, విషయానుగత, పశుసుఖముకంటె విలువ యైనది కాదు. 2 వైదిక ప్రవృత్తికర్మల వలన నైహలౌకిక వైభవమును లభించును. దేవభాగోపకారక స్వర్గసుఖమును లభించును. అనగా ప్రవృత్తికర్మ స్థూలశరీరమునకును, సూక్ష్మ శరీరలక్షణ దేవభాగమునకును ఉపకారక మనిభావము. 3 నివృత్తిమూలకము లగు నవే వైదికకర్మ లన్ననో, ఐహ లౌకిక సుఖములతో బాటగు, పారలౌకిక సుఖములకంటె నెన్నో మడుంగులు శ్రేష్ఠములు-నిశ్శ్రేయసలక్షణ శాశ్వతా నంద ప్రవర్తకములు. సర్వోపకారకములు నై యున్నవి :- ఈపరిలేఖల నరయుడు :-

1 :—

1. (1) నివృత్తిమూల వైదికకర్మ- ఆత్మజ్ఞానసహకృతమ్- విజ్ఞానానుగతం సర్వసిద్ధి కృతకృత్యతా
(2) ప్రవృత్తిమూల వైదికకర్మ ప్రజ్ఞానయుక్తమ్, విజ్ఞానానుగతం, ఇహ పరసుఖప్రాప్తి.

2. (3) ప్రవృత్తిమూల లౌకికకర్మ- ఇంద్రియజ్ఞానయుతమ్, ప్రజ్ఞానానుగతం. లోకమేవఫలం

2 :—

(1) బ్రహ్మసత్యాత్మా:-ఆత్మా-బ్రహ్మ-బ్రహ్మాశ్వత్థమూర్తి-హృదయస్థపరమాత్మా
(2) దేవసత్యాత్మా-సత్త్వం-దేవః-కర్మాశ్వత్థమూర్తి-దేహాభిమానీజీవః
(3) భూతాత్మా - శరీరం - భూతమ్ - అశ్వత్థపతితమ్ - దేహము

3 :—

(1) నివృత్తంవైదికంకర్మ-బ్రహ్మాశ్వత్థవిజయసాధకము కనుక- సర్వసాధకము
(2) ప్రవృత్తంవైదికంకర్మ-దేవసత్యవిజయసాధకము- కనుక- లోక-స్వర్గసుఖసాధకము
(3) ప్రవృత్తంలౌకికంకర్మ-భూతసత్యవిజయసాధకము- కనుక విషయసుఖ-పితృస్వర్గసాధకము.

ఈ మూడుకర్మల యారంభమందును త్రుటిసంధానార్థము, ఓమ్-తత్-సత్ అను బ్రహ్మనిర్దేశమును స్మరింపవలయు నని యాదేశ మున్నను, విశేషదృష్టితో జూచునపుడు 1 ఓంకారనిర్దేశము సృష్టిసాక్షియగు మనఃప్రాణవాఙ్మయవిశ్వాత్మకు వాచకము కనుక ప్రవృత్తిమూలక వైదికకర్మలత్రుటినే సంధానించు ననియు, 2 'తత్' శబ్దము, అనిరుక్తభావము కలదగుటచే నివృత్తిమూలక కర్మలకే ప్రధానముగ నుపకరించు

ననియు, 3 'సత్' శబ్దము మనఃప్రాణవాఙ్మయ సత్తానుగృహీత నామరూపకర్మమయ విశ్వమునకను గ్రాహకమై ప్రవృత్తి మూలక లౌకికకర్మలకు సంధాత యగు ననియు దోచును.

ఇతి-వేద-లోకనిబంధనషట్కర్మాణి.

## 7. ధర్మశాస్త్ర నిబంధన షట్కర్మలు.

వేదాంతాది దర్శన శాస్త్రములందును, మన్వాది ధర్మ శాస్త్రములందును, చరక సుశ్రుతాద్యాయుర్వేద శాస్త్రము లందును నిరూపితములైన యుపాదేయ కర్మలను ఆరు విభాగ ములుగ జేయవచ్చును. అవియే ధర్మశాస్త్ర నిబంధన షట్క ర్మలు. దేనియనుగమన ప్రాప్తి సంస్కారములచే మన యధ్యాత్మ సంస్థ కుత్తరోత్తరము వికాసము కల్గునో తద్వారా ఇహాపర లోక సుఖశాంతులు లభించునో, ఆ యతిశయము తత్త్వము, పదార్థము, ధర్మము. ఇక అధ్యాత్మ సంస్థకన్ననో, కారణ-సూక్ష్మ-స్థూలములను మూడు పర్వములు. వాని రక్షణకగు నేకమాత్రోపాయము ధర్మమే. ఈ త్రిపర్వ భేదముచే ధర్మతత్త్వ మును మూడు సంస్థలుగ నగును. ఈ దృష్టితో పైజెప్పిన మూడు శాస్త్రములను ఒకవిధముగ ధర్మశాస్త్రములుగ నెంచి తత్సమ్మత కర్మషట్కము నిట విచారింతము.

ఈ శాస్త్రీయకర్మలు ఆరును 1. నిత్యకర్మలు, 2. నైమి త్తిక కర్మలు, 3. కామ్యకర్మలు, 4. నిత్య నైమిత్తిక కర్మలు,

5. నిత్య కామ్యకర్మలు, 6. నైమిత్తిక కామ్యకర్మలు అనునవి. తక్కిన కర్మలెల్ల నిందే యంతర్భావ్యములు.

విద్యాకర్మలు రెండును జంట. (సయుక్పదార్థములు) విద్యలేని కర్మప్రవృత్తియు, కర్మలేని విద్యావికాసము అసంభవము. స్థితిగతి తాదాత్మ్యముచే విద్యా కర్మలకును దాదాత్మ్యము. స్థితిస్వరూపము గతినుండి నిష్పన్నము. గతిస్వరూపరతే స్థితి సమాశ్రయముపై నాధారపడి యున్నదని, ఈశోపనిషత్తునం 'దనేజదేకం' అను మంత్ర వివరణావసరమున జెప్పబడినది. విద్యస్థితి, కర్మగతి, ఇవే వరుసగ జ్ఞానక్రియలు, బ్రహ్మకర్మలు. ప్రతిక్షణ విలక్షణము, కుగ్వద్రూపమునగు గతి అసత్తు. సర్వదా లక్షణము, ప్రతిష్ఠారూపమునగు స్థితి సత్తు. ఇది యసత్తునకు బ్రతిష్ఠ. అసత్తు సత్తునకు వికాసము. ఈ రెంటి సమన్వితరూపము విశ్వము. (చూ. బ్రహ్మకర్మ పరీక్ష)

## వేదవిద్యా బ్రహ్మ నిరుక్తి.

సత్తార్థక విద్ ధాతువునుండి విద్యాశబ్దము, కరణార్థక కృఞ్ ధాతువునుండి కర్మ శబ్దము వెలసినవి. విద్యతే సావిద్యా. తద్బ్రహ్మ తద్ జ్ఞానమ్. క్రియతే సా క్రియా, తత్కర్మ అనునవి వాని నిర్వచనములు. విద్యతే = అస్తి = ప్రతిష్ఠా = బ్రహ్మ = 'బ్రహ్మవై సర్వస్య ప్రతిష్ఠా' లక్షణమగు జ్ఞానమే శబ్ద - విషయ- సంస్కారములను నుపాధులచే వేద - బ్రహ్మ - విద్యా స్వరూపము లొందును.

శబ్దము వినుటచే గలుగు జ్ఞానము వేదము. విషయ దర్శనముచే గలుగు జ్ఞానము బ్రహ్మ. ఈ రెండు జ్ఞానములును బిదప బుద్ధిసహాకృత మనోయోగముచే సంస్కారరూపము నొందును. అట్లు సంచితమైన సంస్కార ముక్థరూపము ధరించి ఇహాపర వ్యవహార సంచాలక మగును. అదే విద్య. శ్రుతదృష్ట ప్రత్యయము (జ్ఞానము) లను సంస్కారరూప దృఢమూలము లను గావించుకొననివాడు విద్యాశూన్యుడు. కనుకనే పుస్తకము లను చదువులయే విద్య కాదంకము.

ఇంతకు ఒకే జ్ఞాన ముపాధి భేదముచే విద్యా - వేద - బ్రహ్మరూప పరిణతి గాంచుననియే చెప్పదలచినది. ఈ ఏకత్వ భావనం బట్టియే 'త్రయీ విద్యా, త్రయో వేదాః, త్రయం బ్రహ్మ' అను వ్యవహారములు వెలసినవి. ఇట్లే అనగా జ్ఞానము వలెనే కర్మయు శబ్ద - సంస్కార - విషయానుగ్రహముచే మూడు భాగములు. 1. నామాత్మక కర్మ శబ్దకర్మ, 2. కర్మా త్మక కర్మ విషయకర్మ, 3. రూపాత్మక కర్మ సంస్కారకర్మ. ప్రకారాంతరముగ : కర్మ : శబ్దావచ్ఛిన్న మగునదే నామము. విషయావచ్ఛిన్న మగునదే కర్మ. సంస్కారావచ్ఛిన్న మగునదే రూపము. విద్యా - బ్రహ్మ - వేదముల మూటిమొత్తము జ్ఞాన త్రయి. అదే ఆత్మ - అదే స్థితి - అదే బ్రహ్మ; నామ రూప కర్మల మూటి సమష్టియు కర్మత్రయి. అదే విశ్వము. అదే కర్మ - అదే గతి.

జ్ఞాన లక్షణాత్మకు మనః ప్రాణ వాక్కులను మూడు

పర్వములు గదా! మనగపర్వ ముండగా రూపకర్మయు, ప్రాణ పర్వ మాధారముగ కర్మాత్మక విషయ లక్షణ కర్మయు, వాక్పర్వ మూతగా నామకర్మయు నిలచియున్నవి. నామరూప కర్మ సమష్టియే కర్మ (అసత్తు) మనః ప్రాణ వాక్సమష్టియే జ్ఞానము. (సత్తు) అస్తి - బ్రహ్మ - వేదము - విద్య - నామరూప కర్మ సమష్టియగు కర్మయో, అసత్తు - నాస్తి - క్రియ - అవిద్య. 'విద్యాంచావిద్యాం చ యస్తద్వేదో భయం సహ' అన్నట్లు రెండును జంట. స్థితివిద్య గతికర్మకు ప్రతిష్ఠ. 'సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే''

గతి కొరకు స్థిరధరాతల ముండవలయును. నిష్క్రియా తత్త్వ మొకటి యూత లేకున్నచో క్రియామయ కర్మకు స్వరూప రక్ష యుండజాలదు. స్థితిగతి లక్షణ విద్యాకర్మల తాదాత్మ్య సంబంధమున కిదే యుపపత్తి. ఈపరిలేఖ నరయుడు:



1. త్రయీవిద్యా జ్ఞానం (మనః) - (1) సంస్కారాత్మకం కర్మ - రూపప్రధానం మనోమయం.
2. త్రయం బ్రహ్మజ్ఞానం (ప్రాణః) - (2) విషయాత్మకం కర్మ - కర్మప్రధానం ప్రాణమయం.
3. త్రయోవేదాః జ్ఞానమ్, (వాక్) - (3)శబ్దాత్మకం కర్మ - నామప్రధానం, వాఙ్మయం.

| అస్తిలక్షణం బ్రహ్మ | | నాస్తిలక్షణ కర్మ |
|---|---|---|
| ప్రతిష్ఠా | సతో బంధు మసతి నిరవిందన్ | క్రియా |
| సత్ | | అసత్ |
| జ్ఞానమ్ | | కర్మ |
| స్థితిః | | గతిః |
| అమృత వివర్తమ్. | | మృత్యు వివర్తమ్. |

"అమృతంచైవ మృత్యుశ్చ,
సదసచ్చాహ మర్జున :"

## గతి - కర్మ

ఈ విద్యా కర్మ నిర్వచనముచే ప్రకృతము కర్మయన్నది గతితత్త్వమనియు, అది స్థితి లక్షణ జ్ఞానము నాధారముగొని నిల్చియున్నదనియు తేలినది. గతియే విసర్గభావము. కనుక కర్మకు గీత, 'విసర్గః కర్మ సంజ్ఞితః' అని లక్షణము చెప్పినది. విసర్గ శబ్దము నిత్య సాపేక్షము. ఆ దానభావము నాధారముగా గొనియే విసర్గభావ ముపపన్నమగును. విసర్గ గర్భముం దాదానము నిల్చియున్నది. కనుక గీతోక్త విసర్గశబ్దము ఆదాన సంగ్రాహక మనియు ననవచ్చును.

విసర్గము గతిభావము. ఈ గతిభావము పరాగ్గతి, అర్వాగ్గతి యని రెండు తెరగులు. అటుపోవుట పరాగ్గతి. ఇదే 'గతి లక్షణాగతి.' ఇట వచ్చుట అర్వాగ్గతి. ఇది 'యాగతి లక్షణ గతి.' మొదటిది విసర్గము. రెండవది ఆదానము. చివరకీ రెండును గతులే, కర్మలే. యే కర్మం జూచినను, ఆదాన విసర్గములే కన్పట్టును.

కర్మ చేయబడును. ఎందుకు? ఏదో వస్త్వాదానమునకే కాని మొదట తన ప్రాణశక్తిని, భూతబలమును, సంపత్తిని, విసర్గము గావింపవలయును. అటుగానిచో నాదానము సఫలము కాదు. విసర్గ కృపణు డాదాన వంచితుడగును. ఆగతవస్తు ప్రతిష్ఠకై మొదట తన స్థానమునం దవకాశ మేర్పరుప వలయును. త్యాగముకొలది వైభవము. త్యాగము లేకుండ ఘుణాక్షర న్యాయముగనో మిథ్యావంచనల వలననో వచ్చిన (లభించిన) సంపత్తి కుపభోగ ముండదు. ఉండినను శాంతి లక్షణానంద ముండదు. త్యాగానుబంధియగు వైభవమే శాంత్యానంద ద్వారము.

ఆదాన విసర్గ లక్షణ కర్మయే కర్మకు వాస్తవిక పరిచయము. అట్టికర్మకే పైజెప్పిన యారు వివర్తములు. ఈ యారు విధములగు కర్మలకు నాధ్యాత్మిక సంస్థతో సమన్వయముం గూర్చుటయే ప్రకృత ప్రకరణ ముఖ్యోద్దేశ్యము.

## అధ్యాత్మ ప్రపంచము.

ఆత్మ - సత్త్వము - శరీరము, అనువాని మొత్త మధ్యాత్మ సంస్థ. ఇందు ఆత్మ మనోమయము, జ్ఞానప్రధానము. సత్త్వము ప్రాణమయము, క్రియాప్రధానము. శరీరము వాఙ్మయము, అర్థప్రధానము. ఇవే కారణ సూక్ష్మ స్థూల శరీరములు. ఈ శరీరత్రయియా ప్రతిష్ఠ సూర్యుడు. (చూ. ఆశ్రమ విజ్ఞానము, ఆయుః ప్రకరణము.) ఆత్మ మనస్సు అవ్యయమనస్సు. ఇదే శ్వోవసీయసము, లేక శ్వోవస్యము. ప్రాణలక్షణ సత్త్వమును మనస్సే (ముందు తెలియనగును.) కాని యిది యా యాత్మ మనోభిన్నము. అది సర్వాలంబనము. ఇది యింద్రియాలంబనము. అది యంతర్మనము. ఇది బహిర్మనము. అది జీవన సత్తకు ముఖ్య ప్రతిష్ఠ. ఇది జాగ్రదవస్థకు సమ్రాట్టు. అది విద్యా కర్మమయము. ఇది అన్నమయము. వాక్ప్రాణ చక్షు శ్శ్రోత్ర మనస్సులను నింద్రియవర్గ మనస్సు ఈ రెండు మనస్సులకంటె వేరగు నింద్రియ మనస్సు. ఈ పంచప్రాణ (ఇంద్రియ ములకు నుక్థమగు మనస్సునందు "మనష్షష్ఠానీంద్రియాణి" యందలి యింద్రియ మనస్సు అంతర్భూతమై యున్నది. ఇదే ప్రజ్ఞాన మనస్సు. ఇందు ప్రజ్ఞ ప్రాణమునను రెండుభాగములు. రెంటి మొత్తమే అనింద్రియము, సర్వేంద్రియము, అతీంద్రియము, అను మొదలగు పెక్కు పేరులం బరగు మన ప్రజ్ఞాన మనస్సు. ఇదే సత్త్వమను ఆత్మ పర్వము, రెండవది. మూడవ పర్వము వాక్ప్రపంచాత్మక స్థూలశరీరము. ఇట్లు 1. ఆత్మలక్షణ

శ్రోవస్యసు మనః ప్రధాన కారణశరీరము, 2. సత్వ లక్షణ ప్రజ్ఞాన మనఃప్రధాన సూక్ష్మశరీరము. 3. శరీర లక్షణ భూత ప్రధాన స్థూల శరీరమునను నీ మూటి మొత్తమే అధ్యాత్మము.

సప్తాన్న వివర్తము :- పైజూపిన శరీరత్రయ స్వరూప రక్షకై సప్తవిధా న్నాదానము గావలయును. వస్తుతః 1. జ్ఞానాన్నము, 2. కర్మాన్నము, 3. అర్థాన్నము అను మూడే ముఖ్యాన్నములు. ఇవి వరుసగా కారణ, సూక్ష్మ, స్థూల, శరీరోప కారకములు. ఇందు వాక్ప్రధానమగు నర్థమున కవాంతర భేదము లైదగుటచే మొత్త మన్నము లే డగుచున్నవి. జ్ఞాన, క్రియాకాశ, వాయు, తేజో, జల- పృధువు లన్న నే సప్తాన్నములు.

ఆకాశము వాక్తత్త్వము ; బలగ్రంధితారతమ్యమున నిది పంచభూతరూపము లొందును ; వాక్ప్రధానము లగుటచే భూతములు వాఙ్నామముచే వ్యవహరింప బడును. ఈ పంచ భూతాత్మక వాగన్నము స్థూలశరీ రాన్నము. ఆకాశాన్నము శబ్దరూపము, వాయ్వన్నము శ్వాసప్రశ్వాసాత్మకము. సూర్య-చంద్రాగ్ని వాగాత్మ జ్యోతిభేదముచే బంచధా విభక్త మగు తేజోన్నము ప్రకాశాత్మకము. పానీయము జలాన్నము. పార్థివ మృణ్మయ యవ గోధూ మాద్యన్న మందరు నెరింగినదే గదా ! ఈ సప్తాన్నాదాన విసర్గములే అధ్యాత్మసంస్థా ప్రతిష్ఠకు మూలములు.

మనము సూర్యునుండి వెలసితిమి (నూనం జనాః సూర్యేణ ప్రసూతాః) నిరంతరము నతడు మనలను దిను

చున్నాడు. మన యాధ్యాత్మిక రసాదులను రశ్ములద్వారా, ఆదానము గావించుచు, 'సర్వమాదదానః' అగుచు, తన యాదిత్యనామమును చరితార్థము గావించుకొనుచున్నాడు. ఇక మనలను దిను సీ యన్నాదసూర్యుని, (అతనికి అన్నముల మయ్యు) మనమును దినుచున్నాడు. సూర్యరస సముద్భూత సప్తాన్నములచే పరంపరగను, రశ్మిగత ప్రాణదానముచే సాక్షాత్తుగను అతడు మన కన్న మగుచున్నాడు. ఈ పారస్పరిక ఆదాన విసర్గముల వలననే అతడును, మనమును స్వస్వరూప ప్రతిష్ఠితులమై యున్నాము. పారస్పరి కాన్నాన్నాద భావమే జీవనసంస్థకు ముఖ్యాలంబనము. "యో మాం దదాతి సఇదేవ మావత్ అహమన్న మన్నమదంత మద్మి."

ఈ ప్రాప్తసప్తాన్నము లందును, వాఙ్మయాన్న పంచకము స్థూలశరీర లక్షణ శరీర రక్షకము. క్రియాన్నము సత్వరక్షకము. జ్ఞానాన్న మాత్మకు ప్రతిష్ఠ. ఈ దృష్టితో నాధ్యాత్మికకర్మ, త్రిసంస్థ గలదగును. ప్రతి శరీరాదాన విసర్గకర్మల స్వరూపము లును భిన్నములు. ఇందు మొదటివగు స్థూల శరీర కర్మలను జూతము.

త్రిధాతు వాదము :- వాత పిత్త కఫములు మూడును స్థూల శరీర ధాతువులు. వీని సామ్యావస్థ వలననే స్థూలశరీరము స్వస్వరూపమున నుండును. ఇవి వరుసగ వాయువ్యాప్యాగ్నే యములు, ప్రాణాత్మకములు. ప్రాణమునకు "రూప, రస, గంధ, స్పర్శ శూన్యత్వేసతి అధానుచ్ఛదత్వం" అనియు, ఇంద్రియము

లకు "రూప, రస, గంధ, స్పర్శ శబ్దాత్మక విషయ గ్రాహకత్వే సతి నియత విషయ గ్రాహకత్వం" అనియు లక్షణములు. కను కనే ఇంద్రియముల ద్వారా, లేదా, సూక్ష్మతమ దర్శక యంత్రా దులద్వారా, ఆ ప్రాణరూపములగు నమూర్తధాతువుల నరయ జాలము. సత్తా సిద్ధములయ్యు నివి ప్రత్యక్షమునకు వెలియైనవి. మరియు ;

శరీరమునందు శిరా స్నాయు ధమనీ నామకములు మూడుజాతుల నాడులున్నవి. ఇందు రసవాహినులు శిరలు. జ్ఞానవాహినులు స్నాయువులు. వాయువాహినులు ధమనులు. ఈ ధమనులందు సంచరించు స్థూలవాయువు వాతము. ఇందు ధాతు (ధారక) రూప ప్రాణాత్మకవాతము ప్రతిష్ఠితమై యున్నది. కఫ మాప్యము ; ఇందు ఆప్యప్రాణరూప కఫధాతువు ప్రతిష్ఠి తము. శరీరవ్యాప్తమగు నూష్మమే పిత్తము. ఇందలి యాగ్నే ప్రాణధాతువే పిత్తధాతువు. స్థూలములగు వాత పిత్త కఫములు భౌతికములు. ఇందున్నట్టి శక్తి ప్రాణ ప్రతిష్ఠారూప సునూక్ష్మ మూర్త వాత పిత్త కఫములు దివ్యములు. ఈ వ్యవచ్ఛేదముం బట్టి చూచినచో పాశ్చాత్య విద్వాంసులు "ఎన్నివిధముల చూచిన నగపడని వాత పిత్త కఫ ధాతువాదము నిర్మూలము. తదాధారముం గొనియున్న ఆయుర్వేద నిదాన చికిత్సాదులును అవైజ్ఞానికములు, అనుపాదేయములు" అని వాదించు బుద్ధి శూన్య కుతర్క వితండవాద మెందుకును గొరగానిది. అది వారి స్వార్థలిప్సకు ఘృణాస్పద పరిచాయకము.

ద్విధాతు వాదము: 'అగ్నిషోమాత్మకం జగత్' అనునట్లు మహామాయియగు జగదీశ్వరునకు స్థూలశరీర రూపమగు నీ మహావిశ్వమునకు అగ్ని సోములను రెండు ధాతువు లంగీకరింప బడినవి. సూర్య చంద్రులద్వారా వీనిం బరీక్షింపవచ్చును. మరియు మూర్తి (పిండ) సంపాదకము 'మాతరిశ్వా' యను ప్రాణవాయువొకటి కలదు. ఇది అగ్నియొక్క ధర్త్రావస్థ యగుటచే అగ్నిధాత్వంతర్భూతము. కనుక చివరకు రెండే ధాతువులు. సోమఘనావస్థ జలము. కనుక సౌమ్యధాతువు నాప్యమనియు నందురు. సూర్య వాయు సోమములను నీ మూడు ధాతువులే యోగమాయి యగు జీవాత్మయొక్క స్థూలశరీర రూప క్షుద్రవిశ్వము నందలి (వరుసగ) పిత్త వాత కఫ నామకములగు మూడుధాతువులకు నారంభకము లగుచున్నవి. వేదము నందును, ఆయుర్వేదము నందును, ఈ త్రిధాతు వర్ణన లిట్లు గోచరించుచున్నవి.

"త్రిర్నో అశ్వినా దివ్యాని భేషజా, త్రిఃపార్థివాని త్రిరుదత్తమద్భ్యః
ఓమానం శంయోర్మమకాయ సూనవే'త్రిధాతు'శర్మవహతం శుభస్పతీ"
విసర్గా దానవిక్షేపైః సోమసూర్యానిలా యథా
ధారయన్తి జగద్దేహం, కఫ పిత్తానిలా స్తథా.

'న చ తత్ర ఔదర్యై ర్గుణై రాహారః ప్రక్లిన్నో భిన్న సంఘాతః సుఖరజశ్చ భవతి। సతత్రస్థ ఏవ స్వశక్త్యా శేషాణాం శ్లేష్మస్థానానాం, శరీరస్య చోదక కర్మణా అనుగ్రహం కరోతి॥
(సుశ్రు)

"అగ్నిరేవ శరీరే పిత్తాంతర్గతః కుపితాకుపితః శుభాశుభాని కరోతి. సోమఏవ శరీరే శ్లేష్మాంతర్గతః కుపితాకుపితః శుభాశుభాని కరోతి. సర్వఏవ ఖలు వాతపిత్త శ్లేష్మాణః ప్రకృతి భూతాః పురుష మవ్యాపన్నేంద్రియం, బలవర్ణ సుఖోపపన్న మాయుషా మహతోపపాదయన్తి॥ (చరక సూ.)

"న ర్తే దేహః కఫాదస్తి న పిత్తాన్నచ మారుతాత్
శోణితాదపి వా నిత్యం, దేహ ఏతైస్తు ధార్యతే"

ఆ ర్తవమపి త్రిభిర్దోషైః శోణిత చతుర్థై రుపసృష్ట మబీజం భవతి." (సుశ్రు)

"తావే వార్క వాయూం సోమశ్చ కాలర్తు రసదోష దేహా ప్రత్యయభూతాః సముపదిశ్యన్తే." (చరక)

ఈశారీరధాతు సామ్యావస్థా పరిణతికై ప్రకృత్యనుకూలముగ నాయుర్వేద ముపదేశించు, హిత మితాహార విహారములు స్వరూపరక్షా సాధకములు నిత్యకర్మలు. ఇక మిథ్యాహార విహారములచే త్రిధాతువులును వైషమ్యము నొంది రోగమూలములై దుఃఖప్రవృత్తి కుపోద్బలకము లగునని చెప్పబడినది.

"వికారో ధాతు వైషమ్యం, సామ్యం ప్రకృతిరుచ్యతే
సుఖసంజ్ఞక మారోగ్యం, వికారో దుఃఖమేవ చ"
"యాభిః క్రియాభిర్జాయన్తే శరీరే ధాతవః సమాః
సా చికిత్సా వికారాణాం, కర్మ తద్భిషజాం మతం."

కర్మ పరిభాష : నిత్యకర్మ పరిభాష పాలనము. నైమిత్తిక కర్మపరిభాష రక్షణము. కామ్యకర్మ పరిభాష పోషణము.

1 నియతాహార విహారములచే నగు ధాతుత్రయసామ్యము తత్పాలనము, దానికి జెందిన యాదాన విసర్గకర్మ స్థూల శరీరానుబంధి నిత్యకర్మ. దీనిని సరిగ నాచరింపనిచో హానియున్నది. కాని యాచరించినచో పాలనరూప శాంతి స్వస్త్యయనమే గాని వేరొండు విశేషమేమియు లేదు. 2 ఆచరింపనిచో ధాతువైషమ్య మేర్పడి కలుగు రోగాదుల నివృత్తి ద్వారా శరీర రక్షకై ఆయుర్వేద ముపదేశించు నాదాన విసర్గాత్మక చికిత్సాకర్మ స్థూల శరీరానుబంధి నైమిత్తిక కర్మ. 3 వాజీకరణా ద్యౌషధి సేవనము మూడవదగు కామ్యకర్మ. శరీరపుష్టి ధాతువృద్ధి దీని లక్ష్యములు. ఇట్లే తైల గండూషాది నిత్య నైమిత్తికాదులగు నితర కర్మలును ఆయుర్వేదమం దందందు సంగ్రహింపబడినవి. ఇవి ప్రధానములగు పై మూడు కర్మలయందె అంతర్భావ్యము లగుటచే వీనికి ప్రత్యేక గణన లేదు.

సత్వధాతుత్రయి : పిమ్మటిదగు సూక్ష్మశరీర లక్షణ సత్త్వముం జూతము. ఇంద్రియ వర్గయుక్త ప్రజ్ఞాన మనస్సే సత్త్వము. దీని వ్యాప్తి యున్నంత వరకు గల ప్రపంచమంతయు సత్త్వమనియే వ్యవహారము. 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 భూతానుశయములు (గంధ రసాదులు) పూర్ణ ప్రజ్ఞ కామము - కర్మ (సంస్కారము) అంతఃకరణము, బుద్ధి - అహంకారము - వైశ్వానర - తైజస - ప్రాజ్ఞులు. ఈ మొత్తమంతయు సత్త్వము ; ఇదే సూక్ష్మ శరీరము. స్థూలశరీర మర్థ

ప్రధానము. కనుక చిత్త్వాగ్ని లక్షణ భూతాత్మ సత్త్వము. ప్రాణప్రధానము కర్మాత్మ.

సత్త్వభాగము నిత్యముగ రజస్తమస్సహాకృతము. రజస్తమస్సులు సత్త్వ విరోధులైనను తదవినాభూతములు. ఒకనియందు సత్త్వము ప్రధానము. వేరొకడు రజోమూర్తి. ఇంకొకడు తమఃప్రధానుడు. ఈ త్రిగుణభావ తారతమ్యముచే పదార్థములకు సాత్త్విక రాజస తామసములను మూడు భేదము లేర్పడుచున్నవి. ఈ మూడుగుణముల సత్తయు, కామాది దోషములపై నాధారపడి యున్నది. దోషము తొలగినా, గుణము నిర్గుణమై విశ్వసీమకు వెలియగును. "సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః"

దోషములు :—రజోగుణమునుండి కామ-క్రోధ-లోభములు (కామఏష క్రోధఏష రజోగుణ సముద్భవః) ను, తమోగుణమునుండి, మోహ-మద-మాత్సర్యములును, కలుగును. కామమోహములు, క్రోధమదములు, లోభమాత్సర్యములు జంటలు; రజఃపుత్రులు; వరుసగ తమస్సుంగూడగ, తమఃపుత్రులకు దండ్రులైరి. సత్త్వము ప్రతిష్ఠాభూమి; రేతోధా; కామక్రోధలోభములు రేతస్సులు; తమస్సు యోని; సత్త్వాధారమున, మూడు రేతస్సులును తమోయోనియం దాహుతములు కాగా; మోహ మద మాత్సర్య జనకము లగును. గుణములకు బుత్రులు పౌత్రులు నగు నీ యారుదోషములే పిదప గుణముల స్వరూపరక్షకు కారణము లగుచున్నవి; వాతపిత్తకఫములు శరీర

ధాతువు లైనట్లే అరిషడ్వర్గము సత్త్వధాతువులు; వీనిచే సత్త్వలక్షణ సూక్ష్మశరీర రక్ష జరుగుచున్నది.

కామక్రోధాదులు చెడ్డవికావు; వానివైషమ్యములు (హెచ్చు-తగ్గులు) చెడ్డవి; ఇవి పెరుగుటయు, హానియే; తరుగుటయు దోషమే; వీనిక్రోడి సత్త్వశరీర పాలనరక్షణ పోషణాలు మన్వాది ధర్మశాస్త్రముల ద్వారానే సంభవములు; స్నానసంధ్యాది కర్మలవలన పాలనజరుగును కనుక నివి నిత్య కర్మలు. వీనికూర్చి ఎందుకు? అను ప్రశ్నలేదు; అనైమిత్తిక ములు; వీనింజేసిన, విశేషలాభములేదు; చేయకున్న హాని కలదు; చేసిన నభ్యుదయములేదు; చేయకున్న ప్రత్యవాయము కలదు. అభ్యుదయ ప్రవృత్తినిమిత్త భూత శుభవాసనల నట్టె యుంచుట ప్రత్యవాయనిమిత్తముల నాటంకపరచుటయు నిత్య కర్మల లక్ష్యములు; బ్రాహ్మ ముహూర్తమందు లేచుట స్నానా దులచే మలవిశోధనము, సంధ్యాతర్పణ బలివైశ్వదేవాచరణము, నియతసమయ మితహితభోజనము, స్వాస్థ్యరక్షార్థము నియమిత రూపభ్రమణము, జీవనోపయోగముగ శిష్ట సమాజానుకూల ముగ, నావశ్యకము లగు వినోదముల ననుగమించుట మొద లగునవి నిత్యకర్మలు. ఇందు సామాన్యభావ పాలకములు సామాన్యములు; విశేషభావోద్బోధకములు విశేషములు.

భక్ష్యాభక్ష్య పేయాపేయ, స్పృశ్యాస్పృశ్య వివేకము లేక వర్ణధర్మవిరోధు లగు నసత్కర్మల ననుగమించుట, మిథ్యా

భాషణము, హింస, స్తేయము, అగమ్యాగమనము మొదలగు అసత్కర్మప్రవృత్తిచే సత్త్వ భావము మలిన మగును. కామాదులు విషమము లగును. సత్యదేవతలు, ప్రత్యవాయ ప్రవృత్తి కారణభూతాశుభ సంస్కార ముక్తు లగుదురు. ఈ దోషముల అవరోధ పరిమార్జనములకొరకు, గావింపబడు ప్రాయశ్చిత్తాది కర్మలు నైమిత్తికములు. వీని కాదోషములు నిమిత్తములు గదా! కనుక నైమిత్తికములు.

పుత్రకాముకుడు పుత్రేష్టి జేయును; స్వర్గకాముకుడు జ్యోతిష్టోమ మాచరించును. శత్రువధకాముకుడు కృత్యాప్రయోగ మొనరించును. ఇట్టివి కామ్యకర్మలు; ఇవి పోషకములు; పుష్టిభావమే వీని ముఖ్యోద్దేశ్యము.

జననమరణాశౌచ నిమిత్తకాశౌచ స్నానములు, గ్రహణనిమిత్త స్నానములు, అష్టమహాదానములు, రోగోపశమనార్థము లగు నాయాదానములు, మొదలగు నవి నిత్యనైమిత్తిక కర్మలు. ప్రజ్ఞాపరాధ జనిత దోషనివృత్తి కొరకైన కర్మలు నైమిత్తికములు. ప్రకృతివలన గలిగిన దోషములం బరిమార్జన జేసికొన జేయుకర్మలు నిత్యనైమిత్తికములు. ఇట నిత్యశబ్దము అవశ్య కర్తవ్యతా సూచకము.

ఇష్టాపూర్త దత్తాది విద్యావిరపేక్ష రమణీయకర్మలు, ఏకోద్దిష్ట పార్వణాది శ్రాద్ధకర్మలు, ఆనృశంస ధర్మమునకు జెందినవై సభ్యతా, మానవతా స్వరూప రక్షకము లగు నన్ని

కర్మలు, శాంతి స్వస్త్యయన కర్మలు మొదలగునవన్నియు నిత్య కామ్యములు. వీనివలన నాయా విశేషఫలప్రాప్తియు గలుగును. నిత్యకర్మలవలె నివియవశ్య మాచరణీయములు నగును. కనుక నివి నిత్యకామ్యములు.

రోగశాంతికి, కామనాసిద్ధికి, గావించు మొక్కుబడులు, చెల్లింపులు వ్రతానుష్ఠానములు, నైమిత్తికకామ్యములు. నవీనశిక్షితులు గూడ పరీక్షలందుత్తీర్ణులగుటకు ఈ కర్మలను కొంతవర కాచరించుచు ఈ యంశమునందాస్తికు లనిపించుకొను చుండుట యగపడుచున్నది. ఎట్లయినను నేటికిని ప్రతి యింట నేదోయొక విధముగ నీకర్మప్రచార మున్నది.

ఆత్మధాతుత్రయి :— ఇక కారణశరీరలక్షణ నాత్మ పర్వముం జూతము. దీనికి ముఖ్యప్రతిష్ఠ లగు ధాతువులు, విద్యా-కామ-కర్మలును (అవిద్యలు) మూడు, ఇటువిద్య అటు కర్మ (అవిద్య) మధ్యకామము. వీనిపాలన మాత్మపాలనము ఆత్మస్వరూపరక్ష. వీని వైషమ్య మాత్మస్వరూప విఘాతకము. ఈవైషమ్య సామ్య కర్ణధారుడు మధ్య నున్న కామదేవుడు. కామ మందు వైషమ్యమేర్పడెనా, మొదట నవిద్యాలక్షణ కర్మధాతువు విషమ మగును. దానిచే విద్యాభాగము విషమ మగును. కామభావ సమతచే విద్య కవిద్యతోడను, అవిద్యకు విద్యతోడను సమత్వలక్షణ యోగము చక్కగ నుండును. ఇదే గీతోక్త నిష్కామ కర్మయోగము. వాతాదిధాతువులు

స్థూలశరీర స్వరూపమునకు, సత్త్వాదిగుణములు సత్యమునకు, వలె విద్యాకామకర్మలు మూడును ఆత్మస్వరూప రక్షకములు. ఈ మూటి సమష్టియే ఆత్మ. ఇది యెన్నడును విద్యా (జ్ఞాన) ధాతువులకు వెలి గాజాలదు. దీనినుండి కామ ధాతువుం దొలగింప బడ జాలదు. అవిద్యాధాతువు దీనికి వెలి గాజాలదు.

యోగత్రయి :—ఈ యాత్మధాతుత్రయ వికాసార్థము జ్ఞాన భక్తి కర్మయోగములు వెలసినవి. (1) గృహస్థాశ్రమాను బంధియు బ్రాహ్మణభాగోక్తము నగు కర్మమార్గము కర్మధా తూపకారము. (2) వానప్రస్థాశ్రమానుబంధియు ఆరణ్యకభాగోక్తము నగు భక్తిమార్గము కామధాతూపకారకము. (3) సన్యాసాశ్రమానుబంధియు నుపనిషద్భాగోక్తము నగు జ్ఞానమార్గము విద్యాధాతూపకారకము. (చూడుడు ఆశ్రమ విజ్ఞానము.) ఈ త్రిమార్గమీమాంసకై త్రిధావిభక్త మీమాంసాదర్శనము వెలసినది. జైమినిదర్శనము పూర్వమీమాంస, శాండిల్యదర్శనము మధ్యమీమాంస, వ్యాసదర్శన ముత్తర మీమాంస. త్రిధావిభక్త వేద విధిభాగము క్రమముగ ఆది మధ్యాంత భావయుక్తము కనుక వీనిని వరుసగ వేదాది, వేద మధ్య వేదాంత దర్శనము లనియు ననవచ్చును. ఆయీ విషయములెల్ల నాత్మవిజ్ఞానమునందు దార్శనికాత్మ పరీక్షావసర మున విస్తరించి యుంటిమి. ఇచట జెప్పదలచిన దేమన:-

నిష్కామభావ సమావేశముచే జ్ఞాన-కర్మ-భక్తి నిష్ఠలు మూడును, బుద్ధియోగ సంపత్తియుక్తము లగుచున్నవి. అట్టి

సమతాలక్షణ బుద్ధియోగప్రతిపాద్యాయా యుక్తము లగుటచే బుద్ధియోగాత్మకము లగు నానామార్గములును, ఆత్మ స్వరూప పాలకములు, రక్షకములు నై యున్నవి. ఇవియే ఆత్మ యొక్క నిత్యనైమిత్తిక కర్మలు. కామనావశావేశముచే నివియే కామ్యకర్మలు నగుచున్నవి.

భావశుద్ధికై ధృతి, క్షమా, దయా, శౌచానాయా సానసూయాస్పృహాకామము లను అష్టగుణానుగమనమును ఆవశ్యకము. వాని లక్షణాద్యములు సంస్కారవిజ్ఞానమం దరయ వలయును. ఈ గుణాత్మక కర్మల ననుగమించుటచే ఆత్మ దోష నిమిత్తములనుండి తప్పించుకొనును. కనుక నివి యాత్మకు నిత్య నైమిత్తిక కర్మ లనవచ్చును. సర్వభూతరతి, పరపీడానివృత్తి మొదలగునవి నిత్యకామ్యకర్మలు. యోగశాస్త్ర ప్రతిపాదితము లగు నణిమాది సిద్ధికర్మలు, నైమిత్తికకామ్యకర్మలు. ఇట్లాత్మ కర్మలును ఆరు తెరగులుగా నెన్నవచ్చును.

ఆత్మ పురుషుడు. సత్యము ప్రకృతి. శరీరము వికృతి. మూటిమొత్త మధ్యాత్మము. సత్వ-శరీరములు లేని ఆత్మ (పురుషుడు) అనుపపన్నము. కనుక పురుషశబ్దము ఆసమష్టికిని వాచకమైనది. అట్టి పురుషుని (ఆత్మ - సత్త్వశరీరములు) పై ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతిక భేదములచే మూడాక్రమణలు జరుగుచుండును. 1 ఉల్కావజ్రపాతానులు, ఇంద్ర వాయ వ్యాప్యభూకంపములు, మహామార్యాదులు, ఆధిదైవి కాక్ర మణలు, ప్రాకృతి కాఘాతములు. 2 పశు పక్షి క్రిమి కీట మను

ష్యాది పార్థివప్రాణులవలన గలుగు కష్టము లాధిభౌతికములు. 3 కుపథ్యముచే రోగముం బెంచుకొనుట, అసావధానతచే పడుట మొదలగునవి ప్రజ్ఞాపరాధ ఫలములు. ఈ ప్రజ్ఞాపరాధ ముచే గలుగునవి కామక్రోధాది వేగములు, రోగశోకాదులు మొద లగున వెల్ల నాక్రమణలు, ఆధ్యాత్మికములు. ఈ మూ డాక్రమణలచే పురుషసంస్థయందు సంఘర్షయు, దానిచే తాప మును అశాంతియు (క్షోభ) కలుగును.

త్రివిధాక్రమణలు :- 'గుణ దోషమయం సర్వం స్రష్టా సృజతి కౌతుకీ' అన్నట్లు ఈ యాక్రమణలును శుభాశుభ భేద ముచే రెండు విధములు. ఆధిదైవి కాక్రమణ యగు వృష్టి ఆవ శ్యకమగునంత యగుచో శుభము ; అతివృష్టి యశుభము. విక్షిప్త మనుష్యుని దండించుట యాధిభౌతికాక్రమణ. దీనివలన వాని పిచ్చి వదలును. కనుక శుభము. చీకటిలో నడుచువాడు కానక గోతిలో పడి ముందుకు బోజాలకుండును. ఈ సాంయోగి కాధ్యాత్మి కాక్రమణ పీడాకారణ మయ్యు నితని జీవన రక్షకు గారణమే యగును.

ఆత్మ - సత్త్వ - శరీరములపై భిన్న భిన్న విధముల యాక్రమణలు జరుగుచుండును. కత్తివ్రేటుచే చేయి తెగును. కాని సత్వమునకు ఆత్మకు విశేషాపకారము జరుగదు. బూతులు వినుటచే శరీరము-ఆత్మ అనువాని కేమియు లేదు. గాని సత్త్వ ము తేజిత మగును. మిథ్యాభాషణ వలన శరీరమునకు, మొదట

సత్త్వమునకు నేమియు నంటకున్నను, ఆత్మవికాసముమాత్రము తత్క్షణమే యభిభూత మగును.

ఆయుర్వేదశాస్త్రము శరీరానుబంధి కర్మలను, ధర్మశాస్త్రము సత్త్వానుబంధి కర్మలను, దర్శనశాస్త్ర మాత్మానుబంధి కర్మలను ప్రతిపాదించు నవియు, ప్రతి శాస్త్రమును నిత్యనైమిత్తికాది కర్మషట్కయుక్తమనియు ఇందు ప్రధానములు, నిత్యనైమిత్తిక కామ్యములు మూడే యనియు, వీని యన్యోన్య సంయోగమున నేర్పడు తక్కిన మూడు నీమూటి యందే యంతర్భావము నొందునవియు జెప్పియుంటిమి. 1 నిత్యనైమిత్తికములు - నిత్యములందును, 2 నిత్యకామ్యములు-కామ్యములందును, 3 నైమిత్తికకామ్యములు-కామ్యములందును, అంతర్భావము నొందునని తెలియవలెను. (షట్కర్మాణి దినేదినే).

యజ్ఞార్థకర్మలు :—నిత్యనైమిత్తికములు రెండును యజ్ఞార్థకర్మలు. వీనిచే పురుషసంస్థ తన స్వరూపమందు ప్రతిష్ఠితమై యుండును. వీనివలన బుణ్య (వృద్ధి) పాపములు (హ్రాసములు) లేవు. ఇదే సమత్వయోగము. సమతయే శాంతి-శాంతియే ఆనందము. ఇవి అబంధనములు. "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః" ఇక మూడవవర్గమునకు జెందిన కామ్యములు భగవంతుని దృష్టిలో బంధనమూలములు. ఇందు హ్రాసవృద్ధుల విషమత యుండును. అది యాత్మ సమత యుండనీయదు, కనుక నిది సమతాలక్షణ బుద్ధియోగ

నకు మహాప్రతిబంధకములు. కనుకనే 'కామ్యానాం కర్మ
ం న్యాసం సన్యాసం కవయోవిదుః' అని లక్షణ మేర్పడినది.

కాని, భగవంతుడు కామ్యకర్మశత్రువు కాడు. కామ
(ఉద్ధా ప్యాకాంక్షా నామక ప్రజ్ఞా నానుగ తాసక్తికే)
ద్ధి. ఇదే యాసక్తిజననియగు కామన. ఇది బంధన కార
ు. కామనాశూన్య కామ్యకర్మలు వైయక్తిక స్వార్థ
ర్యాదకు బాహ్యములై లోకసంగ్రాహకములై నిత్యనైమిత్తి
మలవలె యజ్ఞార్థములే యగును. అటుగాక కామనా పరిగ్ర
ముచే నిత్యనైమిత్తిక కర్మలుగూడ కామ్యకర్మ లగుచో
జ్ఞార్థసంప ద్వంచితములే యగును.

ఆత్మ - సత్త్వ - శరీరములకు ఘనిష్ఠసంబంధము కనుక
త్త త్కర్మషట్క ప్రతిపాద కాయుర్వేద, ధర్మశాస్త్ర, దర్శన
స్త్రములు, ఆమూడు పర్వముల రక్షణయు లక్ష్యముగా
నును. ఆయుర్వేదము వర్ణవిధా నానుసారముగనే యౌషధ
రన విధానము గావించును. శారీరశక్తి (సత్త్వము) ననుస
చియే ధర్మశాస్త్రము ప్రాయశ్చిత్తాదికర్మలను ఆదేశించును.
త్వ - శరీరశక్త్యనురూపముగ దర్శనశాస్త్రము యోగాభ్యా
ది నియమములను గావించును.

చాలకాలమునుండి యీ పర్వత్రయ జ్ఞానము మరచి
వలము భూతవాదులమై స్థూలశరీర ప్రధానులమై అన్నపా
చార వ్యవహారాదులవలన సత్త్వమునకు నాత్మకు నేమియు
ంధ లేదని పెసిద్ధాంతమును బరిహాసించు చున్నాము.

బ్రాంది శిరలకు బల మిచ్చును. న్యుమోనియా మొదలగు కొన్ని రోగములందు వేడి పుట్టించి శరీరమునకు మేలుసేయును. ఉల్లిపాయలు శరీరమునకు బలముసేయును. సాంతపనాగ్ని నుండి రక్షించును. కాని ఈ తామస పదార్థములు సత్త్వ-ఆత్మల వీర్యములం బాడుసేయును. కనుకనే ఆయుర్వేదము ద్విజాతికి మద్యౌషధ నియంత్రణము గావించినది. సోడా, లెమనేడ్, బిస్కత్తులు, అయిస్క్రీమ్, లైమ్‌జూస్ మొదలగు స్వర్గీయపదార్థముల వలన శరీరమున కించుక యుపకార ముండవచ్చును. కాని, ఏపద్ధతిపై వీని నిర్మాణము జరుగునో, ఏ యశుచిభావముచే అశుచి స్థానములం దివి సేవింప బడుచున్నవో, యేయవర్ణులద్వారా వీని ప్రదర్శన లక్షణ విశ్వాసములు జరుగుచున్నవో ఆత్మ-సత్వ (శరీర) విఘాతకములగు నేయే తామసపదార్థ సమ్మిశ్రణముచే నివి దివ్యలోకమునుండి యవతరించినవో ఆలోచించినచో ఈ భీభత్సపదార్థము లాత్మ-సత్త్వనాశము గావించునవిగనే తోచును. ఈవిధముగ జివరకు బర్వాత్రయ జ్ఞానము నుపేక్షించి యా ఆత్మశక్తులను స్మృతిగర్భ విలీనము గావించుకొను మనల నే మనుకొన వలయును? కానిండు,-విస్తర మయినది. ప్రస్తుత మిట :—కర్మల తారతమ్యమునకు జెందిన యొక విశేషపద్ధతిం గూర్చి కొంచెము ముచ్చటించి ఈ ప్రకరణము ముగించెదము.

## పురశ్చరణము - అనుష్ఠానము

### ప్ర యో గ ము

నిత్య నైమిత్తిక కామ్య కర్మల సంయోగముచే నిత్య నైమిత్తిక, నిత్యకామ్య, నైమిత్తికకామ్యము లను మూడు సాంయోగిక కర్మలు వెలయు నంటిమి గదా! ఆగమశాస్త్రాను సారము మంత్రసిద్ధి విషయమున, పురశ్చరణము, అనుష్ఠానము, ప్రయోగము నను మూడుకర్మలు గావింపబడును. ప్రాథమి కాచరణము పురశ్చరణము. ఇది ఆత్మదేవతతో మంత్రదేవతకు ప్రాథమిక పరిచయము గల్గించు ప్రక్రియావిశేషము. రాజా ద్యుచ్చశ్రేణివారి పరిచయము ననుగ్రహము వలయుచో (స్వరూ పానుసారముగ) మాటిమాటికి (తఱచుగ) వారివారి ద్వార మున కరుగుచుండ వలయును గదా! అట్లే మంత్రదేవ తాను గ్రహార్థము, నిశ్చితసమయము వరకు, విశేషనియ మానుగ మనమున, మంత్రజపము గావింపవలయును. తద్వారా, ఆయా దేవతాభావనామయుడు గావలయును. అందువలన మంత్రసిద్ధి యగును. ఇదే పురశ్చరణము. ఇది జపాత్మకము.

మంత్రసిద్ధి అయినది. ఆసిద్ధి స్థిరముగ నుండవలయును. అందుకు తత్తన్నియ మానుసారము నాల్గవ, ఎనిమిదవ, లేదా ప్రతిదినమునను సిద్ధమంత్రముం జపింపవలయును. ఇదే అనుష్ఠాన కర్మ. మనకుగావలసిన యుచ్చశ్రేణివ్యక్తి పరిచయసిద్ధ్యనంత రము దానిం గాపాడుకొనుటకు స్వభావానుసార మప్పుడప్పు డతనిం గనుచుండవలయును గదా! అట్లే పురశ్చరణసిద్ధము, అనుష్ఠాన సురక్షితము నగు మంత్రమే యథేప్సిత ఫలదాత యగును. ఇదే ప్రయోగము.

ఈ దృష్టాంతముచే జెప్పదలచిన దేమన :— గాయత్రీ మంత్ర ప్రయోగకర్మ నైమిత్తికకర్మ. అందుకైన యనుష్ఠాన కర్మ నిత్యనైమిత్తికము. ఇట్లే ఒకవ్యక్తి "నా యీకర్మ సిద్ధమగుచో, నేను యావజ్జీవము మంగళవార వ్రత మాచరింతు" ననుకొనుచో కర్మసిద్ధియైన పిదప నతడు వ్రత మాచరింపవలయును. ఇదే నిత్యకామ్యకర్మ. ఇట్లు పరంపరగ మూటికిని నిత్యనైమిత్తిక కామ్యకర్మలం దంతర్భావ మగును. ఈపరిలేఖల నరయుడు.

(1) పురుషత్రయి :—"ఆత్మా సత్వంశరీరంచ త్రయమేతత్ త్రిదండవత్"

1. ఆత్మా - మనోమయః జ్ఞానప్రధానః,- కారణశరీరం-పురుషః
2. సత్వం-ప్రాణమయం-క్రియాప్రధానం-సూక్ష్మశరీరం-ప్రకృతిః
3. శరీరం - వాఙ్మయం - అర్థప్రధానం - స్థూలశరీరం - వికృతిః

} పురుషః.

(2) కర్మత్రయి :—

1. నిత్యకర్మ—పాలనమ్.
2. నైమిత్తికకర్మ—రక్షణం.

} అబంధనములు. యజ్ఞార్థకర్మలు.

3. కామ్యకర్మ—పోషణం— — బంధనమ్.

(3) ధాతువులు :—

1. విద్యా — కామ — కర్మలు — ఆత్మధాతువులు
2. సత్వం — రజః — తమః — సత్త్వధాతువులు
3. పిత్త — వాత — కఫములు — శరీరధాతువులు

} త్రిదండవత్.

(4) చికిత్సాశాస్త్రత్రయీ :—

1. దర్శనశాస్త్రం — ఆత్మచికిత్సకమ్
2. ధర్మశాస్త్రం — సత్త్వచికిత్సకమ్
3. ఆయుర్వేదశాస్త్రమ్—శరీరచికిత్సకం

} త్రిదండవత్.

ఇతి ధర్మశాస్త్ర నిబంధన షట్కర్మాణి

ఇదికర్మయోగ వర్గీకరణము

# కర్మయోగ విజ్ఞానము.

## 8. యోగనిష్ఠా మీమాంస

### మనభ్రాంతి — గీతాశాస్త్రము.

ప్రవృత్తినివృత్తిలక్షణ శ్రౌతస్మార్త సామయాచారిక కర్మల సమష్టియే, కర్మయోగము. గత ప్రకరణములం దిదియే భిన్నభిన్న దృష్టులతో జూపబడినది. భారతీయ కర్మవాద విషయమున, వర్ణాశ్రమ వ్యవస్థామూలక వైదిక-లౌకిక కర్మల పరిచయము కంటె నితరము నిరర్థకమని మా యభిప్రాయము. ఆ రెండువ్యవస్థలకు విరోధముగ, వికర్మ-అకర్మ లక్షణములు గల కల్పితకర్మలు మనము కర్మలనుకొను చున్నాము. అవి కర్మయోగ మర్యాదకు వెలియైనవి. గీతాదృష్టిలో, కర్మయోగము కామనాసంబంధ మున్నపు డాసక్తికారణముచే హేయమును, కామనా పరిత్యాగముచే నదియే అనాసక్తకర్మయోగమై గ్రాహ్యమును అగును. అదే గీతాసంశోధిక కర్మయోగము. దీనినే నిష్కామకర్మయోగము, ధర్మబుద్ధియోగము, అనాసక్తయోగము మొదలగు పేరులం బిలువవచ్చును.

శ్రౌతస్మార్త వైదికలౌకిక కర్మలతో సంబంధములేని నిష్కామ కర్మయోగమును గీత చెప్పు ననుకొను వారు పొరపడుచున్నారు. గీత- అట్టి యలౌకిక కర్మయోగముం దేనిని

జెప్పుటగాని, శాస్త్రీయకర్మయోగముతో విరోధించుటగాని లేదు సరిగదా! విశేషించి "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" 'నత్యాజ్యంకార్య మేవతత్' 'స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం' 'స్వేస్వేకర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతేనరః' 'సహజంకర్మ కౌన్తేయ సదోష మపి నత్య జేత్' 'ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవి ద్యతే' ఇత్యాదిగ వర్ణాశ్ర మానుగత శాస్త్రీయకర్మలనే కర్మ యోగ మర్యాదతో సమర్థించుచు అటుగానియెడ "నసుఖం నపరాంగతిం" అని యభినివేశముం గూడ నగపర్చుచున్నది :— ఇట్టిచో గీతయు తత్ప్రతిపాదిత కర్మయోగమును, వర్ణాశ్రమ వ్యవస్థానుయాయులై శ్రౌతస్మార్తకర్మలందు పక్షపాతము గల వారికే యుపాదేయము కాగలవని వ్యక్త మగును.

అటుగాక వర్ణాశ్రమ సంస్కార యజ్ఞ తపో దా నేష్టా పూర్త దత్తాదులును, వానింబ్రతిపాదించు శ్రుతిస్మృతిశాస్త్రము లును వ్యర్థాడంబరము లనుకొను మహానుభావులు, దయ యుంచి గీతపే రెత్తకుండుటయు, దానిని ముట్టకుండుటయు మేలు.—దానికి గళంకము, బ్రజలకు మోసము దప్పును. ఎఱుంగనిప్రజలు 'గీతాభక్తులుగదా' యను తలంపున గీతయం దలి యవ్యాజ భక్తితో వీరి కనుయాయులై చెడుచుందురు. వీరును, ఏమియు నక్కఱలేదు "గీతాసుగీతా కర్తవ్యా కిమన్యైః శ్శాస్త్రవిస్తరైః" అనుచు నేమేమో చెప్పుచుందురు.

సామాన్యులు, గీత విధినిషేధశాస్త్రముగా దని యెఱుం గరు. 'దేనిని, ఎప్పుడు చేయవలయు ? నన్నది గీత చెప్పదు. ఎట్లు? ఏసౌష్ఠవముతో ? కర్మచేయవలయు నన్నది మాత్రమే చెప్పు నుపనిష చ్ఛాస్త్ర మది. ఆ సౌష్ఠవ రహస్య మత్యంత నిగూఢ సాత్త్విక జ్ఞానమునకు జెందినది. కశ్చిన్మర్యాదా యుక్తము. కనుకనే భగవంతుడును 'మనుష్యాణాంసహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః' అనియెను. వేద - దర్శన - స్మృత్యాది తాత్త్విక జ్ఞానము లేకుండ గీతయందలి యొక వాక్యమునకు గూడ తత్త్వతఃఅర్థమునెఱుంగుట కఠినమేకాదు అసంభవము. ఏమియు లేని శ్రద్ధైక భక్తులు 'స్వాధీనోరసనాంచలః' కోటిలోని వారు, గీతార్థ సమన్వయమునకు బూనినచో నే మందుము ? 'వయం మూకవ్రతాలంబినః' భగవంతుడే వారిని సరిసేయ వలయును.

వేదశాస్త్రసిద్ధ మగు నార్షధర్మమును బునరుద్ధరింప బ్రవర్తిల్లిన గీతాశాస్త్రము, అయోగ్యవ్యక్తి హస్తగతమై తన లక్ష్యవంచితమై పోవుట శోచనీయము. వ్యాపకమగు నది సాంప్రదాయిక వస్తువుగ నైనది. వేదమార్గానుయాయి యగు నది వేదము నెత్తిపై కెక్కి యున్నది. దాని నొక భక్తుడు భక్తిగ్రంథ మనును. ఒక జ్ఞాననిష్ఠుడు కర్మత్యాగలక్షణ జ్ఞాన మార్గబోధక మనును. ఒక కర్మవాది కర్మయోగశాస్త్ర మనును. ఒక లోకాయతికుడు, మహాభారతయుద్ధ మొక కల్పిత

కథ యనియు, అందలి పాత్రలు కల్పితము లనియు, గీత యన్నది సత్యాహింసలను వ్యాఖ్యానముసేయు నాధ్యాత్మిక గ్రంథ మనియు జెప్పును. ఈయన్నిటికి గారణము? అవిద్య, కుసంస్కారము, అసంస్కారము, శాస్త్రజ్ఞానాభావము.

ఇట మాకర్తవ్య మగు సూచన యేమన:—ఆర్షధర్మ రక్ష, వర్ణసమాజముతోడి భారతాభ్యుదయము వలయుచో, గీత, ఆర్షధర్మానుయాయి యనియు శ్రౌత స్మార్త వైదిక లౌకిక కర్మల మౌలికరహస్య ప్రతిపాదక మనియు, కర్మ భక్తి జ్ఞాన మార్గసంశోధక మగు బుద్ధియోగశాస్త్ర మనియు, వర్ణాశ్రమ సంస్కార భావములకు జెందిన స్వ స్వ ధర్మానుసార విభక్తము లగు వర్ణాశ్రమధర్మ సంస్కారకర్మలను సమర్థించున దనియు, యెంచవలయును.- ఇం దేదియు లేక, యితరదృష్టితో వ్రాయ బడిన గీతానువాదములను జూచి, యేమేమో యనుకొనుచు, యెందుకు జెందని నిష్కామకర్మయోగపు చాటింపువేయుట పాడిగాదు.

గీతయందలి ప్రత్యక్షరమును తాత్త్వికజ్ఞానముచే నోత ప్రోతమై యున్నది. పరమేశ్వరు డిచ్చిన యవకాశముం బట్టి యథావిధిగ శాస్త్రపరిశీలన జేసి, వేదశాస్త్ర పరిశీలన ద్వారా లభించిన తత్త్వజ్ఞానము నాధారముగ గొని గీతాతత్త్వము ననుగమింప వలయును. అటుగానిచో యథాశక్తిగ గీతను పారాయణసేయుచు, అర్థములం దవ్యవస్థసేయక శాస్త్రాదిష్ట కర్మలను ముఖ్యలక్షణముగా గొనవలయును. ఏలయన గీత

యీకర్మల రహస్యములనే చెప్పును గదా! అదే గీతాభక్తి, గీతాప్రేమ, గీతాకృతకృత్యత. — గీతయందలి రహస్యపూర్ణ సిద్ధాంతముల నెరుంగుమాత్రమున మన కేయుపకారము గాజాలదు. స్వధర్మ కర్మానుగమనము వలనను, విధినిషేధాత్మక శాస్త్రీయ కర్మానుష్ఠానమువలనను ఉపకారము గాగలదు. అట్టి శాస్త్రీయకర్మవాదము సంప్రదాయ వాద ప్రాబల్యమునను, సంతమతోత్కర్షచే నైన యార్షధర్మ విలుప్తివలనను, గీతా భక్తుల కల్పిత గీతాప్రచారము వలనను, నేడు మాటువడి పోయినది.

## లోకసంగ్రహదృష్టి - గీతాశాస్త్రము.

కర్మయోగ ప్రదిపాదక శాస్త్రములం దీకర్మరహస్యము జెప్పబడలేదు. మరిగీతాశాస్త్ర మవతరింప నేమి యావశ్యకము? అని యిటనొక ప్రశ్న యుదయింపవచ్చును. దీనిం గూర్చి గీతావిజ్ఞాన మందలి "అపూర్వత, పూర్ణత, విలక్షణత" అను ప్రకరణమున విమర్శింపబడినది. ప్రకృతము యోగనిష్ఠా మీమాంస. దీనింగూర్చి నే డనేక భ్రాంతులు వ్యాపించు చున్నవి. గీతయందు కర్మ జ్ఞాన భక్తి యోగముల నన్నిటిని సమర్థించు వచనము లగపడుచుండుటచే వీనియం దేయోగము భగవంతుని కిష్టము? అను సందేహ ముదయించును. ఇందు కిట సమాధానము. "ఈ మూడు యోగము లందును భగవంతుడు నొకిని పక్షపాతి కాడు. మూటియందును పక్షపాతియై వ్యాసి

ద్ధాంతలక్షణము అపూర్వము విలక్షణము నగు నాలవ యోగముసు సమర్థించును" అని మాత్రమే. (విస్తరము బుద్ధియోగ పరీక్షయం దరయ నగును) ప్రకృతము పరమత సంబంధముగల యోగనిష్ఠలం (జ్ఞాన కర్మ భక్తులం) గూర్చియే మీమాంస కావలసి యున్నది. అవియే సంశోధితములై బుద్ధియోగ ప్రతిపాదక మగు గీతయందు లోకసంగ్రహ దృష్టితో సమావేశపరుప బడినవి.

ఇందు భక్తిని జ్ఞానమం దంతర్భావము గావించి కర్మనిష్ఠ-జ్ఞాననిష్ఠ యని రెండునిష్ఠలే యనవచ్చును. ఇందు మొదటిది యోగనిష్ఠ యనియు రెండవది సాంఖ్యనిష్ఠ యనియు వ్యవహరింప బడినవి.

"లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తామయానఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం, కర్మయోగేనయోగినాం
సాంఖ్యయోగౌ పృథగ్బాలా ప్రవదన్తి నపండితాః
ఏకంసాంఖ్యంచ యోగంచ యఃపశ్యతిసపశ్యతి."

ఈసాంఖ్య-యోగ శబ్దముల రహస్యము నెరుంగనిచో యోగమీమాంసయు గతార్థము కాజాలదు. గీతోక్త బుద్ధియోగ మన నేమో యవగతము గాజాలదు. కనుక మొదట లోకమున వాడుక యందున్న ఈ రెండునిష్ఠల స్వరూపములు సంగ్రహముగా నెరుంగుట మేలు.

"సాంఖ్యశబ్దము జ్ఞానయోగ వాచకము. యోగశబ్దము కర్మయోగ సూచకము" అన్నది నిశ్చితవిషయము. ఇక :—

గీతయందలి సాంఖ్యశబ్దముచే నెట్టి జ్ఞానయోగము, యోగశబ్ద ముచే నే కర్మయోగముస్వీకరింపబడినవి? అను నది విచార్యము. ఈ విచారభేద కారణమేమన :- నేడు జ్ఞానయోగము నకు మూడును, కర్మయోగమునకు రెండును భేదము లగపడు చున్నవి. (1) కాపిలసాంఖ్య మొక జ్ఞానయోగము. (2) వ్యాసుని వేదాంతసిద్ధాంత మొక జ్ఞానయోగము. (3) జగన్మిథ్యాత్వ మూలకమును సర్వకర్మ పరిత్యాగలక్షణము నై వాడుకయం దున్నజ్ఞానయోగ మొకటి. -ఇట్లే :- (1) స్వాయంభువుయొక్క కర్మమార్గము (వైదికప్రవృత్తి నివృత్తిలక్షణ కర్మమార్గము) ఒకటి మొదటికర్మయోగము. (2) హిరణ్యగర్భుని కర్మమార్గము రెండవకర్మయోగము. ఈ యైదు జ్ఞాన-కర్మనిష్ఠలందును, స్వాయంభూకర్మయోగ నిష్ఠయు, కాపిల సాంఖ్యజ్ఞానమూలక జ్ఞానయోగనిష్ఠయు నిట ప్రధానముగ మీమాంస్యములు. మొదట సాంఖ్యనిష్ఠం జూతము.

మొట్టమొదట వివస్వన్మనువుగూర్చి అవ్యయావతారుడు భగవంతుడు కృష్ణునిద్వారా సాంఖ్య-యోగనిష్ఠాత్మికబుద్ధియోగ నిష్ఠ యావిర్భవించుటకు బూర్వము-ప్రథమయుగ(దేవయుగ)ము నకు బూర్వము హిరణ్యగర్భయోగ(కర్మ)నిష్ఠయు, కాపిలసాంఖ్య (జ్ఞాన) నిష్ఠయు లోకమందు విస్తరిల్లి యున్నవి. ఇందుకు, బుద్ధియోగ ప్రతిపాదక గీతాశాస్త్ర మీ రెండునిష్ఠలును వాడుకయం దున్న వని యంగీకరించి, ఈ రెంటిసమన్వ యాధారము ననే మూడవ దగు బుద్ధియోగనిష్ఠను స్థాపించుటయే ప్రమా-

ణము. ఈ బుద్ధియోగనిష్ఠయే భగవంతుని ప్రాతిస్వికము. (మేమతం)

ఆ దేవయుగకాల మందలి లోక (భువనకోశ) వ్యవస్థానుసారము ఈ భూతల మందే దే[illegible]ముచే మనుష్యలోకము, తిర్యగ్లోకము, దేవ[illegible] మూడు లోకములు వ్యవస్థితములుగ నుండెను. [illegible] గీత [illegible] పృథివీలోక మన బడు చుండెను. ఇదే నేడు క[illegible]భూ[illegible] తవర్ష మన బరగు చున్నది. తిర్యగ్లోకమున కంతరిక్షలోక మనియు, దేవలోకమున కు స్వర్గలోక మనియు పేరులు. (చూ : గీతావిజ్ఞానము నందు ఐతిహాసిక సందర్భసంగతి ప్రకరణము.)

ఈ మూడులోకములందును రెండవదగు తిర్యక్ (అంతరిక్ష) లోక మందుండు నెనిమిది విధముల తిర్యగ్జాతులందు 'సిద్ధ' నామక మొక జాతి యున్నది. భౌమస్వర్గమునుండి పృథివికి, పృథివినుండి స్వర్గమునకును విమానముల ద్వారా, పృథివ్యంతరిక్ష స్వర్గముల కధిష్ఠావ ("శవసోనపా" త్రను విశేషోపాధి భూషితు లగు నధిష్ఠాత) లగు, అగ్నివాయ్వింద్ర నామక భౌమ (మనుష్య) దేవతల పారస్పరిక గుప్త పత్రములను గొంపోయి చేర్చు చుండుటే ఈ జాతి ముఖ్యకార్యము: ఈ (విమాన సంచారీ గుప్తచర) సిద్ధజాతియందు పరమ జ్ఞాననిష్ఠుడు కపిలు డుదయించెను. తన యపూర్వప్రతిభ, తపస్సు, ఈశ్వరాంశ వికాసప్రభావము మున్నగు వానివలన ఆ యుగమం

దీయనయు అన్య విభూత్యవతారముల వలె విభూతిశాలి యని యంగీకరింపబడెను. కనుకనే భగవంతుడును 'సిద్ధానాం కపిలో మునిః' అని ఈయనను స్వవిభూతిగా వాకొనెను. ఈ వచనము, గీతకు పూర్వము నుండియు కాపిలసాంఖ్యనిష్ఠ వాడుకయందుండె ననుటకును ప్రమాణమగును.

"శ్రుణు మేత్వమిదం తసిద్ధాః సాంఖ్యానాంవిదితాత్మనాం,
విహితంయతిభిఃసకమును నాదిభిరీశ్వరైః
జ్ఞానేనపరిసంఖ్యాయి. సదోషాన్‌విషయాన్నృపః (మహాభార)

నిష్ఠావర్గీకరణము :— కపిలుడు తత్త్వసంఖ్యాధారముపై గుణమయప్రకృతి యొక్క 24 తత్త్వములను గణించుచు, శరీరాభిమానియు, ప్రతిశరీరభిన్నుడును, పుష్కరపలాశవన్నిర్లేపుడు నగు చేతనపురుషుని సాక్షాత్కరించుకొనెను. ఈ భిన్నాత్మవాద సిద్ధాంతము నాధారముగా గొని యాతడు కర్మత్యాగలక్షణ జ్ఞానానుగత సాంఖ్యనిష్ఠను స్థాపించెను. దానికాయన తెల్పిన నిష్కర్ష :— మనుజుడు తత్త్వసంఖ్యానము గావింపుచు ఆ తత్త్వవివేకము ద్వారా, గుణతత్త్వాతీతుడును, సాంఖ్యసిద్ధుడును 25 వ వాడు నగు పురుషు నాశ్రయింపవలయును. అతడు నిర్గుణుడు, నిత్యుడు జ్ఞానైకఘనుడు, ప్రకృతికి జెందిన గుణమూలక కర్మలను పూర్తిగా వదలవలయును. కర్మప్రకృతి యున్నంతవరకును సాంఖ్యజ్ఞానోదయము కలుగదు. ఆత్మ విశుద్ధజ్ఞానమూర్తి కనుక కర్మపరిత్యాగమే తత్ప్రాప్తికి మార్గోపాయము."

భగవంతుఁడీ కాపిలజ్ఞాననిష్ఠ నామూలచూడముగ ఖండింపుచు, బుద్ధియోగమును స్థాపించెను. (అవ్యక్తంవ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః") ఈ సాంఖ్యనిష్ఠయే నేటి ప్రాధానికశాస్త్రము. (దీని వివేచన మాత్మవిజ్ఞానము నందుకావింప బడినది చూడుడు. సాంఖ్యమునందలి గుణాత్మక విశ్వోత్పత్తికి జెందిన విషయములను గీత యాదరించిన విధము గూడ నందుచూపబడినది) ప్రకృత మీసందర్భమునందు రెండు విషయములు. (1) ఒకటి, సాంఖ్యతంత్ర మందలి ప్రతిశరీర భిన్నానేకాత్మవాదము, (2) రెండవది, సాంఖ్య మందలి విశుద్ధజ్ఞానవాదము. ప్రతిశరీర భిన్న మగు నాత్మ విశుద్ధజ్ఞానమయ మనుట.

ఇందు రెండవ సిద్ధాంతమును భగవంతుఁడు పూర్తిగా ఖండించి ఆత్మను జ్ఞానకర్మ మయముగా జెప్పి, కర్మనే నిశ్శ్రేయస (ముక్తి) సాధన మనియెను. ఇక భిన్నాత్మవాదమును, శరీరస్థాభిన్న పరమాత్మతో యుక్త మనుచు, భేదసహిష్ణు వగు నభేదమునకు ప్రాధాన్య మిచ్చి ...దమును, వ్యాస సూత్రోపబృంహితమును అగు వే... (జగన్మిథ్యాత్వ... జ్ఞానబుద్ధియోగ మని వ్యవహరిం... మూ... సాధకప్రాచీన వేదాంత పరీక్ష) ...వచ్చును. దేనినిగొని, తమ

విద్వత్సమాజములందు, ...యోగమును గలసి మెలసి వేదాంత నిష్ఠం గూర్చి గీతయం...ను సాంఖ్యశబ్దముచే వ్యవహా మునులేదు. ఏలనః- గీతకు పూర్వ... యెప్పుడును క్వాచిత్కములు

లేదు. దీని సిద్ధాంత మిట్లు సాగుచున్నది:—"ఆత్మసర్వవ్యాపకము అధ్యాసవశమున నొకేయాత్మ నానారూపములం బ్రతీత మగుచున్నది. ఆత్మ జ్ఞానమయము లేదా, జ్ఞానఘనము. కర్మప్రపంచము సర్వథా మిథ్య. ఆ వ్యాపకాత్మ సంప్రాప్తికి లేదా, నిశ్శ్రేయసాధిగ మార్గము ఈ మిథ్యాభూత వైదిక లౌకిక కర్మలను బూర్తిగా బరిత్యజింప వలయును."

ఈవేదాంతనిష్ఠ:—"ఆత్మ వ్యాపక" మనును. సాంఖ్యము 'ప్రతిశరీరభిన్న మాత్మ' యనును. ఇదే ఈరెంటికిగల మహాభేదము. జ్ఞానకర్మలం గూర్చి యీరెంటి మతములును సమానములే. సాంఖ్యము ఆత్మను విశుద్ధజ్ఞానమయముగ జెప్పి కర్మను బంధనకారణ మన్నది. ఈ వేదాంతమును, ఆత్మను విశుద్ధజ్ఞాన ఘనమనుచు, కర్మాత్యంత విమోక పక్షపాతి యగుచున్నది. సాంఖ్యుల ఆత్మ దేహాభిమాని, శారీరకాత్మ. వేదాంతుల ఆత్మ యన్నిదేహము లందు నేకరూపమున నుండునది. సాక్షి నిత్యకూటస్థము. ప్రత్యగాత్మ.

ఇంద[illegible]వ [illegible]నర్వాచీన వేదాంతనిష్ఠ, ప్రాచీన
సాంఖ్యసిద్ధుడును 25 వ వ[illegible]
ఆత్మాభేదవాదమును, సాంఖ్యనిష్ఠ
యును. అతడు నిర్గుణుడు,
సంగ్రహించి మూడవదగు, కర్మ
జెందిన గుణమూలక కర్తలని[illegible]
స్వాయముగ గల్పించి, "అడవి
ప్రకృతి యున్నంతవరకును
," అను సామెత చరితార్థము
ఆత్మ విశుద్ధజ్ఞానమూర్తి కను[illegible]
వ్యాఖ్యాతల లీల. దీనింగూర్చి
ముఖ్యోపాయము."
నధికారము లేదు.

ఈ చెప్పబడిన రెండు జ్ఞాననిష్ఠలం గూర్చియు జెప్ప దలచిన దేమన :—గీత, సుప్రసిద్ధ సాంఖ్యనిష్ఠను, "ఆత్మ విశుద్ధ జ్ఞానరూపము, ప్రతిశరీరభిన్నము" అన్నదానిని, నవీనవేదాంత మువలె కర్మను మిథ్యయనక "బంధనకారణముమాత్రమే" యన్నదానిని ఖండించెను. గీత, సాంఖ్యజ్ఞానప్రతిపాదక మను కొను సాంఖ్యులు గీతావేదాంతనిష్ఠ నెరుంగనివారు. భగవం తుడు గీత యందలి సిద్ధవిద్యా ప్రకరణమందు, నిరూపించిన జ్ఞానయోగలక్షణ బుద్ధియోగము, సాంఖ్యనిష్ఠయందలి కర్మ త్యాగభావనను నిరసించు సంశోధిత రూపముగాని, వారి జ్ఞాన యోగమును సమర్థించునది కాదు. ఈ సంశోధిత సిద్ధవిద్యా లక్షణ, కర్మయుక్త జ్ఞానబుద్ధియోగ దృష్టితో గీతనెవరేని జ్ఞాన యోగశాస్త్ర మనుకొన్నచో నిష్ప్రాపత్తియే.

ఇక నవీనవేదాంత నిష్ఠావిషయముం జూతము :—సాంఖ్య యోగమునకు వలె దీనికి గీతయందే సంశోధనయును లేదు సరిగదా! 'అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం' అని భగ వంతుడు సాధ్యయుగ కాలమునాటి యసద్వాదు (అభావవాదు) లగు సాధ్యుల యసద్వాదమును (జగన్మిథ్యాత్వవాదమును) ఖండించివైచెను. ఈ జగన్మిథ్యాత్వము సాధకపక్షర్వాచీన వేదాంత నిష్ఠా పక్షపాతులు, గీతను తమ సిద్ధా వచ్చును. దేహనుకొని, తమ జ్ఞానయోగ దృష్టితో 'గీత జ్ఞానర యోగమును గలసి మెలసి వాదమాత్రము.

ను సాంఖ్యశబ్దముచే వ్యవహా

ఇక మిగిలినది మూడవ యెప్పుడును కావ్యచిత్కములు

వేదాంతనిష్ఠ :— సంక్షిప్తము, సారగర్భితము నగు వాణిచే నుపనిషత్తులు నిరూపించినది దీనినే. దీనినే వ్యాసుడు సూత్రము లందు సమర్థించెను. వైరాగ్యబుద్ధియోగ మనుపేర గీతాచార్యుడు దీనినే వివరించెను.

ఇదే గీతాప్రతిపాద్య ముఖ్యవిషయము. దీని గర్భమందే (1) సాంఖ్యలక్షణ సంశోధిత జ్ఞానయోగము (2) యోగలక్షణ సంశోధిత కర్మయోగము (3) మధ్యస్థ భక్తియోగము, ప్రతిష్ఠితములై యున్నవి. ఈ ముఖ్యవేదాంత నిష్ఠాదృష్టితో ప్రధానముగ గీత బుద్ధియోగశాస్త్ర మయ్యెను, తత్ప్రతిచ్ఛాయతో గూడిన మూడు గౌణయోగముల దృష్టితో, నది సాంఖ్యయోగ శాస్త్రము, భక్తియోగశాస్త్రము, కర్మయోగశాస్త్రము ననబరగును. జ్ఞానయోగసూచక మగు సాంఖ్యశబ్దముచే గీతగ్రహించిన జ్ఞానయోగమేది ? యను ప్రశ్న కిది సంక్షిప్తమీమాంస-ఇందు వలన :-(1) సాంఖ్యశబ్దముచే సంశోధిత కాపిలజ్ఞానయోగ మభిప్రేతమనియు, (2) అర్వాచీన వేదాంతనిష్ఠాలక్షణ జ్ఞానయోగ ముపేక్షణీయ మనియు (3) ప్రాచీనము, నౌపనిషదము, వేదాంత నిష్ఠాలక్షణము, వైరాగ్య బుద్ధియోగలక్షణము నగు జ్ఞానయోగమే గీతకు ముఖ్య నిర్గుణ ప్రతిపాద్య విషయ మనియు తేలినది.

ఇక మూలక కర్తలు గల దన్న యోగనిష్ఠం (కర్మ ప్రకృతి యున్నంతవరకును కర్మనిబంధన ప్రకరణము లందు ఆత్మ విశుద్ధజ్ఞానమూర్తి కనస్వా— రానుగత వైదిక- లౌకిక, ముఖ్యోపాయము." స్వతంత్ర విభాగము. ఇదే మొదటి

దగు యోగ (కర్మ) నిష్ఠ. ఈ కర్మయోగమునకు బ్రథమప్రవ ర్తకుడు. లేదా ప్రథమ వ్యవస్థాపకుడు, ఆది మనువు స్వాయంభూబ్రహ్మ.

"యంతుకర్మణియస్మిన్స న్యయుక్త ప్రథమంప్రభుః
సతదేవస్వయంభేజే సృజ్యమానః పునఃపునః" (మనువు)
"యేషాంతుయాదృశంకర్మ భూతానామిహకీర్తితం.
తత్తథావోఽభిధాస్యామి. క్రమయోగంచజన్మని" (మను)

మానవధర్మశాస్త్ర మీకర్మయోగమునకు మూల ప్రతిష్ఠ (2) రెండవయోగనిష్ఠ సుప్రసిద్ధ మగు యోగదర్శ నము. కాయక్లేశాత్మకము, ధారణా ధ్యాన సమాధిలక్షణము, సిద్ధి తుష్టి ప్రవర్తకము నగు ఈ యోగ మూల సిద్ధాంతముల కాది ప్రవర్తకుడు దేవయుగ కాలీన హిరణ్యాగర్భఋషి.

"సాంఖ్యస్య వక్తా కపిలః పరమర్షిః సఉచ్యతే
హిరణ్యగర్భో యోగస్య వేత్తానాన్యః పురాతనః" (భారత)

ఈ హిరణ్యాగర్భ నిష్ఠయే పతంజలి యుపబృంహితము గావించెను. కనుక పిదప నిది పాతంజల యోగ నామము నొందెను. కాపిలనిష్ఠా సమకాలికమగు నిది తదనుగామియే. పతంజలియు లౌకిక కర్మవాదము హేయముగ నెంచి సాధన దశ యందీ యోగము నాత్మజ్ఞానోదయ సాధకముగ నెంచెను. కనుక ఈ రెండును సజాతీయము లనవచ్చును. దేవయుగమందు సాంఖ్యమును, తదనుగామియగు యోగమును గలసి మెలసి యేకమైపోయినవి. కనుక ఈరెండును సాంఖ్యశబ్దముచే వ్యవహ రింప వచ్చును. కాని ఈ రెండును యెప్పుడును క్వాచిత్కములు

వేదాంతనిష్ఠ :— సంక్షిప్తము, సారగర్భితము నగు వాణిచే నుపనిషత్తులు నిరూపించినది దీనినే. దీనినే వ్యాసుడు సూత్రము లందు సమర్థించెను. వైరాగ్యబుద్ధియోగ మనుపేర గీతాచార్యుడు దీనినే వివరించెను.

ఇదే గీతాప్రతిపాద్య ముఖ్యవిషయము. దీని గర్భమందే (1) సాంఖ్యలక్షణ సంశోధిత జ్ఞానయోగము (2) యోగలక్షణ సంశోధిత కర్మయోగము (3) మధ్యస్థ భక్తియోగము, ప్రతిష్ఠితములై యున్నవి. ఈ ముఖ్యవేదాంత నిష్ఠాదృష్టితో ప్రధానముగ గీత బుద్ధియోగశాస్త్ర మయ్యెను, తత్ప్రతిచ్ఛాయతో గూడిన మూడు గౌణయోగముల దృష్టితో, నది సాంఖ్యయోగ శాస్త్రము, భక్తియోగశాస్త్రము, కర్మయోగశాస్త్రము ననబరగును. జ్ఞానయోగసూచక మగు సాంఖ్యశబ్దముచే గీతగ్రహించిన జ్ఞానయోగమేది ? యను ప్రశ్న కిది సంక్షిప్తమీమాంస-ఇందువలన :-(1) సాంఖ్యశబ్దముచే సంశోధిత కాపిలజ్ఞానయోగ మభిప్రేతమనియు, (2) అర్వాచీన వేదాంతనిష్ఠాలక్షణ జ్ఞానయోగ ముపేక్షణీయ మనియు (3) ప్రాచీనము, నౌపనిషదము, వేదాంత నిష్ఠాలక్షణము, వైరాగ్య బుద్ధియోగలక్షణము నగు జ్ఞానయోగమే గీతకు ముఃనిర్గుణపాద్య విషయ మనియు దేలినది.

ఇక మూలక కర్తలు గల దన్న యోగనిష్ఠం (కర్మ ప్రకృతి యున్నంతవరకును కర్మనిబంధన ప్రకరణము లందు ఆత్మ విశుద్ధజ్ఞానమూర్తి కనస్కా— రానుగత వైదిక- లౌకిక, ముఖ్యోపాయము." స్వతంత్ర విభాగము. ఇదే మొదటి

దగు యోగ (కర్మ) నిష్ఠ. ఈ కర్మయోగమునకు ప్రథమప్రవర్తకుడు. లేదా ప్రథమ వ్యవస్థాపకుడు, ఆది మనువు స్వాయంభూబ్రహ్మ.

"యంతుకర్మణియస్మిన్ స న్యయుక్త ప్రథమంప్రభుః
సతదేవస్వయంభేజే సృజ్యమానః పునఃపునః" (మనువు)
"యేషాంతుయాదృశంకర్మ భూతానామిహకీర్తితం,
తత్తథావోఽభిధాస్యామి, క్రమయోగంచజన్మని" (మను)

మానవధర్మశాస్త్ర మీకర్మయోగమునకు మూల ప్రతిష్ఠ (2) రెండవయోగనిష్ఠ సుప్రసిద్ధ మగు యోగదర్శనము. కాయక్లేశాత్మకము, ధారణా ధ్యాన సమాధిలక్షణము, సిద్ధి తుష్టి ప్రవర్తకము నగు ఈ యోగ మూల సిద్ధాంతముల కాది ప్రవర్తకుడు దేవయుగ కాలీన హిరణ్యగర్భఋషి.

"సాంఖ్యస్య వక్తా కపిలః పరమర్షిః సఉచ్యతే
హిరణ్యగర్భో యోగస్య వేత్తానాన్యః పురాతనః" (భారత)

ఈ హిరణ్యగర్భ నిష్ఠయే పతంజలి యుపబృంహితము గావించెను. కనుక పిదప నిది పాతంజల యోగ నామము నొందెను. కాపిలనిష్ఠా సమకాలికమగు నిది తదనుగామియే. పతంజలియు లౌకిక కర్మవాదము హేయముగ నెంచి సాధన దశయందీ యోగము నాత్మజ్ఞానోదయ సాధకముగ నెంచెను. కనుక ఈ రెండును సజాతీయము లనవచ్చును. దేవయుగమందు సాంఖ్యమును, తదనుగామియగు యోగమును గలసి మెలసి యేకమైపోయినవి. కనుక ఈరెండును సాంఖ్యశబ్దముచే వ్యవహరింప వచ్చును. కాని ఈ రెండును యెప్పుడును క్వాచిత్కములు

గనే యుండినవి. కారణము ? ఈ రెండును అవ్యక్త భావమునకు జెందినవి. "అవ్యక్తా హి గతిర్దుఃఖం" అన్నట్లు మనుజులకు గఠిన మార్గములుగ నైనవి. కనుకనే యివి విస్తరిల్లలేదు. కానిండు, కర్మత్యాగ లక్షణ సాంఖ్య (జ్ఞానయోగ) ము వలె తపనురూ యియు కాయక్లేశాత్మకము నగు నీ యోగమును గీతాదృష్టికి విలువగలది గాదనియే చెప్పదలచినది. కాని, గీతయందలి భక్తి యోగ (ఐశ్వర్య బుద్ధియోగ)ము ఈ యోగము నాధారముగా గాని వెలువడినదే యని యిట జ్ఞప్తి యుంచుకోదగిన విష యము.

హిరణ్యగర్భ లేదా పాతంజల యోగము సోపాన పరం పరా న్యాయముచే యోగమునకు నాల్గుభాగములు గావించెను. అవి క్రమముగ 1. రాజ, 2. మంత్ర, 3. హఠ, 4. లయ యోగము లనబరగినవి. ఇందు హఠ, లయ(అమనస్క)యోగ ము లత్యధిక క్లేశావహములు. మంత్రయోగము సామాన్య క్లేశా వహము. ఇక ఈశ్వరార్పణ లక్షణమగు రాజయోగము సుఖా వహము. 'సాపరానురక్తి రీశ్వరే' అన్నట్లు ఈశ్వరార్పణ లక్షణ రాజయోగమే భక్తియోగ మనబరగినది. ఇది కామనా యుక్తిచే వ్యక్తికల్యాణదాయియై కామ్యభక్తి మార్గమగును. కామ్య మంత్ర హఠ లయ సహచరియగు నీ కామ్యభక్తి మార్గమే హిరణ్యగర్భ సమ్మత భక్తిమార్గము. అది యా యోగమున కంగము. సాంఖ్యనిష్ఠయందు కర్మను సమావేశ పరచి జ్ఞానబుద్ధియోగముగ స్వీకరించినట్లే భగవంతుడు ఈ

యోగము నాలు గంగములందును కాయక్లేశాత్మకములగు నితరములు మూడంగములను ద్యజించి నాలవదగు కామ్యభక్తి మార్గమందలి కామనను ద్రోచివైచి నిష్కామ భక్తి యోగముంజేసి యైశ్వర్యబుద్ధియోగ మనుపేర గ్రహించెను. సిద్ధవిద్యా ప్రతిపాదిత జ్ఞాన (బుద్ధి) యోగము సాంఖ్యనిష్ఠ (కాపిలనిష్ఠ) నుండి వలె, రాజవిద్యా ప్రతిపాదిత భక్తియోగము (ఐశ్వర్య బుద్ధి యోగము) యోగ (హైరణ్యగర్భ) నిష్ఠనుండి గృహీతమని యెఱుంగవలయును. భగవద్దృష్టిలో నిది సుసుఖ మార్గము, గ్రాహ్యము.

"రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమం.
ప్రత్యక్షావగమం ధర్మ్యం. సుసుఖం కర్తుమవ్యయం."

సర్వజనోప కారకములగు లౌకిక వైదిక కర్మలను పరిత్యజించి, మనో బుద్ధీంద్రియాదులను బలాత్కారముగ నణచివైచుచు, దురూహా పథముంబట్టి లోక సంగ్రహా విఘాతమాచరించుట భగవంతుడు మంచిపనిగా నెంచలేదు. ఒకటి ఈ యోగమందు కాయక్లేశ మధికము. రెండు, ఇంకు వైయక్తిక స్వార్థ ప్రాధాన్యము. మూడు కామభావ సమావేశముచే నాసక్తి సామ్రాజ్యము. అను నీయెల్ల హేతువులచే కామ్యభక్తి మంత్ర హఠ లయ యోగాత్మకమగు నీ యోగమార్గమును భగవంతుడు, కర్మశూన్య సాంఖ్యమార్గము వలె ననుపాదేయ మనియే యెంచెను. ఇక నవ్యక్తమూల సాంఖ్యనిష్ఠం బోలె దీని నేల వేరుగా ఖండింపడయ్యె ? నన్నచో దాని ఖండన తోడనే ఇదియు

పరాస్త మైనట్లేనది గదా! గీతతో దుల్యమగు వేదాంత దర్శనమును సాంఖ్యము నామూలచూడముగ ఖండించి చివరకు యోగఖండనం గూర్చి 'ఏతేన యోగః ప్రత్యుక్తః' అనుటయే చాలుననుకొన లేదా? దానింబట్టి సాంఖ్యయోగము లొకజాతిలోని వనియు, ఒకదానిని ఖండించుటే రెండవదాని ఖండనయు నగుననియు దేలుచున్నది గదా! అట్లే యిచటను నెఱుంగవలయును.

'సాంఖ్య-యోగా' అను దానిలోని యోగశబ్దముచే నెవరేని, హిరణ్యగర్భ (పాతంజల) యోగమును గ్రహించి గీతను యోగశాస్త్ర మనుకొన్నచో నది భ్రాంతి. అందలి సాంఖ్య శబ్దము వలననే రెండును గతార్థములు. గీతాదృష్టికి రెండును ఖండనీయములు. కనుకనే గీతను సాంఖ్యశాస్త్ర మనరానట్లే యోగశాస్త్రము ననరాదు. సంశోధిత రూపమున నా రెండు యోగములును గీతయందుండుట వలన నది యొక విధముగ జ్ఞానయోగశాస్త్ర మన్నను, భక్తి (ఐశ్వర్య బుద్ధి) యోగ శాస్త్ర మన్నను, సత్యదూరముకాదు. చివరకు దేలిన నిష్కర్ష :— మూడువిధముల జ్ఞానయోగములందును సాంఖ్యలక్షణ సంశోధిత జ్ఞానయోగమును యోగలక్షణ సంశోధిత భక్తియోగమును, సాంఖ్యశబ్దముచేతనే గృహీతము లనియు, కనుకనే ప్రకరణారంభమందే భక్తియోగమునకు సాంఖ్యమందే యంతర్భావ మని చెప్పబడిన దనియు, ఈ కారణము వలననే భగవంతుడు 'లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా

నఘ" అను నిత్యాదిగ శాశ్వతములగు కర్మజ్ఞాన భక్తు లను మూడునిష్ఠలను రెండునిష్ఠలుగనే పరిగ్రహించె ననియు, ఈసమ న్వయము, భక్తియోగము జ్ఞానయోగమున కంతర్భావ మను కొన్నప్పుడే సుసంగత మగుననియు ఏర్పడును.

ఇట్లు కాపిలసాంఖ్యము హిరణ్యగర్భ యోగము అను నీ సాంఖ్యయోగములు రెండు నొకటైనచో, 'సాంఖ్యయోగౌ పృథగ్బాలాః' యను దానియందలి యోగశబ్ద మేయోగముం జెప్ప నన్నచో, సమాధానము, 'స్వాయంభూ నిష్ఠ' అనియే. భగవంతు డాది మనువు, ప్రజారక్షణ పోషణ వికాసార్థము ప్రకృతిసిద్ధవర్ణాశ్రమ విభాగమును, తద్ధర్మ వ్యవస్థయు గావించెను. యోగ్యతానుసారముగ, నా యా వర్ణములను, ఆశ్రమ ములను, ఆ యా కర్మ విశేష నియుక్తములం గావించెను. ఈ కర్మమార్గమే దేవయుగమందు యోగనామము నొందెను. అదే గీతయందలి యోగశబ్ద వాచ్యార్థము.

"లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖ బాహూరు పాదతః
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం, శూద్రం చ నిరవర్తయత్
సర్వస్యాస్య తు సర్గస్య గుప్త్యర్థం సమహాద్యుతిః
ముఖ బాహూరుపజ్జానాం, పృథక్కర్మా ణ్యకల్పయత్" (మనువు)

హిరణ్యగర్భయోగము నాల్గువిధములైనట్లే, ఈ స్వాయం భూ కర్మయోగమును, ప్రవృత్తి నివృత్తి భేదముచే రెండు విధ ములు. 'ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికం' లౌకిక విషయముల వంకకు వంగుట మనుష్య స్వాభావిక ప్రవృత్తి గదా!

"నమాంస భక్షణే దోషో న మద్యే న చ మైధునే
ప్రవృత్తిరేషా భూతానాం, నివృత్తిస్తు మహాఫలా" (మనువు)

ఈ విషయ కామనా పరిణామము ? కర్మనివృత్తి భావమును లోపింపజేసినది. వైదిక లౌకిక కర్మలెల్ల గామనా ప్రధానములై బంధ కారణము లైపోయినవి. ఈ యభినివేశ మెంత వరకు బోయినది ? సాంఖ్య నిందకు దిగినది, వేదవాద రతులగు కర్మఠులకు ప్రవృత్తి మూలకము, కామవిషయ పూరకము నగు కర్మమార్గమే యారాధ్యమైనది. మొదటినుండియు సాంఖ్యులన్ననో, జ్ఞానాభినివిష్టులు, కర్మమార్గ మాత్యంతిక పతనకారణ మనుకొనువారు. వారికి వీరు ప్రతిభటులై "మా యోగ (ప్రవృత్తి మూలక యజ్ఞ తపో దానాది లక్షణ వర్ణాశ్రమానుబంధి వైదిక కర్మయోగ)మే, సర్వశ్రేష్ఠము. దీనివలన మా కోరిన ఫలములు లభించును. మేము భోగైశ్వర్య భోక్తల మయ్యెదము. మీరు కర్మ మార్గముం దిరస్కరించి, ఇహాపర సంపద్దూరులై కాయ క్లేశము లొందుదురు" అనుచుండిరి.

ఇక నా జ్ఞానాభినిష్టులన్ననో "ప్రేలకుడు, ఈ సుఖము లెంత కాలము ? మరల నెంతటి అసహ్య దుఃఖము లనుభవింప వలయునో, దుఃఖైక కారణములగు కర్మలకొక నమస్కారము. కామజనితాసక్తి ప్రభావముచే నివి సర్వనాశ హేతువులే యగును. వార్ధక్యము నందీ కామన లెంత బాధించునో యయాతి చెప్పెనుగదా, 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' యుండనే యున్నది. ఇక స్వర్గ సుఖమునకు మురియ నేల ? మా కేదుఃఖ

మును లేదు. కర్మతో మాకు బనిలేదు. మా కాయక్లేశమా మీ యనంత దుఃఖము మందరకు నేపాటిది? ఇది బుద్ధి పూర్వకము గనుక మాకంత పరితాపమే లేదు. మాకు బరిణామము? శాశ్వత బ్రహ్మానందము 'నస పునరావర్తతే' మీకో, 'పునరపి జననం పునరపి మరణం' అనుచుండిరి.

## బుద్ధియోగావిర్భావము.

ఇట్లు తన ప్రజ్ఞాపరాధముచే వైదిక కర్మయోగమును ప్రవృత్తిమూల కామనా కళంకితము గావించి మను నిష్ఠానుయాయి మానవ సమాజము తన స్వాభావికాత్మజ్ఞాన ప్రకాశము నావృతము గావించు యోగ (కామ్యకర్మ యోగ) మునకు ప్రాధాన్య మిచ్చివైచెను. అటు జ్ఞానాభినివిష్టులు కపిల హిరణ్యగర్భానుయాయు లాత్మాంగభూత కర్మం దిరస్కరించి లోకవైభవమునో విడచిరి. కేవల జ్ఞానానుగమనమున ఆత్మపదమునో పొందజాలరైరి.

స్వాయంభువ మనుశాసన కాలము మొదలుగ, వివస్వంతుడు యావరాజ్య పదారూఢు డగుట వరకు గల చివరి కాలమునం దీ రెండు నిష్ఠలకును వైరములు పొడముచుండెను. వికృతి లక్షణ మానవ సమాజము యొక్క యీ యాత్యంతిక క్షోభ తదవినాభూతమగు ప్రకృతిని క్షోభిల్ల జేసెను. చివరకు ప్రాకృతిక నిత్య వర్ణాశ్రమ ధర్మములు, సర్వప్రతిష్ఠాభూతమగు నార్ష ధర్మము మ్లానత నొందెను. ఫలితము? ప్రకృతి

ంత్యాయుక్తుడు పురుషుడుగూడ క్షోభిల్ల నయ్యెను. ఈ ధర్మగ్లాని యుపశమనార్థము మానవ సమాజ మందలి యీ ద్వైతవృత్తి నాశము కొరకు, సాంఖ్యయోగ నిష్ఠలను సమన్వయ మొనరింప నై ప్రకృతిసిద్ధ వైరాగ్య బుద్ధియోగ మావిర్భవింపను, జ్ఞాన కర్మాత్మిక వేదాంత నిష్ఠను స్థాపింపను, ఆ క్షోభకాలమందు శుద్ధప్రకృతి యొక్క అమోఘ ప్రేరణచే ఆ యజు పురుషుడు జన్మను స్వీకరించెను.

"అజోపిసన్ అవ్యయాత్మా భూతానామీశ్వరోఒపిసన్
ప్రకృతింస్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా"

ఆ యవతారపురుషుడు స్వయంభూపుత్రు డగు వివస్వం తుని తన ప్రధాన ప్రథమ శిష్యునిగా జేసికొని అతనిం గూర్చి,

"సాంఖ్యయోగౌపృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః
ఏకంసాంఖ్యంచయోగంచ యఃపశ్యతిసపశ్యతి"

అని ఘోషించెను. ఆ సందేశము పరివర్తనశీల నియతి చక్రప్రభావముచే గొంతకాలమునకు విలుప్త మయ్యెను. మరల నెప్పటియట్లు జ్ఞానకర్మల కలహము లంకురించి మానవసమాజ మును సంకట గ్రస్తము గావించెను. ఆర్ష ధర్మము మరపున దగిలినది. వ్యక్తులు సమాజము, రాష్ట్రము, అంతటను కష్టము లావరించినవి. అదే మహాభారతకాలము (చూడుడు గీతావిజ్ఞా నము ఐతిహాసిక సందర్భ సంగతి) సరిగ్గా కావలసిన దేమో అయినది. తన ప్రతిజ్ఞను రక్షించుకొనుటకు (యదాయదాహి ...పరిత్రాణాయ)ఆ ప్రథమోపదేష్టయే, వాసుదేవశరీరముతో

నవతరింప నయ్యెను. అర్జునుని ప్రధాన ప్రథమశిష్యునిగా గొని, యతనిం గూర్చి మరల 'సాంఖ్యయోగా' అని ఘోషింపవలసి వచ్చెను.

అయినది: కాని పురుషుడు తన ప్రతిననుండి చలింపడు. అనృతసంహిత మగు మనుజ సమాజమును స్థిరధర్మానుయాయి కాజాలదు. కొన్ని శతాబ్దుల వరకు నార్షధర్మము సురక్షితము గనె యుండెను. కాని కలికృప! మొదటికంటె నధర్మ, వ్యాజ ధర్మముల వలన ఆర్షధర్మము మ్లాన మయ్యెను! వైరాగ్యబుద్ధి యోగలక్ష క్షార్షధర్మ మన్ననో కొన్ని శతాబ్దులలోనే యుచ్ఛిన్నప్రాయ మైనది, ఇక దద్గర్భస్థములు సమ్మతములు నగు, (1) సంశోధిత జ్ఞానబుద్ధియోగ లక్షణ కర్మయుక్త జ్ఞాన (సాంఖ్య) యోగము (2) ఐశ్వర్యబుద్ధియోగలక్షణ నిష్కామ భావోపేత భక్తియోగము. (3) ధర్మబుద్ధియోగలక్షణ కామ నివృత్తియుక్త కర్మయోగమును, (యోగనిష్ఠ) అను నీ మూడు నిష్ఠల స్వరూపములు గూడ జెడినవి. (1) జ్ఞానయోగ స్థానమును, జగన్మిథ్యాత్వమూలక మగు వేదాంతనిష్ఠయు, (2) భక్తి యోగస్థానమును, వైరాగ్యజ్ఞానములేనట్టియు, దాస్యభావ యుక్త మయినట్టియు, కామనామయ నిర్వీర్య సంప్రదాయ భక్తియు, (3) కర్మయోగస్థానమును, శాస్త్రవిరుద్ధ వికర్మాకర్మ నామకాసత్కర్మలును, ఆక్రమించుకొన్నవి. అన్నిటి కంటెను శోచనీయస్థితి యేమన యీ యుత్పథములు మూటిని బట్టిన వారును, తమ కల్పితసిద్ధాంతములచే జనసామాన్యమును

దమతము వలలలోబడవై చుకొనుటకు సాధనముగా గీతాశాస్త్ర ముఁనే గొనుచున్నారు. అందరును గీతానుయాయులే తమతమ కల్పితసిద్ధాంతముల కన్నిటికి సమర్ధనములు. గీతవలననే అందరును గీతాపారదర్శులే. వ్యాఖ్యాతలే. అనన్యభక్తులే. అబ్రహ్మణ్యమ్! అబ్రహ్మణ్యమ్!! లుప్తప్రాయ మగు నా యార్ష ధర్మము, మరల మధుసూదన ప్రేరణచే ఆయనకృపాకణ రూపమున నిట్లు మరల వెలయుచున్న దని మా నమ్మకము. కానిండు :—

కం॥ పలికెడిది భాగవతమట ;
పలికించెడివాడు, రామభద్రుండట ; నే
పలికిన, భవహరమగునట ;
పలికెద ; వేరొండుగాథ ; పలుకగనేలా ? (పోతన)

"కాయక్లేశాత్మకము, అవ్యక్తలక్షణము, హిరణ్యగర్భ నిష్ఠారూప యోగయుక్తము, (వర్ణాశ్రమానుబంధి స్వాయంభూ నిష్ఠారూప) కర్మవియుక్తము,(కనుకనే)సన్యాసనామ ప్రసిద్ధము నగు సాంఖ్యనిష్ఠ (జ్ఞానయోగము)-యోగనిష్ఠ (వైదికకర్మ యోగము) కంటె వేరైనది. ఇట్లే యోగనిష్ఠయు సాంఖ్యనిష్ఠ కంటె వేరైనది." అను నీభావము బాలబుద్ధికి జెందినది. కర్మయోగులు జ్ఞానము(సాంఖ్యము)ను ఆశ్రయముగ గొనవలదా? సాంఖ్యనిష్ఠులు జ్ఞానులు, కర్మత్యంతికపరిత్యాగము జేయగలరా? అసంభవము, భగవంతుడు చెప్పుచున్నాడు :—"మీయిరువురకు విరోధము మంచిదికాదు. మీ మీ నిష్ఠలందు మీ రనన్య

భావమున నారూఢులు గండు! మా కేవిప్రతిపత్తియు లేదు. కొంచెము సవరణ చేసుకొనుడు. కర్మవాదులు మీ యాత్మ జ్ఞానము నుత్తరోత్తరము నావృతముగావించు కామాసక్తిని, ఫలాసక్తిని పూర్తిగా వదలుకొనుడు! జ్ఞానవాదులు! మీరు జ్ఞానముతో, లోకసంగ్రహరక్షకొరకు, లోకవ్యవస్థలను, అను ష్ఠానములుగ నుంచు టావశ్యకము. ఈశ్వరీయకర్మలుగ నెంచి లోకసంగ్రాహక కర్మలందు ప్రవృత్తులుకండు! కామనా త్యాగమే నిజ మగు సన్న్యాస మని జ్ఞప్తియుంచుకొండు! కర్మ త్యాగమన్నది కేవలము మోసము. "నహి దేహభృతా శక్యం, త్యక్తుం కర్మాణ్యశేషతః కార్యతేహ్యవశఃకర్మ సర్వఃప్రకృతి జైఃగుణైః" త్యాగముపేరే సన్న్యాసము. ఇదే సాంఖ్యనిష్ఠ.— కర్మవాదులు, కర్మపరిగ్రహామువలన యోగమార్గప్రతిష్ఠితులై కామనాపరిత్యాగము జేసి వైచినచో, కామత్యాగలక్షణ మగు నీ యోగనిష్ఠను చక్కగా ననుష్ఠించుటచే వారు త్యాగలక్షణ సాంఖ్యనిష్ఠయొక్క అతిశయమును, పరిగ్రహలక్షణ యోగనిష్ఠ యొక్క యతిశయమును పొందగలరు. గ్రహణమేగదా యోగము? ఇదియే యోగనిష్ఠ. ఇక :—జ్ఞానవాదులు, జ్ఞానాను గతివలన సాంఖ్యమార్గ ప్రతిష్ఠితులై నిష్కామభావముతో కర్మగ్రహణ మాచరించుచో నాజ్ఞానానుగత, గతిలక్షణ మగు నీ సాంఖ్యనిష్ఠనే యనుష్ఠించుటవలన, ఈ పరిగ్రహలక్షణ యోగ నిష్ఠకు, త్యాగలక్షణ సాంఖ్యనిష్ఠకు ప్రభువులు కాగలరు. "ఏకమ ప్యాస్థితః సమ్య గుభయో ర్విందతే ఫలమ్"

ఇట్టి సమ్యక్సన్యాసము (సాంఖ్యము) చే, జ్ఞానయుక్త మగు నిట్టి సమ్యగ్యోగముచే, మీ యిరువురి యభీష్టములును నెరవేరును. ప్రవృత్తిమూలక కర్మలందు కర్మవంక బరువు. కర్మత్యాగలక్షణ జ్ఞానమందు జ్ఞానమువంక బరువు. ఇదే విషమత, క్షోభ, అశాంతిమూలము. రెంటి యందును సమావేశము కాకున్నంతవరకు రెంటికిని సమత యుండదు. అందువలన, సన్యాసమును, యోగమును సమ్యగ్భావ దూరములే యగును. కాని, పారస్పరిక వినిమయముచే, సమ్యగ్భావము నొందుచో ?

"సన్యాసఃకర్మయోగశ్చ నిఃశ్రేయసకరా వుభౌ"

ఇంకను, ఇందు, అనగా నిట్లు సంశోధిత రూపము లగు సాంఖ్యయోగము లందు జ్ఞానమార్గముకంటె కర్మపరిగ్రహ లక్షణ కర్మమార్గమందు, లోకసంగ్రహ రక్ష విశేషము. సాంఖ్య నిష్ఠుడును కర్మయాచరించును. శక్య మగు నంతవరకు లోక సంగ్రహమును గమనించును. కాని యెట్లయినను చివరకు :— లోకధర్మవిరోధియగు జ్ఞానప్రాధాన్యముచే నతని జ్ఞానోపయిక కర్మవైయక్తికస్వార్థమునకేసాధక మగును. ఇక కర్మయోగ మార్గమో, వైయక్తిక స్వార్థముతో పరమార్థముం గూడ ప్రధానముగ ననుగమించును. కనుక ఈ దృష్టితో 'తయోస్తు కర్మసన్యాసా త్కర్మయోగోవిశిష్యతే' యనుటయే భగవంతుని కుచితముగా దోచెను.

సన్యాస మార్గమం దున్నవ్యక్తి, లోకసంగ్రహము నందు సఫలుడగుట, ఆతని జ్ఞానోపయిక కర్మవలన సమాజ

మున కుపకారము జరుగుట కఠినము. ఏలయన, మొదట, మార్గమే కఠినము. ఆపై లోకసంగ్రహమునకు ప్రాయశః అభావము. కనుక నిట్టి సన్యాసికంటె నా విజితేంద్రియుని యోగ మార్గమే (కర్మ మార్గమే) శ్రేష్ఠము. అతడు తన్ను తన కర్మను సంపూర్ణముగ భూతహితార్థము సమర్పించి, లోకసంగ్రహ బుద్ధిపూర్వకముగ యావజ్జీవము నిష్కామ భావముతో కర్మ యందు ప్రవృత్తుడగును. అతడే నిజముగ సన్యాసి, యోగియును "ననిరగ్ని ర్నచాక్రియః" చూడుడు :-

"సన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి
యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే
నైవకించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్."

కానిండు, ప్రస్తుతము చూచుకొందము. జ్ఞానకర్మనిష్ఠలతో ప్రస్తుత వేదాంత నిష్ఠం గల్పినచో అయిదు నిష్ఠలగును. ఇందు మూడు పర మతములకు జెందినవి .ఒకటి గీతకు జెందినది. ఒకటి యుపేక్షణీయము. ఎట్లో మరల నొక మారిటు చూతము. 1. కాపిల నిష్ఠయొక్క సంశోధిత రూపమే గీతయందలి జ్ఞాన యోగము, 2. హిరణ్యగర్భ నిష్ఠయొక్క సంశోధిత రూపమే గీతయందలి భక్తియోగము, 3. స్వాయంభూనిష్ఠయొక్క సంశోధిత రూపమే గీతయందలి కర్మయోగము, 4. బుద్ధియోగలక్షణ వేదాంత నిష్ఠయే గీత శాంత యోగము. (5) ప్రస్తుత వేదాంత నిష్ఠయే, యుపేక్షణీయము.

కాపిల సాంఖ్య[1]నిష్ఠయు, హిరణ్యగర్భ యోగ[2]నిష్ఠయు, గీతయందలి సాంఖ్యము[1], స్వాయంభువ సమ్మత యోగ[2]నిష్ఠ గీతయందలి యోగము. ఇట్లు 'లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా' అను దాని యందలి సాంఖ్యయోగనిష్ఠ కాపిల, హిరణ్యగర్భ, స్వాయంభూ యోగనిష్ఠలను సంగ్రహించుచున్నది. లోకమందు వాడుకలోనున్న యీ మూడు నిష్ఠల, సంశోధిత రూపములును గీతయందలి సిద్ధ - రాజా - ర్ష విద్యలందు బ్రతిపాదింపబడిన జ్ఞానైశ్వర్య ధర్మ బుద్ధి యోగ లక్షణ జ్ఞాన - భక్తి - కర్మయోగములు నా బరగినవి. శ్రేణీ విభాగ దృష్టిచే జ్ఞానయోగము మొదటిది. కర్మయోగము రెండవది. భక్తియోగము మూడవది. మొదటిదానియందు లోకసంగ్రహ మల్పము. రెండవదాని యందు లోక సంగ్రహము పూర్ణమే కాని, ఆత్మ ప్రసాద మల్పము. రెండును గలది భక్తియోగము (మూడవది). కనుక నీ శ్రేణీవిభాగము న్యాయసంగతమే యగును. ఇందు కర్మయోగమునకు గృహస్థాశ్రమము తోడను, భక్తియోగమునకు, వానప్రస్థాశ్రమము తోడను, జ్ఞానయోగమునకు సన్యాసాశ్రమము తోడను ప్రధాన సంబంధములు. అన్నిటికి బైని నాల్గవ శ్రేణియందున్న రాజర్షివిద్యా ప్రతిపాదిత వైరాగ్య బుద్ధియోగ లక్షణయోగము, గీతారాద్ధాంతము. ఇదే భగవన్నిష్ఠ యన బరగినది.

## భ క్తి ని ష్ఠా ప్రా చీ న త.

వెనుక భక్తియోగముం గూర్చిన ప్రశ్నకు హిరణ్యగర్భనిష్ఠద్వారా సమాధాన మీయబడినది. దానిం గూర్చి యింక నొంచెము వివరించుట యప్రస్తుతము గాదు. భగవంతుడు రెండు నిష్ఠలనే పేర్కొనెను. గీతయందు భక్తియను మూడవ నిష్ఠ యొకటికూడ నగపడుచున్నది. ఇదియు నాదియుగమునుండియు వాడుకయం దున్నచో భగవంతు డేల గణింపలేదు? ఇది శాశ్వత నిష్ఠ కాదన్నచో, శాశ్వత ధర్మప్రవర్తకుడు భగవంతుడు గీతయందు దీని కేయాధారము గొని స్థాన మిచ్చెను? ఇది భక్తుల కొక సమస్య.

ఈశ్వ రాజ్ఞాపత్రరూప వేదోక్త జ్ఞానకర్మల కనుయాయియగు భారతవర్ష మాదియుగము నుండియు నీశ్వరోపాస్తిరూప భక్తిమార్గ వంచితముగ నుండి, త్రేతా ద్వాపరములందు, భక్తి నిష్ఠ నేర్చియుండు ననుట యసంభవము. మను, కాపిలనిష్ఠలు పుట్టినపుడే యోగక్రియారూపమున హిరణ్యగర్భుని ద్వారా యీ భక్తినిష్ఠయు కల్గినది. కాని యానా డది భక్తియను పేర గాక యుపాసన యను పేర బిలువబడినది. వైదికయజ్ఞకర్మలందు మహావీరోపాసన (ప్రవర్గ్యోపాసన) యను సాకారోపాసన యున్నను, ధ్యానప్రధానమును (కనుకనే) జ్ఞానయోగాత్మకము నగు నుపాసనకే యా కాలమునందు ప్రాధాన్య మీయబడుచుండెను. కనుకనే ఉపాసనాకాండ ప్రతిపాదక

వైదికారణ్యక భాగమునకు జ్ఞానకాండ ప్రతిపాదక మగు నుపనిషత్తులందే అంతర్భావ మూహింప బడినది. 'బృహదారణ్యకోపనిషత్' ఇత్యాదు లిందుకు నిదర్శనము లనదగును.

ఇట్లు జ్ఞానయోగలక్షణము గల యుపాసన యందలి కొన్ని సాకారవిధములు హిరణ్యగర్భ యోగనిష్ఠయందును, మనునిష్ఠయగు కర్మనిష్ఠయందును, అంతర్భావములుగ నెన్న బడినవి. ఇక నిర్గుణప్రకారములు సాంఖ్యనిష్ఠయం దంతర్భావములైనవి. కాగా, కర్మ-జ్ఞానోపాసనలే యీ నాడీశ్వరోపాసనలుగ నెన్నబడుచు వచ్చెను. అగ్నివాయ్వింద్రాది స్తుతిలక్షణోపాసనలు గూడ కర్మాత్మికములే యైనవి. ఈ యుపాసనలు యజ్ఞకర్మస్వరూప నిర్మాణమునకే యుపయోగ పడుచు వచ్చెను. ఇట్లుభయనిష్ఠలం దిది యంతర్భావ్యమగుటచే దీనిని వేరుగ గణింప నావశ్యకము కాదయ్యె.

జ్ఞానోపాసనా ప్రధాన మగు నారణ్యకమందు కేవలము నిర్గుణోపాసనయే యన్నది లేదు. సూర్యచంద్ర పృథివ్యాదుల సాకారోపాసనలును అందు గావలసినన్ని యున్నవి. మూర్తము నాధారముగ గొని యమూర్తము నారాధించు విధమే యీనాటివాడుక. ప్రస్తుత మూర్తిపూజ కది యొక రూపాంతరమే. సాంఖ్యనిష్ఠవలె నీ యుపాసనానిష్ఠయు కొంతకాలమునకు ప్రవృత్తిమూలక కర్మవాదసంసర్గముచే కామనామయమయ్యెను. ఈశ్వరోపాసనా స్థానమును భౌతికఫల కామనలాక్రమించినవి. కనుకనే సాంఖ్య-యోగాంతర్భూతమై స్వతంత్ర

పరిగణనములేని భక్తినిష్ఠను గూడ భగవంతుడు సవరింపవలసి వచ్చెను. అదే గీతయందలి యైశ్వర్యబుద్ధియోగము. ఇట్లు గీత యొకవిధముగ జ్ఞాన-యోగ-భక్తిశాస్త్ర మైయున్నది.

## నిష్ఠా సమన్వయము

ఈనిష్ఠలతత్త్వము నెఱుంగక గీతయందు, జ్ఞానమే, భక్తియే, కర్మయే యున్నది, తక్కినవి గౌణము లనుకొను సాంప్రదాయికులతో, "గీతయం దివి యేవియులేవు, అది కేవలము బుద్ధియోగశాస్త్ర" మందుము. బుద్ధియోగసమావేశముచే ప్రతియోగమందును మూడుయోగములు నుండును. గీతదృష్టిలో :— అశాశ్వత స్వర్గాదిఫలముల కతిరిక్తముగ, ఆత్మోపయికజ్ఞానము, ఈశ్వరాంశరూప మగు నైశ్వర్యమును వికసింపజేయని కర్మయోగము కర్మయోగమే కాదు. లోకసంగ్రహకర్మలు లేక గోవిందరసప్రవాహము లేక, స్థాణురూపమగు జ్ఞానయోగమునకును విలువలేదు. —ఇక :-జ్ఞానము నుపేక్షించి, వర్ణాశ్రమమూలక కర్మలను దిరస్కరించు భక్తియు భక్తికాదు. ధర్మజ్ఞానైశ్వర్యములు మూటివలననే ఐశ్వర్యలక్షణ భక్తినిష్ఠ సిద్ధమగును. కర్మనిష్ఠ సంపన్నమగును. జ్ఞానలక్షణ సాంఖ్య సంపద వికసించును. కర్మజ్ఞానమార్గములను నిందించు భక్తులు పతితులు. వారిభక్తి అభక్తిరూప వ్యభిచారిణి. భక్తిజ్ఞాన నిందక కర్మాభిమానులును పతితులే. వారికర్మ కేవలము ఆత్మపచనకారణము. అఘోత్పాదకము. ఇక :—భక్తి-కర్మ

నిందకులగు జ్ఞానులును, మూర్ఖునికంటె నెక్కుడు దురవస్థాపాత్రులు. "తతో భూయఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః"

ఇంతకు నీ నిష్ఠావ్యాఖ్యకు **నిష్కర్ష :** జ్ఞానానుయాయియగు విద్వాంసుడు జ్ఞానార్జనతో, శాస్త్రసిద్ధకర్మలు, లోకసంగ్రాహక కర్మలనుగూడ యథాశక్తిగ నాచరింప వలయును. ఈశ్వర ప్రణిధాన లక్షణోపాసననుగూడ ననుష్ఠింప వలయును. భగవదారాధన శూన్యము, కర్మ విరహితమునగు జ్ఞానము కాలాంతరమునం దజ్ఞానరూపముగ బరిణతమై అభ్యుదయ నిఃశ్రేయసములకు బదులు, పతనమునకు గారణమగును. భగవద్భక్తి శూన్యులు, అకర్మణ్యులు, కేవల జ్ఞానోపాసకులు, అగు నేటి యస్మత్సదృశ జ్ఞానాభిమానులే యిందు కుదాహరణ భూతులు.

ఇక నహోరాత్రములు నిష్కామకర్మ డిండిమఘోషము గావించు నా కర్మాభిమానులకు కూడ నావశ్యక కర్తవ్యమున్నది. ఏమన వారు తమ కర్మమార్గమును శాస్త్రానుకూలముగా సవరించుకొనుటకు బ్రయత్నింపవలయును. యథాశక్తిగ జ్ఞానము ఈశ్వరచింతనమును గూడ ననుగమింప వలయును. శాస్త్రసిద్ధ కర్మ-జ్ఞాన-భక్తుల నుపేక్షించి వారొనరించు కల్పిత కర్మమార్గానుగమనము వారికిని వారి యనుయాయులకును గూడ కల్యాణము నొడగూర్పదు. ఇట్లే 'పానీయంబులు ద్రావుచుం గుడుచుచుం భాషింపుచున్ హాసలీలానిద్రాదులు సేయుచు' భక్తిగుణానువాద మొనరించు భక్తరాజులుకూడ వర్ణాశ్రమధర్మానుకూల భక్తిమార్గము ననుగమింపుచు శాస్త్ర

సిద్ధ యజ్ఞతపోదానేష్టాపూర్తదత్తము లను నీలోకసంగ్రాహక కర్మలనుగూడ ఈశ్వరార్పణబుద్ధితో నాచరించు చుండవల యును. జ్ఞానవైరాగ్యములను భక్తి కాలంబనములుగ జేయవల యును. అటుగానిభక్తి వంధ్య యగును. అజ్ఞానవశమున వర్ణా శ్రమకర్మలను శాస్త్రసిద్ధ జ్ఞానవైరాగ్య భావములను అపహా సించువారి కల్పితభక్తికి భగవంతుడు ప్రసన్నుడును గాడు. 'సిరికింజెప్పక శంఖచక్రయుగముం జేదోయిసంధింప కేపరివారం బును జీరక' వారిని రక్షించుటకు వట్టిపాదములతో బరువెత్తు కొనియు రాడు.

గీతావిజ్ఞానమందలి 'భగవద్గీతోపనిషత్తు' అను సమష్టి నామరహస్యము నందు భక్తికాండ 'భగవ' చ్ఛబ్దముచేతను, వితానలక్షణకర్మకాండ 'గీతా' శబ్దముచేతను, జ్ఞానకాండ 'యుపనిషత్' శబ్దముచేతను సూచిత మంటిమి. ఈమూడునిష్ఠ లను బోల్చునపుడు భక్తి-కర్మ-జ్ఞానములను శ్రేణీవిభాగ మేర్ప డును. కనుకనే నామక్రమ మట్లు ఏర్పడినది. గీతకు పేరులు మూడుకావు. బుద్ధియోగప్రధానాత్మకము గీతాశాస్త్ర మొకటే. తద్గర్భమందు లోకసంగ్రహదృష్టితో నా మూడు గౌణయోగములును ప్రతిష్ఠితములైనవి. *'భగవద్గీతోపని

---

* నిర్గుణబ్రహ్మ వాఙ్మనసాతీత మగుటచే ననుపాస్యము, భక్తిమార్గమున కతీతము. అదే మాయా, కళా, గుణ, వికార, అంజన, ఆవరణ నామకము లగు నుపాధులచే సగుణమై ఐశ్వర్యాదిషడ్భావపాత్రమై జీవాత్మ కుపాస్య మగు 'భగ వంతు' డగును. బ్రహ్మయొక్క భగవత్త్వమే (భక్తి) ఉపాసనకు మూలభిత్తి.

షత్తు" అను నీ నామసమష్టి ఆయపూర్వము, విలక్షణము, పూర్ణము నగు బుద్ధియోగమునే సమర్థించుచున్నది.

---

భక్తియోగమునకు గేవలము భగవంతుని తోడనే సంబంధము. ఈ సహజసంబంధము నాధారముగ గొనియే నామసమష్టియందలి 'భగవత్' అను నంశమును భక్తి యోగ సంగ్రాహక మంటిమి.

అర్థక్రియాజ్ఞానాత్మక విశ్వమం దర్థజ్ఞానములు స్వస్థాన ప్రతిష్ఠితములు. ఉత్తరోత్తరముగ వికాసభావ సంబంధము కేవలము క్రియవలననే యగును. క్రియయే గతిధర్మమువలన అర్థ-జ్ఞానములకు విస్తారకారణ మగును. విస్తారభావ మూలాధారము క్రియాభావము. విస్తారభావమే గానము గదా! ఆయీ యాధారముం గొని విస్తారభావాత్మక గీతాశబ్దమును, కర్మవాచక మనవచ్చును. విశ్వమును, విశ్వమందలి చరాచరప్రజావర్గమును భగవత్కర్మవిస్తారమే. కర్మయే మహామాయి. మహేశ్వరుని మహాసంగీతము. దాని ననుసరించియే యోగమాయి. జీవాత్మ జీవన్ముక్తుడు కాగలడు. గీతాశబ్దముయొక్క యీ రహస్యమును లక్ష్యమం దుంచి కొనియే నామసమష్టియందలి 'గీతా' అను నంశమును కర్మయోగమునకు సంగ్రాహక మంటిమి.

మౌలికసిద్ధాంతమునే విజ్ఞానభాషయం దుపనిషత్తందురు. మౌలికసిద్ధాంతమే విశ్చలజ్ఞానభావ సూచకము. అదే మౌలికోపపత్తి. మౌలికజ్ఞానము. దీనివలన విషయజిజ్ఞాసువునకు విషయమునెడ దృఢనిష్ఠ యేర్పడును. ఉప = విషయసమీపే, ని = నితరాం, నిశ్చయేన, షత్ = సీదతి ప్రతిష్ఠితోభవతి. ఈ యాధారముపై నామసమష్టియందలి "ఉపనిషత్" అను నంశమును జ్ఞానయోగ సూచక మంటిమి.

# ఉపసంహారము

మనకేమి కావలయును? అన్నది మొదటిప్రశ్న. సమాధానము? 'యోగక్షేమో నః కల్పతాం' అను శ్రౌతసిద్ధాంతము. దీనికి తాత్పర్యము? భారతీయప్రజ:—స్వవర్ణాశ్రమ ధర్మానుసారము, స్వ స్వ నియతకర్మలందు యావజ్జీవ మనన్య భావమున, ప్రవృత్తము కావలయును. స్వకర్మానుష్ఠానమే మన యోగక్షేమముల భిత్తి. అందుకు విరుద్ధముగ నగు యోగక్షేమము వాస్తవికతా వంచితము. అనుష్ఠానకాల మందే క్షోభకు-అశాంతికి-చివరకు దుఃఖమునకు గారణము. కనుక 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ' అను భగవదాదేశమును శిరసావహించి, శాస్త్రసిద్ధకర్మప్రవృత్తులు గావలయును. ఇహ పర సుఖ శాంతులు కల్గును. శాస్త్రీయ కర్మల కొకటే పరిభాష. 'వర్ణాశ్రమసిద్ధ కర్మకలాపము," ఇదే భారతీయ కర్మయోగము, కనుకనే ప్రస్తుతము, వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానమునకు ముఖ్యస్థాన మిచ్చి, యిందు కర్మతంత్ర వర్గీకరణ మొనరించి, గీతయందలి కర్మయోగమును స్పష్టీకరించితిమి. ఇంతమాత్రమున, మహామోహప్రధాన కర్మమార్గ జటిలత విడిపోవు ననజాలము. కాని, స్థాలీపులాక న్యాయముగ "కింకర్మ కిమకర్మ" అను ముడివిప్పుట కనువగు కొన్ని పరిభాషలిందుజూపితి మనగలము. 'గచ్ఛతఃస్ఖలనంవాపి' అను సూక్తిని

స్మరించుచు, ప్రాతఃస్మరణీయ శ్రీగురుచరణములం దీ యల్ప ప్రయాసను సమర్పించుకొనుచు, నీ ప్రకరణమును ముగించుచున్నాము.

ఓమ్ తత్ సత్

ఇతి కర్మయోగవిజ్ఞానమ్.

ఇతిశ్రీ.........శ్రీమద్భగవద్గీతావిజ్ఞానాంతర్గత
కర్మయోగవిజ్ఞానమ్.

సంపూర్ణమ్.

# నమస్తే



సనాతన ధర్ము లగువారు, పెద్దలను జూచి వందనము, అభివాదనము, నమస్కారము, ప్రణామము జెప్పువారు. లేదా కొన్ని ప్రాంతములందు జయరామ, జయగోపాల, జయమాతా యనెడివారు. నేడు ఆర్యుల మనుకొను వారెట జూచినను ఆ పూర్వ పరిపాటిని హేళన గావింపుచు, అన్ని వర్ణములందు నన్ని లింగములవారు, నన్ని యవస్థలవారును బరస్పరము దర్శించు కొనునపుడు 'నమస్తే', 'నమస్తే మహాశయ' యనుచు నమస్తే యనుకొనుట పరిపాటిగ నేర్పడి యుండుట జూచుచున్నాము.

'నమస్తే' యనునది వైదిక శబ్దము. వైదిక ఋషి ప్రయుక్తము. 'నమస్తే రుద్రమన్యవే' ఇత్యాది రూపమున దేవ స్తుతి యందు 'నమస్తే' పదే పదే ప్రయుక్త మయినను, లౌకిక వ్యవహార కాలములందీ పరస్పర 'నమస్తే' వ్యవహారము స్వాయ ముగా వేదబ్రాహ్మణము నిషేధించినది.

స్వాహా, స్వధా, వౌషట్, శ్రౌషట్, స్వగా యిత్యాదు లన్న (యజ్ఞ) వాచకములు. విషయ భేదముచే దేని వ్యవహార మునందు దానికి ప్రత్యేకత కలదు. దేవతల యన్నాహుతి స్వాహా, పితరులకు స్వధా, ఇంద్రునకు వౌషట్, ఇత్యాది విధా నము లున్నవి. ఈ శబ్దభేద వ్యవహార భేదము నతిక్రమింప జాలము. చూడుడు. భుజింపుము, ఆరగింపుము, తినుము,

మేయము, స్వీకరింపుము, గ్రహింపుము, ఇత్యాదులు సమానార్థ ప్రయోగ్యము లయ్యు అన్నియెడల నేదైన బనికిరాదు గదా! ఆ యా వ్యక్తి విశేషముం బట్టి ఆ యా వాక్య ముప యోగ్యము. 'నమస్తే' శబ్దమునకు నిదే స్థితి.

యజ్ఞసంస్థ యన ప్రకృతి, లేక దేవ సంస్థ. ఇందు లౌకిక వ్యవహార సమావేశము నిషిద్ధము. యజ్ఞ మండలమునందు జరుగు ఋత్విగ్యజమానులందు పరస్పరాభినందన వ్యవహారము నందు 'నమస్తే' శబ్ద ముపయోగపడును. ఇట్లు ఈ శబ్దము యజ్ఞ మునకు నియతమై యున్నది. కారణ మేమన 'నమః' శబ్దము యజ్ఞవాచకము. 'నమస్తే' యన 'తమ'యజ్ఞసాధకుడను' అని యర్థము. కనుక యజ్ఞాతిరిక్త సామాన్య లౌకిక వ్యవహారము లందు 'నమస్తే' యనుట మిథ్యాదోష భాగి యగుటయే. ఈశ్రుతివచనమునవలోకింపుడు.

"చతుర్ద శైతాని యజూంషి భవన్తి త్రయోదశమాసాః సంవత్సరః ప్రజాపతి శ్చతుర్దశః ప్రజాపతిరగ్నిః యావానగ్ని ర్యావత్యస్య మాత్రా తావతై వైన మేత దన్నేన ప్రీణాతి 'నమోనమ' ఇతి యజ్ఞో వై నమః యజ్ఞే నైవైన మేత న్నమస్కారేణ నమస్యతి తస్మాదుహా నాయజ్ఞియం బ్రూయాత్ 'నమస్తే' ఇతి యధా హైనం బ్రూయా ద్యజ్ఞస్తే ఇతి తాదృక్ తత్" శ. బ్రా.

నేటి యార్యజగద్వ్యవహారము వైదికమేనా? కానిండు, ప్రాణప్రధాన వైదికవిజ్ఞానము లుప్తప్రాయమైనది. భౌతిక ప్రధానమగు ప్రాశ్చాత్యవిజ్ఞాన సహవాస దోషమున, మన

యాజ్ఞాదేశము నుపేక్షించి కల్పిత యజ్ఞముచే యనిష్టమునే సాధించుకొను చున్నారు. దేవతలనుపిల్చి యథోక్తక్రమ సత్కారము లాచరింప కుండుట కంటె పిలువ కుండుటయే మేలు. కనుకనే యజ్ఞాది ధర్మానుష్ఠాన విహీనులగు సామాన్యజనము భౌతిక సంపత్తియం దెంతో సమృద్ధులుగ నుండగ, నాయా ధర్మానుష్ఠానాడంబరముగల ధార్మికజను లన్ని విధములందు జెడి పరముఖాపేక్షులై బ్రతుకుచు "చేయువారికంటె చేయ కున్నవారే సుఖవంతు" లని యనుకొన వలసిన స్థితి పట్టినది. ఏమైనను:—క్రమము దప్పక పని సేయువారికి ఫలము తప్ప దని యే చెప్పి యీప్రసంగము ముగించుచున్నాము.

# గంగావతరణము.

సప్తవితస్తి కాయాత్మక మగు నీ మహాబ్రహ్మాండ మందాధ్యాత్మి కాధిభౌతి కాధిదైవికము లను మూడుమూడు మండలములు కలవు. అం దాధిదైవికముచే నాధిభౌతికమును, ఆ రెంటిసంమిశ్రణమున నాధ్యాత్మికమును వికసిల్లును. వీనియందు మూలభూతమగు నాధిదైవిక మండలము పంచమండలాత్మక మగుటచే నీ సర్వవస్తుజాతమును బ్రపంచ మనబడుచున్నది. ఆ యాధిదైవికాంతర్గత పంచ మండలములును వైజ్ఞానికులు క్రమముగ 1. ప్రాణము, 2. ఆపస్సు, 3. వాక్కు, 4. అన్నము, 5. అన్నాదము అనిపిలుతురు.

సర్వ జగద్వ్యాపకము, శబ్ద స్పర్శ రూప రస గంధ రహితము కనుకనే యథామచ్ఛదము (చోటు నావరింపనిది) సర్వసృష్టి ప్రవర్తకము నగు నొక మౌలికతత్త్వవిశేషమున్నది కదా ! దానినే మహర్షులు ప్రాణమనియు ఋషి యనియు వ్యవహరించిరి. ఈ వచనము జూడుడు :

"అసద్వా ఇదమగ్రఆసీత్ తదాహుః-కింతదసదాసీత్ ? ఇతి. ఋషయోవావతదగ్రేఽసదాసీదితి తదాహుః :- కేతేఋషయః ? ఇతి. ప్రాణావా ఋషయః తేయత్పురాఽస్మాత్ సర్వస్మాదిదమిచ్ఛన్తః శ్రమేణతపసా 'అరిషన్ తస్మాద్ ఋషయ' ఇతి (శత. 6)

ఈ శ్రుతికి అర్థము :- ఇదమగ్రే=ఇదియని నిర్దేశముగ వ్యవహరింపబడు సృష్టికి బూర్వము, అసదాత్మకము, సర్వజగ

త్రప్రభవ ప్రతిష్ఠా పరాయణ భూతము నగు నొక తత్త్వ విశేష ముండెను. అదే ప్రాణము. ఏవస్తువునందు ప్రాణ ముండునో యని 'సత్' శబ్దముచే చెప్పబడును. 'సామాన్యే సామాన్యా భావః' యను న్యాయము చొప్పున మనుష్యత్వము నందు మనుష్యత్వాభావము, ఘటత్వమునందు ఘటత్వాభావము గదా! అట్లే సత్స్వరూప సంపాదకమగు ప్రాణమందు ప్రాణా భావము. కనుక నీ ప్రాణతత్త్వమును విద్వాంసు లసత్తని చెప్పె దరు. దేవపదవి నొందిన విద్వాంసుల యీ పరోక్ష ప్రియత్వ మునే 'పరోక్ష ప్రియా ఇవహి దేవాః ప్రత్యక్ష ద్విషః' అని నైగమికు లందురు.

ఇక మహాబ్రహ్మాండ మందు మొదటి దీయసదాత్మక ప్రాణమండలము. దీనిని వైజ్ఞానికులు స్వయంభూమండల మందురు. ప్రాణాత్మకము సర్వజగనిర్మాతయు నగు స్వయం భువుచే మొదట నాపస్సు పుట్టును. —విజాతీయములగు ననంత ప్రాణములలో గేంద్రము నందు కలుగు ఘర్షణవలన నబుత్పత్తి యగును. ఎప్పుడైన నబుత్పత్తి ఘర్షణాధీనము కదా! ఆ మొదటిదగు ఋషిప్రాణ మాప్యప్రాణము వలె దేనిచేతను బుట్టక స్వయముత్పన్న మగుటచే స్వయంబు వందురు. ఇట్లా మొదటి దగు ప్రాణాత్మక స్వయంభువుచే మొదట నబు త్పత్తియే గావింపబడును. దీని నుద్దేశించి మను విట్లనియెను:—

**తతః స్వయంభూర్భగవాన్ అవ్యక్తో వ్యఞయ న్నిదం**
**మహాభూతాది వృత్తౌజాః ప్రాదు రాసీత్తమోనుదః**

యోఽసావతీంద్రియగ్రాహ్యః సూక్ష్మోఽవ్యక్తః సనాతనః
సర్వభూతమయోఽచింత్యః సఏవస్వయముద్బభౌ
సోఽభిధ్యాయశరీరాత్స్వాత్ సిసృక్షోర్వివిధాః ప్రజాః
అపఏవససర్జాదౌ తాసుబీజమవాసృజత్.

"చతుష్టయంవా ఇదంసర్వం" అను ననుగమశ్రుతివచనానుసారము వేదములు నాల్గుగదా! అందు స్వాయంభువ వేదమే బ్రహ్మనిశ్వసితవేదము. మరియు, వేదము ఋక్కు, సామ, యజుస్సు అని మూడువిధములచే విభక్తముకదా! ఋక్కుఛందోవేదము. సామమువితానవేదము. యజుస్సురస వేదము. ప్రకారాంతరముగ:—ఋక్కుమూర్తి. యజుస్సుగతి. సామతేజస్సు. ఈ తైత్తిరీయ వచనము జూడుడు,

"ఋగ్భ్యోజాతాం సర్వశో మూర్తిమాహుః
సర్వాగతి ర్యాజుషీహైవ శశ్వత్
సర్వంతేజః సామరూపంహ శశ్వత్
సర్వంహీదం బ్రహ్మణాహైవ సృష్టమ్."

యజుస్సు స్థితిగత్యాత్మకవేదము. యద్భావముగతితత్త్వము. జూభావము స్థితితత్త్వము. యత్ + జూ = యజ్జూ. ఇది పరోక్షప్రియులగు దేవతల సమయానుసారము యజుస్సు. ఋక్సామములు వయోనాధములు. యజుస్సు వయస్సు (ము) "ఋక్సామే యజురపీతః" యని యగ్నిరహస్యవేత్త లందురు.

సర్వసృష్టివిధానము యజుస్సుచే నగును. యద్భావము గతియంటిమి. అది వాయువే. స్థితిభావ మాకాశము. ఈశ్రుతి జూడుము:—

"అయంవావ యజు ర్యోయంపవతే ఏషహియన్నేవేదం సర్వంజన యతి ఏతంయంతమిద మనుప్రజాయతే తస్మా ద్వాయురేవయజుః అయ మేవాకాశోజూః యదిదమంతరిక్షం ఏతంహ్యాకాశ మనుజవతే తదే తద్యజుర్వాయు శ్చాంతరిక్షంచ యచ్చజూశ్చ తస్మాద్యజుఃత దేత ద్యజు ర్ఋక్సా మయోః ప్రతిష్ఠితమ్ ఋక్సామేవహతః" శత.

ఆ యజుర్వేద మం దాకాశ మమృతమృత్యు భేదమున ద్వివిధము. అమృతాకాశమింద్రుడు. "శునంహువేమ మఘ వానమింద్ర" మిత్యాదిగా మహర్షు లీయింద్రునే నిరూపించిరి. "నేంద్రాదృతే పవతేధామ కించన" అన్న ట్లమృతాకాశాత్మకు డగు నీయింద్రుడు సర్వవ్యాపకుడు. ఈ యింద్రతత్త్వము 'నీథ' రనుకొనవచ్చును. ఈ యమృతాకాశముతో నిత్యసంబంధము గల మర్త్యాకాశము వాక్కనుపేరు గల యింద్రపత్ని. 'తస్యైత స్యాగ్నే ర్వాగే వోపనిషత్' అన్నట్లు మర్త్యవాక్కు అగ్ని మయి యైయున్నది. ఇది వేదాగ్ని. దీని స్వరూపమగు వాయు వ్యాపారము వలన నీవాఙ్మయాగ్ని కొంత కరిగి ఆపస్సుగ నగును. ఈవచన మవలోకింపుడు.

"ప్రతిష్ఠాహ్యేషా యద్బ్రహ్మ తస్యాంప్రతిష్ఠాయాం ప్రతిష్ఠితోఽత ప్యత సోఽపోఽసృజత వాచఏవలోకాత్ వాగేవసాఽసృజత సాఇదంసర్వ మాప్నో ద్యదిదంకించ యదాప్నో త్తస్మాదాపః యదావృణో త్తస్మాద్వా (శత)"

విస్తర మగుచున్నది. ఆ యీ విషయముల విశద రూప ణము మరొకచో జూచుకొందము. ప్రస్తుతము 'వేదవాక్కునుండి మొదట నబుత్పత్తి యైనద'నియే చెప్పదలచినది. ఆవేదవాక్కే అన్నిటికి జనని. ఈ మనువచనముల జూడుడు.

"సర్వేషాంతుసనామాని కర్మాణిచపృథక్పృథక్
వేదశబ్దేభ్యఏవాదౌ పృథక్సంస్థాశ్చనిర్మమే
చాతుర్వర్ణ్యంత్రయోలోకాః చత్వారశ్చాశ్రమాఃపృథక్
భూతంభవ్యం భవచ్చైవ సర్వంవేదాత్ప్రసిద్ధ్యతి."

ఈ రెండవదగు నాపోమయ మండలము 'పరమేష్ఠి'యనబడును. అనంతర మాపోఘర్షణచే నా యాపోమయ సరస్వాన్నామక మహా సముద్రమం దప్పరమాణువులు యజ్ఞ వరాహమూర్తియగు వాయువుచే గ్రసుముగ ఘనీభూతములై సముద్రకేంద్రమున బ్రజ్వలితములై మండలాకారత నొందును. ఈయగ్ని పిండము నుద్దేశించి మనువు 'తాసువీర్య మవాసృజత్' అనియెను. ఈ మూడవది వాఙ్మండలము. సూర్యాత్మకము. ఈ వాక్కుచే ఋగ్యజు స్సామాత్మిక యగు త్రయీవిద్య యావిర్భవించెను. బ్రహ్మ నిశ్శ్వసిత వేదముకంటె వేరగు నిది గాయత్రి మాతృక వేదము. వేదోపాదానత చేతనే యీ సౌరీవాక్కు- వేదమాతయని కృష్ణశ్రుతి వచించెను :-

"వాగక్షరంప్రథమజా ఋతస్య । వేదానాంమాతాఽమృతస్యనాభిః
సానోజుషాణోపయజ్ఞమాగాత్ । అవన్తీదేవీసుహవామేఽస్తు."

ఈ శతపథ బ్రాహ్మణ వచనముగూడ జూడుడు :-

"సాయాసావాక్-అసౌస ఆదిత్యః సఏషమృత్యుః తస్మాద్యత్కించి దర్వాచీనమాదిత్యాత్ సర్వంతన్మృత్యునాఽఽప్తమ్ తదేతన్మండలంతపతి తన్మహదుక్థమ్ తాఋచః సఋచాంలోకః అథయదేతదర్చిర్దీప్యతే తన్మహావ్రతమ్ తానిసామాని ససామ్నాంలోకః యఏషఏతస్మిన్ మండలే పురుషః సోఽగ్నిః తానియజూంషి సయజుషాంలోకః సైషాత్రయ్యేవ విద్యాతపతి తద్ధైత దవిద్వాంస ఆహుః-త్రయీవాఏషా విద్యాతపతీతి".

పిమ్మట సౌరరశ్మి ఘర్షణవలన మరల నింకొక యాపస్సు పుట్టి 'వేన'రూపమున సూర్యమండల(Solar system)వ్యాప్తమై 'మరీచు' లనబడుచున్నది. 'అంభస్సు' అని ప్రసిద్ధి నొందిన పారమేష్ఠ్యాపస్సు గంగారూపమున బరిణమించునట్లు ఈ మరీచులు యమునారూపమున బరిణతము లగును. చాక్షుష కృష్ణనామ ప్రసిద్ధసౌరకృష్ణునకు యమునతో నిత్యసంబంధ ముండును. గంగకు విష్ణువుతో సంబంధము. ఆ యీ సౌర మండలస్థమగు నర్ణవనామ ప్రసిద్ధాపో సముద్రమునందు రుద్రాగ్ని ప్రవేశము వలన, నా యాపస్సుల శైత్యము నశించుట వలనను అగ్ని యొక్క తాపక్షయము వలనను అనుష్ణశీతమగు మూడవద్రవ్యము పుట్టిల్లుచున్నది. అది పృథివీ మండల మనబడును. అది రాసాయనిక ప్రక్రియద్వారా, క్రమముగ (1) ఆపస్సు, (2) ఫేనము, (3) ఊషస్సు, (4) సికతా, (5) శర్కరా, (6)అశ్మ (7) అయస్సు, (8) హిరణ్యమని యెనిమిది వ్యాహృతులు గలది. కనుక 'అష్టాక్షరావై గాయత్రీ' యను శబ్దరూపగాయత్రీ ఛందస్సాదృశ్యమువలన దీనిని గాయత్రి యని వైజ్ఞానికులు పలుకుచుందురు. ఈ శ్రుతివచనము జూడుడు :-

"దేవాశ్చవా అసురాశ్చ ఉభయే ప్రాజాపత్యాః పస్పృధిరే తాన్ స్పర్ధమానాన్ గాయత్రీ అంతరాతస్థౌ యావై సాగాయత్రీ ఆసీత్ ఇయంవై సాపృథివీ ఇయంహవై తదంతరాతస్థౌ" ఇతి (శత)

పృథివీగర్భస్థమగు నమృతాగ్నియే అంతరిక్ష మందంతటను వ్యాప్తమైయున్న సోమాత్మకమగు నన్నమును భక్షించు

చున్నది. ఈ సోమాహుతిరూప యజ్ఞముచే, కేంద్రప్రతిష్ఠితుడై యుండి యమృతాగ్ని రూపుడగు భగవంతుడు ప్రజాపతి యీ పృథివీ మండలమును రక్షించుచున్నాడు. అతని విద్వాంసు లెఱుంగుదురను నీ వచనముం జూడుడు.

"తస్యయోనిం పరిపశ్యన్తిధీరాః తస్మిన్హ తస్థుః భువనానివిశ్వా"

ఇట్లు పృథివీ పిండస్థుడై యమృతాగ్ని రూపుడగు ప్రజాపతి సోమాన్నమును భక్షించును గనుక నీ పృథివీ మండలము శరీర శారీరాభేమువలన నన్నాద మండల మనబడును. భోక్త-యన్నాదు డనుట వైదిక పరిభాష.

నాలవదగు నీ పృథివీ మండల మందలి యత్రినేత్రము నుండి అనగా పారదర్శిత్వ ప్రతిబంధకాత్రి ప్రాణమునుండి సోమోత్పత్తి కలుగుచున్నది. ఈ బ్రహ్మాండ వచనము జూడుడు :-

"ఊర్ధ్వ మాచక్రమే తస్య సోమత్వం భవి తాత్మనః
నేత్రాభ్యా మస్రవత్ సోమః దశధా ద్యోతయన్ దిశః"

ఆయీ యత్రివిషయ వివేచనము వేరొకచో విస్పష్టము. ఇట్లత్రిప్రాణమునుండి పుట్టిన సోముడే యన్నమండలము అయినది. అతడే అగ్నికి అన్నము. ఈ వచనముం జూడుడు.

"తేదేవా అబ్రువన్ నవా ఇమ మన్యత్ సోమా ద్దినుయాత్
సోమమే వాస్మైసంభరామ తస్మై సోమం సమభరత్ ఏషవై
సోమోరాజా దేవానా మన్నం య చ్చంద్రమాః" (శత)

ఇట్లు 1. ప్రాణము, ప్రజాపతి, స్వయంభూ, 2. ఆపస్సు, పరమేష్ఠి, విష్ణువు. 3. వాక్కు, ఇంద్రుడు, సూర్యుడు,

4. అన్నాదమగ్ని, 5. అన్నము సోముడు, ఈ పంచ దేవతలు దర్శపూర్ణమాసయజ్ఞముచే సర్వామునయ్యెను. ఈ శాతపథీ వాక్కులల నవలోకింపుడు.

"తావా ఏతాః ప్రజాపతే రధిదేవతా అసృజ్యంత అగ్నిరింద్రః సోమః పరమేష్ఠిప్రాజాపత్యః సఆపోఽభవత్ ఆపోవా ఇదంసర్వం తా యత్ పరమేస్థానే తిష్ఠన్తి తస్మాత్పరమేష్ఠీ నామ సప్రాణో ఽభవత్ ప్రాణోవా ఇదంసర్వం యద్వైకించప్రాణి సప్రజాపతిః సావాగభవత్ వాగ్వాఇదం సర్వం తస్మాదాహు రింద్రోవాగితి అన్నాద ఏవాగ్ని రభవత్ అన్నం సోమః అన్నాదశ్చవా ఇదంసర్వ మన్నంచ తావా ఏతాః పంచదేవతాః ఏతేన కామప్రేణ యజ్ఞే నాయజంత."

అనగా :- "స్వయంభూ, పరమేష్ఠి - సూర్య - పృథివి - చంద్రులను నివి భౌతిక పిండములు. స్వాయంభువాకాశము. పరమేష్ఠి వాయువు, సూర్యుడు తేజస్సు. పృథివి మృత్తు. చంద్రుడాపస్సు ("అప్స్వంతరా సుపర్ణో ధావత్తే దివి") ఈ భూత పిండములందు క్రమముగ బ్రహ్మ, విష్ణు, ఇంద్ర, అగ్ని, సోములను దేవతలు ప్రతిష్ఠింపబడిరి. 1. బ్రహ్మ ప్రాణమయుడు. 2. విష్ణు వాపోమయుడు, 3. ఇంద్రుడు వాఙ్మయుడు, 4. అగ్ని అన్నాదుడు. 5. సోముడన్నము" అని యర్థము.

ఈ మండల పంచకము ప్రకారాంతరముగ భూత పంచకమే. ఈ భూతప్రపంచమునే భగవంతుడు గీతయందు మొదటివాడగు క్షరపురుషునిగ జెప్పెను. ఆ క్షరాధార భూతుడు, బ్రహ్మ విష్ణ్వింద్రాగ్నిసో మాత్మకుడు, సాంఖ్యదర్శనమున నవ్యక్తనామ ప్రసిద్ధుడు (అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః) శారీరక దర్శన

మున 'సేతు' నామముచే ప్రసిద్ధుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి, సర్వవిత్, కనుకనే సర్వసృష్టి ప్రవర్తకుడు నగు. రెండవ వాడక్షర పురుషుడు. సర్వాధార భూతుడగు నీ మధ్యమ పురుషుడు :-

"ఏతదాలంబనంశ్రేష్ఠ మేతదాలంబనం పరం
ఏతదాలంబనంజ్ఞాత్వా యోయదిచ్ఛతితస్యతత్"

అని యుపవర్ణింపబడెను. ఇక ఆనంద విజ్ఞాన మనః ప్రాణ వాగ్భేద భిన్న పంచ కళలు గల మూడవ వాడవ్యయుడను నుత్తమ పురుషుడు. ఈ విధముగ 1. సర్వభూతములును క్షరుడు. అతడువిశ్వోపాదాన కారణభూతుడు. 2. భూతకోటిపై ప్రతిష్ఠితమగు తత్త్వ మక్షరుడు. అతడు నిమిత్త కారణభూతుడు. 3. ఈ యిరువురి కాలంబనభూతు డవ్యయుడు. ఈ త్రిపురుష పురుషాత్మక విజ్ఞానమును గురించి భగవంతు డిట్లు చెప్పెను.

"ద్వావిమౌపురుషౌలోకే క్షరశ్చాక్షరఏవచ
క్షరఃసర్వాణిభూతాని కూటస్థోఽక్షరఉచ్యతే
ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయఈశ్వరః"

ఇందు పంచకళాత్మకక్షరుని ప్రథమ కళయగు బ్రహ్మకు ప్రాణాక్షరునితోడను, జలమునకు విష్ణువుతోడను, వాక్కునకింద్రునితోడను, పృథివి కగ్నితోడను, అన్నమునకు సోముని తోడను సంబంధము. ఇట్లు ఈ పంచ మండలములును బ్రహ్మ-విష్ణు-ఇంద్ర-అగ్ని - సోమ మండలములని ప్రసిద్ధి నొందినవి. 1. బ్రహ్మాక్షరమయ మండలము ప్రాణమయము. 2. విష్ణ్వక్షరమయ పరమేష్ఠిమండల మాపోమయము. 3. ఇంద్రాక్షరమయ

సూర్యమండలము వాఙ్మయము. 4. అగ్న్యక్షరమయ పృథివీ మండల మన్నాదము. 5. సోమమూక్షరమయ చంద్రమండల మన్నమయము. ఈ విధముగ ప్రాణాపోవా గన్నాదాన్నాత్మక స్వయంభూ పరమేష్ఠి సూర్యచంద్ర పృథువులను మండల పంచక సమష్టియే యాధిదైవిక మండలమని యెఱుంగ వల యును. దీనిచే మర్త్యభావ ప్రధానము. పృథివ్యప్తేజో వాయ్వా కాశాత్మకము నగు నాధి భౌతిక మండలముయొక్క యుత్పత్తి కలుగుచున్నది. ఆ మండలమందు స్వయంభ్వాదులు క్రమముగ గుహా, ఆపః, జ్యోతిః, రసః, అమృతమ్, అను నీ పేరులచే నొప్పును. అనగా: గుహా=స్వయంభూ, ఆపః=పరమేష్ఠీ, జ్యోతిః=సూర్యః, రసః=పృథివి, అమృతం=చంద్రః ఈ యాధి భౌతి కాధిదైవిక సంమిశ్రణముచే నాధ్యాత్మిక మండల ముద యించును. ఇందు అవ్యక్తాత్మ=స్వయంభూ, మహానాత్మ= పరమేష్ఠి, విజ్ఞానాత్మ (లేక) బుద్ధి=సూర్యుడు, ప్రజ్ఞానాత్మ (లేక) మనస్సు=చంద్రుడు, శరీరము=పృథివి.

అన్నిటికి దిగువది పార్థివశరీరము. దానికింద్రియములు, వానికింద్రియార్థములు, వానికి జంద్రాత్మక మగు మనస్సు, దానికి సూర్యాంశభూత విజ్ఞానాత్మక యగు బుద్ధి, దానికి బర మేష్ఠ్యంశభూత మహానాత్మ, దానికి స్వయంభూరూప మగు నవ్యక్తము, దానికి ఆత్మ క్షరాక్షరావ్యయ రూప షోడశీ పురుషుడు పరములు. పురుషునికంటె బరమేదియు లేదు. ఈ యాధ్యాత్మిక క్రమిక విజ్ఞానమున కాఠకశ్రుతి యిట్లు వర్ణించెను.

"ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చపరం మనః
మనసస్తుపరాబుద్ధిః బుద్ధేరాత్మామహాన్పరః
మహతఃపరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః
పురుషాన్నపరం కించిత్ సాకాష్ఠాసాపరాగతిః"

ఇందువలన నాధిదైవికమందున్న పదార్థములే యాధ్యాత్మిక ప్రపంచమునందు గూడ చక్కగా నివిష్టములై యున్నట్లు సిద్ధ మగుచున్నది కనుకనే శ్రుతియు :

"యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ
మృత్యోః సమృత్యు మాప్నోతి యఇహ నానేవపశ్యతి
పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అనియెను.

పదార్థమాత్రముయొక్క మౌలికతత్త్వములు ప్రాణములు. అవియే ఋషులు. వానినుండి జనించిన పారమేష్ఠ్య సౌమ్యప్రాణములు పితరులు. వానినుండి పుట్టు నాగ్నేయప్రాణములు దేవతలు. ఆప్యప్రాణములసురులు నని వైదిక సామాన్య పరిభాష. ఈపూర్వోక్త ప్రాణవోవాగాది రూప సృష్టిక్రమమును వర్ణింపుచు మనువు ఇట్లు చెప్పెను.

"ఋషిభ్యః పితరోజాతాః పితృభ్యోదేవదానవాః
దేవేభ్యశ్చజగత్సర్వం చరంస్థాణ్వనుపూర్వశః"

ఇంతకు: బ్రాణమండ లానంతరము అనగా స్వాయంభూమండ లానంతరము పరమేష్ఠిమండల మను రెండవది కలదు. అది విష్ణ్వక్షర సత్తచే విష్ణువను పేర బ్రసిద్ధము. సూర్యమండ

లముకంటె బరమస్థాన స్థిత మగుట బరమేష్ఠి నాబడుచున్న దని తేలినది.

ఈ పంచమండలము లందును భిన్నభిన్న జాతీయపదార్థములు పుట్టుచున్నవి. వాని వల్లనే ఆయామండలముల స్థితియు గలుగుచున్నది. కనుక నీ పదార్థములు 'మనోతా' లందురు. కలయన వానియం దాయామండలముల మనస్సు లోతము లగును. కనుక నట్లు చెప్పబడినవి. ఈశ్రుతిం జూడుడు.

"త్రయోవై దేవానాం మనోతాః, తస్యామేవ తేషాంమనాంస్యోతాని. వాగ్వైదేవానాం మనోతా, తస్యాంహితేషాం మనాంస్యోతాని. అగ్నిర్వైదేవానాం మనోతా, తస్యాంహితేషాం మనాంస్యోతాని" (ఐత.బ్రా)

ప్రతి మండలము నందును మనోతాత్రయము పుట్టుచున్నది. 1. ప్రాణమయ స్వయంభూ మండలమందు వేదములు, సూత్రము, నియతి, యని 2. ఆపోమయ పరమేష్ఠి మండలమున భృగు, అంగిరా, అత్రి, యని 3. జ్యోతిః, గౌ, ఆయువు అని వాఙ్మయ సూర్యునందును, 4. రేతస్సు, శ్రద్ధ, యశస్సు అని అన్నమయ చంద్రునందును, 5. వాక్, గౌ, ద్యౌ, అని యన్నాదాత్మక పృథివియందును ఇట్లు అయిదింటియందును మూడు మూడు చొప్పున పదునైదు సంపన్నము లగును. ఇంతకంటె నన్యమేమియు లేదు. కనుకనే ఛాందోగ్యమునందు :

యాని పంచధా త్రీణి త్రీణి. తేభ్యో నజ్యాయః పరమన్యదస్తి
యస్తద్వేద సవేద సర్వం. సర్వాదిశో బలిమస్మై హరన్తి."

అని చెప్పబడినది. ఈ మనోతాలయందు ప్రస్తుతము పరమేష్ఠి మండలమునకు జెందిన భృగ్వంగిరోఽత్రులను వానితోడనే మనకు బని కలదు. 1. ఘన-తరళ-విరళావస్థా త్రయ భేదముచే ఆపగ, వాయు, సోమ యని మూడు భృగువులు. 2. అగ్ని, యమ, ఆదిత్యులని మూవు రంగిరసలు. 3. మూడవదగు నత్రి ప్రాణము భృగ్వంగిరులట్లు మూడు తెరగులు కానందున 'నత్రి' యందురు. ఆధునికు 'లాక్సిజన్' అనునది పై జెప్పిన పవమాన భార్గవవాయువే. ఈ భృగ్వంగిరాత్మకమగు నాపోమయ పరమేష్ఠి మండలముం గురించి శ్రుతి యిట్లనియెను :

"ఆపో భృగ్వంగిరో రూప మాపో భృగ్వంగిరోమయం
అంతరైతే త్రయోవేదాః భృగూనంగిరసః శ్రితాః"

ఇట్లీ యాపోమయ పరమేష్ఠి మండలమం దుత్పన్నమగు సోమము విశ్వజాత పదార్థములను పవిత్రములను గావించుచున్నది. దూషిత పరమాణువులను వెంటనే పవిత్రములుగ జేయుశక్తి దీనికే కలదు. ఈ సోమము "తృతీయస్యాం వై దివి సోమ ఆసీత్" అను శ్రౌత వచనముచే సూర్యునికంటె బైనున్న మూడవ స్వర్గము నం దుండుచున్నది. ఈ పవిత్ర సోమమునే బ్రహ్మణస్పతియని వ్యవహరింతురు. ఈ వచనము జూడుడు :

"పవిత్రంతేవితతం బ్రహ్మణస్పతే। ప్రభుర్గాత్రాణిపర్యేషివిశ్వతః
అతప్తతనూర్నతదామో అశ్నుతే। శృతాసఇద్వహన్తస్తత్సమాశత.
(ఋక్ 9-83-1)

అర్థము :— ఓ బ్రహ్మణస్పతి ! తే పవిత్రం వితతమ్=నీ తేజము వ్యాప్తమై యున్నది ; ప్రభుః=ప్రభువగు నీవు, గాత్రాణి =వస్తుజాతమును, విశ్వతః=అంతటను, పర్యేషి=పరివేష్టించు చున్నావు, అతప్త తనూః=తాపరహితము, అగ్ని పరమాణు రహితమునగు వస్తువు, ఆమః=అపరిపక్వమగునది (ఆ పవిత్ర తేజమును) నాశ్నుతే=పొందదు. అనగా సోమమాత్ర లల్పతమ ములుగ నుండును. కాని, శ్రుతాసః=పరిపక్వ వస్తువులు, ఆపవి త్రమును, వహంతః తత్ సమా శత : వహించి వ్యాప్తము లగును :

అనగా : పక్వ పదార్థములం దీసోమమంతట బరివేష్టించి యుండును. అపక్వ పదార్థము లందిది యంతగా నుండదని భావము.

ఈ సోమము దూషిత పరమాణువులను నాశము గావిం చును. దీనిం ద్రాగినచో బుద్ధి వృద్ధినొందును. గౌరూప సూర్య రశ్మల నుత్పాదించును. ప్రకాశమును గల్గించును. ఓషధులను పోషించును. సోమముయొక్క యీ గుణము లన్నిటి గురించి మహర్షి యిట్లనుచున్నాడు :

"సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః
జనితాగ్నేః జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితోత విష్ణోః
త్వమిమా ఓషధీః సోమ విశ్వాః త్వమపో అజనయ స్త్వం గాః
త్వమాతతన్ థోర్వంతరిక్షం త్వంజ్యోతిషా వితమోవవర్థ" ఇత్యాది.
(ఋక్)

ఈ పవిత్ర సోమము అంభస్సు. ఆపస్సు పరమేష్ఠిమండలమునుండి యవతరించుచున్నది. అదియే గంగావతారము. అనగా: ఈ యంభోమయ సోమము సూర్య మండలముం భేదించి యా ద్వారమున మన భూమండలమునకు వచ్చి యంతటను వ్యాప్తమగుచున్నది. సూర్యు డాగ్నేయ ప్రాణ సమూహము గదా: కనుక పరమేష్ఠినుండి వచ్చిన, అంభోమయము, శైత్య ప్రధానమునగు సోమమునకు, సౌరాగ్నేయ ప్రాణమునకు బరస్పర విరోధము వలన నా రెంటికి సంఘర్షణ పుట్టును. చివరకు సూర్య రశ్మ్యవచ్ఛిన్నములగు నాగ్నేయ ప్రాణములు అంభోమయ పవిత్ర సోమము నుత్తర దిశకు విసరివేయును. అందువలన నది సౌమ్యదిక్కు అనబడుచున్నది. దానికి లోకపాలుడు సోముడే. అట్లు విక్షిప్తమైన సోమము చంద్ర మండలముద్వారా ఉత్తర దిశయందున్న స్థూలాపస్సులతో గలసి యటనుండి హిమాలయ పర్వతమునుండి వెడలుచున్నది. సోమమయియగు నా నదియే త్రిపథగ, భగవతి, భాగీరథి, గంగ యనబడుచున్నది. సోమము మొదట సూర్యునొంది యటనుండి తిర్యక్రక్షిప్తమై యుత్తరముం జేరి యటనుండి మరల పృథివిం జేరుచున్నది, గనుక త్రిపథగ యనదగును. పరమేష్ఠి విష్ణువని పూర్వ మనుకొంటిమి. అందుండి యిది పుట్టుటచే విష్ణుపది యనవచ్చును.

ఇక: సూర్య మండలమును భేదించుకొని సూర్యోపరి పరమేష్ఠిరూప సామదాత్మక గోసవనామ ప్రసిద్ధ గోలోకమునకు

బోవు నాత్మ మరల తిరిగిరాదు. దాని కదే ముక్తి. ఆ స్థానము నందే గాంగేయ సోమ ముండును. ఈ గంగా తోయమందు నదే యున్నది. కనుక నట్టిశక్తియే దీనివలనను గలుగును. అనగా నాత్మ సూర్యభేదన సమర్థమగును. కనుకనే అట్టి ముక్తి ప్రదమగు గంగాతోయమం దాత్మ సమర్పణమున దన్ను గృతకృత్యునిగా నెంచు ధన్యు డిట్లనుచున్నాడు :

"కాకైర్నిష్కుశితం శ్వభిఃకబళితం గోమాయుభి ర్లుంఠితమ్
స్రోతోభిశ్చలితం తటాంబులులితం వీచీభిరాందోళితం
దివ్యస్త్రీకర చారుచామర మరుత్ సంవీజ్యమానః కదా
ద్రక్ష్యేఽహం ? పరమేశ్వరి ! త్రిపథగే ! భాగీరథి ! స్వంవపుః."

# స్త్రీ స్వాతంత్ర్య - పారతంత్ర్యములు

యజ్ఞమునందు బత్నీసన్నహన మను కర్మ యున్నది. అనగా "యజ్ఞవస్త్రో బత్నీం గూర్చుట." దీనింగూర్చి సంగ్రహముగ దెలిసికొందము. యజమాన పత్నియే పత్ని. ఏల యన:—"పత్యుర్నో యజ్ఞసంయోగే" యను పాణినీయ వచనము ననుసరించి యజ్ఞసంబంధము వల్లనే పత్నీ శబ్దము నిష్పన్న మైనది. కనుక పత్నీశబ్దమే యీ యర్థమును సూచించును. ఈమెకు యజ్ఞముతో దప్పక సంబంధము గూర్చవలయును. పత్నిలేని యజ్ఞ మపూర్ణ మగును. ఎట్లన:—ప్రాకృతిక నిత్య మగు నాధిదైవిక యజ్ఞముం జూడుడు. యజ్ఞమువలన సృష్టి యను ప్రజోత్పత్తిం జేయ నెంచిన ప్రజాపతి తన శరీరమును పతి—పత్నీరూపమున రెండుగా భాగించుకొనెను. ఈ మిథునభావముననే విరాట్ప్రజోత్పత్తి యైనది. ఈ మనువచనము జూడుడు.

"ద్విధాకృత్వాత్మనో దేహం అర్ధేన పురుషో ఽభవత్
అర్ధేననారీ తస్యాం స విరాజ మసృజత్ ప్రభుః"

స్వయంభూప్రజాపతి వేదమూర్తి. వేదము ఋగ్యజుస్సామ భేదముచే మూడువిధములు. ఇందు యజుస్సు వాస్తవమున యజ్జూ. (యత్-జూ) యత్ భాగము వాక్కు. ఇదే అగ్ని. యాజ్ఞికపరిభాషచే దీనిని 'సార్వయాజుషాగ్ని' యందురు. వైజ్ఞానికులు సత్యాగ్ని యందురు. ఇక జూ భాగము ప్రాణము. ఇది

వాయువు. ఈ వాక్ప్రాణ(అగ్ని + వాయు)మూర్తి యజ్ఞూ లేక యజుర్వేదమూర్తి స్వాయంభూ ప్రజాపతి ఋక్సామరూప ఛంద ములచే నిత్యముగ ఛందితుడు (వేష్టితుడు)గ నుండును. యజుస్సే స్వాయంభూప్రజాపతి శరీరము. ఈయజుర్మయ శరీరము యొక్క యత్ రూప వాగగ్ని భాగము జూరూప వాయువ్యాపా రముచే గొంతభాగము ద్రుతమై (కరిగి) పోవును. అగ్నిపై వాయువు ప్రసరింపగా (ఒత్తుకలుగగా) నా యగ్ని నీరగునని, "అగ్నేరాపః" అను వచనము స్పష్టీకరించును. గ్రీష్మానంతరము వర్షాగమున మీ సిద్ధాంతమునే యనుసరించును. ఇట్లు ప్రజాపతి వాగ్భాగ మూంశికరూపమున జలము (పారమేష్ఠ్యసోమము)గ నగునుగనుకనే 'సోఽపోఽసృజత వాచ ఏవ లోకాత్, వాగే వసాఽసృజ్యత' అని శతపథశ్రుతి వచించెను.

వాఙ్మయ శరీరముయొక్క అగ్ని-సోము లను నీరెండు భాగములే పతి-పత్నులు. అగ్ని పతి. సోమము స్త్రీ. ఈరెంటి మిథునభావముచే సూర్యరూప విరాట్పురుషుడు జనించెను. సౌరసంవత్సర మందును ఈదాంపత్య భావమే కలదు. సంవ త్సర మందలి యారు ఋతువులలో వసంతగ్రీష్మ-వర్ష ఋతువులు మూడు ఆగ్నేయములు. శరత్ హేమంత, శిశిరములు మూడు సౌమ్యములు. ఈరెంటి సమన్వయమునను సంవత్సరయజ్ఞ స్వరూపము నిష్పన్నమగును. దీనివలన పార్థివప్రజ లుత్పన్ను లగుదురు. పార్థివప్రజ యందు నీ మిథునభావము కలదు.

శుక్రముసౌమ్యము. శోణిత మాగ్నేయము. ఈరెంటి సమన్వయముచే ప్రజోత్పత్తి. ఇట్లు (1) స్వాయంభువ (2) సాంవత్సర (3) ఆధ్యాత్మికయజ్ఞములు మూటియందును దాంపత్యభావ మున్నది. ఈపరిలేఖను జూడుడు :—

దాంపత్యభావపరిలేఖ :-

| అగ్ని-పురుషుడు. | సోమము-స్త్రీ. | యజ్ఞము. |
|---|---|---|
| వాక్కు | + ఆపస్సు | స్వాయంభువయజ్ఞము |
| వసంత, గ్రీష్మ-వర్షములు | + శరద్దేమంతశిశిరములు | సంవత్సరయజ్ఞము |
| శోణితము | + శుక్రము | ఆధ్యాత్మికయజ్ఞము. |

అగ్నిషోమాత్మకమగు నీయజ్ఞమును ప్రకారాంతరమున జూతము. సంవత్సరమండలమున సూర్యచంద్రులు ప్రధానగ్రహములు. సూర్యు డాగ్నేయము, చంద్రుడుసౌమ్యము. విషువద్వృత్త కేంద్రమందు సూర్యు డున్నాడు. మన ఖగోళ స్వరూప సంపాదక మీవిషువన్మండలమే. దీనివలననే మన స్వరూపము నిర్మింపబడినది. సంవత్సరమును మహాసుపర్ణ డంకురు. అయనములురెండు నితనికి రెండుపక్షములు. మధ్యస్థ విషువద్వృత్త మాత్మ. పూర్వదిఙ్ముఖముగ నిలువుడు. పూర్వ భాగము నందు దృశ్యఖగోళీయ (సూర్యయుక్త) విషువత్తును, పశ్చిమమునం దదృశ్య (చంద్రయుక్త) విషువత్తును ఉండును. అందొకటిపురుషుడు, రెండవదిస్త్రీ. ఆరెంటిసమష్టిరూప మగు విషువద్వృత్తీయ పూర్ణఖగోళము సంవత్సరరూప యజ్ఞప్రజాపతి. ఇందు పురుషనిర్మాణము సూర్యప్రధాన దృశ్య ఖగోళము

చేతను, స్త్రీనిర్మాణము చంద్రప్రధా నాదృశ్యఖగోళముచేతను అగును.

పురుషుని వెన్నెముక విషువద్వృత్తము. కాని, అర్ధ విషువద్రసమే వచ్చును. కనుకనే వెన్నెముకనిర్మాణము నలువైపులను వృత్తరూపముగ లేదు. సగమగు నదృశ్య భాగము స్త్రీయొక్క నిర్మాణము గావించును. అనగా అర్ధాకాశము పురుషాధికారమునకును, అర్ధాకాశము స్త్రీయధికారమునకును వచ్చును. ఒక సంవత్సరాకాశమే పురుషుడుగ స్త్రీగ విభక్తమైనది. కనుకనే స్త్రీ నర్ధాంగి యందురు.

పురుష శూన్యార్ధాకాశ పూర్తి స్త్రీవలన నగును. అది లేకున్న యజ్ఞస్వరూప మపూర్ణము. 'దేవో భూత్వా దేవం భావయేత్' అని నిర్ణయము. సంవత్సరరూప యజ్ఞదేవ ప్రాప్తికై యజ్ఞకర్త మొదట యజ్ఞరూపి కావలయును. అందుకు పత్నీయోగము కావలయును. దానితో బూర్ణుడై పూర్ణేశ్వర (యజ్ఞవిష్ణువుయొక్క సంబంధమునొంద నధికారి యగును. అటుగాక పత్ని లేని యజమాని యజ్ఞకర్మ ప్రవృత్తుడగునో నొక సంవత్సరములోపలనే మృత్యువు వాతబడును. సగము వేడిమెక్కిన యుద్దము ముక్కలగును గాని నిలువదు గదా! కనుక పత్నీసన్నహన మత్యావశ్యకము.

సూర్యోపలక్షిత ద్యులోకము తండ్రి. చంద్రోపలక్షిత పృథివీలోకము తల్లి. రెంటిసమష్టియు ద్యావాపార్థివ యజ్ఞము.

పృథివి పశ్చిమార్ధము. ద్యులోకము పూర్వార్ధము. ద్యురూప సూర్యోత్పన్న పురుషుడు యజ్ఞమునకు బూర్వార్ధము. పృథివ్యుపలక్షిత చంద్రప్రధాన స్త్రీ యజ్ఞమునకు జఘనార్ధము. (పశ్చిమార్ధము) ఇది లేనిచో యజ్ఞ మర్ధముగనే యుండును గాని పూర్ణముకాదు. ఈ శ్రుతులను జూడుడు:-"అర్ధో అర్ధోవా ఏషఆత్మనక - యత్పత్నీ" "అయజ్ఞోవా ఏష యోఽపత్నీకః" "సోఽయమాకాశః పత్న్యా పూర్యతే" యజ్ఞాధికారి పురుషుడు. పత్ని లేకున్న యజ్ఞము జరుగదు. ఈ యజ్ఞావశ్యక ర్తవ్యతం గురించియే పురుషునకు బహువివాహావిధానము శాస్త్రసిద్ధముగ నెంచబడినది.

యజ్ఞ పశ్చిమార్ధము పత్ని. యజమానుని యజ్ఞము పశ్చిమమునుండి పూర్వమునకు వితతమై నాచికేత స్వర్గమున ప్రతిష్ఠిత మగును. పత్ని లేనిచో పశ్చిమభాగము లేదు. అది లేక ప్రతిష్ఠా విరహితమగు యజ్ఞము పూర్వదిక్కున కరుగుట కాధార మేది? కనుక యజ్ఞ వితానమునకు పూర్ణతా లక్షణ సమృద్ధి కొరకు పత్నీ సన్నహన మత్యంతావశ్యకము. కనుకనే శ్రుతి 'జఘనార్ధో వా ఏష' ఇత్యాదిగా జెప్పినది.

పత్నీయోగము సాధారణముగ గాక, యోక్త్రముతో (పలుపుతో) కట్టబడును. పలుపనగా బారిపో వీలు లేనంత గట్టిగా బంధించునది. ఏమిది? స్త్రీ సోమ ప్రధానత గలది గదా! సోమము ఋతతత్త్వము. కనుక సత్యభావ శూన్యము. అందు

వలన నిత్యము స్త్రీని నిగ్రహించి యుంచవలయును. దీనింబట్టియే శాస్త్రకారులు స్త్రీస్వాతంత్ర్యమునకు విరోధము జూపిరి. స్త్రీ యొక్క బాల్య యౌవన వార్ధకములందు పితా, పతి, పుత్ర బంధము లేర్పరచిరి ఋతభావ మందాత్మ ప్రతిష్ఠ లేదు. అది భోగ్య వస్తువు. కనుక సర్వదా సంరక్షణీయము. దానికి బర ప్రతిష్ఠ కావలయును. ప్రతిష్ఠాసూత్ర మందుండియు తన ఋత భావమువలన స్త్రీ యుచ్ఛృంఖలయై పోవుచుండును. ఇకప్రతిష్ఠా సూత్రమే లేకున్న జెప్పవలయునా?

ఋతప్రధాన - అనృత రూపయగు స్త్రీయొక్క ఈ యప్రతిష్ఠాభావ రక్షణకొరకు, అనగా స్వతంత్ర ప్రవృత్తిని పర తంత్రము గావించి సీమితము సేయుటకే పత్నీ సన్నహాన కర్మ సేయబడును. ఇందుకు సాధనముగు యోక్త్ర బంధనముచే, యజమానపత్నియొక్క సౌమ్యావృత్తి శాంతించును. ఋతము నకు బదులు సత్యభావము చేకూరును. అప్రతిష్ఠ ప్రతిష్ఠారూప మున బరిణతి గాంచును. అనృతము, అయజ్ఞియము నగు భావము సత్యయజ్ఞరూపముగ బరిణత మగును. యజమానుని యర్ధాకాశము పరిపూర్ణమగును. పూర్ణయజ్ఞమునకు పూర్ణ సమృద్ధి ప్రాప్తించును. సన్నహానమునకిది మౌలిక రహస్యము.

నేటి స్త్రీజాతి కీ శ్రౌత సిద్ధాంత మెంతయో కంటకముగ కళంకముగ దోచవచ్చును. శ్రుతియొక్క యీ సంకుచితదృష్టికి వేదభక్తులుకూడ "అయ్యో! ఈశ సృష్టియందు సామాన్య ప్రాణులకుగూడ స్వతంత్రముగ దిరుగుటకు జన్మసిద్ధాధికార

మున్నదే. ఇక సభ్యబుద్ధియుక్త మానవ సమాజస్త్రీవర్గమునెడ భగవదాదేశ రూపమగు నీ వేదములందు ఏ యాధారమున నీయమానుషిక సిద్ధాంతము లిపిబద్ధము గావింపబడెను" అనుకొందురు. నిజముగా నీ సమస్య జటిలము. సభ్యతా సంస్కృతులపై కళంక మాపాదించు నదియు నగును.

కాని, "ఎవని యుప్పుపులుసు తిందుమో వాని మాటాడవలయు" నను న్యాయముచొప్పున బ్రకృత సిద్ధాంతము నెదుట గతిలేక శిరము వంచవలసివచ్చును. ఇప్పుడు మన మీ విషయమున గేవల మొకటి చూడవలయును. మన పూర్వోక్త వేదభక్తి మన కల్పనా సీమితమా? లేక యందేమైన నిజమున్నదా? దాని బలమున గదా వేద విరోధులు వేద భక్తులును ఇట్టి సిద్ధాంతములకు క్షోభ నొందుచున్నారు? అంతఃకరణము కూడ నా సిద్ధాంతము వంక కాకర్షింపబడుచున్నది. రండు! ఈ స్వతంత్రతా - పరతంత్రతల మౌలికత్వముం గూర్చి తెలిసికొందము. విచార శూన్యమగు సామాన్య దృష్టి యొకొకప్పుడు మనలను మోసగించుచుండును. ఈ మోసమునం బడ్డ మానవీయమగు బుద్ధిమనస్సు సత్యము నసత్యమనుకొనుచుండుటలో నాశ్చర్య ముండదు కదా! మన మిట్టి ప్రమాదమునకు లోనగుచుంటి మేమో!

నేటి జనసమూహము నీ క్రిందివిధముగా భాగింపవచ్చును

1. (i) సనాతన ధర్మ్మలు, ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ధర్మము వంకబెట్టుకొని రూఢివాద సమర్థకులుగ నున్నారు.

తక్కినవారి నధర్ములనుచున్నారు. వీరిని ధర్మప్రేమగల సనాతన ధర్ములందుము.

(ii) సనాతన ధర్మోపదేశకులు:- ప్రచారకులు, ధర్మరక్షకులగు మహాంతులు, ఆచార్యులు, మఠాధీశులు, మౌలికరహస్య ప్రతిపాదనసేయు విజ్ఞానసిద్ధ వేదశాస్త్రముల నుపేక్షగా జూచుచు ధర్మ రక్షణకు వ్యర్థప్రమాణిత సంప్రదాయ భక్తిని సాధనముగా బెట్టికొని, సంస్కర్తలను సంతోషపెట్టుటకు తమ్ము నిరర్థకులుగ జేసికొనుచున్నారు. వీరిని ధర్మోపదేష్టలగు ధార్మిక నేతలందుము.

2. (i) సనాతనధర్ముల రూఢివాదశత్రువులగు సంఘ సంస్కర్తలు ప్రత్యక్షముగనో పరోక్షముగనో, సంస్కరణ నెపమున, శుద్ధాధర్మసమర్థకు లగుచున్నారు. ఇది పశ్చిమాడంబర భక్తిఫలము. ఆయాదర్శము లేకుండ వీరు మాటాడజాలరు. వీరిని సంస్కరణప్రేమగల సంస్కర్త లందుము.

(ii) సంస్కర్తృసమాజముయొక్క యుపదేశకులు, మార్గప్రదర్శకులు, నాయకులు, సంస్కరణమూలప్రాణరూప మౌలికధర్మ - మౌలికసంస్కృతి - మౌలిక సాహిత్యముల నుపేక్షించి-సమాజవ్యవస్థా సంచాలనమునకు - సర్వథా వ్యర్థప్రమాణిత కల్పనాభక్తిని సాధనముగ గొని వర్తమానయుగ ధార్మిక జనతా పరితోషమునకు దమ్ము నిరర్థకులుగా జేసికొనుచున్నారు. వీరిని మార్గదర్శక సమాజనేత లందుము. - చివరకు (1) ధార్మికవర్గము (2) సంస్కర్తృవర్గము అని రెండువర్గములుగ నెంచెదము.

ఈ రెండువర్గములు నుద్దేశ్యదృష్టితో సమాన పథాను యాయులే. ఎట్లన :—మనము, మనదేశము, మనసభ్యత - మన సంస్కృతి సురక్షితముగ నుండవలయుననియే ఈ యుభయుల యుద్దేశ్యము. ఇది యన్ని విధములచేతను మాన్యము. కాని, వింతయేమనగా, సమానోద్దేశ్యములుగల వీరుభయులును ఘోరవిరోధులుగ నగపడుచున్నారు. ధార్మికవర్గము సంస్కర్తృ వర్గమును సర్వనాశనప్రవర్తకమనును. సంస్కర్తలు ధార్మిక వర్గము నున్నతికి ప్రతిబంధక మందురు. ఇక (1) ఆదర్శభక్తు లయ్యు గర్మశూన్యమగు ధార్మికవర్గముయొక్క ధర్మప్రసారము క్రమముగా శైథిల్యము నొందుచున్నది. (2) కర్మపరాయణ మయ్యు నాదర్శశూన్యమగు సామాజికవర్గముయొక్క యుచ్ఛృంఖలత క్రమముగ వృద్ధింగత మగుచున్నది. ఈ విధముగా దేశము యొక్క జ్ఞానశక్తి - క్రియాశక్తులు రెండును రెండు స్వతంత్ర దళములందును విభక్తములై మూడవదగు నర్థశక్తికి మూలో చ్ఛేదకారణములై సర్వనాశప్రయోజకము లగుచున్నవి. ఇది యెఱింగిన యేభారతీయుని మనస్సు క్షోభ నొందదు?

ధార్మికవర్గము శాశ్వతధర్మములకు పరివర్తనశీలములగు దేశకాలపాత్రద్రవ్యాదులకు జెందిన తత్తత్సామయికాచార వ్యవహారములను ముడిపెట్టి వానిని గూడ సామయికములు గావించి వైచెను. గతసభ్యత లేక యాచార వ్యవహారములు దేశకాలాదుల పరివర్తనముచే స్మృతిగర్భ మందు విలీనము

లగుచున్నవి. క్రొత్తక్రొత్తవి వికాసము నొందుచున్నవి. శాశ్వత ధర్మముపై బలాత్కారముగ నా సామయి కాచారాదుల లేపము పూయబడుచున్నది. ఫలితమేమి కల్గినది ? ధర్మతత్త్వ మన్నివిధముల నంతర్హితమైనది. రూఢివాదమునకు ప్రాబల్యము మాత్రము మిగిలినది. శాశ్వతధర్మ మనిత్యమగు మతవాద మగుచు, పరమార్థ సాధనకు బదులు, కేవలము స్వార్థపోషకమై పోయినది.

మానవీయమన స్సెంతవరకు నీ తాండవనృత్యము సహించియుండును ? కావలసిన దేమో అయినది. కొందరు నేతలు జనుల నిట్లు హెచ్చరించుచున్నారు. "మీరు ధర్మ మనుకొన్నది వ్యాజధర్మము. ధర్మముచాటున రూఢివాదము చిగురులెత్తు చున్నది. ధర్మముయొక్క యీవేషమే మీ స్వాతంత్ర్య మపహరించినది" దీనిపరిణామము దేశము నెదుటనే యున్నది. ధర్మసంస్కరణము తీవ్రముగ ప్రారంభ మయ్యెను. కాని, ధర్మరహస్యభూతమగు మౌలికసాహిత్యము లేనందున నీసంస్కరణము బాహ్యావరణముతో బాటుగ గర్భిభూతమగు మౌలికతత్త్వముపై గూడ దెబ్బదీయ మొదలిడెను. కుళ్లిన యవయవభాగముం గోసివేయుచు విశుద్ధము సంరక్షకము నగు భాగముంగూడ గోసివేసినట్లయినది. 'ఆరికెలగోసిన చేతితో కంది కూడ గోయబడి'నట్లయినది, సంస్కర్తల యీతప్పును వారొప్పి కొనక తప్పదు. ఈవిధముగ, ఉన్న కొంచెము మౌలికతయు, నామావశేష పరిణతి నొందిపోయినది.

ప్రకరణ మప్రాసంగిక మయ్యు ప్రాసంగికమైనది. ప్రస్తుత ప్రశ్న స్త్రీస్వాతంత్ర్యము. స్వతంత్రతయందనన్య ప్రేమగల సంస్కర్తలు స్త్రీస్వాతంత్ర్యమును ప్రతిబంధించు నాదేశమును సహింపజాలరు. కారణమేమన :—వారిదృష్టిలో "నస్త్రీస్వాంత్ర్య మర్హతి"యను నాదేశము పురుషసమాజ స్వార్థవృత్తికి ద్యోతకము. ఋత-సత్యవివేచన సేయుచు బూర్వ మీ ద్యోతకత్వము యొక్క నిరర్థకత్వము గొంతవరకు జూప యత్నించి యుంటిమి కాని, యంతమాత్రమున వారికి సంతుష్టికాదు. కనుక నింకను కొంచె మీ సాధనసిద్ధికి బ్రయత్నింతము.

స్వ + తంత్రము = తనతంత్రము, అనగా ? స్వ యన నేమి ? తంత్ర మననేమి ? మొదట కోశకారు ననుసరింతము. 'స్వోజ్ఞాతావాత్మని' (అమర) అనుటంబట్టి స్వ యన జ్ఞాతియు, ఆత్మయు నని యర్థములు. జ్ఞాతయగు నాత్మయే జ్ఞాతిబంధువు. "యావద్విత్తం తావదాత్మా" అను వచనముచే విత్తపర్యంత మాత్మసత్త యంగీకరింప బడినది. బంధువర్గము లేదా జ్ఞాతివర్గ మంతర్విత్తమునం దంతర్భూత మైనది. కనుక వీరిని స్వ యన దగును. కనుక జీవర కాత్మయే స్వ శబ్దమునకు వాచ్యార్థ మగుచున్నది. మరియు శబ్దార్థక స్వనధాతువునుండి (స్వన = శబ్దే, భ్వాదిపర—సేట్) స్వశబ్దము సిద్ధమగును. "స్వనతి-ఇతి స్వఃస్వతేవా" యని నిర్వచనము. ఆత్మ శబ్దప్రవర్తకము. అనగాఆత్మనుండి శబ్దము వెలువడును. కనుక 'స్వనతి' శబ్దం కరోతి- శబ్ద ముత్పాదయతి వా'యని ఆత్మను స్వ యనవచ్చును.

ఈనిర్వచనము వలన శబ్దోత్పత్తియం దసమర్థ మగు నాత్మ 'స్వ' మర్యాద లేక స్వ-ధర్మ వంచిత మగుచు స్వగ యనిపించు కొనక 'పర' యనబడు నని సిద్ధ మగుచున్నది. "అయినచో:

## పూర్వ పక్షము.

ఆత్మనుండి శబ్దము వెలువడును. లేదా ఆత్మశబ్దము నుత్పన్నము గావించును. అన నర్థ మేమి? శబ్దము నుత్పన్నము గావింపని యాత్మ యొకటి కలదా?

"ఆత్మాబుద్ధ్యాసమేత్యర్థాన్ మనోయుంక్తేవివక్షయా,
మనఃకాయాగ్నిమహత్య స్ప్రేరయతిమారుతం."

అను పాణినీయ వచనము చెప్పిన శబ్దోచ్చారణ వివక్షసేయు నాత్మబుద్ధితోఁగూడి యభిలషితార్థ కామనకు మనస్సుతో యోగము గూర్చును. ఆత్మకామనచే కామనామయ మగుమనస్సు సర్వాంగశరీర వ్యాప్తవై శ్వానరాగ్ని(కాయాగ్ని) యందు క్షోభ పుట్టించును. కామాఘాత క్షుబ్ధమగు నగ్ని యొక్క క్షోభ ప్రాణవాయువుపై నాఘాతము కల్గించును. అట్లాఘాతమునొందిన వాయు వురము, కంఠము, శిరస్సు మొదలగువానియం దేదో యొక స్థానముం డీకొని కంఠ తాల్వాది స్థానములకు దిగి వర్ణ రూపమును ధరించును. ఇట్లు ఆత్మకామనయే బుద్ధిద్వారా మనోద్వారమున, శరీరాగ్నిక్షోభవ్యాపార మూలక ప్రాణవాయువును సంచారభావమున బరిణమింప జేసి వర్ణరూపమున బరిణతి నొందించుచున్నది. 'వాయుఃఖాత్ శబ్దః

తత్" అను ప్రాతిశాఖ్యసిద్ధాంతము నీవిషయమునే సమర్థించుచున్నది.

ఇట్లు శబ్దోత్పత్తికి లేక వర్ణోత్పత్తికి స్వాభావిక నియమమగుచో అనగా: నేశబ్దమైన నాత్మకామనా విరహితముగ వినిర్గతము కాజాల దన్నచో "స్వనతి-స్వవ్యతే" యన్నట్లు సర్వప్రాణుల యాత్మయు 'స్వ' యైయున్నది గదా! ఇక శబ్దోత్పత్తియందు సమర్థముగాని దాత్మకా దనుటలో నర్థమేమి? 'సహ్యా శబ్దమివాస్తి' 'సర్వంశబ్దేనభాసతే' ఇత్యాది శ్రౌతస్మార్త వచనముల చొప్పున సర్వమునకు బ్రత్యయము శబ్దాత్మక మగుచో, శబ్దప్రేరణ సర్వమునకు బ్రాతిస్వికధర్మ మగుచో- నిత్యశబ్ద వినిర్గమానయాయి యగు నీయాత్మ యెన్నడు 'పర' యగుట సంభవముకాదు." అన్నచో:—

సమాధానము:—కేవలము 'స్వ-పర' భావములనే విచారణసేయుచో నైవి ప్రతిపత్తి సంభవమే. కాని:—'తంత్ర' శబ్దము గూడ గైకొని విచారించిన ఈవిప్రతిపత్తి దాని యంతనదే యంతరించును. కేవల మాత్మ (స్వః) (తంత్రానుగామి కాకున్నంతవరకు) 'స్వః' యనబడజాలదు. తంత్రమును దన యాయతనము జేసికొనియే ఆత్మ శబ్దోత్పాదనకు సమర్థమై 'స్వః' శబ్ద వ్యవహార్య మగును. ఆతంత్ర మాత్మానుగామి యగుచో తంత్రాధ్యక్షు డగునాత్మ 'స్వతంత్ర' మనబడును. అటుగాక తంత్ర మాత్మను నిక్కృతముజేయుచో నది పరతంత్ర మనుబడును. తదనుగతాత్మయు పరతంత్రమని యంగీకరింపబడును.

స్వతంత్ర పరతంత్ర శబ్దములు తంత్రద్యోతకములే కాని ఆత్మవాచకములు కావు. ఆత్మ స్వతంత్రముగాదు, పరతంత్రమును గాదు. సర్వస్వరూప మగు దాని నిశ్చితస్వరూప మేదియు బంధింప జాలదుకదా! కనుక రెండుశబ్దములును తంత్రవాచకములే. ఆత్మతంత్రము 'స్వతంత్ర'ము. ఆత్మవిరోధి పరతంత్రము నన బడును. స్వతంత్రము నందున్న యాత్మ 'స్వాః' భావను సురక్షితము గావించుకొన జాలును. పరతంత్రము నందున్న యాత్మ 'స్వాః' భావముం బోగొట్టుకొనును. ఇట్లు ఈపరతంత్ర స్వతంత్ర శబ్దములు రెండును తంత్రవాచకములే యగుచున్నవి. పోగా పోగా చివరకు 'తద్వాద' న్యాయముచే నీరెండును ఆత్మవాచకములుగా గూడ నంగీకరింపబడెను.

స్వ- తంత్రమం దున్నను, పర-తంత్రమం దున్నను, ఆత్మ శబ్దోత్పత్తికి బ్రవర్తక మగును. ఇందువలన రెండుస్థితులందును, దానిని 'స్వపతి' యన్నట్లు 'స్వాః' యనవచ్చును. రెండుస్థితులందును భేదమేమన :- స్వ-తంత్రమందున్న యాత్మయొక్క కామన మనస్సును సంచాలన సేయును. పరతంత్రమందున్న యాత్మ కామనపై మానస కామనసంచాలన గావించును. మనఃకామనను తనరంగుచే శబలితముగావించి శబ్దప్రవర్తకమగు నా స్వః (ఆత్మ) 'స్వాః' యనబడును. తనకామనను మనఃకామన రంగుచే శబలితము గావించి శబ్దప్రవర్తక మగు స్వః (ఆత్మ) 'పర' యనబడును. ఇట్లు ప్రకార భేదముచే శబ్దాయమాన

మగు నాయొక 'స్వః' కు స్వః-పరః, యని యీ రెం డవస్థలు నగును.

స్వ(తన)తంత్రమున కధ్యక్షమగు నాస్వః (ఆత్మ) 'స్వగ' యనబడును. పర (ఇతర) తంత్రమున కనుగామియగు నా'స్వః'యే 'పర' యనబడును. (పరధర్మావచ్ఛిన్నమనబడును) ఇక నీభేద మును లక్ష్యమం దుంచికొనియే "శబ్దోత్పత్తియందు సమర్థ మగు నాత్మ 'స్వః' యనియు, అసమర్థమగు నాత్మ 'పర' యనియు ననబడునని పైని జెప్పబడినది. శబ్దోత్పత్తి రెండవస్థల యందు నగును. కాని పరతంత్రావస్థయం దుత్పన్న మగు నాత్మశబ్దము పరధర్మ శబలిత మగుటచే ఆత్మది యనబడదు. ఇప్పుడు స్వతంత్ర పరతంత్రము లనేమి ? వేని క్రమికసంబంధ ముచే నా స్వః (ఆత్మ) స్వగ-పరభావములందు (ఆత్మా-అనాత్మ-భావములందు) బరిణత మగుచున్నది ? అను విష యముంగూర్చి యోచింపుడు.

కోశానుసారము పూర్వము 'స్వగ' ఆత్మవాచక మను కొంటిమి. జ్ఞాతయగు నాత్మయే 'స్వగ' మైయున్నది. ఆత్మ భావనా శూన్యమగు విషయమాత్మకు పరభావమగును. జ్ఞాత-జ్ఞేయము అను రెంటియందు జ్ఞాత, ఆత్మయొక్క స్వ-భావ మగుచో జ్ఞేయము పరభావ మగును. చైతన్య జ్ఞాతాత్మకు, జ్ఞేయమగు విషయము సర్వథా జడమై పోవుచున్నది. జడత్వము చేతనే దాని ననాత్మ యనవచ్చును. ఈ దృష్టితో ననాత్మ భావ మును పరభావమందుము. కోశకారుడు పరశబ్దమునకు 'దూరా

నాత్మోత్తమాగ పరా" (అమరము) అనియెను. ఇందు బ్రకృత మునాత్మభావ మభిప్రేతము. ఈ భావముం గొనియే పరశబ్దము శత్రువాచకముగ గూడ నయ్యెను. ఇట్లే 'స్వః' బంధు వాచక మయ్యెను. చివరకు ఆత్మ 'స్వః,' అనాత్మ 'పర' మైయున్నది. ఆత్మోపకారక భావము స్వః, ఆత్మవిరోధిభావము పర, అయి నవి. ఆత్మను తదీయ శ్రేయోభావమును 'పర' యందురు.

ఇక తంత్రశబ్దార్థముం జూతము. "తంత్రం ప్రధానే సిద్ధాంతే, సూత్రవాయే, పరిచ్ఛదే" (అమరము) "అథ తంత్రంస్యాత్కు- టుంబార్థే చ కర్మణి, ఇతి కర్తవ్యతాయాం చ సాధారణ విధౌ తథా శిలాయా మమృతాయాం చ, తంత్రపిణా గుణే తనావితి (శేషః) 'తంత్రం స్వరాష్ట్ర చింతా స్యాత్'(వైజయన్తి) ఇత్యా ద్యనేకార్థము లున్నను, ప్రకృతము ప్రధాన మభిప్రేతము. ప్రకృ తినే ప్రధాన మందురు. ప్రకృతిభావమున కంతరంగ బహిరంగ భేదముచే రెండు వివర్తములు గలవు. అందు పాంచభౌతిక విశ్వము బహిరంగ ప్రకృతి. విశ్వ సంచాలికయగు ప్రకృతి యంతరంగ ప్రకృతి. ఇది విశ్వమున కాదికారణముకనుక దీనిని ప్రధానమందురు. విశ్వక్షేత్రాధిష్ఠాతయు, ప్రకృతిరూపము నగు నీ ప్రధాన తత్త్వము పురుష సహయోగముచే క్షేత్రజ్ఞుడుగ నైయున్నది. విజ్ఞాన భాషయం దిదే 'విజ్ఞానాత్మ' యనియు బిలువబడును. వాక్ప్రకృతి తత్త్వమే బుద్ధి.

ప్రధాన ప్రకృతియే వ్యక్తరూపముగ వితతమై విశ్వ విస్తారమునకు గారణ మగుచున్నది. అనగా నిదే విశ్వవితానము

గావించునని యర్థము. కనుక "తన్యత్తే అనేన సర్వమ్" అను నిర్వచనము చొప్పున ప్రకృతిరూపమగు నీ ప్రధానమును 'తంత్ర' మనవచ్చును. స్వ, పర, తంత్ర యీ మూటియర్థము క్రమముగ ఆత్మ, అనాత్మ ప్రధానములని యేర్పడును. ఇం దనాత్మభావమే మనము విశ్వమనుకొను బహిరంగ ప్రకృతి. ఆత్మరూపమగు 'స్వ' పురుషుడు ఆది కారణరూప ప్రధానము, ప్రకృతి. కార్యరూప విశ్వ మనాత్మ్య పరభావ మగుచు వికృతి యగును. మొదట నాధిదైవిక విశ్వమునం దీ మూటిని దర్శింతము.

స్వాయంభూ, పరమేష్ఠి, సూర్య, చంద్ర, పృథివ్యాత్మక విశ్వమందు మొదటి రెంటి సమష్టియు, నమృత ప్రధాన పురుష సంస్థ. చివరి రెంటి సమష్టియు మృత్యుప్రధాన వికృతిసంస్థ. మధ్యస్థము కనుకనే అమృత మృత్యు ప్రధానమగు సూర్యుడు ప్రకృతిసంస్థ. పురుష సంస్థయం దవ్యయాత్మయొక్క వికాసము. వికృతి సంస్థయందు భౌతికక్షరుని సామ్రాజ్యము. ప్రకృతిసంస్థయం దక్షరునకు ప్రధానత. అవ్యయుడు స్వ, క్షరుడు పర, అక్షరుడు తంత్ర. అవ్యయ పురుషుని 'స్వ' యొక్క తంత్ర మీ యక్షరుడు. ఈ తంత్రము (అక్షరము) క్షరరూప పరభావమున కనుగామి యగుచో నీ స్వతంత్రము (అవ్యయ తంత్రము) పరతంత్రము (క్షర తంత్రము)గ నగును. అవ్యయాత్మ అక్షర తంత్రము ద్వారా క్షరునందు సమావిష్టుడగుట స్వతంత్రతయు, అవ్యయాత్మ యక్షర తంత్రమును, క్షరమున కనుగామిం గావింపుచు నా క్షరమునం దాసక్తుడగుట పరతంత్రతయు నగును.

పైని జెప్పినయాత్మ వివర్త నిరూపణముచే దేలినదే మనగా సూర్యస్థానీయమగు ప్రధానము (అక్షరము) స్వతంత్రము ఏలన? ఈ యక్షరము యొక్క తంత్రము (విస్తారభూమి) అవ్యయుడే. స్వః (ఆత్మ) తంత్రముగ గల వా డక్షరు డే కాగలడు. అక్షరుడు 'స్వ' ను తన తంత్రముగా జేసికొనక పరలక్షణ క్షరుని దన తంత్రముగా జేసికొన్న-చో 'బరుడు' తంత్రముగా గలవాడై పరతంత్రు డగును.

విషయము కొంచెము జటిలముగ దోచును. స్వతంత్ర పరతంత్ర శబ్దము లాత్మవాచకములో, అనాత్మ వాచకములో, ప్రధాన సూచకములో యగును. కనుక నీ విషయము జటిల సమస్యయే. కనుక గొంచెము వివిరణ మవసరము.

| | |
|---|---|
| ఆత్మ—స్వ— | అనాత్మ—పర—ప్రధానము—తంత్రము |
| పురుషుడు—స్వ— | వికృతి—పర— ప్రకృతి—తంత్రము |
| అవ్యయుడు—స్వ— | క్షర—పర— అక్షర—తంత్రము |
| స్వయంభూ + పరమేష్ఠి—స్వ—చంద్ర- | పృథువులు—పర— సూర్య—తంత్రము |

ఈ పథకము వలన ఏ రూపముగనైనను 'స్వ' కు తంత్రముతోడనో, తంత్రమునకు 'స్వ' తోడనో సంబంధ మున్న-చో స్వతంత్ర శబ్ద ముదయించుననియు, 'స్వ' కు తంత్రము ద్వారా 'పర' తో లేదా 'పర' కు తంత్రముద్వారా 'స్వ' తో సంబంధ మున్నచో పరతంత్ర శబ్ద ముదయించుననియు స్పష్టమగుచున్నది. దీనితో బాటుగ నింకొకటిగూడ దేలుచున్నది ఏమన :-

'స్వ' కు సాక్షాత్తుగ తంత్రముతో సంబంధముండునపుడు స్వతంత్ర శబ్దము నాత్మ వాచకముగనే యంగీకరింపబడును.

అటుగాక 'పర' ద్వారా సంబంధ ముండుచో పరతంత్రశబ్దము నాత్మవాచకముగనే యంగీకరింపబడును. ఈ స్థితిలో స్వతంత్ర పరతంత్రములకు "ఆత్మ స్వతంత్రము" "ఆత్మ పరతంత్రము" అని యర్థమగును.

మరియు తంత్రమునకు సాక్షాత్తుగ 'స్వ' తో సంబంధ మున్నపుడు స్వతంత్రశబ్దమును తంత్రవాచకముగ నంగీకరింప బడును. అటుగాక 'పర' ద్వారా సంబంధ ముండునపుడు పర తంత్రశబ్దమును తంత్రమునకే వాచకమగును. ఈ స్థితిలో స్వతంత్రపరతంత్రములకు "తంత్రః స్వతంత్రః" "తంత్రః పర తంత్ర" యని యగును.

ఇంకను :—'పర'కు తంత్రముద్వారా 'స్వ'తో అనుకూల (అనుయోగి) సంబంధ మున్నపుడు స్వతంత్రశబ్దము పరవాచక ముగ నగును. ప్రతికూల (ప్రతియోగి) సంబంధమున్నపుడు పరతంత్రశబ్దమును 'పర' వాచకమే యగును.

చివరకు దేలినదేమనగా :— తంత్రానుగామి యగు నాయాత్మయే స్వతంత్రము. పరానుగామియగు నాయాత్మయే పరతంత్రము. స్వానుగామియగు తంత్రమే స్వతంత్రము. పరాను గామియగు నాతంత్రమే పరతంత్రము. స్వానుగామి (అను కూలము) యగు నా 'పర' స్వతంత్రము. స్వాననుగామి (ప్రతి యోగి) యగు నా 'పర' యే పరతంత్రము. ఇట్లు : ఆత్మ-తంత్రము-పర-ఈమూడు నొక్కొక్కటే స్వతంత్రము, పర తంత్రము గావచ్చును. -మరియు :—స్వలక్షణాపురుషుడు, తంత్ర

లక్షణాప్రకృతి, పరలక్షణావికృతి, ఈమూడుసంస్థలతోడను సంబంధభేదముచే స్వాతంత్ర పరతంత్ర శబ్దములను సమన్వయింప వచ్చును.

(1) ఈ మూ డు వి వ ర్త ము ల నుం డి మొదట ఆత్మ స్వాతంత్ర్య-పారతంత్ర్యముల విచారణ మనకు ప్రస్తుతము. ఈ 'స్వః' (ఆత్మ) స్వ-తంత్రమునకు (తనతంత్రరూప-అక్షరము లేదా ప్రకృతికి) అనుగామి యగుచు, తంత్రము (ప్రకృతి) ద్వారా, పరభావమందు (క్షరములేదావికృతియందు) అనాసక్తరూప మున ప్రవిష్టమగుచో (అనగా :-తంత్రానుగతమై పరభావ యుక్త మగుచో) ఈ తంత్రానుగామియగు 'స్వ'ను, "తంత్రాను గతః-యః,-స్వః-(ఆత్మా) అను నిర్వచనముంబట్టి 'స్వతంత్ర' యనబడును. ఆత్మవాచక మగు నీస్వతంత్రశబ్దమున కిదే నిర్వ చనము. (ఆత్మస్వాతంత్ర్యము.)

ఇక :—స్వః (ఆత్మ) తంత్రానుగామిగాక యది 'పర'తో తంత్రముద్వారా యోగము గుదుర్చుకొన్నపుడు, 'పర' యొక్క యాసక్తివలన ఆ'స్వ'యొక్క తంత్రము 'పర'యొక్క ప్రతి చ్ఛాయతో గూడి తన తంత్రభావము బోగొట్టుకొనెను. తంత్ర రూపమగు నక్షరము, పరరూప క్షరముయొక్క నశ్వరధర్మము లతో గూడి తన ప్రాతిస్వికమగు నక్షర సంపత్తిం గోలుపోయెను. ఇంతకు బూర్వమీయాత్మదిగా నున్న యక్షరరూప తంత్రము. ఆత్మయొక్క విషయాసక్తిచే నిపుడు దానితంత్రముగా నుండక పోయెను. ఆయక్షరముయొక్క యాసనము 'క్షరపరము' హరిం చెను. కనుక పరయే దీనికి తంత్రమై పోయినది.

'పర'యొక్క యాసక్తి యింతటితో నాగక అక్షరమును వలె దానితో గూడియున్న 'స్వ'ను గూడ 'పర' (క్షర) రూపమున బరిణతి నొందించెను. చివరకు :—'స్వ' కు తంత్రము గాజాలని క్షరభావముగల 'పర', 'స్వ'కు తంత్రమైపోయెను. 'స్వ' తన స్వభావమునుండి ఆవృతినొంది 'పర' మై పోయెను. 'పర' అక్షరనుండి తంత్రాసనము నపహరించికొని తన్ను తంత్రముగా జేసికొని తనశ్వర 'పర' భావమాత్మ కిచ్చి (దాని'స్వ' భావ వంచితముగావించి) దానిని 'పర' చేసివైచెను. 'స్వ'ను 'పర'జేసిన దొకపని. తంత్రమును 'పర'చేసి తంత్రభావమును దానపహరించిన దొకపని. ఈరెండుపనుల వలనను 'స్వ' 'పర' గను, 'పర' 'తంత్ర'ముగను అయ్యెను.- తంత్రము 'పర' యగుచు ఈతంత్రాకారాకారితక్షరమునందు విలీనమైపోయెను. లేదా, 'పర'మై పోయిన ఆత్మయందు విలీనమై పోయెను.

ఇట్లు తంత్రానుగతముగ నున్న (అక్షరానుగతముగ నున్న) 'స్వః' యొకపుడు స్వతంత్రముగ నున్నది. నేడు ఈకృత్రిమ తంత్రముయొక్క కృపచే 'పర'మై తదనుగామియై 'పరతంత్ర' శబ్దవాచ్యమైపోయెను. "తంత్రానుగతః (తంత్రప్రతికృతిరూప క్షరానుగతః) యఃపరః-(పరధర్మానుగతః) స్వః (ఆత్మా) అనట్టి యీ నిర్వచనముచొప్పున నిది పరతంత్ర మనబడును. పూర్వమువలె 'తంత్రానుగతః-పరః-పరతంత్రః' అని యాత్ర వాచక పరతంత్ర శబ్దమునకు నిర్వచన మగును. (ఆత్మపార తంత్ర్యము.)

స్వతంత్ర-పరతంత్రశబ్దముల స్వ- (స్వ-రూపమందున్న ఆత్మ) పర- (పరరూపపరిణతమైనయాత్మ) అవయవము లాత్మ వాచకము లనుకొన్నచో నాస్వతంత్ర - పరతంత్ర శబ్దములకు గ్రమముగ బూర్వోక్తనిర్వచనము అనగా 'తంత్రానుగతఃస్వః' 'తంత్రానుగతఃపరః' యనియే యగును. ఇట నాత్మయే స్వ-దశయం దున్నదై తనకు బంధు వనబడును. అదే పరాక్రాంతమై తనకు రిపు వనబడును. "ఆత్మైవహ్యాత్మనోబంధు, రాత్మైవ రిపురాత్మనః" అని గీత. నిజముగ :—అనుకూల తంత్రానుగత మగు నాత్మ మిత్రమగును. ప్రతికూలతంత్రానుగత మగునాత్మ శత్రువగును.

ఆత్మవాచకములగు నీరెండుశబ్దముల నిర్వచనము మరొక దృష్టితో జూతము. ఆత్మను వికసింపజేయుభావ మాత్మ బంధువు. ఆత్మ నావృతము గావించు భావ మాత్మరిపు వన బడును. ఆత్మబంధువును మనము స్వ కు స్వ (ఆత్మకుస్వజనము లేదామిత్రము) అనియు, ఆత్మరిపువును, స్వకుపర (ఆత్మకు పరజనము లేదా రిపువు) అనియు అందుము. పరక్షరమును దన గర్భమం దుంచుకొను తంత్రాక్షరము ఆత్మోదయకార ణమై ఆత్మకు స్వ యగును. తంత్రాక్షరముం దన గర్భమం దుంచుకొను, పరక్షరము ఆత్మపతనమునకు గారణమై ఆత్మకు 'పర' యగును. ఈదృష్టితో అక్షరతంత్ర మాత్మకు స్వతంత్రము (స్వహితతంత్రము) క్షరతంత్రము పరతంత్రము (విరోధితంత్రము) అగును. స్వతంత్రానుగతాత్మ 'స్వతంత్రోయస్యఆత్మనః సఆత్మా

స్వతంత్రః' అని స్వతంత్రమనియు, పర-తంత్రానుగతాత్మ 'పరః-తంత్రోయస్యాత్మనః స-ఆత్మాపరతంత్ర అని పరతంత్ర మనియు జెప్పబడును.

(1) { తంత్రానుగతః (అక్షరానుగతః) స్వః (ఆత్మా) స్వతంత్రః-ఆత్మా-స్వః
తంత్రానుగతః (క్షరానుగతం) స్వః (ఆత్మా) పరతంత్రః-ఆత్మా-పరః

(2) { స్వః (అక్షరః) తంత్రోయస్యసః (ఆత్మా) స్వతంత్రః-అక్షరః-స్వః
పరః (క్షరః) తంత్రోయస్యసః (ఆత్మా) పరతంత్రః-క్షరః-పరః

(2) ఆత్మ-పురుషవాచక స్వతంత్రపరతంత్రశబ్దముల విచారణ ముగిసినది. ఇక తంత్రవాచక (అక్షరవాచక) శబ్దములను విచారింతము. దేనివలన స్వరూపరక్షణ యగునో అయ్యది 'స్వ'యగును. స్వరూపహానిం జేయునది 'పర' యగును.- మధ్యస్థతంత్రరూప మగు నక్షరము స్వస్వరూపమున నవినాశి. దీని కొకవైపున నవినాశియగు నవ్యయమును, ఒకవైపున నాశవంతమగు క్షరమును గలవు. ఇక నక్షరుడు సమవిభూతి యుక్తుడగుచో నేబాధయులేదు. కాని క్షరభావాసక్తుడగుచో తన తంత్రభావమును విడచి పరభావముగ బరిణతినొందును. అవ్యయ భావానుగామి యగుచో నతని తంత్రము అనగా స్వ-భావము సురక్షితముగ నుండును. ఈదృష్టితో నాత్మవలె అక్షరము కూడ స్వః-పరః యని రెండురూపములను ధరింప గలదు. తంత్రానుగత (అవ్యయానుగత) స్వః (అక్షరము) స్వతంత్రము. తంత్రానుగత (క్షరానుగత) పర (క్షరరూపాక్షరము) పరతంత్రము. పైని జెప్పిన యీరెండు నిర్వచనములు తంత్రరూపాక్షరమును స్వః-పరః-యని యంగీకరించి ప్రతిష్ఠింపబడినవి.

అక్షరబంధు వవ్యయమే ఇతనికి స్వ. క్షరమితనికి 'పర' యనబడును. ఈదృష్టితో నవ్యయతంత్ర మక్షరతంత్రముయొక్క స్వ-తంత్రము. క్షరతంత్రము పర-తంత్రము. ఈ రెంటి నిర్వచనములు నిట్లుండును.

(1) { 1. స్వః (అవ్యయః) తంత్రోయస్యసః-అక్షరః-స్వతంత్రః
2. పరః (క్షరః) తంత్రోయస్యసః-అక్షరః-పరతంత్రః

(2) { 1. తంత్రానుగతః(అవ్యయానుగతః)తంత్రః(అక్షరః)స్వతంత్రః-అక్షరః-స్వః
2. తంత్రానుగతః (క్షరానుగతః) తంత్రః (అక్షర) పరతంత్రః-అక్షరః-పరః

(3) { 1. స్వః (అవ్యయః) తంత్రోయస్యసః (అక్షరః) స్వతంత్రః-అవ్యయః-స్వః
2. పరః (క్షరః) తంత్రోయస్యసః (అక్షరః) పరతంత్రః-క్షరః-పరం

(3) ఇక మూడవదగు పరభావముం జూతము. యోగ్యతా విరహముచే నెచ్చట 'స్వ' 'పర'గా జూడబడెనో అచ్చట 'పర' 'స్వ' యగుటయు జూడబడెను. ఆ నశ్వర సంసారమే యొకనికి (ఆసక్తిద్వారా) బంధన కారణమగును. ఆ నశ్వర భౌతికపదార్థములే యొక యుపాసకుని కొరకుపాసనా సాధకములగుచు ముక్తి కారణములగును. 'పర' కు (క్షరమునకు) అక్షరముద్వారా అవ్యయతంత్రముతో యోగము కుదిరినచో నా 'పర' అక్షరము (స్వ) అగుచు, స్వతంత్రమగును. అటుగాక వైకారిక భావాభినివేశము లభించినచో, తన 'పర' నామముం జరితార్థముజేయుచు పరతంత్రమేయగును. ఈ దృష్టితో నీశబ్దములకగు నిర్వచనమందు స్వః పరలు, క్షర వాచకములుగ నుండును. అవ్యయతంత్రానుగత 'పర' 'స్వతంత్ర' యనబడును. వైకారికప్రపంచాసక్త "పర" పరతంత్ర మన

బడును. పూర్వోక్తమగు రెండవ దృష్టియు ఈ క్రింది విధమున సమన్వయించుకొన వలయును.

(1) { 1. తంత్రానుగతః (అవ్యయానుగతః) పరః (క్షరః)స్వతంత్రః-క్షరః-స్వః
2. తంత్రానుగతః (వికారానుగతః) పరః (క్షరః) పరతంత్రః-క్షరః-పరః

(2) { 1. స్వః (అవ్యయః) తంత్రోయస్యసః (క్షరః) స్వతంత్రః-అవ్యయః-స్వః
2. పరః (వికారః) తంత్రోయస్యసః (క్షరః) పరతంత్రః-వికారః-పరః

ఇంతకు స్వతంత్ర పరతంత్ర శబ్దములు రెండు ననుగమ భావమునకు జెందినవి కాని యొక నియతార్థముం జెప్పునవి కావని తేలినవి. పరిస్థితి తారతమ్యముచే నన్నియు స్వతంత్రములు, పరతంత్రములుగూడ నైయున్నవి. స్వతంత్రమగు నాత్మయు పరతంత్రము గావచ్చును. పరతంత్రమగు 'పర' క్షరమును స్వతంత్రము గావచ్చును. పురుష ప్రకృతి వికృతులందేదియు స్వస్వరూపముచే స్వతంత్రముకాని పరతంత్రముకాని కాజాలదు. పురుషుడు ప్రకృతి సహయోగముచే స్వతంత్రుడగుచో వికృతి సహయోగముచే పరతంత్రుడు గావచ్చును. ప్రకృతియు బురుషానుగామినియై స్వతంత్రయు, వికృతింబట్టి పోవుచో పరతంత్రయు కాగలదు. ఇట్లే వికృతియు, ప్రకృతి లేక పురుషుననుగమించినచో స్వతంత్రయు, వికార ప్రపంచాసక్తయై పరతంత్రయు గాగలదు. ఈ మౌలిక పరిభాష చొప్పున మన మాధ్యాత్మిక జగత్తుయొక్క స్వతంత్రతా పరతంత్రతల నన్వేషింప వలయును. దాని యాధారమున 'స్త్రీస్వాతంత్ర్య' మీమాంస సేయవలయును.

ఆధిదైవిక విశ్వమందు స్వయంభూ + పరమేష్ఠి-సూర్య-చంద్ర + పృథివి రూపముచే పురుష (ఆత్మ); ప్రకృతి (ప్రాణము) వికృతి (పశువు)గా ప్రజాపతి వివర్తము పూర్వము చెప్పబడినది. ఇపు డాధ్యాత్మిక విశ్వమం దీ మూడు సంస్థల సూక్ష్మభావముల వంకకు బోక స్థూలముగా అందరు నెఱిగిన నాల్గుభాగములను జూతము. ఆత్మ, బుద్ధి, మనస్సు, శరీరము ఈ నాల్గు నంద రెరిగినవి. ఒక విధముగ కొంతసేపు ఆత్మను స్వయంభూ యొక్క యంశమగు నవ్యక్తము + పరమేష్ఠి యంశ రూపమగు మహత్తు ఈ రెంటి సమష్టి పురుషుడనియు, సూర్యాంశ రూప బుద్ధిని ప్రకృతి యనియు, చంద్రాంశరూప మనస్సు పృధివ్యంశ రూప శరీరము. ఈ రెంటి సమష్టి వికృతి యనియు, నెంచుడు. పురుషు డవ్యయుడు, ప్రకృతి యక్షరము, వికృతి క్షరము అయ్యెను. అక్షరాత్మక బుద్ధి కటువైపున నవ్యయాత్మ కామృతాత్మయు, నిటువైపున క్షరాత్మక మర్త్య మన శ్శరీరములు నున్నవి. ఈ పరిలేఖ జూడుడు :

1. (స్వయంభూ + అవ్యక్తః) + (పరమేష్ఠీ + మహాన్)—ఆత్మ-పురుషుడు-అవ్యయుడు-స్వః
2. సూర్యుడు + బుద్ధి........................ప్రాణః-ప్రకృతి-అక్షరము-తంత్రము
3. (చంద్రుడు + మనస్సు) + (ప్రధివీ + శరీరము)- పశువు-వికృతి-క్షరము-పరః

అధిదైవిక అధ్యాత్మ ఆధిదైవిక అధ్యాత్మ ప్రజాపతి

ఆధిదైవిక యజ్ఞమునుండియే, ఆధ్యాత్మిక యజ్ఞ మావిర్భవించెను. ఆధిదైవిక యజ్ఞమందు యజమాను డెవరు? తత్పత్ని యెవతె? చూతము. 1 ఆత్మ, 2 సూర్యరూప

ప్రకృతి, 3 చంద్రపృథివీరూప వికృతి యనునీ మూటియందును. (1) ఆత్మ - యజ్ఞవేది లేదా యజ్ఞధరాతలము "పతదాలంబనం శ్రేష్ఠమ్" "అధి యజ్ఞోహ మేవాత్ర" ఇత్యాదు లీ విషయమును విశదపరచును. (2) సూర్యుడు యజమానుడు. (3) పృథివీ యుక్త చంద్రుడు యజమాన పత్ని. ఆ రెంటి మిథున భావము యజ్ఞము. ఇది ప్రజోత్పత్తికి గారణము.

సూర్యు డగ్నిమయుడు. చంద్రుడు సోమమయుడు. సౌరాగ్ని ప్రవర్త్యభాగము. ఋతాగ్ని, చాంద్ర సోమ ప్రవర్గ్య భాగము ఋతసోమము. ఋతసోమమున కుత్తరదిక్కు ఋతాగ్నికి దక్షిణదిక్కు స్థానములు. ఉత్తర సోమము దక్షిణమునకు, దక్షిణాగ్ని యుత్తరమునకు నిరంతరము బోవుచుండును. ఋత సోమాహుతిచే వసంతాది ఋతూత్పత్తి యగుచున్నది. షడృతు సమష్టిచే సంవత్సర యజ్ఞము నిష్పన్న మగుచున్నది. అగ్నిషో మాత్మకము, షడృతు మూర్తియు నగు నీ సంవత్సర యజ్ఞము పార్థివ ప్రజోత్పత్తికి గారణ మగుచున్నది.

పార్థివ ప్రజయందు సంవత్సరయజ్ఞ ప్రజాపతియొక్క అగ్ని సోమ భావద్వయ మున్నను వృషాసృష్టియందు సూర్యోప లక్షిత సంవత్సర యజ్ఞముయొక్క అగ్నితత్త్వమును, యోషా సృష్టియందు చంద్రోపలక్షిత సంవత్సర యజ్ఞముయొక్క సోమ తత్త్వమును బ్రధానములుగ నుండును. పురుషసృష్టి వృషా; స్త్రీసృష్టి యోషా; పురుష నిర్మాణమం దగ్నియు, స్త్రీనిర్మా ణమునందు సోమమును బ్రధానములు, ఇక నగ్నిషోములు యీ

తారతమ్యముల వివరణము లందం దీయబడినవి. గాన వీనిం గూర్చి ప్రస్తుత మొక్కటిమాత్రము తెలిసికొన్న జాలును.
ఏమన :-

అగ్ని అన్నాదము, భోక్త; సోమము అన్నము భోగ్యము. ఎట్టిభోగ్యము? పశురూప భోగ్యమా? కాదు. మిత్రరూప భోగ్యము. అగ్ని సోమభోక్తయగుచో; సోమ మగ్ని కాత్మప్రతిష్ఠ యగును. సోమసంబంధములేక యగ్ని జీవింపజాలదు. అగ్నినాధారముగ గొనకుండ సోమము తన రూపమును సత్యభావ పరిణతి నొందించుకొన జాలదు. ఈ శ్రుతివచనము జూడుడు:

"అగ్నిర్జాగార త మృచః కామయన్తే అగ్నిర్జాగార తము సామానియన్తి అగ్నిర్జాగార త మయంసోమఆహ "తవాహమస్మి సఖ్యేన్యోకా"

ఋక్ 5-44-15

అగ్ని బలముగలదే. కాని యీబలవత్త్వము సోమ సహయోగముపై నాధారపడి యుండును. హృదయ భావము వల్లనే బలమునకు వికాసము. అనగా బలవికాసభూమి హృద యము. హృదయస్థమగు నుక్థబలము సత్యము. ఈసత్యోక్థము నుండి వెడలు సత్యరశ్ములు బలము. ఒక సత్యమునకే నత్యము బలము నని రెండు స్థితులు. సత్యాధారమున బలప్రయోగము జరుగును. సత్యము స్వయముగా నేపనియు జేయదు. ఆలంబన మాత్రముగ నుండును. సత్యరశ్మిరూప మగు బలమే బహి ర్జగత్తు వంకకు వికసించును. కనుకనే "బలంసత్యాదోజీయః"

"బలంవావ విజ్ఞానాద్భూయః" ఇత్యాది నిగమములు వెలసినవి.

పురుషునందు సత్యాగ్నితత్త్వమునకు ప్రధానత కలదు. అగ్ని బలవత్తత్త్వము. కనుక పురుషుడు బలముగలవాడందురు. సోమ మబలము లేక నిర్బలము. ఏమన:—సోమము ఋత తత్త్వము. హృదయశూన్యము. కనుక సత్యభావ ముండదు. సత్యములేనపుడు తద్వికాసరూప బలమును లేదు. స్త్రీయందీ ఋసోమతత్త్వమునకు ప్రధానత కలదు. కనుక దాని నబల యందురు.

పురుషుడు బలవంతుడు. స్త్రీ అబల. పురుషుడు సత్య భావోపేతుడు. స్త్రీ అనృతభావోపేత. పురుషు డాగ్నేయుడు; స్త్రీ సౌమ్య. పురుషుడు భోక్త. స్త్రీభోగ్య. అతడు ప్రతిష్ఠ. తదాధారమున నిది ప్రతిష్ఠిత. ఆలంబన మతడు, ఆలంబితయిది. స్వచ్ఛందస్కు డతడు. ఇది పరచ్ఛందానువర్తిని. అగ్రిరూపాగ్నియుక్తు డగు పురుషు డగ్రేసరుడు. సోమయుక్తయగు స్త్రీ తత్పశ్చాద్గామిని. ఇవి పురుషప్రధానత స్త్రీగౌణతకు గల దృష్టులు.

ఇక నేదృష్టితో స్త్రీ స్వస్వరూపముచే అబలయయ్యు నుపాస్యదేవతాసనము నొంది యున్నదో ఆదృష్టితో విచారింతము. పై పేరాయందు జెప్పిన దంతయు నిజమే. కాని మన మబలయనుకొన్న సోమము, అనంతరము, అబాహ్యము నగు బలఘనము. మనము 'బలవాన్' అనుకొన్న యగ్ని అనంత రము, అబాహ్యము నగు నిర్బలము. ఇది ఆడుదానిని మగ

వాడు, మగవాని నాడుది యన్నంత విపరీతముగా దోచ వచ్చును. చూతము.

బలపరిభాష సంకోచము. నిర్బలపరిభాష వికాసము. ఒకచో నిలుకడగ నుండలేక ఇటునటు తూలుట వికాసము. అస్థిరతయే నిర్బలత. నిలుకడగల్గి యుండుట సంకోచము. ఇదే బలమునకు సాక్షాత్ప్రతిమ. జూడుడు :— నిర్బలునకు చేతులు జారవిడుచును. బలవంతుడు బద్ధముష్టియై యుండును. వదులు కట్టు, వదులునడుము, వంగినబుజములు, నిర్బలత్వ ద్యోతకములు. కట్టుబిగువు, బిగువునడుము, ఎగుబుజములు, బద్ధముష్టి బలవత్త్వ ద్యోతకములు. శరీరపర్వములు సంకుచితములు పుష్టియుక్తములు నగుచో శరీరము సబలము, శ్లథశరీరమునిర్బలము. సంయతవాణి సబలము. స్ఖలితవాణి నిర్బలము. కనుక పైజెప్పిన పరిభాష యుచిత మనవచ్చును.

అగ్నికివికాసము, సోమమునకు సంకోచము, ధర్మములు. కనుక అగ్నినిర్బలము, సోమముబలఘనము అన వచ్చును. ఇప్పుడు జూడుడు. అగ్నిప్రధాన పురుషుడు, సోమప్రధాన స్త్రీ. యిందెవరి యాసనమున్నతము? అట్లయిన స్త్రీ నబల యను టెందుకు? దీనికి 'అసత్' శబ్దము ప్రత్యుత్తర మిచ్చును. ఎట్లన :— ప్రాణముసత్తు. కాని, "సామాన్యే సామాన్యాభావః" యను పరిభాష చొప్పున, ప్రాణమందు ప్రాణ ముండదు. కనుక సద్ఘన మగు ప్రాణ మస త్తందురు. ఈవచనము జూడుడు:

"అసద్వాఇద మగ్ర ఆసీత్. తదాహుః కిం తదసదాసీత్ ? ఇతి ఋషయోవావ తదగ్రేఽ సదాసీ దితి. తదాహుః—కేతేఋషయః—ఇతి ప్రాణావా ఋషయః. ఇత్యాదిః (శత 6)

సోమముబలఘనము, బలముస్వాయముగ 'బలవాన్' అగు టెట్లు ? బలము గలదిగదా బలవాన్ ! కనుక బలఘన మగు సోమము 'అబల' యన బడినది. బలఘనాత్మక మగు నీ యబల సోమముం గొనియే, వికాసధర్మముగల యగ్ని 'బలవాన్' అనుటకు సమర్థ మగును. సోమనిష్కాసనము గావించినచో అగ్నియొక్క బలాభిమాన మూడిపోవుటయు, వెంటనే దాని శివభావము పోయి, రుద్రభావమున బరిణతినొంది యుత్క్రాంతి నొందుటయు నగును.

స్త్రీ స్వాతంత్ర్యము గూర్చిన యీ విచారణలో శివ—రుద్రభావ మెక్కడ నుండి వచ్చిపడెను ? చిత్తము ! శివ—శక్తి తత్త్వము కొంచెము చవి చూడవలయును. 'అగ్నిర్వారుద్రః' అన్న ట్లగ్నితత్త్వము రుద్రుడు. విశ్వసంహారమున కేకమాత్రాధిష్ఠాత రుద్రదేవతయే యనునదియు విజ్ఞానసిద్ధ విషయమే. శక్తిసమాగమము లేనంతవర కీయన రోదనము సేయుచుండును. కనుకనే శ్రుతి 'సోఽరోదీత్ త ద్రుద్రస్య రుద్రత్వమ్' అన్నది.

రోదన మెందుకు ? శ్రుతి సుందరముగ జవాబిచ్చెను చూడుడు :—రుద్రుడగ్నిమూర్తి. స్వభావముచే అగ్ని అన్నాదము. కనుక అన్నము దొరుకునంతవరకు నతని స్వరూపము సురక్షితముగ నుండును. అన్నావరోధమున ? స్వరూప

నాశాశంకచే రోదనము మొదలిడును. మాతృగర్భమున దొమ్మిది నెలలవరకుండు చిత్యాగ్ని పిండరూప శిశువు, తల్లి నాళము ద్వారా అన్నరసము లభించుచుండును. కనుక నేడువదు. కాని :—నియతావధ్యనంతరము 'ఏవయామరుత్' యొక్క త్రోపుడుచే గర్భమునుండివెడలి భూమిం బడుటతోడనే ఏడువ మొదలిడును. ఇంద్రియదేవత లందరు వణకిపోవుదురు. వారు తమచేష్టలచే మంత్రాదుల నన్నాహుతికై బాధ్యుల గావింతురు. శిశుముఖమున గుడాది రససేచనము గావింతురు. రుద్రుడు శాంతించును. (శత 9-1-1-10)

ఈ యవస్థయే, ఆధిదైవిక రుద్రునకు నని యెరుంగ నగును. ఆధిదైవిక రుద్రుడు స్వయముగ నేడ్చినంతనే యా యశ్రువులనుండి యొక భయానక వస్తువు నుత్పన్నము గావించెను. దాని చక్రమునం బడిన ధీరులుకూడ నేడ్చెదరు. మతిలేక తిరుగుదురు. వారికి శాంతి యుండదు. అదే రజతము. వైదిక విజ్ఞానముం బట్టి రుద్రాగ్ని ద్రుతావస్థచే రజత ముత్పన్నమగును. రజతము రుద్రదేవతాశ్రువు. కనుక యజ్ఞమందు రజత దక్షిణ నిషిద్ధమైనది. 'బర్హిషి రజతం నదేయం' ఈ రజత మేవని నేడ్పించదు? సరి: రుద్రదేవత సాక్షాత్తుగ నగ్ని. దీని రోదనము నివారించుటకు సోమాహుతి ప్రదాన మొకటే యుపాయము. దానితో రుద్రుని ఘోరభావము శాంతించి 'శివాతనూ' దయ మగును.

సోమాహుతి లేకున్న రుద్రాగ్ని రోదనము చేసిచేసి తన స్వరూపముం బోగొట్టికొని శుద్ధసోమముగ మారిపోవును. అగ్ని యుత్క్రమించి చరమసీమయందు సోమముగ బరిణతి నొందును. అగ్నికి ప్రధానస్థానము కేంద్రము. అందుండి నలు వైపులకు విశకలితమగును. సోమాహుతి యుండునంత వరకు దాని మూలరూపమునకు బాధలేదు. అది లేనినాడు విశకలన చరమదశ నొంది యగ్నిప్రతిష్ఠ యగు సత్యభావము విలీనమై ఋతసోమ భావముం బ్రాపించును. జలము సోమముయొక్క యవస్థాంతరమే. అగ్నియే వికాస చరమసీమం జేరి జలము (సోమము) అగును. 'అగ్నేరాపః.'

మనుజుడెవడైన నేడువగ నేడువగ శరీరమంతయు నీరు గ్రమ్మి యగ్ని నిశ్శేషముకాగా జల్లబడును. ఈ దృష్టితో నన్నాహుత్యవరోధముచే నగ్ని యన్నమగును. ప్రకారాంతర ముగ: ఆకలిగొన్న మనుజున కన్నాగమనము లేనపుడు అంత వరకు నన్నాదముగ నున్న శరీరాగ్ని అన్నముగ నైపోవును. ప్రాణాగ్ని యుత్క్రాంత మగును. శివుడు శవరూపాన్నమై పోగా నది శ్మశానాగ్ని (క్రవ్యాదాగ్ని)కి తృప్తికారణమగును. అగ్ని కంతిమావస్థ (సోమాభావమునందు) సోమమే యగు ననుట నిశ్చయము. బలఘనమగు సోమమును గర్భమునంగొని బలశూన్య మగునగ్ని బలవంతమగుచు భోక్త యనిపించు కొనుచున్నది. అదే సోమావరోధమున తానే బలఘనమై ఇతరబలవంతున కన్నమై పోవుచున్నది. భోక్త భోగ్యము, శాసకము, శాసితము అగుచున్నది.

ఇంతకు దేలినదిది :- అగ్నియొక్క బలవత్త్వము సోమ సంబంధముపై నాధారపడియున్నది. బలఘనము, బల తత్త్వము సోమము. దీనిం గాని యగ్నిమూర్తియగు రుద్రుడు సాంబసదాశివుడై నాడు. పురుషు డగ్ని ప్రధానుడు. కనుక శివుడు. స్త్రీ శక్తిఘనమగు సోమతత్త్వము ప్రధానముగా గలది. కనుక శక్తి యనవచ్చును. శివశక్తుల యీ వ్యాపకావతార ములంబట్టి రుద్ర శివభావములను ప్రాసంగికములుగ నెంచితిమి.

బాహ్య దృష్టిని విడచి మొదట నంతర్దృష్టితో శివ - శక్తి సమన్వయమునకు జూతము. పురుషుడు శివుడెందువలన? సోమము వలన; పురుషు డాగ్నేయుడే. కాని యితనికి ప్రతిష్ఠ సోమమే. భుక్తాన్న సప్తమావయవ రూప 'శుక్ర'ము (రేతస్సు-వీర్య - ధాతువు) సాక్షాత్తుగ సోమము. మతము లన్నిటియందు నీ సౌమ్య శుక్రమే పురుషుని యంతరాత్మయై యున్నది. పురుషుని భౌతిక దృశ్యశరీర మాగ్నేయము. అంతర్జగద్రూప శుక్రము సౌమ్యము. శుక్రక్షయము పురుష నాశకారణము. తద్రక్ష స్థితి కారణము. కనుక శ్రుతి 'బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యు ముపాఘ్నత" యన్నది. బలఘనము సౌమ్యమునగు నీ శుక్రముచే పురుషుడు బలవంతుడుగ నుండును.

ఇంకొక రహస్యము :- శుక్రము సోమము. కనుక బల ఘనమయ్యు పూర్వోక్త పరిభాషం బట్టి స్వయముగ బల ప్రయోగాసమర్థ మగుటచే నబలమందురు గదా ! పురుషజాతి దౌర్భాగ్య మేమన ? ఈ యబల సోమము(శుక్రము)పూర్వోక్త

ప్రకారము పురుషాంతరాత్మయై యున్నదికదా! ఇందుచేతనే పురుషుని బాహ్య జగత్తు (ఆగ్నేయ శరీరము యెంతగా ఆక్రమణానుయాయిగ నుండునో, అంతర్జగత్తు అంత శిథిలముగా నుండును. అనగా శరీరము సబలము. ఆత్మ నిర్బలమునని తాత్పర్యము. నిర్బలమగు శుక్రరూపాంతరమగు మనస్సునుండి సంకల్పోదయము - కనుక చివరకు పురుషుడు విశేష సాధనములచే శక్త్యుపాసన సేయుకున్నచో నితని సంకల్పములు చాలవరకు వట్టివే యగును. నిజముగ శ్రీరామకృష్ణ పరమహంస శక్త్యుపాసన నేటి యుగమున కొక శుభసందేశ మనవచ్చును.

పురుష-పురుష సామ్ముఖ్యమున సంకల్పము సఫలము కావచ్చును. సౌమ్యాత్మయగు పురుషున కాగ్నేయ శక్తియగు స్త్రీయొక్క సామ్ముఖ్యమున నగు దురవస్థ వర్ణింప బనిలేదు. స్త్రీ సౌమ్య; సంకల్పము శుక్రానుబంధియగు మనస్సునకు జెందిన దగుటచే సౌమ్య. ఇక జెప్పవలయునా? దేవుడు పూజారియు నొకటి. 'రోగియు వైద్యుడు పాలే కోరుట' చరితార్థము లగును. "అగ్నికుండ సమానారీ ఘృతకుంభ సమః పుమాన్"

సరి: పురుషుని పాంచభౌతిక శరీరపిండ మాగ్నేయము. దానికి బ్రతిష్ఠా రూపమగు శుక్రము సౌమ్యము. అగ్ని వృషా. కనుక పురుషుడు. సోమము యోషా, కనుక స్త్రీ. కనుక స్త్రీయే పురుషునకు బ్రతిష్ఠ యనవచ్చును. ఇంతే కాక మనము పురుషు లనుకొను వారందరు ఆగ్నేయ శరీరముం బట్టి పురుషు

లయ్యును, వస్తుతః అంతః ప్రతిష్ఠారూప శుక్రసోమ దృష్టితో - ఆత్మదృష్టితో స్త్రీలై యున్నారు. చూడుడు :

"స్త్రియః సతీస్తాన్ ఉమే పుంస ఆహుః పశ్యదక్షణ్వా న్నవిచేతదంధః
కవిర్యః పుత్రః సఈమా చికేత యస్తావిజానాత్ సపితుష్పితాసత్"

(ఋక్)

ఈ శ్రుతి తాత్పర్యము :- పురుషులు అగ్నిప్రధాన శరీరముం బట్టి పురుషు లనిపించుకొన్నను, శుక్ర ప్రధానమగు నాత్మం బట్టి వారిని స్త్రీలే యనవలయును. ఆత్మ - శరీరము యీ రెంటిలో నాత్మ ప్రధానముగ నెంచబడును. 'తద్వాద న్యాయము'చే నే సంస్థయం దేది ప్రధానమో ఆ సంస్థకాపేరు వ్యవహార్య మగును గదా ! ఇక అజ్ఞులు స్త్రీలను పురుషు లను చున్నారు. కన్ను లున్నవారి కీ రహస్యము తెలియును. "పశ్య దక్షణ్వా న్నవిచేతదంధః"

సరి : ఇప్పుడు మరింత చిక్కువచ్చి పడినదే. పురుషులు స్త్రీలు, స్త్రీలు పురుషులునా ? ఈ సమస్య జటిలత వదలు టెట్లు ? పురుషసంస్థ "యగ్ని ప్రధానము. సోమతత్త్వము గౌణముగా గలది" యనిపించుకొన వలయును. ఇందు కుపాయ ములు రెండు. అందు :

(1)పురుష శరీర మాగ్నేయము. దీనికి ప్రతిష్ఠ జలము. "అద్భ్యః పృథివీ" యని పృథివీ స్థానీయ శరీర పిండమున కుపాదాన మప్తత్త్వమని శ్రుతి వచించెను. "ఋతేభూమి రియం శ్రితా" దీనినే స్థిరపర్చును. ఇట్లు ఆగ్నేయ శరీరమునకు ప్రతిష్ఠ

అప్తత్త్వరూప సోమము. అనగా శరీర పిండమందు ప్రాణము, భూతము నని రెండుభాగములు. దృశ్యభాగము భూతము. దానికి బ్రతిష్ఠారూపమగు నదృశ్యతత్త్వము ప్రాణము. భూత భాగ మాగ్నేయము. దీనికి బ్రతిష్ఠ ఆప్య (సౌమ్య) ప్రాణము.

ప్రతిష్ఠాలక్షణ మగు నీ యాప్యప్రాణము శరీరమునుండి వెడలిపోవు నపుడు శరీరము నష్ట మగును. ప్రాణాత్మక మగునీ యాప్యసోమమును, పవిత్ర - బ్రహ్మణస్పతి - అంభః, అని వ్యవ హరింతురు. దర్భ, గంగ, సువర్ణము, మృగచర్మము మొదలగు వాని బవిత్రత కీయంభస్సే యాధారము. ఆయావివరములు ఆయాశీర్షికల క్రింద జూడవచ్చును.

అంభస్సు ఈభూతశరీర ప్రతిష్ఠగా నున్నంతవరకు శరీర మందు దూషిత కీటాణువులు చేరవు. అటుగా కున్నచో శరీరము కుళ్లిపో నారంభించును. తప్తతనువునం దీయంభస్స త్త యుండును. అతప్తతనువునందు (అగ్నితాపశూన్య శవశరీరమునందు) ఇది యుండదు. ఈయంభస్స్వరూప మీశ్రుతియందు చూడనగును.

* "పవిత్రంతేవితతం బ్రహ్మణస్పతే ః ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః అతప్తతనూ ర్నతదామో అశ్నుతే, శ్రుతాసఇద్వహంతః తత్సమాసత"

ఇంతకు :—ఆగ్నేయ భూతపిండ ప్రతిష్ఠ 'పవిత్ర' నామక

* సంప్రదాయముంబట్టి తప్తచక్రాంకన పరముగ విశిష్టాద్వైతులు ఈమం త్రమును సమన్వయింప జూచుట యవైజ్ఞానికము; అవైదికము. శరీరమందు మచ్చ మోక్షదాయకమా ? "అంధేనైవ నీయమానా యథాంధాః" యన్నది వేరు. "యదేవ విద్యయాకరోతి శ్రద్ధ యోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" యన్నది వేరుగదా!

మగు నీ యాప్యప్రాణ మని భావము. జీవనదశయందును, అస త్ప్రవర్తన, మిథ్యాభాషణ, అగమ్యాగమన, అభక్ష్యభక్షణ, అస్పృశ్యాస్పర్శన, ఆది ధర్మవిరోధి కర్మలచే నీపవిత్రమగు నాప్యప్రాణమున కాఘాతము కలుగును. అట్టిచో "అరే! వీనికి నీరు దిగిపోయినది" అందురు. కనుక జలము భూతశరీర ప్రతిష్ఠ యని తేలినది.

శరీరమి ట్లయినది. ఇక రెండవది 'సౌమ్యశుక్ర'ము- ఇందును భూతము ప్రాణము నని రెండు భాగము లున్నవి- ఇందలి భూతభాగము సౌమ్యము. దీనికి బ్రతిష్ఠయగు ప్రాణ మాగ్నేయము. బాహ్యభాగ మాగ్నేయ మగుచో నంతర్భాగము సౌమ్యముగ నుండుటన్నది యొక సామాన్యానుగమ నము. ఇట్లే బాహ్యము సౌమ్యమగుచో నాంతర మాగ్నేయ ముగ నుండుటయు నగును. ఉదాహరణమునకు జ్వరార్తుని చూడుడు :—జ్వరమనగా :-లోపలి వేడి పైకుబుకును, శరీరము యొక్క యాప్యభాగము హృదయస్థానమున జేరును. అందు వలన హృత్కంపము కలిగి చలితోచును. ఇది జ్వరపూర్వావస్థ. బయటికి వేడి, లోపలచలువ, యిదేజ్వరము. మూలాగ్ని మొదలుచెడదు, కేవలమభిభవము మాత్రమే. అందువలన నగ్ని మందగించును. తత్సన్నిహిత జాఠరాగ్నియు మందమగును. ఆస్థితియం దన్నాహుతి నది పచనముసేయ జాలదు. చివర కట్టి యతప్తాన్నము అగ్నిమాత్రల మరింత నిర్బలముల గావించును. జ్వరము పెరుగును. అటుగాక :—అన్నాహు త్యవరోధము

ావించినచో హృదయమూలాగ్నియొక్క స్వాభావికోత్తేజనచే
ాఠరాగ్ని క్రమప్రవృద్ధి నొంది కాలాంతరమున తదావరణరూప
'తసోమమును బయటికి ద్రోసివేయును. జ్వరము శాంతించును.
'నుక జ్వరమున కాయుర్వేదము లంఘనం పరమౌషధ మన్నది.
ఆకలి లేకుండ దిన్న యన్నమును జాఠరాగ్ని పచనముసేయలేక
ోగా సోమవేగము పెరుగును. జ్వరముదయించును. ఇట్లు
జ్వరమజీర్ణమున కుత్తేజక మగును. జ్వరము శాంతిలు
విహ్నము స్వేదము. ఇట్లు హృదయగతమగు నాజల మపుడు
బయటకురాగా, బయటివేడి హృదయమును జేరును. శరీరతాప
మణగిపోవును. కనుక పైసూత్రము సరియైనదే యగును.

ప్రకృతిమండలము శీతముగ నున్నపుడు మన శరీర మగ్ని
మయమై యుండును. శీతకాలమున నోటినుండి యావిరి వచ్చును.
అట వేడియుండుచో నిట చలియుండును. వేసవియందు చెమట
పోడుచు శరీరము చల్లగానుండును గదా! పైకి సౌమ్యుడు
లోపల కఠోరస్వభావమున నుండును. పైకి గోపముగ నుండు
వాని లోపల వట్టిదే. పైకి భయానకుడగు రుద్రుడు లోపల
కేవలము భోలాబాబా (ఉబ్బులింగడు). వెంటనే ప్రసన్నుడై
వరప్రదానము గావించుట యితని స్వభావము. విష్ణువు పైకి
శాంతుడు, సౌమ్యుడు. లోపల మహాకఠోరుడు, యుక్తిపరుడు.
ఘోర పరీక్ష సేయక వరదానము సేయడు. మెత్తగ తియ్యగ
మాటాడువాడు భయంకరుడు. స్పష్టవాది,కటుభాషియగువాని
హృదయము నిర్మలము. మంచి చెడ్డల కిదియొక నికషణము.

ఈ ప్రాకృతిక నికషణము నాధారముగ గొని, శుక్ర బాహ్యభాగము సౌమ్య మగుచో, దాని ప్రాణభాగ మాగ్నే యమే యగును. శుక్ర నిర్మాణ మోషధి రూపాన్నము వలన నగును. శారీరాగ్నియం దాహుతమగు నన్నమే రసాసృఙ్మాంసాది క్రమముం బట్టి శుక్రరూప పరిణతి నొందును. ఓషధులు సౌమ్యములు. కాని వీని గర్భమం దగ్ని యుండును. "ఓషం : (ఉషదాహే : దాహస్తాపః, తాపోఽగ్నిః, తం) ధత్తే" యని మోషధిశబ్ద నిర్వచనము. తద్రూపాంతరమగు శుక్రము నట్టిదే కావలయును. భూతసౌమ్య శుక్రప్రతిష్ఠ తద్ గర్భీభూతమగు నీ యాగ్నేయ ప్రాణమే. శుక్రస్థితమగు దీనిని 'వృషా' యందురు. ఇది శుక్ర వర్షణముచే ప్రజోత్పత్తి యందు సమర్థమగును. ఏ పురుషుని శుక్రమందు వృషాప్రాణము మూర్ఛితమగునో తన్మూలమున ప్రజోత్పత్తి కాదు. ప్రజోత్పత్తి కారణము శుక్రము కాదు. వృషా ; అది లేని పురుషుడు షండుడు, నిర్వీర్యుడు. ఈ వృషచే పురుషుని స్త్రీయనక పురుషు డనదగును.

పురుషునందు శరీరము - శుక్రమునని రెండు విభాగములు. ఇవి వరుసగ నాగ్నేయము - సోమము నై యుండి యొక్కొకటియు మరల నాగ్నేయ - సౌమ్యములని రెండు భేదము లయినవి. ఈ దృష్టితో పురుషుని యుపక్రమోప సంహారము లగ్నిగనే యుండును. శరీరము శారీరప్రాణము ; శుక్రము శుక్రగత ప్రాణము అను నీ నాల్గును క్రమముగ ఆగ్నేయము, సౌమ్యము - సౌమ్యము, ఆగ్నేయము అగును. ఇటు నటు అగ్ని

మధ్య రెండు సోమములు. అగ్నిపురుషుడు రెండువైపుల బురుషుడు. ఇపుడు చూడుడు. పురుష సంస్థయందు ప్రధానమగ్నితత్త్వమా? సోమతత్త్వమా? అగ్ని ప్రధానమని పురుషుడే యందుము. స్త్రీ (సోమము) అగ్నితంత్రమై యున్నందున పరతంత్ర మందుము.

| | | | |
|---|---|---|---|
| శారీరము | 1. శరీరము | —అగ్ని-(పురుషుడు)—య ఏవాదిః | అగ్నిప్రధానః |
| | 2. ఆప్యప్రాణము | —సోమము-స్త్రీ | |
| శుక్రము | 1. శుక్రమ్ | —సోమము-స్త్రీ | పురుషః |
| | 2. ఆగ్నేయప్రాణము | —అగ్ని-(పురుషుడు)—సఏవాన్తః | |

శుక్రదృష్టితో స్త్రీ యనదగిన పురుషుడు పై జెప్పిన మొదటి యుపాయముచే బురుషుడగుచున్నాడు. ఇక:

## రెండవ యుపాయము.

### సంవత్సర మండలము.

ఇందుండియే పురుష నిర్మాణము జరిగినది. కనుకనే పురుషుని యజ్ఞమందురు. ఆ యజ్ఞ విషయము మరొకచో జూడవచ్చును. దేనివలన బురుషశరీరము నిర్మింపబడు చున్నదో యట్టి దృశ్యమగు నర్థ ఖగోళాత్మకార్థ సంవత్సరము యొక్క యుత్తర భాగమందు సోమమునకు, దక్షిణమం దగ్నికిని, ప్రధానత కలదు. మధ్యవృత్తము విషువత్. ఈ యర్థ విషువద్వృత్తమునుండి వెన్నెముక (మేరుదండము) నిర్మితమైనది. ఉత్తర మండలి సౌమ్య సంవత్సరముచే శరీరోత్తరభాగము (ఎడమ) దక్షిణ మండలి యాగ్నేయ సంవత్సర భాగముచే దక్షిణ పార్శ్వము (కుడి) నిర్మితము లయ్యెను.

శరీరమందు కుడిభాగము బరువు. ఎడమభాగము తేలిక. అంతర్బాహ్యము లందలి ప్రతి యవయవము నందును ఈ భేద ముండును. కుడిభాగము పెద్ద; పుష్టము. ఎడమభాగము చిన్నది, దుర్బలము. ఇందుకు కారణము పురుష యజ్ఞ వివరణమున జూడవచ్చును. గాని ప్రస్తుతము దక్షిణభాగ మాగ్నేయ మగు టచే బలవంతము ప్రధానమునై యున్నదనియు, వామభాగము సౌమ్యమగుటచే నిర్బలము గౌణమునై యున్నదనియు తెలిసి కొన్నచో జాలును.

స్థూల పర్వములంబట్టియే కాక, సూక్ష్మశక్తి దృష్టిం బట్టియు, నాలోచించినచో నుత్తరముకంటె దక్షిణభాగమే, యధిక శక్తికలదై యుండును. కుడి కున్న కర్మనిపుణత, యెడమ కుండదు. ఔపనిష దేంద్రరూప "చాక్షుష పురు షుడు"ను దక్షిణాక్షి యందే యుండును. కనుక నితనిని దక్షి ణాక్షిపురుషు డనియు నందురు. "యోయం దక్షిణేఽక్షన్ పురుషః" (బృహ)

మన దైనికచేష్టలందలి యనుభవముచే గూడ దక్షిణ భాగ ప్రధానతయే కన్పట్టును. ఇక వామభాగ మింతుకు విప రీతము. సౌమ్యము అనగా సోమప్రధానము. గౌణము. ఇత్యాదు లన్నియు పాఠకులు స్వయముగా నూహింపగలరు. వామ నేత్రము నందు పైనిజెప్పిన చాక్షుషపురుషుని పత్నియుండును. దాని నింద్రపత్ని యందురు. "యఏషవామనీః నఏషవభా మనీ" అన్నట్లు ఇంద్రపత్నిని భామనీయందురు. ఎడమకాలికి

కుడికా లాధారము. కృష్ణభావభంగి యందు, సవ్యపాదము నాశ్రయముగా జూచెదము. ఆయీ కారణములన్నిటిచే వామ భాగస్థ సోమభాగ మీశరీరసంస్థ యందు గౌణ మనవచ్చును.

మరియు :—అగ్ని వికాసధర్మము గలదనియు, సోమము సంకోచధర్మము గల దనియు ననుకొంటిమి. కనుక పురుష దక్షిణభాగ మగ్నిప్రధాన మగుటచే వికాసవృత్తి కనుయాయి. వామభాగము సోమప్రధాన మగుటచే సంకోచవృత్తి కనుగా మిగా నుండును.—సోమమున్న యుత్తరదిక్కు ఊర్ధ్వప్రదేశము. అగ్నియొక్క దక్షిణదిక్కు అధఃప్రదేశమునని యెరుంగుదుము. ఊర్ధ్వస్థసోమ మధస్థవహ్ని నాధారముగ గొనియుండును.

పురుష శరీరముయొక్క రెండుభాగము లందు నగ్ని ప్రధానతయుండి అగ్నితత్త్వమే పురుషుడై యున్నపుడు, స్త్రీ పురుష భావములు రెండు నున్నను పురుషుని పురుషు డనక స్త్రీ యే యందుము. ఇట్లు (1) శుక్రాధారభూతము, నుపక్రమ స్థానీయము నగు నాగ్నేయ ప్రాణముయొక్కయు, భూతాగ్ని రూపము, ఉపసంహారస్థానీయము నగు శరీరము యొక్కయు, ప్రధానతచేతను (2) దక్షిణపార్శ్వస్థాగ్ని ప్రధానతచేతను, అనగా నీరెం డుపాయములచేతను పురుష పురుషత్వము సురక్షిత మగుచున్నది. ఇట్లు రుద్రాగ్ని సంబంధము గల వృషా తత్త్వము యొక్కయు, తత్ప్రధానత గల పురుషవర్గము యొక్కయు వివేచన ముగిసినది. ఇక యోషాతత్త్వమునకు తత్ప్రధానతగల స్త్రీవర్గమునకు నాలంబన మైనట్టియు, శక్తిఘన

మగుటచే అశక్తిశబ్ద వాచ్యమై రుద్రపురుషుని శివునిగావించు నట్టియు, నా సోమతత్త్వము నంతర్దృష్టితో విచారింతము.

సోమాహుతి లేనపుడు రుద్రాగ్ని కాలాంతరమున సోమరూప స్త్రీభావపరిణతి నొందు ననియు, అగ్ని చరమసీమ యందు సోమ మగుననియు నిదివర కనుకొంటిమి. సోమ స్థితియు నింతే. అగ్నిసంబంధ ముండు నంతవరకే దాని స్వరూప రక్ష. అగ్నికి బ్రధానస్థానము కేంద్రము. సోమవ్యాప్తిస్థానము పరిధి. అటనుండి సంకోచధర్మముగల సోమము క్రమక్రమ ముగ కేంద్రముం జేరుచుండును. ఈసంకోచభావ మగ్నిసంబంధ మున్నంతవరకు సమముగ నుండి యదిలేనపుడు సంకోచ చరమ సీమం జేరి యది (సోమము) విస్ఫోటన కారణమై యగ్నిరూప మున బరిణతి నొందును. వికాసాంతిమ పరిణామము సంకో చము. అగ్నియొక్క యంతిమపరిణామము సోమమగు నట్లు సంకోచమున కంతిమపరిణామము వికాసము, సోమాంతిమ పరిణామము అగ్నియు నగును.

అగ్నిఋతువు (గ్రీష్మము) చరమసీమం జేరి సోమర్తు (వర్ష-శీతర్తు)వగు నట్లు శీతర్తువు చరమసీమం జేరి గ్రీష్మర్తు కారణ మగును. బలవదగ్న్యాశ్రయమున దన స్వరూపము నిల్పుకొను, బలఘునసోమము, తదుపేక్షచే స్వయముగ (నగ్ని)- రుద్ర మగును. రోదనకు మొదలిడును. భోగ్యము భోక్త యైనది. ఇందువలన శివతత్త్వవికాస మగ్నిషోమ సమన్వ యముపై నాధారపడియున్న దని తేలును. సోమము నుపేక్షించి

అగ్నియు, అగ్ని నుపేక్షించి సోమము నేమ్చును. అగ్నిషో మాత్మ యజ్ఞ ముచ్ఛిన్న మగుచో రుద్రావతారమై ప్రళయ దృశ్య ముపస్థిత మగును. దాని రూపము నేడు మనయెదుట నున్నది.

బలఘన మగు నబలసోమమునకు స్త్రీతో సంబంధ మున్నది. అదృశ్యమగు నర్ధఖగోలీయ చాంద్రపారామమే స్త్రీ స్వరూప సంపాదకము. కనుక స్త్రీని సౌమ్య అబల యందురు. నామమాత్రమునకే గాని వాస్తవమున నబల శక్తిపుంజ మై యున్నది. కారణము స్పష్టమే, ఎట్లన :—స్త్రీశరీరము సౌమ్యము. కాని, ఆత్మ ఆగ్నేయము. పురుషప్రతిష్ఠ శుక్రమైనట్లు స్త్రీకి బ్రతిష్ఠ శోణితము. రక్తవర్ణముగల యాగ్నేయ మంగళగ్రహ ప్రాణయుక్త శోణితము సాక్షాత్తుగ నగ్ని. ఇదే స్త్రీయొక్క యంతర్జగత్తు- ఆత్మయు నై యున్నది. అనగా :—స్త్రీయొక్క భౌతిక దృశ్య శరీరము సౌమ్యము. అంతర్జగద్రూప శోణిత మాగ్నేయము. శోణితక్షయము స్త్రీకి నాశకారణము. తద్ర క్షయే స్థితిహేతువు. ఈ బలవంత మగు శోణితాగ్నిచే అబల యగు స్త్రీ బలవతి యగుచున్నది.

దీనింబట్టి స్త్రీబాహ్యజగత్తు (సౌమ్యశరీరము) ఆక్రమ ణయం దసమర్థము. అంతర్జగత్తు ఎంతో ఉగ్రము. శరీరము నిర్బ లము. (సౌమ్యము) ఆత్మ సబలము. (ఆగ్నేయము) ఈ యగ్ని తత్త్వ రూపాంతర మగు మనస్సు- అందు స్థిరభావోదయము— తదనుగామియగు సంకల్పస్థైర్యము—తదీయ సఫలత- ఇవి

మాతృరూప స్త్రీకి స్వయంభువులగు భాగ్యములు. కనుకనే "బుద్ధి స్తాసాం చతుర్గుణా" యందురు. కల్యాణవాంఛ గలదెవ డీబుద్ధిరూప మాతృశక్తికి వందనము సేయడు?

"యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః" (సప్తశతీ)

స్త్రీ - స్త్రీ సాముఖ్యమున సజాతీయాను బంధముచే నుగ్రత యుండక పోవచ్చును (సవతులందు తప్ప). కాని, దౌర్భాగ్యముచే నే పురుషుడైన స్త్రీకి ప్రతిస్పర్థిగ నిలువబడినచో లేదా, తన యవివేకమున నామె సౌమ్య శరీర గర్భితో గ్రాగ్నిని రవుల గొల్పినచో సర్వనాశమునకు బాత్రుడగును. మాతృశక్తియొక్క యంతర్జగత్తు మేలుకోనంతవరకే క్షేమము. దానిని మేలుకొల్పు వాడందాహుతి కావలసినదే.

ఇతిహాస మిట్టి సర్వనాశము రుచిచూచిన వారి చరిత్రల నెన్నిటినో చెప్పియున్నది. ద్రౌపది యవమానమునకు బ్రాయశ్చిత్తము నేటివర కింకను పూర్తికాలేదు. భారతీయ పురుషవర్గము నేడు నా దోషమునే యనుగమించుచుండుట. లజ్జా ఖేదా వివేకములకు విషయము. ఈ దోషమును నివారించుటకే నేటి సంస్కరణ ప్రియులనుండీ యవైజ్ఞానికము, అప్రాకృతికము, కనుకనే రోగ వర్థకమునగు స్త్రీ స్వాతంత్ర్య వాదము జన్మించి యుండు ననుటలో నాశ్చర్య ముండదు; దాని పరిశోధన కొరకే యీ మౌలికవాదము నెత్తవలసి వచ్చినది.

ఇప్పటికి స్త్రీయొక్క పాంచభౌతిక శరీర పిండము సౌమ్యమనియు దానికి బ్రతిష్ఠయగు శోణిత మాగ్నేయమనియు

స్పష్టమయినది. సోమము యోష యగుటచే స్త్రీ. అగ్ని వృషా యగుటచే బురుషుడు. సోమరూప స్త్రీశరీర ప్రతిష్ఠ అగ్నిరూప శోణితము. కనుక పురుషుడు స్త్రీకి బ్రతిష్ఠ. ఈ యాధారముపై మనము స్త్రీలనుకొనువారు సౌమ్యశరీర దృష్టితో స్త్రీలేయైనను అంతః ప్రతిష్ఠారూప శోణితాగ్నిం బట్టి యాత్మదృష్టితో బురుషులే యనవచ్చును.

ఇట నొక పక్షపాత విషయమేమన "ఆత్మదృష్టిచే బురుషుడు స్త్రీ. అయినను పురుషు డనుచున్నారు" అని "స్త్రియః సతీస్తాం ఉమేపుంస ఆహుః" ఇత్యాది రూపముచే శ్రుతి స్పష్టముగా పురుషులను స్త్రీలని యవమానించినది గదా! స్త్రీల విషయమున గూడ మీరు పురుషులు. ("పురుషాః సంతః త్తే ఉమే స్త్రియ ఆహుః") అనవలదా? అనలేదు, పోనిండు. పురుషాత్మ నిర్బలమనియు, స్త్రీయాత్మ సబలమనియు నెరింగిన యాశ్రుతి పురుషు డవమానము సహించుననియు, స్త్రీ సహింప దనియు ననుకొని యుండునేమో! కానిండు.

ప్రధానభూతమగు నాత్మదృష్టితో స్త్రీసంస్థ యాగ్నేయి యగునపుడు దానిం బురుషుడందురు. నేటినుండియు ప్రతిస్త్రీయు దన్ను బురుషు డనుకొనును. ఎవరి వేషములు, తలపులు వారి కింపు గదా? పురుషజాతి స్త్రీయన్నంతలో క్షుబ్ధము గావచ్చును తచ్ఛాంతికి రెండుపాయములను పైని జూపియుంటిమి. మరి స్త్రీజాతి పురుషోపాధిచే శాంతించునా? అయినను వారి స్వరూప రక్షకు గూడ నేదో యుపాయముం జూతము.

పూర్వోక్త పురుష సంస్థా పరిభాషానుసారముగనే స్త్రీ యొక్క సౌమ్య శరీరము ఆగ్నేయ శోణితమును, ప్రాణ భూత భేదముచే రెండు రెండు విభాగములుగ నున్నవి. సౌమ్యదృశ్య శరీరము భూతభాగము. దాని కాధారమగు ప్రాణ మాగ్నేయము. ప్రత్యక్షముగ పురుష శరీర మగ్నికృపచే కర్కశ మయ్యు హీనవీర్యముగ నుండును. ఏమన దీనికి మూల ప్రాణ మాప్యము(సౌమ్యము) కనుక నిర్బలము. కనుక ప్రబలాఘాతము లోర్వజాలదు.

ఇక స్త్రీశరీరమో, సోమానుగ్రహముచే కోమలమయ్యు వీర్యయుక్తము. ఒకమాత్రపు వ్యాఘాతముల నది లెక్క సేయదు. ఏమన దీనికి మూలప్రాణ మాగ్నేయము. అగ్ని బల వంతము. ఇది శరీరము నాఘాతము నుండి రక్షించును. ఈ శరీర ప్రతిష్ఠాదృష్టితో స్త్రీ సౌమ్యమై స్త్రీ యనిపించు కొనును.

ఇక శోణిత భూతభాగ మాగ్నేయమే, కాని, యందలి ప్రాణముసౌమ్యము. దీనిని 'యోష' యందురు. పురుషశుక్ర మందలి వృష యు, స్త్రీ శోణిత మందలి యోష యు మిథున భావము నొందిన ప్రజోత్పత్తి యగును. దోషదూషితము లగుచో నీరెండును వ్యర్థములే. సంతాన ప్రతిబంధకములే. శుక్రశోణితశుద్ధి యోషావృషల శుద్ధియే. ప్రజాతంతువు దాని వలననే సురక్షితము కాగలదు.

సౌమ్యశుక్రస్థిత మగు నాగ్నేయప్రాణము 'పుంభ్రూ

ణము' ఆగ్నేయశోణిత మందలి- సౌమ్యప్రాణము 'స్త్రీ ప్రాణము'- శుక్రశోణితము లీరెంటికి పోషకములు. అవి ప్రవృద్ధము లగుచో నివి బలిష్ఠములుగ నుండును.— పుంప్రాణము పురుషుడు. ఆగ్నేయము. దీని సమృద్ధి? శుక్ర సమృద్ధింబట్టి యుండును. శుక్రము? సౌమ్యము. కనుక స్త్రీ. అట్టి స్త్రీ సమృద్ధి, అభ్యుత్థానము, అభ్యుదయమునే పురుషసమృద్ధికి అభ్యుత్థానమునకు, అభ్యుదయమునకు ప్రధానకారణము. ఇక:- స్త్రీప్రాణమో! స్త్రీ- సౌమ్యము నై యున్నది. దీని సమృద్ధి? శోణితవృద్ధింబట్టి యుండును. శోణితము? ఆగ్నేయము కనుక బురుషుడు. మఱి :— స్త్రీసమృద్ధి అభ్యుత్థానాదులకు పురుషుని సమృద్ధ్యాదు లాధారములు. ఇదే దాంపత్యభావ మౌలికరహస్యము. అర్ధనారీశ్వర సమృద్ధవైభవము, ఇదే. ఇదే విశ్వశాంతికి మూలప్రతిష్ఠ.

పై రెండు ప్రాణములును మిథునభావము నొందు నపుడగు సంఘర్షణమునం దేది ప్రబల మగునో అది రెండవదానిని మ్రింగివేసి తన రూపముగ బరిణమింప జేయును. కనుక వంశరక్ష గోరువాడు, స్త్రీని సమాధానపర్చవలయును. సౌమ్యయగు దాని యాశీర్వాదముచే శుక్రభావము సమృద్ధముగ నుండి పుంప్రాణ వృద్ధికి గారణమగును. ఇచ్ఛయు సఫలమగును. సంఘర్షణయందు రెండుప్రాణములు సమము లగుచో సంతానమున రెంటిచిహ్నములు నుండును. ఇదే నపుంసకసృష్టి. ఈరెంటిలో నేది మూర్ఛిత మైనను మిథునభావము వ్యర్థమే యగును.

"అధిక్యే రేతసః పుంసః కన్యాస్యాదార్తవాధికే
నపుంసకం తయోః సామ్యే యథేచ్ఛా పారమేశ్వరీ" (భావప్రకాశము)
"పుమాన్ పుంసోఽధికే శుక్రే స్త్రీభవత్యధికే స్త్రియాః
సమేఽపుమాన్ పుంస్త్రియౌవా క్షీణేఽల్పేచ విపర్యయః" (మనుః)

ఈ స్త్రీస్వరూపముచే :- పురుష స్వరూపము నందు వలెనే యీ క్రింది పరిలేఖంబట్టి స్త్రీని స్త్రీ యనవచ్చు ననియు అగ్నియగు పురుషు డీతంత్ర మం దుండుటచే పరతంత్రు డన వచ్చు ననియు దెలిసది.

| | | | | |
|---|---|---|---|---|
| శారీరము 1 | 1. శరీరము | —సోమము-స్త్రీ | యఏవాదిః | |
| | 2. ఆగ్నేయప్రాణము | —అగ్ని-(పురుషః) | సోమప్రధాన- స్త్రీ-స్త్రీ | |
| శోణితము 2 | 1. శోణితము | —అగ్ని-(పురుషః) | | |
| | 2. సౌమ్యప్రాణము | —సోమము-స్త్రీ | సఏవాన్తః | |

పురుషున కగ్ని - స్త్రీకి సోమము, తంత్రములు. ఎవరి తంత్రమందున్న వారు స్వస్వరూపముచే స్వతంత్రులే గాని పర తంత్రులు గారు. ఒకవేళ పరతంత్రు లన్నచో నిరువుర నన వలయును. జీవన ప్రతిష్ఠయగు మధ్యభాగ మాత్మ. ఆగ్నేయ పురుషునకు స్త్రీయగు సోమద్వయము మధ్యభాగము. కనుక నతని కది పరతంత్రము. ఉపక్రమోప సంహారములంబట్టి స్వతంత్రము. స్వః=అగ్నిః తంత్రో యస్య అనవచ్చును. మధ్యభాగ ముంబట్టి, పరః=సోమః తంత్రః యస్య, యని, పరతంత్రము. స్త్రీవిషయమునగూడ నిట్లే యూహింపుడు. ఇక నెవరి తంత్రమును వారు స్వతంత్రులు గనుక నొకరికొకరికి హెచ్చుతగ్గులు లేవు. ఇట్లిరువురును సనాతనవిశ్వమునకు సనాతన మిత్రులు.

సమాన వ్యసనశీలములు మైత్రికి ముఖ్యాదర్శములు గదా! వీనినే మన మహర్షులు: సర్వశ్రేష్ఠాదర్శములుగ నెంచిరి. 'సహాధర్మంచరతాం'

సమానధర్మాచరణము లేని యీ యాత్రికుల యాత్ర నీరసము, నిర్వినోదము, యాతయామము. ఈ స్వతంత్రదృష్టితో స్త్రీపురుషులం దెవరు స్వతంత్రులు? ఎవరు పరతంత్రులు? అనుట విలువలేని ప్రశ్న. వారి వారి యాగ్నేయ-సౌమ్య సంస్థలందుండి-అగ్ని-సోమానుబంధి ధర్మానుగమనము సేయుట కిరువురు స్వతంత్రులే కదా! ప్రస్తుత స్త్రీస్వాతంత్ర్య వాదమున కీదృష్టియున్నచో ఋషిసమ్మతమే, ఎవరిధర్మమందు వారున్నచో స్వతంత్రు లనుట కేవైజ్ఞానికుడు కాదనును? అటుగాక, సౌమ్యస్త్రీ ఆగ్నేయపురుష సంస్థవంకకు, ఆగ్నేయపురుషుడు సౌమ్య స్త్రీసంస్థ వంకకు వంగుచో ప్రతివైజ్ఞానికుడును లాభము కంటె హానియే యధిక మనును. ప్రకృతియొక్క గుప్తరహస్యముల తోడను, స్త్రీపురుష వాస్తవికస్వరూపజ్ఞానము తోడను, వారి ప్రాకృతిక యోగ్యతతోడను పరిచయములేనివా రెటులను కొన్న సంతోషమే.

స్త్రీపురుషు లిరువురకు నేయే యధికారములను అధికారమూలక విషమతలను బ్రకృతి తన చేతబెట్టికొని యున్నదో అవి యెన్నడు నెవరివలనను మారజాలవు. వృషాపురుషుడు రేతఃసేకాధికారి. అతనికి శ్మశ్రువులు జన్మసిద్ధములు, అతనిశరీరచన సంఘటనము ఇంద్రియవిభాగము వేరు. ఇక: యోష

స్త్రీకి శరీరసంఘటన మందు భేదము సరియే గదా! ఇక శ్రోత్రగ్రహణము, గర్భాధానము, మొదలగు నైయుక్తికాధికారములు పురుషులందు గల్పింపనైన జాలము.

రెండవదగు నధికారమూల విషమత యనగా:—ప్రకృతి మూలకము లగు పైనిజూపిన రెండు విషమస్వరూపముల యాధారమునను మహర్షులు దీని నావిష్కారము గావించిరి. ఇందు స్వతంత్రవాదులు శ్లోక్యము కల్గించుకోవచ్చును. గాని అందువలన నుపకారము గాక యపకారమే జరుగును. సమత—లేక- సమానాధికారములు జీవనసత్తోపయికములగు నాహార నిద్రాదిక కతిపయ పరిగణిత వ్యవస్థలందు మాత్రమే, స్త్రీపురుషులకే కాదు ప్రాణిమాత్రమున కధికారము కలది. కాని, యే మౌలిక ప్రాకృతిక ధర్మ మీ సమానాధికారులను, "అయం మనుష్య- స్త్రీ-బాలః- పశుః" ఇత్యాది రూప విషమతలందు విశేష భావములం బరిణతినొందించి యున్నదో, ఆవిశేషములకు గేవలాధికార మాయావిశేష ప్రాణులందే యుండును. అట్టి విశేషభావ రక్షకము లగు విశేషధర్మములను సమానాధికార మర్యాదాయుక్తములుగ జేయుట యా సమానాధికారుల యున్మత్త ప్రలాపమాత్రము. ఈదృష్టితో ప్రస్తుత స్త్రీస్వాతంత్ర్య వాదము నట్టిదే గాని పురస్కారపాత్రము కాదు.

ఇంతకు బూర్వమే, స్వతంత్రు లెవరు, పరతంత్రు లెవరు? అను ప్రశ్న కవకాశమే లేదనుకొంటిమి. ఈ ప్రశ్న యెప్పుడారంభ

మగును? స్త్రీ పురుషుల దాంపత్యభావ విచారణ జేయ బూను కొన్నప్పుడు గదా! వారు స్వతంత్రులో పరతంత్రులో మిత్రులో మరేమో యగుదురు గాక! ఈ తటస్థ సంబంధము దాంపత్య భావ సంబంధము గలది కాదు.

నిర్వివాద విషయ మింకొకటేమన దాంపత్యభావ విర హితముగ స్త్రీ పురుష సృష్టియే యసంభవము. అట్టిచో దాంపత్య భావానుగామియగు నిర్ణయమేదో అదే మాన్య మగునని యొప్పుకోవలెను. అనగా దాంపత్యభావ కాలమందు స్త్రీ పురుషు లిరువురియందు నెవ రేతంత్రము ననుగమింతురో ఆ తంత్ర మా దాంపత్య ఫలస్వరూప ప్రజాత్మక స్త్రీపురుషుల దనబడును. ఇక నా తంత్రము 'స్వ' కానిండు, 'పర' కానిండు.

కర్మ ప్రక్రియయందు స్వతంత్రుడగు వాడు కర్త యందురు "స్వతంత్రః కర్తా...క్రియాయాం స్వాతంత్ర్యేణ వివక్షితోఽర్థః కర్తాస్యాత్'అని వ్యాకరణము. కర్తయొక్క కర్మ సఫలమో విఫ లమో అగుగాక యది వేరుమాట. ప్రజోత్పత్తి యొకఫలము. దానికిసాధకమగు కర్మ పతిపత్నీ దాంపత్యభావము. అది మూల కారణము. ఈ కర్మకు నిరువురి సహయోగము కావలయును. కనుక దంపతీశబ్దముచే పతిపత్నులు గ్రహింప బడుదురు. అయి నను ఈకర్మయందు స్వతంత్రకర్త పతియే యని యంగీకరింప బడును. ఎట్లన:-ఈకర్మకు ప్రాథమిక ప్రేరణ పురుషునుండియే యగును.

1. పురుషఏవ స్త్రియ మనుధావతి న స్త్రీపురుష మను.
2. పశ్చాద్వై పరీత్యవృషా (పురుషః) యోషా మధిద్రవతి అనుద్ర వతి తస్యాం రేతః సించతి. (శత)
3. తస్మాదు స్త్రీపుంసోపమంత్రితా నిపలాశమి వైవ వదతి. (శత)
4. తస్మాదు స్త్రీపుంసోపమంత్రితా ఆరకాదివై వాగ్రేఽసూయతి.(శత)

రేతోవర్షణముచేతనే శుక్రగ తాగ్నేయప్రాణము 'వృష' యనబడును. కామజనిత కంపాత్మక క్షోభయే రేతమును స్వస్థాన చ్యుతము గావించును. కనుకనే రేతోవర్షక వృషా ప్రాణమును 'వృషాకపి' యనిరి. "తద్యత్ కంపమానో రేతో వర్షతి తస్మా ద్వృషాకపిః" (గోపథ) ఈ ప్రథమ ప్రేరణవలన వృషాప్రధాన పురుషుని దాంపత్యకర్మకు స్వతంత్రకర్త యందుము. ఇట్లు వృష స్వతంత్ర మగుచో యోష పరతంత్ర మని చెప్ప నక్కరలేదు. చివరకు ఈ దాంపత్యమున నుత్పన్న మగు పురుషసంతానము వృషా ప్రధానమై స్వతంత్ర మనియు, కన్యాసంతానము పరతంత్రమనియుజెప్పబడును. ఇదియొకదృష్టి.

ఇక రెండవదృష్టితో జూతము: ప్రతిద్వంద్వు లిద్దరి సంఘర్షణయం దెవ్వడు ప్రధానుడుగ నుండునో వాడే ప్రధానుడై స్వతంత్రు డనబడు నట్లు స్త్రీపురుషులు సౌమ్యాగ్నేయులగుట నన్యోన్యాదభావముచే ప్రతిద్వంద్వులు. పూర్వపరిభాష చొప్పున నీద్వంద్వములు నాలుగు. కాని, పురుషశరీ రాధారభూతాప్యప్రాణము పురుషశరీర మందును, స్త్రీశరీ రాధారభూతాగ్నేయ ప్రాణము స్త్రీశరీర మందు నంతర్యాతములుగ నెంచుటచే మూడు ద్వంద్వములు మాత్ర మగును. ఈపరి లేఖలను బరిశీలింపుడు :

| పురుష వివర్తము. | స్త్రీ వివర్తము. | |
|---|---|---|
| 1 ఆగ్నేయశరీరము-అగ్ని-పురుషుడు | సౌమ్యశరీరము-సోమము-స్త్రీ | 1 ద్వంద్వము |
| 2 ఆప్యప్రాణము-సోమము-స్త్రీ | ఆగ్నేయప్రాణము-అగ్ని-పురుషుడు | 1 ద్వంద్వము |
| 3 సౌమ్యశుక్రము-సోమము-స్త్రీ | ఆగ్నేయశోణితము-అగ్ని-పురుషుడు | 3 ద్వంద్వము |
| 4 ఆగ్నేయప్రాణము-అగ్ని-పురుషుడు | సౌమ్యప్రాణము-సోమము-స్త్రీ | 4 ద్వంద్వము |

1. { 1 ఆగ్నేయం-పురుషశరీరం-పురుషః
   2 సౌమ్యం-స్త్రీ శరీరం-స్త్రీ } ప్రతి ద్వంద్వలు-మొదటి ద్వంద్వము

2. { 1 ఆప్యప్రాణము-పురుషశరీర ప్రతిష్ఠ-స్త్రీ
   2 ఆగ్నేయప్రాణము-స్త్రీ శరీరప్రతిష్ఠ-పురుషుడు } ప్రతి ద్వంద్వలు ద్వితీయ ద్వంద్వము

3. { 1 సౌమ్యం-శుక్రం-పురుష ప్రతిష్ఠ-స్త్రీ
   2 ఆగ్నేయం-శోణితం-స్త్రీ ప్రతిష్ఠ-పురుషుడు } ప్రతి ద్వంద్వలు తృతీయ ద్వంద్వము

4. { 1 ఆగ్నేయప్రాణము (వృషా) పురుషుడు
   2 సౌమ్యప్రాణము-యోషా-స్త్రీ } ప్రతి ద్వంద్వలు చతుర్థ ద్వంద్వము

1. { ఆప్యప్రాణగర్భిత మాగ్నేయం శరీరం-సోమాగ్ని మయం పురుషశరీరం పురుషః
   ఆగ్నేయప్రాణగర్భితం సౌమ్యంశరీరం-అగ్నీషోమమయం స్త్రీశరీరం-స్త్రీ } 1 మొదటి ద్వంద్వము

2. { 1 సౌమ్యశుక్రం-స్త్రీ
   2 ఆగ్నేయశోణితం-పురుషః } ప్రతి ద్వంద్వలు రెండవ ద్వంద్వము

3. { 1 ఆగ్నేయము-వృషా-పురుషః
   2 సౌమ్యము-యోషా-స్త్రీ } ప్రతి ద్వంద్వలు మూడవ యుగ్మము

పైనిజూపిన మూడు ప్రతిద్వంద్వములందు నేది ముందుకు సాగుచున్నది? అందైన నేది ముం దాక్రమించుచున్నది? చివర దేని యాక్రమణకు ప్రధానత కలదు? మొదట వీనిని చూడుడు: 1 దాంపత్యభావోపక్రమ మూలాధారము దంపతుల స్థూలశరీరము. పురుషశరీర మాగ్నేయము. స్త్రీశరీరము సౌమ్యము. అగ్ని సోమముపై యాక్రమణ సేయుచున్నది. అనగా బురుషభావము స్త్రీభావముపై నాక్రమణ సేయుచున్నది. ఇందు పురుషభావమునకు ప్రధానత యున్నది. 2 ఈ మొదటియాక్రమణకు బిమ్మట పురుషశుక్రము స్త్రీశోణితము నందు సిక్తమగును. సౌమ్యశుక్ర మాగ్నేయ శోణితము నాక్రమించుచున్నది. అనగా స్త్రీతత్త్వము పురుషతత్త్వము నాక్రమించుచున్నది. ఇందు స్త్రీభావమునకు ప్రధానత కలదు. 3 పిమ్మట సౌమ్యశుక్ర మందలి యాగ్నేయ ప్రాణమూర్తి వృష, యాగ్నేయ శోణిత మందలి సౌమ్యప్రాణమయియగు యోషపై నాక్రమణ సేయును. పురుషభావము స్త్రీభావము నాక్రమించును. ఇంతటితో సరి. పురుషభావమునకు ప్రధానత కలదు. ఈ యంతిమాక్రమణము త్రియుగ్మాత్మక దాంపత్య కర్మను ప్రజోత్పత్తిఫల రూపమున సఫలము గావించును.

మూటియందును ఆద్యంతములందు బురుషాక్రమణకే ప్రధానత యున్నది. ఇక మధ్య (రెండువైపులను పురుషాక్రమణచే బరతంత్రమైయున్న) స్త్రీయాక్రమణముకనుక పురుషుని స్వతంత్రకర్త ప్రధానుడు అందురు. స్త్రీని పరతంత్ర కర్త్రాను గామిని గౌణ యందురు.

పురుషునివలె స్త్రీయు దన సోమసంస్థయందు స్వతంత్ర యని మున్నే యనుకొంటిమి. కాని ఆస్వాతంత్ర్యము, పరతంత్ర మును దనరక్షకముగా గొన్నంతవరకే సురక్షితముగ నుండ గలదు. ఆర్యర్షులు స్త్రీస్వాతంత్ర్యము నపహరింప గోరుటలేదు. స్త్రీల స్వతంత్రసంస్థ సోమప్రధానమగుటచే ఋత మగుచున్నదై- యనృతము ప్రతిష్ఠాశూన్య మైయున్నది. కనుక వారొక ప్రతి ష్ఠిత సత్యము నాధారముగ గొని తమ స్వాతంత్ర్యము నుపయో గించుకొనుట యుచిత మనుచున్నారు. 'న స్త్రీస్వాతంత్ర్య మర్హతి' యనువాక్యమునకు భావమిదే. వారు స్త్రీ-పరతంత్ర యని యెన్నడు ననలేదు. పైగా: పురుషులకు వలె స్వతంత్రత స్త్రీలకు గూడ జన్మసిద్ధ మనుచున్నారు. ఇక పైవాక్యమునకు "స్త్రీస్వతంత్రగా నుండయోగ్యకాదు" అనగా స్త్రీతనస్వాతం త్ర్యము నుపయోగించునపుడు స్వయముగ గాక యొకానొక యన్యాశ్రయము గొని యుపయోగింప వలయుననియే భావము, "స్త్రీపుతచ్చు తద్ధిగేహాం వినష్టం" అన్న దీభావము తోడనే.

"అనాయకా వినశ్యన్తి నశ్యన్తి బహునాయకాః
స్త్రీనాయకా వినశ్యన్తి నశ్యన్తి బాలనాయకాః"

సంవత్సరమండలదృష్టితో తత్ప్రతిరూప దాంపత్యవిచా రము జేసినను, పురుషస్వతంత్రత, స్త్రీపరతంత్రతయు సిద్ధ మగును: ఎట్లన :- సాంవత్సర ఖగోళీయ దృశ్యార్ధమడలము నుండి పురుషసృష్టియు, అదృశ్య చాంద్రఖగోళార్ధభాగము

నుండి స్త్రీసృష్టియు వికాసము నొందెను. ఈదృష్టితో నెవరి సంస్థను బట్టి వారు స్వతంత్రు లనవచ్చును. కాని, యీ రెంటి సమష్టిరూప మగు సంవత్సరము స్వయముగా నగ్నిమూర్తి. ఇందు అగ్నిరూపపురుషుడు, సోమరూపస్త్రీయు, ప్రతిష్ఠితులై యుండుటచే సంవత్సరము నగ్ని యనుటతో సోమమయము ననవచ్చును. "సంవత్సరో వై సోమో రాజా: (కౌషీ) "సంవత్సరో వై సోమః పితృమాన్" (తై। బ్రా) ఇత్యాను లీవిషయమును స్పష్టముసేయును. అయినను, సంవత్సర మహాలికరూప మగ్నియే. దీని నగ్నియనక యజుఃపురుషు' డనిరి. (శత 10-5-2-1) ఇదే "తస్యవా ఏతస్యాగ్నే ర్వాగే వోపనిషత్" అన్నట్లు 'వాక్' అందురు. మొదట నీ యగ్నిమూర్తి వాక్ప్రజాపతి యేకాకిగ నుండెను. పిమ్మట నిది సృష్టికామనచే-అగ్నిరూప పురుషుడు, సోమరూప స్త్రీ యని రెండురూపముల బరిణమించెను. ("అర్ధేనపురుషోఽభవత్-అర్ధేననారీ" (మనువు) (ఆడం, ఈవ్) శ్రుతియు, 'సోఽపోఽసృజత వాచఏవ లోకాత్' వాగేవసాఽసృజ్యత" అని వాగగ్నియే ఆస్యసో మోపాదాన మన్నది. ఈ ప్రమాణము లన్నిటిచొప్పున వాఙ్మయము లేదా వాక్ప్ర ధానము, అగు సంవత్సరప్రజాపతిని అగ్నిప్రధాన మనవచ్చును. ఇదే ఆత్మ. సర్వత్రవ్యాప్తి దీనికే. ఈవచనమును పరికింపుడు.

(1) సర్వంవై సంవత్సరః (2) సంవత్సరఏవాగ్నిః (3) సంవత్సరో వై పితా వైశ్వానరఃప్రజాపతిః (శత) (4) వాక్సంవత్సరః (5) అగ్నిః సంవత్సరః (తాండ్య)

(1) ఈ సంవత్సర వాగగ్నిమూర్తియొక్క ప్రధాన భాగమే ఆగ్నేయపురుషుడు. గౌణభాగము సౌమ్యస్త్రీ. ఈదృష్టితో పురుషుడు స్వతంత్రుడు. (2) అగ్నియన్నాదము, సోమ మన్నము. ఈదృష్టిత్రోడను, పురుషప్రాధాన్య స్వాతంత్ర్య ములు సిద్ధములే. (3) అగ్ని సత్యము. సోమము ఋత మగు నన్నృతము. ఈదృష్టితోడను పురుషుడు ప్రధానుడు. (4) దక్షిణ పార్శ్వ స్థాగ్ని బలవంతము. ఉత్తరపార్శ్వస్థ సోమము నిర్బ లము. ఈదృష్టిత్రోడను పురుషుడు వీర్యశాలి. స్త్రీ అవీర్య.

ప్రకృతిసిద్ధములగు నీ కారణములన్నిటిచే స్త్రీపురుషుల పరతంత్రతా స్వతంత్రతలు వెలసినవి. స్త్రీకి దాయవిభాగమున కధికారమేలలేదు? సామాజిక, రాజనైతిక, ధార్మిక వ్యవహా రములందు పురుషునకు వలె పూర్ణస్వాతంత్ర్యము లేదేల? బాల్య-యౌవన- వార్ధక్యము లందు పితా, పతి, పుత్రరూప బంధము లేల? ఈ మొదలగుప్రశ్నలన్నిటికి సమాధాన మీపూర్వోక్తములగు నగ్ని-సోమములమౌలికవ్యాఖ్యలే. స్మృతి శాస్త్రము సామయికమనియు, పరివర్తనశీలమనియు ననుకొను వారు ఇది (స్త్రీ పారతంత్ర్యవిధానము) స్మృతికారుల కల్పన యనియు అపరివర్తనీయ వేదశాస్త్రమం దీప్రశంస లేదనియు ననుకోవచ్చును. అట్టివారి సంతుష్టికి విస్తరభయ ముచే గొన్ని మాత్రమే యగు నీ క్రింది ప్రమాణవచనము లుదహరింప బడినవి.

| పురుషసృష్టి-ఆగ్నేయీ (సంవత్సరము) | స్త్రీసృష్టి-సౌమ్యా |
|---|---|
| **పురుషః** | **స్త్రీ** |
| 1. పురుషోఽగ్నిః (శత) | 1. ఉత్తరతఆయతనా స్త్రీ (శత) |
| 2. ఏతావాన్ పురుషః యదాత్మాజాయా (తాండ్య) | 2. అనృతం స్త్రీ.... |
| 3. యద్వై పురుషవాన్ కర్మచికీర్షతి శక్నోతివై తత్కర్తుం (శత) | 3. కర్మవాఇంద్రియం వీర్యం, తదేతదుత్పన్నం స్త్రీషు |
| 4. పురుషః శతవీర్యః (తై. బ్రా.) | 4. అవీర్యావై స్త్రీ |
| 5. ద్విప్రతిష్ఠః పురుషః (గో. పూ.) | 5. పతయోహ్యేవస్త్రియై ప్రతిష్ఠా |
| **వృషా** | **యోషా** |
| 1. ఇంద్రోవైవృషా (శత) | 1. యోషావై సినీవాలీ (శత) |
| 2. వృషాహింకారః (గోప) | 2. పురంధ్రిర్యోషా (తై) |
| 3. వృషారేతఃసించతి (శత) | 3. యోషారేతోధత్తే (శత) |
| 4. దక్షిణతోవై వృషాయోషాముపశేతే | 4. యోషావైపత్నీ .. |
| 5. సమగ్నిరిధ్యతేవృషా | 5. నవై యోషాకంచనహినస్తి .. |
| **అగ్నిః** | **సోమః** |
| 1. యోవై రుద్రః సోఽగ్నిః (శత) | 1. శ్రీర్వై సోమః (శత) |
| 2. వీర్యంవా అగ్నిః (తై) | 2. పశవోహిసోమః .. |
| 3. పురుషోవా అగ్నిః | 3. భద్రా-తత్ సోమః (ఐత) |
| 4. వృషాగ్నిః-(శత) | 4. యోషావాఆపః (సోమః) (శత) |
| 5. అగ్నిర్వై రేతోధా (తై) | 5. తిరోఅహన్యాహిసోమాః (కా) |
| **అన్నాదః** | **అన్నమ్** |
| 1. అన్నాదోఽగ్నిః (శత) | 1. అన్నంపశవః (ఐత) |
| 2. అగ్నిర్వైదేవానామన్నాదః (తై) | 2. అన్నము శ్రీః (శత) |
| 3. అగ్నిరన్నాదోఽన్నపతిః (తై) | 3. శ్రియాప్రియం (సమదధాత్)(గోప) |
| 4. అగ్నిమన్నాదంవేద-అన్నాదోహైవ భవతి | 4. అన్నంవైసోమః (శత) |

5. అన్నాదా-తదగ్నిః (ఐత)

5. పరమన్నాద్యం యత్సోమః (కౌ)

దక్షిణాదిక్

1. దక్షిణామారోహ గ్రీష్మఋతుః
2. దక్షిణైవసర్వం (గోప)
3. అగ్నినాదక్షిణమ్ (ఐత)
4. దక్షిణాదిక్ ఇంద్రోదేవతా (తై)
5. దక్షిణాయాం దిశిరుద్రాదేవాః (ఐ)

ఉత్తరాదిక్

1. ఉదీత్తరాహవై సోమోరాజా (ఐ)
2. ఏషావై వరుణస్యదిక్ (తై)
3. యదుత్తరతోవాసి, సోమోరాజా భూతోవాసి
4. ఏషాఉవై శాంతాదిక్ (తై)
5. ఏషాహిదిక్ స్విష్టకృతః (శత)

పై నుదాహృత వచన పర్యాలోచనచే స్త్రీపురుషుల నిర్మాణమునం దెంతో భేద మున్న దని స్పష్ట మగుచున్నది. ఆభేద మీప్రాకృతిక స్వరూపములను రెంటి నొక స్రోతస్సున ప్రవహింప నీయదు. అగ్నిప్రధాను డగుపురుషుడు తన వికాస కారణముచే సంకోచభావ దూరుడుగ నున్నచో సోమప్రధాన యగు స్త్రీయొక్క సంకోచభావ మొకస్వాభావిక ధర్మమగు చున్నది. తన్మూలక లజ్జాశీలాది సద్గుణములే స్త్రీస్వరూప రక్షకము లగుచున్నవి. తద్బలమున బురుషుని సామయి క్రోధం డత నామె శమింపజేయగలదు. రెండువిరోధశక్తు లొకచో నమన్వితము లగుటే సమీకరణమూల శాంతికి మూలము. పురుషునివలె స్త్రీయు నాగ్నేయియగుచో విస్ఫోటనమే. పురుషుడు సౌమ్యుడు. స్త్రీ ఆగ్నేయి యగుచో సంస్థయేయుచ్ఛిన్న మగును. అగ్నిషోముల (ఉగ్రతా-శాంతుల) సమన్వయమే దాంపత్యజీవన శాంతి-తుష్టి-పుష్టులకు ప్రధానకారణము. తన రక్షాభారము పురుషస్కంధస్థితమై యున్నంతవరకే స్త్రీయొక్క

సౌమ్యరూప ముండగలదు. పరతంత్రమును దనకు రక్షణగ గొన్నపుడే ఆమె స్వరూపభూత మగు సౌమ్యతంత్రమును రక్షించుకోగలదు.

ఇంతవరకుజేసిన స్వతంత్రతా - పరతంత్రతా విచారణ వలన నేమితేలినది ? స్త్రీకి స్వాతంత్రమేమి ? పారతంత్ర్యమేమి? స్త్రీస్వరూపమును దూషితముసేయు నా పారతంత్ర్యమేమి ? శాస్త్రకారులు ఏయంశము లందు స్త్రీ పరతంత్ర యనుచున్నారు ?

"స్త్రీ నన్నివిధముల నశిక్షితగ నుంచవలెను. పురుషుడు తనధార్మిక, సామాజిక-రాజనైతిక కార్యము లందు స్త్రీయొక్క సలహాను గైకొన బనిలేదు. ఆమె నింటినుండి బయటికి బోనీయరాదు. ముఖావగుంఠము నామె వీడ కుండవలయును. పతి శ్వశుర దేవరాదుల యాజ్ఞల నీషన్మాత్రమును దప్పరాదు. ఇందేదైన వ్యతిరేక మగుపడినచో పురుషుడు తనయిష్టానుసారము దండింపవలయును." ఇది స్త్రీపారతంత్ర్యమునకు శాస్త్రీయార్థ మనుకొన్నచో శాస్త్రమందు వీని గంధమైన లేదని చెప్పెదము.

ఇక :- "స్త్రీతనకౌటుంబికధర్మమును, సంతానపాలనమును, గృహ్యకర్మలను ఉపేక్షించి, స్కూళ్లయందు, కాలేజీలందు, పురుషసమాజముతో పశ్చాత్య శిక్షానుగామి కావలయును. సామాజిక రాజనైతిక కార్యములందు లగ్న కావల

యును. పురుషాను శాసనమునకు విలువ నీయబనిలేదు. దేశ-కుల-ధర్మాచారముల నంటిపెట్టుకొని యుండక వేషభూషలం దిచ్ఛవచ్చిన రీతి నుండ వచ్చును. లజ్జాశీలాదులు నిరుపయోగ ములు. సుఖముగా నవ్వుచు ప్రేలుచు పురుషులతో దిరుగ వచ్చును. ఎవరినియంత్రణకు వీసమెత్తును లొంగబనిలేదు" అని స్త్రీస్వతంత్రత కర్థ మన్నచో దీని వాసనయు శాస్త్ర మందు లేదని ఖండితముగా జెప్పెదము.

పైనిజెప్పిన పరతంత్రతా స్వతంత్రతల రెంటి వ్యవహార శైలియందు భేదమున్నను, పరిణామదృష్టితో రెండును సమా నమే. (1) పూర్వోక్తపరతంత్రతయందు పురుషునివలన స్త్రీపశు భావ పరిణత యగుచున్నది. (2) ఇక బూర్వోక్త స్వతంత్రత యందు స్త్రీ తన యిచ్ఛచొప్పున బశు వగుచున్నది. పశుభావ దృష్టితో రెండునొకటే. తన యిచ్ఛానుసారము సేయుమనస్సు, తనపనిపై నన్యనియంత్రణ సహింపజాలదు. పరేచ్ఛంబట్టి వివశ ముగ గావింపబడు పనిపై పరేచ్ఛానియంత్రణ సంభవము కావచ్చును. ఇచ్చటగూడ నీస్థితియే యనుకొనుడు. పరతంత్రతా మూలక పశుభావముపై స్త్రీకి పురుషేచ్ఛానియంత్రణ- యనై చ్ఛికముగ నున్నది. కనుక దీని కవరోధము కలుగవచ్చును (కలిగింప నవకాశమున్నది) కాని, స్వతంత్రతామూలక పశ భావమందు, స్త్రీకి యిచ్ఛాస్వాతంత్ర్య మున్నది. అది యైచ్ఛి కము, కనుక దానిని సంస్కరించుట యసంభవము కాకున్నను సంభవమును గాదు.

సంస్కృతిపై నావరించిన యావరణము దొలగించుకొని యా సంస్కృతిని రక్షించుకొనుట సహజము. కాని, ఆవరణముతోబాటు మూలముం గూడబోగొట్టుకొని పరసంస్కృతిం బ్రవేశపెట్టుకొన్నప్పుడు సంస్కారమెవరికి ? పతితున కుద్ధారము సంభవమే. పతనమున జూర్ణమై పోయినపు డిక నేమి సేయవలయును ? తాను, తానుగా నున్నచో గదా ! సంస్కరణము ? తాను పరుడైనచో నిక నేముండును ? కనుక: ప్రస్తుత పరతంత్రతా స్వతంత్రత లందు పరతంత్రత చికిత్సకు సాధ్యము కావచ్చునేమో గాని, స్వతంత్రత మాత్రము (అనగా అది మహాపరతంత్రత) చికిత్సకు సాధ్యముకాదు.

ఇక : విందులు, పేరంటములు, తీర్థములు, మొదలగు వానికి దిరుగుట, బాలవివాహములు, వృద్ధవివాహములు, కన్యావిక్రయములు, వరవిక్రయములు, అంతజులతో దుర్వ్యవహారము, ఇత్యాదు లన్నిటి స్థితియు నింతే. ఇవన్నియు విశుద్ధ ధూషివాదము లనుటకు సందేహింపము. వీనివలన మన సమాజము, రాష్ట్రము ఎంతయో యెన్నివిధములనో చెడిన మాట నిజమే. ఈదురాచారములను తుడిచివేయు నవసర మెంతేని కలదు. నేటి కొందరు బుద్ధిమంతు లందుకు గటిబద్ధులై యుండుట ముదావహము. వారీవిషయము లందు గావించు నాందోళన హృదయపూర్వకముగ నభినందించుచు, నమ్రభావమున, గీతాచార్యుని యీ క్రిందిసూక్తులను వారియెదుట నుంచుట మాకర్తవ్య మనుకొను చున్నాము.

"నబుద్ధిభేదంజనయే దజ్ఞానాం కర్మసంగినాం
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మహార్హసి"

వర్తమాన భారతీయ సమాజము చాలవర కశిక్షితమై యున్నదని సంస్కరణవాదులు నొప్పుకొందురు. సంస్కరణము గూడ వారికే కావలయుననియు నొప్పుకొందురు. అందు బుద్ధిభేద ముత్పన్నము గావించుచో సంస్కరణముకంటె కలహము లధిక మగుట తథ్యము. ఉండవలసిన దీసమాజమందు, వ్యవహరింపవలసినది దీనితోడనే. సంస్కరణము దీనికే. కనుక దేశ కాల పాత్రాది వివేక ముంచుట యుచితము. లోకసంగ్రహ విరోధియు, బుద్ధిభేదజనకము నగు సంస్కరణము 'విషకుంభం పయోముఖం' అగును. కొన్నివందల సంవత్సరములనుండి యేర్పడిన కుసంస్కార మొకచిటికెలో పోగొట్టవలయు ననుకొనుట యవివేకము. ఇది యొకసూచన.

బాల్యవివాహము చెడ్డది. కాని బాల-యువ-పరిభాష యేమో ముందెరుంగుట మంచిది. శీత, గ్రీష్మ-ప్రధానదేశములం దిది యెట్లు విజ్ఞానసమ్మత మగునో చూడవలయును. సంస్కర్తలకు దివ్యదృష్టి యున్నచో చెప్ప నక్కరయే లేదు. అటుగాక వారిది విశుద్ధలౌకిక దృష్టియే యగుచో నిట్టి వివాదలకు నిర్ణయము సేయుపట్టులందు శబ్దప్రమాణము నాధారముగ గొనుటయే కర్తవ్యము "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" ఇది యొక సూచన.

ఈరెంటిని విడచిన సంస్కరణవాదము మనది. మన సమాజమునకు రాష్ట్రమునకు జెందినది కాదనియు ఇందు ధర్మ మను వంకతో నీవాదుల స్వార్థసిద్ధికి సాధనము లున్నవనియు నందుము. ఇందువలన మూలసంస్కృతికే భంగము తెచ్చిపెట్టు చున్నా రందుము. ఈక్రింది వాదములందలి మంచిచెడ్డలను బరిశీలింపుడు :-

1. "స్త్రీ యశిక్షితగ నుండుట యనుచితము."

నిజమే కాని, కాలేజీలయందలి పాశ్చాత్యశిక్ష పైదాని కంటె భయంకరము.

2. "ఘోషా ఆచారము అశాస్త్రీయము."

లజ్జాశీలశూన్యాట్టహాసాదు లింతకు మించిన భయావహములు.

3. "బాలవివాహములు చెడ్డవి."

యువతీపరిణయము లింతకంటె చెడుగులకు మూలములు.

4. "తీర్థయాత్రలు, విందులు, పేరంటములు మొదలగునవి కూడనివి.

ప్రీతిభోజనములు, వనభోజనములు, త్రేనీటివిందులు సర్వనాశ హేతువులు.

5. "అంత్యజులతో దుర్వ్యవహార మమానుషతకు గుర్తు."

స్పృశ్యాస్పృశ్య ఖాద్యాఖాద్యాది వివేకము లేకుండుట మరింత ముప్పు.

6. "భర్తల నిరంకుశత నింద్యము దండ్యము."

"విడాకులచట్టము మూలసంస్కృతినాశమునకు మొదటి హేతువు."

7. "రూఢివాదములు త్యాజ్యములు."

దానితో మూలసంస్కృతిపరిత్యాగము వినాశకారణము.

8. "అంతటను సంస్కారమావశ్యకము."

పాశ్చాత్యపద్ధతు లాదర్శముగా గొనకున్న మేలు.

9. "సంస్కరణ ముత్తమకర్మ."

లోకసంగ్రహ ముపేక్షించి బుద్ధిభేదము బుట్టించు సంస్కరణము జఘన్యకర్మ.

10. "మానససంకల్పానుసార సంస్కరణము."

శాస్త్ర (శబ్ద) ప్రమాణైకసార సంస్కరణ ముపాదేయము.

స్త్రీలు పూర్ణశిక్షితులు కావలయు ననుట ధ్రువసత్యము. ఏలయన:-నవమాసములవరకు దల్లిగర్భ మందుండు బాలకుని భావి జీవన మందలి యభ్యుత్థాన పతనములు మాతృ స్వరూపముంబట్టి యుండు ననుట సత్యదూరము కాదు గదా! పురుష సమాజప్రతిష్ఠ మాతృశక్తియే. దాని స్వతంత్రత ఆనందము బుద్ధివికాసము మొదలగు నవి పురుష సమాజమునకు మూలములు. మాతృజాతి యవమాన మొందు కొంప యది శ్మశానము, కులభూతినాశము, కర్మకలాపము

నిష్ఫలము.” ఇవి పురాతన ఛాందసుల యుద్గారములు. వీనిని సంస్కర్త లాలోచింపక కళంకము లనుచున్నారు. మరియు వారు మనువును స్త్రీపారతంత్ర్య సమర్థకునిగ నిరూపించు చున్నారు! మాతృశక్తియెడ మనువునకు గల యాదర మాతని యీ క్రిందివచనముల వలన దేటపడును.

1. పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః
2. యత్రనార్యస్తుపూజ్యన్తే రమన్తేతత్రదేవతాః
యత్రైతాస్తునపూజ్యన్తే సర్వాస్తత్రాఫలాఃక్రియాః
3. శోచన్తిజామయోయత్ర వినశ్యత్యాశుతత్కులం
నశోచన్తినయత్రైతా వర్ధతేతద్ధిసర్వదా
4. జామయోయానిగేహాని శపంత్యప్రతిపూజితాః
తానికృత్యాహతానీవ వినశ్యన్తిసమంతతః
5. తస్మాదేతాఃసదాపూజ్యాః భూషణాచ్ఛాదనాశనైః
భూతి కామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషుచ
6. సంతుష్టోభార్యయాభర్తా భర్త్రాభార్యాతథైవచ
యస్మిన్నేవకులేనిత్యం కల్యాణంతత్రవైధ్రువం
7. స్త్రియాంతురోచమానాయాం సర్వంతద్రోచతేకులం
తస్యాంత్వరోచమానాయాం సర్వమేవనరోచతే (3)
8. ప్రజనార్థంమహాభాగాః పూజార్హాఃగృహదీప్తయః
స్త్రియఃశ్రియశ్చగేహేషు నవిశేషోస్తికశ్చన
9. అపత్యంధర్మకార్యాణి శుశ్రూషారతిరుత్తమా
దారాధీనఃతథాస్వర్గః పితౄణామాత్మనశ్చహ. (9)

మన సంస్కర్తలు స్త్రీపారతంత్ర్య మనుకొన్నది నిజముగా స్వాతంత్ర్యము. స్వాభావికవికాసము నణచివేయు నియంత్రణ పరతంత్రత యనదగును. గాని స్వరూపరక్షణ సేయు మధురశాసనము ఆత్మవికాసహేతువై స్వతంత్రతయే యగును. మన్వాదు లట్టిదానినే విధించిరి. అది పరతంత్రతకాదు. 'రక్ష' యందుము. సౌమ్యబాలకునెడ దండ్రికివలె సౌమ్యస్త్రీయెడ పితా-పతి-పుత్రులకు రక్షాత్మక నియంత్రణము విధియైయున్నది. బాహ్య శత్రువులనుండి తప్పించుకొనుటకు సైనికవిశేషస్థల నియంత్రణము మన రక్షయగును గాని పరతంత్రత కాదుగదా! ఇది మనస్వరూప స్వాతంత్ర్యప్రతిష్ఠ. అనగా తాత్పర్యమిది :— స్త్రీరక్షాభారమేవ్యక్తులపై నున్నదో వారు శాసనబుద్ధితో గాక సేవకులై దానిని నిర్వహింతురు. పదేపదే పూజ్యభావము, పూర్ణసత్కారము, మధురనియంత్రణము.

మరొక చమత్కారము జూడుడు :—మనువు స్త్రీ ప్రాకృతిక స్వరూప పరిచితి గలవాడు. సౌమ్యాంతర్జగత్తుగల పురుషుని కటుశాసనబద్ధుం గావింపవచ్చును గాని ఆగ్నేయాంతర్జగత్తుగల సౌమ్యస్త్రీపై కటుశాసనము మాట దూరముగా నుంచి బలాత్కారభావనగల మధురశాసనమైనను సాగబోదు. పూజ్యభావయుక్త రక్షాభావము సంపత్తి సంగ్రహ వినియుక్తి ద్రవ్య శరీర శుద్ధి- ధర్మ్యకార్యాభిగమనము మొదలగు నతభావములను మధ్యస్థములను గావించుకొని స్త్రీయొక్క యంతర్జగత్తుపై నధికారము నిలువ బెట్టుకోవచ్చును. చూడుడు :—

1. నకంచిద్యోషితశ్శక్తః ప్రసహ్యాపరిరక్షితుం
ఏతైరుపాయయోగైస్తు శక్యాస్తాపరిరక్షితుం
2. అర్ధస్యసంగ్రహేచైనాం వ్యయేచైవనియోజయేత్
శౌచేధర్మేఽన్నపక్త్యాంచ పారిణాహ్యస్యవేక్షణే. (మను 9)

భారతీయశాస్త్రము లన్నిటిని వెదకుడు. స్త్రీలవిషయమున 'బరతంత్ర' శబ్దము గోచరింపదు. 'నస్త్రీస్వాతంత్ర్యమర్హతి' "అస్వతంత్రాఃస్త్రియఃకార్యా" "సర్వకర్మస్వస్వాతంత్రతా" అని యిట్లు వారిస్వతంత్రతోపయోగము స్వతంత్రముగ నుండరాదనియే యాదేశ ముండును. ఒకరక్షకుని దమకు బ్రతిష్ఠగా జేసికొన్నప్పుడే వారు వారి స్వతంత్రత సురక్షితము గావించుకొన గలరు. ఈ యంశము స్త్రీయొక్క సహజసిద్ధ సౌమ్యభావముంబట్టి సర్వమాన్య మనియే యంగీకరింప బడును.

మరియు నెక్కడెక్కడ స్త్రీపారతంత్ర్యోల్లేఖన మున్నదో అటనట పురుషుడు రక్షకు డనియే చెప్పబడినది. కాని శాసకు డనలేదు. చూడుడు: "పితారక్షతికౌమారే, భర్తారక్షతి యౌవనే, రక్షన్తి స్థావిరే పుత్రాః" "స్త్రియోరక్ష్యా విశేషతః" "జాయాంరక్షన్ హిరక్షతి" "రక్షేయుః తాఃసురక్షితాః" "యతన్తేరక్షితుం భార్యాం" ఇత్యాదులు చాలును.

'మనువు తాను పురుషు డగుటచే స్త్రీల నిట్లు పక్షపాతముగ జూచెనని ప్రలాపించువారికి:—"అయ్యా! మీావలె నతడు సంస్కర్తయే కాని, నిజమైన సంస్కర్త. స్త్రీజాతి

దోషము తమవలె నాతడును పురుషుల నెత్తినే రుద్దుచున్నాడు. అందు నైతిహాసిక ఘటనలను గూడ జూపుచున్నాడు. స్త్రీజాతి పతనమునకు బురుషులపరాధు లనియు, మధురజలముగల నది క్షారసముద్ర సంసర్గముచే క్షారమగునట్లు పురుషదోషము స్త్రీని దూషిత జేయు ననియు జెప్పుచున్నాడు. పురుషుని సద్గుణములచే స్త్రీయును బాగుపడగలదు. కనుక స్త్రీల మేలు గోరు పురుషుడు ముందు బాగుపడవలయు ననుచున్నాడు" అని చెప్పి యీ మనుసూక్తులు కానుకపెట్టికొందుము :

"యాదృగ్గుణేనభర్త్రాస్త్రీ సంయుజ్యేతయథావిధి
తాదృగ్గుణాసాభవతి సముద్రేణేవనిమ్నగా
అక్షమాలావసిష్ఠేన సంయుక్తాధమయోనిజా
శారంగీమందపాలేన జగామాభ్యర్హణీయతాం
ఏతాశ్చాన్యాశ్చలోకేఽస్మిన్ అపకృష్టప్రసూతయః
ఉత్కర్షంయోషితఃప్రాప్తాః స్వైస్వైర్భర్తృగుణైఃశుభైః"(మను 9)

ఇచ్చట నొక శంక కలుగవచ్చును :—"మున్ను చూపిన అగ్నిషోమ విజ్ఞానము చొప్పున సౌమ్యస్త్రీ శక్తిరూప యగు నపుడు ఆమెకు బురుషరక్షణతో బనియేమి? పురుషు నామెయే శక్తిమంతుని గావించుచున్నది గదా! అపూర్ణపురుషుని తన యర్ధాకాశ ప్రదానమున పూర్ణునిజేయు చున్నది గదా! అట్టిచో నామె తన రక్షణ దా నొనరించుకొన జాలదా?" అని.

సమాధానము :—ప్రశ్న సాధారణ మయ్యు గుతూహల వర్ధకము. కుతూహలము వృద్ధికారణము, మనబుద్ధివైభవము.

కొంచె మాలోచించిన నీ ప్రశ్న పుట్టబనియే యుండదు. ముందు విజ్ఞాదృష్టితో జూతము. ఏతత్త్వ మేతత్త్వఘనమో, అది యాఘనతత్త్వము నుపయోగింప జాలదు. ఉదాహరణమునకు :—మనఃప్రాణవాగ్ఘను డగు నవ్యయాత్మను గైకొనుడు- మనస్సుజ్ఞానశక్తి - ప్రాణముక్రియాశక్తి - వాక్కు-అర్థశక్తి-కనుక నవ్యయుడు శక్తిఘనుడు అయినను ఆశక్తి నతడు స్వయముగ నుపయోగించుకొనజాలడు. శక్తిసంచారమునకు శక్త్యతిరిక్త ప్రదేశ ముండవలయును. శక్తి కతిరిక్తము లేనపుడు ప్రసార మెక్కడ ? కనుక మనఃప్రాణవాఙ్మూర్తి లేదా జ్ఞానక్రియార్థ శక్తిమూర్తి యగు నవ్యయుని "అప్రాణోహ్యమనాః శ్శుభ్రో హ్యక్షరా త్పరతఃపరః" అని చెప్పబడినది.

కామన మనోవ్యాపారమే యైనను హృదయరూప సీమాభావముం దనకు బ్రతిష్ఠగా గొనకుండ కామోదయ మసంభవము. ఇక అవ్యయమనస్సు హృదయము నొకే వస్తు తత్త్వము. కనుక మనోఘను డయ్యు నతడు నిష్కాముడు. ఆప్తకాముడు, అకాముడు అను నిత్యాది నామములచే వ్యవహృతు డయ్యెను. స్వశక్త్యుపయోగము స్వ యందు పీలు పడదు. అన్యముం దనకు బ్రతిష్ఠగ కొన్నప్పుడే యిది సాధ్యము. దర్పణము నాధారముగ గొనక చక్షువు తన్ను దా జూచుకొన జాలదు. తనరోగమునకు దాను చికిత్సజేసికొను వైద్యు డుండడు. తన వ్యాజ్యమందు తాను వాదించుకొను న్యాయ వాదియు నుండడు.

ఇట స్త్రీయన్ననో శక్తిఘన. కనుక శక్తివంతు నాశ్ర యింపక యది తనశక్తిని సద్వినియోగము సేయ జాలదు. అట్లయిననే దాని శక్తి తత్త్వము వికసించును. తనకు వికా సము కల్గును. పురుషుని శక్తిశాలిం గావించి శివభావపరిణతుం జేయును. ఇది యొక సమాధానము.

ఇక స్థూలదృష్టితో జ్ఞాతము :—కో శో ప యో గ ము న్యాయముగ గోశాధిష్ఠాత సేయుచుండుట మనోవృత్తుల సమీ కరణమున కావశ్యకము. అనగా: ఎవనివద్ద నేవస్తు వున్నదో దాని నాత డుపయోగింపరా దని తాత్పర్యము. ఈ నియ మానుసారము చరించిననే సమాజశాంతి యుండగలదు. ఈ యుద్దేశ్యము సిద్ధించుటకే వర్ణవ్యవస్థ యేర్పడిన దని చెప్ప నక్కఱలేదు. ఎట్లన: బ్రాహ్మణుడు జ్ఞానకోశము. క్షత్రియుడు పరాక్రమకోశము. వైశ్యుడుసంపత్తికోశము. శూద్రుడు శిల్ప కలానుగత సేవాభావకోశము. ఇట్లు నాల్గువర్ణములవారు నాల్గు కోశముల కధికారులు.

ఇందు బ్రాహ్మణుని జ్ఞానము సమాజశిక్షకు, క్షత్రియుని పరాక్రమము సమాజరక్షణకు-వైశ్యుని సంపత్తి సమాజభుక్తికి- శూద్రుని సేవాబలము సమాజతుష్టికి నాహుతములు గావలసి నదే కాని తమ కిందు మిగుల్చుకొను నధికారము లేదు. లేదా మిగుల్చుకొందురు ఆహుతశేషమును. ఈ యజ్ఞోచ్ఛిష్టముల వల్లనే స్వరూపమును రక్షించుకొనుట కధికారమున్నది.

"యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యన్తే సర్వకిల్బిషైః" నిర్ధాతకిల్బిషత కిదే యధికారము. "మనము సమాజముకోసము గాని సమాజము మనకోసము కాదు. ఈ సర్వహుత యజ్ఞము సమాజశాంతికి, సమాజస్వాతంత్ర్యతకు, మూలప్రతిష్ఠ. పారస్పరి కానుశాసనమందే స్వతంత్రబీజము ప్రతిష్ఠిత మైయున్నది.

మిఠాయివాడు, కట్టుపనివాడు, కుంభకారుడు, మొదలగు నవాంతరకోశాధిపతులు తమ సామగ్రిని తామే హవ్యము గావించుకొన్నచో పరిణామ మేమగును? స్త్రీయన్ననో! శక్తిఘన. ఆమె కాశక్తిని సాత్మోత్తుగ-స్వయముగ నుపయోగించుకొను నధికారములేదు. 'నాశక్తి ఎంత, ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, ఎట్లు వ్యయ మగుచున్న' దను జ్ఞానము శక్తిఘనమునకుండదు. ఇందు కొకమంత్రి యుండవలయును. అట్టి మంత్రి రక్షకుడు, సైనికుడు, ఉపాసకుడు, పూజకుడు నగు పురుషుడు అను పేరులతో నిందింపబడుచున్నాడు. ఇందుకు గారణము పురుషజాతియే, అంశికరూపమున నిందు సంస్కర్తల సమాజము గూడను.

పశ్చిమదేశమందు స్త్రీలకు స్వాతంత్ర్యమున్నది కనుక ఆదేశ మున్నతదశ నందియున్నది." అని కొందరందురు. 'చిత్తము, తమది భారతవర్షము, తాము భారతీయులు. ఇయ్యది-పూర్వదేశము, కర్మభూమి, ఆర్యావర్తము, భారతవర్షము. తమయభిమతమేమి? పూర్వము - పశ్చిమము; కర్మ - అకర్మ; ఆర్యు డనార్యుడు; భారతవర్షము- కేతుమాలావర్షము;

౦వలయుననియా ? యేమిచెప్పునో ప్రకృతి నడుగుడు" అని
ంమంచుము.

ప్రకృతియిట్లనుచున్నది :—ప్రాగ్దేశమందు నే నింద్రరూప
మునను పశ్చిమందు వరుణరూపమునను ఉన్నాను. ఇంద్ర
దేవత అగ్ని కనుయాయి. వరుణదేవత సోమమున కనుయాయి.
నుకనే, యగ్నిప్రతిష్ఠారూప దక్షిణదిక్కు ఇంద్రునకును, సోమ
పతిష్ఠారూప- ఉత్తరదిక్కు వరుణునకును జెందు ననికూడ
ంచబడును. ఈ వచనములను బరిశీలింపుడు- ఈవిషయవివర
ణము గీతవిజ్ఞానపరిచయమునందు 'ప్రాక్పశ్చిమము లను శీర్షిక
క్రిందజూడుడు :—

| ఇంద్రః | వరుణః |
| --- | --- |
| అథయత్ పురస్తాద్వాసీంద్రోరాజా | 1 అథయత్ పశ్చాద్వాసి వరుణోరాజా |
| అథైనం (ఇంద్రం) ప్రాచ్యామ్(ఐత) | 2 ప్రతీచీదిక్ వరుణోఽధిపతిః (అథ) |
| ప్రాచీదిక్-అగ్నిర్దేవతా (తై) | 3 ప్రతీచీదిక్ సోమోదేవతా (తై) |
| దక్షిణాదిక్-ఇంద్రోదేవతా (తై) | 4 ఉత్తరాహవైసోమోరాజా (ఐ) |
| వృషావా-ఇంద్రః | 5 ఏషావైవరుణస్యదిక్ (తై) |

ఇంద్రాగ్నిరూప పురుషుడు పురుషసృష్టికిని, వరుణ
సోమరూప స్త్రీ స్త్రీసృష్టికిని ఆలంబన మని యిదివరకే యను
కొంటిమి. కనుక మనది పురుషసృష్టికి బ్రధానతగల దేశము.
పాశ్చాత్యులది స్త్రీసృష్టికి బ్రధానతగల దేశము అని ద్యోతక
ములు. ఈ ప్రాకృతికభేదముంబట్టి రెండుదేశముల యాదర్శము
లును వేరువేరుగ నుండు ననుకొనదగును. ఇక నీభేదమే, వారి
దాంపత్యావస్థకు మనదాంప త్యావస్థకు భేద మున్న దనుకొను
టకు జాలును. రెండు నెన్నడు సమములు కాజాలవు.

పోనిండు, ఈప్రాకృతిక కారణము నటుంచుడు. శక్తి తత్త్వము నరక్షితము గావించుకొన్న పశ్చిమదేశములకు నేడాశక్తితత్త్వము సర్వసంహారోపక్రమముగ నైన నగ్నసత్య మెవ్వ రొప్పికొనరు ? తన్ను స్వతంత్ర యనుకొనక తన స్వాతంత్రతయం దర్ధభాగము పురుషుని దనుకొనుట యార్యనారికి శోభనిచ్చును. ఆమె సహాయోగముం గొని తన స్వతంత్రత నుపయోగించుకొనుటయే ఆర్యపురుషుని కర్తవ్యము. ఈయిరువురి సద్భావనమే మనదేశమునకు కల్యాణదాయిని.

సంస్కర్తల సంస్కరణము పశ్చిమదేశముల సంస్కారానుకరణము గాని నిజమైన సంస్కారము గాదని వారి యావేశముచే మరచుచున్నారు. వారి సంస్కరణములకంటె మన రూఢివాదములే కొంతమెఱు గనిపించును. వారి స్వాతంత్ర్యముకంటె మన పారతంత్ర్యమే మెరుగు. మన మూలనాశమునకు నోరుదెరచి వేచియున్న ఆ యనుకరణము, సంస్కరణము, స్వతంత్రత, ఏమి ప్రయోజనములు ? ఘోషా మంచిది కాదు. నిజమే. దానిని మానిపింపనై చేయు భీషణ ప్రతిజ్ఞల మాటున నిర్లజ్జతా పాలనమా ? జాతిభోజనమువద్దు. మంచిదే, ప్రీతిభోజనముల మాటయేమి ?

ధర్మ మంగడివస్తువై యధర్మప్రసారము సేయునపుడు, "నశ్యన్తి బహునాయకాః" యను నాభాణకము చరితార్థమగునపుడు సంస్కర్తలు సంస్కరణ మనుపేర కలహప్రసా

ు సేయుట వారి దోషముకాదు. దేశకాల పరిస్థితులను
డ విచారింపవలయును. శాసకుల సంస్కారప్రభావము
ృతుల కంటకుంఘుట యసంభవము గదా! ఈవిషయము
లక్ష్యమం దుంచికొని, పారస్పరిక వైమనస్య పరిత్యాగ
స దేశమందలి విద్వాంసులు, సంస్కర్తలును, నేకీభవించి
ామర్శించి సామయిక పరిస్థితికి గూడ నాదరప్రాయము
ంలట్టి నొకానొక మధ్యమార్గము జూచుట మేలు.
కృశ్చిమ భయానక సంఘర్షయందు బడి యున్న మన
ాలికత నేదో యొకవిధమున రక్షించుకొన గలిగిన మంచిది.
స్తత ధర్మము, సంస్కరణము అను పేరులతో తత్త్వదను
ంయు లధర్మమును - కలహమునే ప్రసారము సేయుచున్నా
ి తప్పదు. ఇక నసమర్థుడగు నీ లేఖకుడు తనక్షోభశాంతికి,

"యేషాం చేతసి మోహ మత్సర మద భ్రాంతిః సముజ్జృంభతే
తేఽప్యేతే దయయా దయాఘన విభో సంతారణీయా స్త్వయా"

ుకొనుట కంటె గత్యంతరములేదు.

ఇంతవరకైన దాంపత్యవిజ్ఞాన వివేచనముత్రో:—ఆర్యా
ి మందలి దయాళువు లగు మహర్షులు స్త్రీజాతి కేనియ
ములు విధించిరో యవి యన్నియు నభ్యుత్థానకారణము లని
నది. స్త్రీరొక్క ఋతమయియు, సత్యశూన్యయు నగు
స్యవృత్తిని లక్ష్య మందుంచికొని యొకచో మను భగ
ను డిట్లుగూడ జెప్పెను.

"మాత్రా స్వస్రాదుహిత్రావా న వివిక్తాసనోభవేత్
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి"

ఈమాట యుపహాసాస్పదమా? కన్నులు మూసి యోచింపుడు. ఘోషాపద్ధతిని ఖండించు విధానమునకు మాటున ఆర్యస్త్రీని, ఉద్దామ వాసనావాసిత పశ్చిమప్రాంగణము నందు తాండవనృత్యమునకు నిలువబెట్టుట స్త్రీజాత్యున్నతికి మార్గమేనా? ఈకుఱూహాప్రశ్న మననము సేయుకొలది యు వివేకశాలిని యగు బుద్ధి చిరంతనార్షసిద్ధాంతమునే శరణ్యముగా గొనకుండ జాలదు.

నమో మంత్రకృద్భ్యో ఋషిభ్యః
స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ
జాయతే వర్ణసంకరః.

ఇతి—శ్రీః.

# పశ్వాలంభన విజ్ఞానము.

పశువు లేకుండ నేయజ్ఞమును నిష్పన్నముకాదు. దర్శ పూర్ణమాసలకు గూడ బశు వుండవలయును. ఇందును గురించి విద్వాంసులం దెన్నో మతభేదములు కలహములు బయలుదేరి దేశసంఘటన శక్తికి క్షీణత నాపాదించుచున్నవి. ప్రతివారును వైదికసాహిత్యము నారాధించువారే. అయినను ఈకలహము లకు మతభేదములకును మూలము, వేదమును సక్రమముగ నధ్యయనము సేయమియు, తద్విజ్ఞానము పూర్ణముగ నెఱుంగ మియు ననక తప్పదు.

విద్వాంసులు సనాతనధర్ములో ఆర్యసామాజికులో కానిండు. ఎవరైనను తా మనుకొన్న విషయము సిద్ధముసేయు టకు దేనికో-దేనికో ముడివెట్టుచు 'మసిబూసి నేరేడుకాయ జేయు' సామెత సార్థకపరచుచున్నారు. ప్రకరణముతో గాని, తాత్పర్యార్థ విచారణతో గాని బనిలేదు. తమ కనుకూలముగ నొక శబ్దము దొరకినను, దానిని ప్రమాణముగ బెట్టికొని తక్కిన దంతయు స్థిరపరచుచున్నారు. "శ్రాద్ధము మూర్తిపూజ మున్నగువాని యందు విజ్ఞానము లేదు. వేద మీశ్వరప్రణీతము. బ్రాహ్మణ భాగము వేదము కాదు. వేదమందు విధవతో దేవరనియోగ మున్నది" ఇత్యాది విషయములం గొని తమ తమ సిద్ధాంతము నేతయందు మహిమ జూపుచు తటస్థ జిజ్ఞాసు

వులను సందిగ్ధమనస్కులను గావింపుచున్నారు. అందీ పశ్వాలంభన విషయ మొకటి. ఇది పండితులకుగూడ శంకావహమై యున్నది. పశ్వాలంభన మనగా పశుస్పర్శమాత్రమే యని కొందర రందురు. కానిండు. చూతము.

"ఈశ్వరీయసృష్టియందు పశువులును మనవంటి చేతనములే. ససంజ్ఞజీవులే గదా! అట్టిచో సజాతీయదృష్టితో సజాతీయ పశువధ మనుజుత కెంత విరుద్ధ ధర్మము! యజ్ఞమందు పశువధ శాస్త్రసిద్ధ మనువారు "మాహింస్యాత్ సర్వభూతాని" "మాగా మనాగా మదితిం వధిష్ఠ" యన్న శాస్త్రము రెండు విరుద్ధములగు నాజ్ఞల గావించునా? అనుకోరాదు. ఒక న్యాయాధికారి రెండు విరుద్ధ నిర్ణయములం గావించునా? ఇది యంతయు నామా సంప్రదాయికు లేర్పరచుకొన్న నియమము. వీని యిట్టి శాస్త్రమునకు గళంకము దేవచ్చునా? "యజ్ఞమున జంపబడిన పశువునకు స్వర్గసిద్ధి" అను నిట్టి హేత్వాభాసములకు నాగరకలోక దృష్టియందు విలువ యున్నదా? మానవతకు శాస్త్రమునకు విరుద్ధముగ నెందైన నగపడిన వచనములను ప్రక్షిప్తము లనుకోవలయు." ఇది పూర్వపక్షము.

పై పంక్తులు చారువాక్కులు 'ప్రాణిని కష్టపెట్టరా' దనునది యుదాత్త సిద్ధాంతము గదా! కాని సూక్ష్మముగ జూచినచో దీని కపవాదములేదా? దొంగ-హంతకుడు అగు సమాజశత్రువును 'మాహింస్యాత్'ని యూరుకొనవచ్చునా?

కనుక మా మనవి యేమన:—మీమాంస ద్వారా నియతహేతుత అవసరము. ప్రసంగము, ఉపోద్ఘాతము, కార్యై క్యము, నిర్వాహైక్యము మొదలగు సంగతులద్వారా చక్కని సమన్వయము కుదుర్చుకోనంతవరకు మన యిచ్ఛానుసారము నిరాలోచనముగనే నిర్ణయమును జేసికొన జూచుట వ్యర్థసాహసము. అందరు నీసూత్రానుసారము ధర్మనిర్ణయము సేయుచున్నా మనియే అందురుగాక! అయినను, 'ధర్మస్యసూక్ష్మాగతిః' యను ప్రధాన సిద్ధాంతము నెదుట బెట్టుకొని శాస్త్రజాల మందు దడుగిడవలయును. ఉదాహరణార్థము మొదట హింసా-అహింసల పదార్థతత్త్వము వంకజూతము.

ఏప్రాణికైన నేమాత్రపుపీడ కల్గించిన నది హింస. సంతుష్టిపరచుట యహింస. అది యాత్మకు బ్రత్యవాయమునకును, ఇది అభ్యుదయమునకును, అది పాపమునకు, ఇది పుణ్యమునకు కారణములు. కాని ఇందుకు బ్రమాణ మేమున్నది. ఒకనిని గాయపరచితిమి, అతనికి దుఃఖము కలిగెను. ఇంతవర కనుభూతిసరియే. కాని పాపము కలిగినట్లు ప్రమాణ మేమి? ఇట్లే ఒకనికి అన్నదానాదికముచే సుఖముకల్గించి నపుడు కల్గు పుణ్యవిషయమున నింతే. ప్రత్యక్షానుమానము' లిందెందుకు బనికిరావు. ఎట్లయినను శబ్దప్రమాణము నంగీకరింపనిదే ఇందుకు సమాధానము దుర్ఘటము. కారణమేమన:—

పుణ్యాపాపసంబంధము సుసూక్ష్మము అతీంద్రియమునగు నాత్మకు జెందినది. ఈ విషయమున నతీంద్రియద్రష్టలగు నాప్త

పురుషు లొనరించిన వ్యవస్థా వాక్యములకంటె మరొక ప్రమాణమునకు గతిలేదు.

"అనృతసంహితా వై మనుష్యాః" అన్నట్లు మనుష్యు డనృత సంహితుడు. "సత్యసంహితా వై దేవాః" అన్నట్లు దేవతుల్యులగు నాప్తపురుషులు సత్యసంహితులు. కనుక ధర్మాధర్మముల విషయమున అతీంద్రియద్రష్టల వచనములే ప్రమాణములు గాని మన బుద్ధిబల ముపయోగించి నిర్ణయించుట యనుచితము. "కృష్ణస్తు భగవాన్ స్వయం" ఆర్యసంతతి కంతటి యాప్తుడు లేడు. సాక్షాత్కరించిన సచ్చిదానందబ్రహ్మ మయ్యు నిట్టి విషయ నిర్ణయమునకు శాస్త్రమునే ప్రమాణముగ గొనవలయునని తదీయ వాఙ్మధుబిందులను చవిజూడుడు.

"యఃశాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
నససిద్ధిమవాప్నోతి నసుఖం నపరాంగతిం
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మకర్తుమహార్హసి"

శాస్త్రనిష్ఠనుగూర్చి హరివంశ మం దొక యుపాఖ్యానము :—శ్రాద్ధము చేయుచున్నారు. పితృతృప్తికి మంత్రవాక్కుతో పిండదానము సేయుటకు శాస్త్ర మాజ్ఞాపించెను. పిండదానావసరమున ప్రేతాత్మ పిండగ్రహణార్థము చేయి జాపెను. అచటివా రందరు నాశ్చర్య నిమగ్నులైరి. 'చేతిలో పిండదానము సేయు మని శాస్త్ర మాజ్ఞాపింపలేదు. కనుక చేతిలో పిండదానము సేయజాలము." అని వారు శాస్త్రోక్త

ముగ పిండదానము చేసిరి గాని చేతిలో సేయలేదు. వారి
కాకాశవాణి రూపమున నిట్లు వినబడెను. "మీశాస్త్రనిష్ఠకు
సంతుష్టుల మైతిమి. మీకర్మ యెల్లవిధముల సఫల మగుగాక."

ప్రాతఃస్మరణీయ కుమారిలభట్టు ఈ శాస్త్రనిష్ఠాధా
మునసే "యదివేదాః ప్రమాణంస్యుః...అని చెప్పుచు, గిరిశిఖ
మునుండి దుమికెను. కాని అతని కేమియు భంగమురాలేదు
ఇంతకు పాప-పుణ్య; కర్మా-కర్మ ధర్మా-ధర్మములకు శాస్త్ర
తప్ప యితర ప్రమాణ మేదియులే దని ఫలితార్థము. దా
నవహేళనజేసి స్వబుద్ధిబలమున నేమియు సేయజాలము. పా
లౌకిక విషయముల దాకవద్దు. లౌకిక కార్యములందు నిం
ఓషధి-వనస్పత్యాది విజ్ఞానము లెన్నో లౌకిక వృద్ధ వ్యవహ
మూలక శబ్దప్రమాణములపై నాధారపడియే యున్న
అంగడివాని మాటనమ్మి యెన్నోవస్తువులను స్వీకరింతువ
ఇంద్రియగోచర విషయములకే యీగతి పట్టునపుడు అ
ద్రియ విషయములను గూర్చి యడుగ వలయునా?

వ్యాసభగవాను డీవిషయమున 'అశుద్ధమితిచే న
బ్దాత్' అని సూత్రించెను. సామాన్యముగ 'మాహిం
త్సర్వభూాని' యన్న శాస్త్రమే అపవాదరూపమున 'అగ్నీ
మీయం పశుమాలభేత' అన్నది. దేశ-కాల-పాత్రా ద్యా
ముపై ధర్మాధర్మనిర్ణయము జరుగును. కనుకనే: ఈ
ధర్మలక్షణములకు చరితార్థత కల్గుచున్నది.

"దేశేకాలఉపాయేన ద్రవ్యం శ్రద్ధాసమన్వితమ్
ప్రాప్తేప్రదీయతేయ త్తత్ సకలం ధర్మలక్షణం
శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్యచప్రియమాత్మనః
సమ్యక్ సంకల్పజఃకామో ధర్మమూలమిదం స్మృతం"

కొందరిట 'స్వస్యచ ప్రియమాత్మనః' అనుచో 'మాకేది మంచిదిగ దోచునో అది' యని యర్థముగానెంచి 'మాయాత్మ పశుహింసను సమర్థింప గోరుటలే' దందురు. హేతు వందము గనే యున్నది. కాని కొంచెము విమర్శింతము. ఒక సన్నిపాత రోగి యన్నముగోరును. అతని కది హార్దికప్రేరణయే గాని వేరు గాదు. కాని వైద్యు డన్నము బెట్ట నీయడు. ఈనవీన ధర్మలక్షణానుసార మావైద్యు డధర్మము చేయుచున్నట్లే గదా! తన యంతరాత్మ మద్యపానము సేయవాంఛించును. ఈయాత్మవిషయైషణ ధర్మమూలక మేనా? భగవంతుడు మనువు అనృతసంహితులగు మనుష్యుల యీస్వాభావి కేచ్ఛల నుల్లేఖించుచు

"నమాంసభక్షణేదోషో నమద్యేనచమైధునే
ప్రవృత్తిరేషాభూతానాం నివృత్తిస్తుమహాఫలా' అనియెను.

ఈనివృత్తి కాత్మబల ముండవలయును. వాస్తవ మేమనగా :—మన అధ్యాత్మజగత్తు నందు ప్రజ్ఞాన (మనస్సు) విజ్ఞాన (బుద్ధి) ములందు పరస్పరము స్పర్ధ సాగుచుండును. ప్రజ్ఞానము పార్థివము, విజ్ఞానము సౌరము. చాంద్రసోమ మోషధీప్రవిష్టమై మన మనస్సున కుపాదాన మగుచున్నది. ఇట్లు సౌరతత్త్వము బుద్ధి కధిష్ఠాతయై యున్నది. ఇందు

సోమము ఋతతత్త్వము. అగ్ని సత్యతత్త్వము. ఋతము విచాలిభావము. సత్య మవిచాలిభావము. ఋతసోమాత్మక మనస్సు విచాలి. సూర్యుడు మనకు దూరస్థుడు. కనుక స్వభావముచే మనకు ఋతసోమాత్మక మనఃప్రధానత యుండును.

ప్రాణముగల వస్తువు సత్తు అందురు. 'సామాన్యే సామాన్యాభావః' అన్నట్లు ప్రాణ మందు ప్రాణ ముండదు గనుక ప్రాణము నసత్తసరి. ఋతశబ్దమునకు నిదే యవస్థ. ఋతము నందు ఋతముండదు కనుక ఋతము నన్ృతమందురు. అవ్యయపురుషుడు మనఃప్రాణమూర్తి. మనస్సులో మనస్సు ప్రాణములో ప్రాణము నుండవు. కనుక ముండక శ్రుతి యితనిని "అప్రాణోహ్యమనః శుభ్రః అక్షరాత్పరతః పరః" అన్నది. ఇంతకు జెప్పదలచినది :—ఋత మయ్యు నన్ృతశబ్దమున జెప్పబడు చాంద్రసోమము మనస్సున కుపాదాన మనియే. జీవసృష్టియం దీ ఋతసోమము ప్రధానము. కనుకనే 'అహ మస్మి ప్రథమజా ఋతస్య' అను వచనము వెలసినది. 'అన్ృతసంహితా మనుష్యా' అన్న నిగమమునకు దాత్పర్యమిదే. సహజముగా మనకు మనఃప్రధానత యుండును.

మనస్సు ఋత మగుటచే హృదయశూన్యము. అది యొక విషయముపై స్థిరముగ నుండదు. దానికి స్థిరతవచ్చుచో నది సౌరవిజ్ఞాన ప్రవేశమువల్లనే. సౌరతత్త్వ మగ్నిప్రధాన మగుటచే సత్యము. "చిత్రందేవానా ముదగా దనీకమ్" అన్న ట్లా సౌరప్రాణమే దేవతలు. వారు సత్యాగ్నిమయులు కనుక

'సత్యసంహితావై దేవాః' అని నిగమము వెలసెను. మనోమూర్తియగు ప్రజ్ఞానాత్మ - బాహ్యాత్మ; విజ్ఞానాత్మయే అంతరాత్మ. వైశ్వానర - తైజస - ప్రాజ్ఞ సమన్విత ప్రజ్ఞానాత్మ కర్త. విజ్ఞానాత్మ కారయిత. ఇతనిని గీత క్షేత్రజ్ఞు డన్నది. ప్రజ్ఞానము సహజముగ ప్రబలముగ నుండును. విజ్ఞానబలము నకై శాస్త్రాధ్యయనము, తపస్సు మొదలగునవి యుండవలయును. అనగా ప్రజ్ఞానము సిద్ధము. విజ్ఞానము సాధ్యము.

ఋతప్రధాన మగు మనస్సు నిమ్నగామి. ఏమన :— ఋతతత్త్వము పారమేష్ఠ్యము. పరమేష్ఠి ఆపోమయుడు. ఆపస్సు నిమ్నానుగామి యగుట ప్రత్యక్షమే. విజ్ఞానశాస్త్రి లేని మనస్సు స్వతంత్రమగుచు తన ఋతమూలా కావృతభావముచే నాత్మపతనమునకు గారణమగును. విజ్ఞానసారథి తొలగుటతోడనే మనోమయ ప్రగ్రహములు వదులగును. అతని యింద్రియాశ్వములు శరీరరథ మందలి యాత్మ నుత్పథమున గొంపోవును. దుర్వ్యసనప్రవృత్తి అకారణ కారుణ్యము మొదలగునవి మన స్వభావ ధర్మములు. విజ్ఞానబలానుసారము మన స్సాగును.

మనఃప్రేరణచే దుష్కర్మప్రవృత్తి కలుగును. వెంటనే అది చెడ్డదని తోచును. అట్లు తోచుట బుద్ధిపని. వెంటనే ఇక నిట్టి పనిచేయరా దనుకొందుము. ఇది మనస్సునకు జెందిన యూహ. విజ్ఞానము దుర్బలమగుచో మనస్సు జయించును. దుష్ప్రవృత్తి

కలుగును. స్వస్థదశయందలి యాకలి విజ్ఞానసహాకృత మనస్సునకు జెందినది. ఇది యనాసక్తి మూలేచ్ఛ. కడుపునిండ దిని బజారున బోవుచు చిరుతిండి తినగోరుట కేవలము మనస్సునకు జెందిన యిచ్ఛ. ఇది ఆసక్తిమూలేచ్ఛ. బంధకారణము. కర్తవ్యాకర్తవ్యముల మంచిచెడ్డలు విచారించుట బుద్ధిపని. హాతాన్నిర్ణయము మనస్సుపని. బుద్ధియోగములేని మనస్సు ఇట్లు అసంబద్ధ నిర్ణయము లాచరించును. అర్జును నంతవాడు గూడ నీమనోఽనుగ్రహమున మోసపడెను. నిరపరాధుల జంపరా దనునది యెవరంగీకరింపరు? కాని పరిస్థితి నారయ వలయును. అర్జునుడు క్షాత్రధర్మ మహాత్వ మాలోచింపక 'నయోత్స్యే' అని వేసెను. భగవంతుడు 'బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతంభవ' అని యాదేశించెను. అర్జునుడు సంభాళించుకొనెను. విజయము-భూతి-శ్రీ-లను పొందగల్గెను. మన స్థితియు నింతే. నిరపరాధ పశువధయా? యని యనుకొందుము. యజ్ఞమువలన నగు మహాఫలమును మరతుము. ఇట్టి దయ ఆత్మసంకల్పము కాదు. మనస్సంకల్పము. బుద్ధియోగము లేని యిట్టివి సమ్యక్సంకల్పములు కావు. సమ్యక్సంకల్పజ కార్యము బుద్ధియోగముపై నాధారపడి యుండును. ఇదే "స్వస్యచప్రియమాత్మనః" అనుట కర్థము. తక్కిన దనర్థము.

శాస్త్రీయమర్యాద నటుండనిచ్చి యైహలౌకిక విషయముల వంకకు జూతము. సమాజశాస్త్రులు 'అనేకుల కధిక

సుఖ మొసంగు నది 'శ్రేయస్కర' మందురు. జీవులందు మనుష్యునకు విలువ హెచ్చు. కారణము ? స్పష్టమే. ఇతనియందే ఇంద్రియములకు బూర్ణవికాస మున్నది. కనుకనే స్థావర–జంగమ విశ్వాభ్యుదయ మితనిచేత నున్నది. స్వస్థము-సుశిక్షితము నగు మానవసమాజముగల రాష్ట్రమందలి కృష్యాదులు, పశ్వాదులు, ఓషధి-వనస్పత్యాదులు, నదీ-నదములు, సమృద్ధములుగ నుండును. కనుక అందు క్షేప్రయత్నము చేసినను తప్పుగాదు. భారతీయ యాజ్ఞికు లొనరించు పశువధ నాక్షేపించు పాశ్చాత్యవిద్వాంసులు కేవల శరీర చికిత్సకొరకు పరిశోధనకొరకు నెన్ని నిరపరాధ ప్రాణుల వధించుచున్నారో చెప్పనక్కరలేదు కదా ! ప్రస్తుత చికిత్సాప్రణాళిక యందింజక్షను సార్వజనీనమై యున్న విషయము విశదమే. నిరపరాధ్యశ్వాది పశువులను శృంఖలాబద్ధములు గావించి సూచీప్రయోగమున వాని శరీరస్థ కీటాణువుల ద్వారా ఇన్‌జెక్షను ట్యూబు తయారుచేయుట హింసారహిత కర్మమేనా ? మనుష్యాస్థి విజ్ఞానము సంపాదించుకొరకు వైజ్ఞానికు లెన్ని కప్పలను జంపుటలేదు ? కాడ్లీవరాయిలు ప్రచార మహింసనే సూచించునా ? పండిత పామరు లెల్లరు నీయన్నిటి నామోదించుచున్నారు గదా ! ఇవి యెల్ల దైవకార్యము లనుకొనుచున్నారు గదా ! ఇక :-యజ్ఞమువలన కూడ ననేకుల కధిక సుఖము జేకూర్చుట యన్నది సిద్ధమగుచో ఇం దగునట్టి పశుహింస కాక్షేపణ లెందుకు ?

కొందరు మహానుభావులు "మాంస మప్రాకృతిక భోజనమందురు. మనుష్యోదరపూర్తి కీశ్వరు డోషధి వనస్పతులను నిర్మించెను. అంతలి బల మింకను గలదు. గోధూమ-మాషాదులందు మాంసకృత్తు లధికముగా నున్నవి. మాష మాంసమే యనవచ్చును. కనుకనే అది అయజ్ఞిక మన్నారు. శరీరధాతువుల కాయా ద్రవ్యములు లభించు నపుడు అవి సురక్షితము లగును. మాంసరక్షకు మాంసము. రుధిరమునకు రుధిరము. ఇతరధాతు విషయము నింతే. ఇట్టివాని మాత్రలన్నియు నోషధివనస్పతులం దున్నవి. మీరు మాంసమో! యందురు. మేము స్వర్ణము, రాగి, వెండి, లోహము మొదలగు ధాతూపధాతువులు విషోపవిషములుకూడ ప్రాకృతి కాన్నము లందుము. ప్రతి మూలికయందు నేదో ధాతువో, ఉపధాతువో యుండియున్నవి. ఆవశ్యకతంబట్టి ఆయుర్వేద వైద్యులు వీనిని స్వతంత్రముగా గూడ బ్రయోగించి లాభము గాంచుచున్నారు. ఇట్టి స్థితిలో మాంస మప్రాకృతిక మనుట సాహసము. మాంస మన్నది పశువులందే యున్న దనుకొనరాదు. అదియొక విశేష ప్రాణము, దీనిని బ్రాహ్మణములందు 'పురీష' నామమున వ్యవహరించిరి. (శత. 8-7-4-16) అదియే భౌతికద్రవ్య మందున్నదో అదియు "తాత్ స్థ్యాత్తాచ్ఛబ్ద్యమ్" అను న్యాయానుసారము మాంస శబ్దముచే వ్యవహరింపబడును.

మత్స్యమం దీపురీష ప్రాణములేదు. కనుకనే మత్స్య-మాంసములను వేరుగా పరిగణించిరి. అదే పురీషము మాష

యం దధికముగ నున్నది. కనుక దానిని మాంసప్రతికృతి యనిరి. దానిం దిన్నచో నేమి లాభనష్టము లున్నవో అవే దీనిం దిన్నను లభించును. మాంస మప్రాకృతి కాన్న మగుచో మనుజుడు దానిం జీర్ణించుకో జాలడు. కాని, అనుభవమున నట్లు కానము. మాంసాశులగువాని మాంసమప్రాకృతిక మను టకు సందేహములేదు. అవి త్యాజ్యములే. కాని మాంస మప్రాకృతి కాన్నముకాదు. చూడుడు, శ్రుతి :—

(1) ఏతదుహవై పరమన్నాద్యం యన్మాంసం (శత)

(2) అన్నము పశోర్మాంసమ్ (శత)

ఇది యంతేయు నటుంతము: భారతవర్షమును విడచి తక్కిన భూభాగ మంతటిలో నూటికి 99 గురు మాంసభక్షులు, భారతము నందు మాత్రము? కొలది జాతులందు కొలదిమంది తప్ప తక్కిన పెక్కురు మాంసభక్షులే. కనుకనే శ్రుతి "పరమ మన్నాద్యమ్" అన్నది. మాంసము వ్యాపకాన్నమే. కాని మేమీవృత్తికి స్వాగతమిచ్చుటలేదు. మఱి మాచెప్పునదేమన:- మాంసము ప్రాకృతి కాన్న మనియే. అట్లన్నపుడే "నమాంస భక్షణేదోషో...అను మనువచనము చరితార్థ మగును. ఋషుల దృష్టిలో నీప్రవృత్తి చెడ్డది. ఇతరాన్నములచే జీవయాత్ర గడచు నపుడు, సులభముగా నన్నసామగ్రి లభించునపుడు పశుమాంస ముం దినకుండుటే యుత్తమము. పశుమాంస మన్న మయ్యు బురీష సంబంధముగల దగుటచే బుద్ధికి వ్యాఘాతకము కనుక దీనిం దినకుండుటయే శ్రేయస్కరము. మనకు ఇతర స్థావర

వస్తూపలబ్ధి యగుచున్నను జిహ్వాచాపల్యమునకు వశులమై మాంసము గోరుట 'మాహింస్యాత్సర్వభూతాని' అను వచనముతో విరోధించి ప్రత్యవాయ భాగుల మగుటయే.

సాత్త్వికభావ రక్షకు మాంసగ్రహణ మనుచితము. కాని అప్రాకృతికము కాదు. కాదన్నచో 'పంచపంచనఖా భక్ష్యాః' 'నమాంసమశ్నీయాత్' అను నిట్టి వచనములకు విలువయేమి? నిషేధము ప్రాప్తిపూర్వకము గదా! 'నమాంస మశ్నీయాత్' అన్నది అపవాద విధి గాని సామాన్య విధికాదు. బ్రహ్మచర్య రక్షణ గావించు వ్రతనియమములను విధించుచు శ్రుతి "నమాంసమశ్నీయాత్ నస్త్రియముపేయాత్ యన్మాంసమశ్నీయాత్ యత్ స్త్రియముపేయాత్ నిర్వీర్యఃస్యాత్ నైనమగ్ని రుపనమేత్. (తై. బ్రా.) అనియెను. ఇది విధిపరకవచన మనుకొన్నచో స్త్రీ సంబంధ నిషేధముకూడ ప్రాప్తముకాగా, "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" అను వచనవిరోధము సిద్ధమగును. కనుక దీనిని విశేషవిధి యనుకోవలెను.

ప్రకృతిసిద్ధ మాంసాశన ప్రవృత్తిని ఋషులు నిరోధించి, పరమావశ్యక మని యెంచి యజ్ఞ మందు పశుప్రాశనమును విధించిరి. అయినను ఈ విషయములు కలివర్జ్యములుగ నెంచబడెను. నియోగవిధి శాస్త్రీయమయ్యు కలహ ప్రధాన కలియుగ మందు సహజముగ మనుష్యుల ఆత్మదౌర్బల్యముం బట్టి ఈవిధి వ్యభిచారమార్గమునకు దర్శకమై యనర్థహేతు వగునని

దూరదర్శులగు ఋషులు కలివర్జ్య మనిరి. యజ్ఞములకు నిదే యవస్థ. "జనమేజయా జ్జనమేజయాంతమ్" అను పురాణవచనానుసారము విశేషతః త్రేతాయుగ పర్యంతము, సాధారణముగ ద్వాపరయుగాంతమందలి జనమేజయ సర్పయాగ పర్యంతము యజ్ఞప్రధానత యుండెను. పిమ్మట దీనియందలి శ్రద్ధ క్షీణించెను. తుదకు :—పంచపశ్వాత్మక చితియజ్ఞ మందు, కేవలము ప్రాజాపత్య పశ్వాలంభన మాత్రము మిగిలెను. పుష్కర (బుఖార్) నివాసి ప్రజాపతి (బ్రహ్మ) మొదలు సాయకాయననామక శ్యాపర్ణ పర్యంతము పురుష-అశ్వ-గో-అవి-అజ అను నీ పంచపశువుల ఆలంభన మగుచున్నది. కాని యాజ్ఞవల్క్యుని కాలమందు కేవలము ప్రాజాపత్యాజ-వాయవ్యాజ అను నీయజ పశ్వాలంభనమే మిగిలెను. (శత.1-4-38-6) నేడు యజ్ఞవిద్య విలుప్తప్రాయ మైనది.

నేటిది ఉపాసనాయుగము. యజ్ఞమున కేవలము గాలిని శుద్ధిపరచు ప్రక్రియగా నుండిపోయినది. యథేచ్ఛా పద్ధతులు నిర్మింపబడినవి. యథేచ్ఛాధికారము లభించినది. కలికృప :- అంతయు విడంబన యగుచున్నది. అతీతానాగతజ్ఞులు ఋషులీయుగ మాహాత్మ్య మెరింగి యుండిరి. ఈయుగప్రజ లింద్రియ లోలుపులగుదు రని వా రెరుంగుదురు. కనుక పశువధ కాజ్ఞ యిచ్చుచో ననర్థము వాటిల్లునని నియోగము నట్లు దీనిని కలివర్జ్యములందు జేర్చివైచిరి. ఈవిధముగ నీయుగమున స్మార్త యజ్ఞప్రధానత కలిగినది. ఇన్ని యున్నను పధర్మపరాయణు

డైన ప్రస్తుతము వితాన యజ్ఞము జేయుబూనెనా, పశ్వాహుతి లేనిచో నాయజ్ఞము నిరర్థకమని యెఱుంగవలయును. లేదా చేయుటయే మానుటమంచిది.

యజ్ఞమందు పశువధ గావింపబడును. హింసాదోష మును కలదు. తత్పరిహారార్థము దక్షిణ విధింపబడినది. హింసకు బెదరి యజ్ఞమునే విడచుట బుద్ధిమత్త్వము కాదు. ఇట్టి యాపత్తుల నెత్తి చూపవలయుచో నేకర్మయు సాగ జాలదు. ఈభగవద్వచనము జూడుడు :-

'సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్ని రివా వృతాః'

కర్మమాత్రము దోషయుక్త మన్నచో భోజన-శయన-చలనాది కర్మలం దసంఖ్యా వాయవ్య జీవుల హింసాజనిత ప్రత్యవాయ మున్న దనుకోవలయును. ఇది యుక్తిసంగతమా? చివరకు :—ధర్మాధర్మ హింసాహింసాద్యతీంద్రియ విషయము లందు శాస్త్రమేమి చెప్పునో అదే ప్రమాణ మని యంగీక రింపవయును. 'మాహింస్యాత్సర్వభూతాని' యన్న శాస్త్రమే విశేషస్థలమున 'అగ్నీషోమీయం పశుమాలభేత' అన్నది. రెంటికి శబ్దప్రమాణము సామాన్యము. కనుకనే 'అశుద్ధమితిచే న్నశబ్దాత్' అను సూత్రము వెలసినది. ఇట శంకర వ్యాఖ్య చూడదగినది.

యజ్ఞవిద్య ప్రకృతికి ప్రతికృతి. కనుక అందేమి జరుగు చున్నదో ఇం దదే చేయబడును. కనుక :—మొదట పశ్వాలం

భనమును గూర్చిన ప్రాకృతిక నిత్యయజ్ఞ స్వరూప మేమో పరిశీలింతము :—

(1) రెండు వస్తువులను రాసాయనిక సంయోగమున గలిపి వాని కపూర్వస్వరూపము నిచ్చు ప్రక్రియావిశేషము పేరు యజ్ఞము. ప్రకృతి - పురుషుల సమన్వితరూపము మొదటి యజ్ఞము. ఈ యాజ్ఞిక సమన్వయము లేనిదే సృష్టి కాజాలదు. ఈ యాజ్ఞికసమన్వయమును లక్ష్యమం దుంచికొనియే 'తత్తు సమన్వయాత్' అను సూత్రము వెలసినది. ప్రకృతిపురుషసమన్వితరూపము యజ్ఞేశ్వరప్రజాపతి. షోడశియను పురుషప్రజాపతి ప్రకృతితో గూడి యజ్ఞరూపమున బరిణతినొంది ప్రజోత్పత్తికి గారణమగును. షోడశకళాప్రజాపతి అగ్నిప్రధానుడు. ప్రాణః-ఆపః-వాక్-అన్న-అన్నాద-భేదభిన్న పంచకళ ప్రకృతితత్త్వము సోమప్రధానము. అగ్నితత్త్వము వృష. సోమతత్తము యోష. పశ్నోపనిషత్తునం దివి ప్రాణము-రయి యని వాడబడినవి. విశ్వసృష్టి కధిష్ఠాతయగు అగ్నీషోమాత్మక (వృషా యోషాత్మక రయిప్రాణాత్మక) యజ్ఞము పాంక్తము (పంచావయవము) 'పాంక్తో వై యజ్ఞః' అను ననుగమమునకు అనేక ప్రకారములగు సమర్థనము మనొకచో జూచుకొందము. ప్రస్తుతము ద్యావాపృథువులకు జెందిన ప్రాంక్తయజ్ఞము వంక జూతము.

(2) "యథాగ్నిగర్భాపృథివీ తథాద్యౌ రింద్రేణగర్భిణీ" అను శ్రౌతవచ నానుసారము. పృథివి కగ్నియు, ద్యులోకమున

ంద్రుడు నధిష్ఠాత్మ దేవతలు. ఆయా లోకాధిష్ఠాత ఆయా
ోక ప్రజాపతి యందురు. ఈ పరిభాషానుసారము పైవా
రెరువురు బ్రజాపతులు. వీరు ఆదానవిస ర్గాత్మక యజ్ఞము
ద్వారా రోదసీవిశ్వ ప్రభవములై యున్నారు. ఈ యజ్ఞము
వలన బ్రజాపతి నిరంతరము విస్రస్త మగుచుండును. సూర్యుని
(ఇంద్రప్రాణమయ) భాగము ప్రవర్గ్యరూపమున సూర్యునుండి
వేరై యోషధి వనస్పత్యాది నిర్మాణము గావించుచుండును.
ఇందువలన సౌరభాగము వ్యయమగుచుండును. ఇదే ప్రజాపతి
యొక్క విస్రస్తత. సూర్యు డుదాహరణ మాత్రము. విశ్వ
మందలి జడచేతన పదార్థములెల్ల నిరంతరము విస్రస్తము లగు
చున్నవి. ఎల్లప్పుడును వానివాని పరమాణువులు వ్యయమగు
చున్నవి. కాని, ఆయా పదార్థ కేంద్రస్థిత విష్ణువుయొక్క
అశనాయచే నాకర్షింపబడు నన్నముయొక్క ఆహుతిద్వారా
వెంటనే యీ విస్రస్తభాగము పూర్ణమును అగుచుండును.
పదార్థము లెల్లను తమతమ భాగములను ప్రవర్గ్యరూపములుగ
నన్నములుగా జేయుచు ఇతర ప్రవర్గ్యములం గొని అన్నాద
ములు నగుచున్నవి. "సర్వమన్నం సర్వమన్నాదః" అని సిద్ధాం
తము, అన్న-అన్నాదాత్మకమగు నీ నిత్యయజ్ఞ నిరూపణము
నేయు శ్రుతివచనము జూడుడు.

"అహమస్మి ప్రథమజా ఋతస్య పూర్వం దేవేభ్యోఽమృతస్యనామ
యోమాదదాతి సఇదేవమావత్ అహమన్న మన్నమదంత మద్మి."

పదార్థములనుండి విస్రస్తమగు భాగ మగ్ని. అశనా యచే వస్తుగతాగ్నియందు ఆహుతమై ఆ విస్రస్తభాగపూర్తి గావించు వస్తుతత్త్వము సోమము. కనుక 'అగ్నౌసోమాహుతి ర్యజ్ఞః' అని తేలుచున్నది. ప్రాణాగ్ని విస్రస్త మగుచుండును. అశనాయా ద్వారా ప్రాణాగ్ని యాకర్షణచే మరల అన్నా హుతి యగును. ఇట్లు అన్నముచే ఊర్క్-ఊర్క్‌చే ప్రాణము. ప్రాణముచే అన్నము. అన్నముచే ఊర్క్. ఈ ధార నిరంత రము సాగుచున్నది. కనుకనే యజ్ఞమునకు 'అన్నో ర్ప్రాణా మన్యోఽన్యపరిగ్రహో యజ్ఞః' అనియు లక్షణ మేర్పడుచున్నది.

(3) "తస్యవా ఏతస్యాగ్నేః వాగే వోపనిషత్" అన్నట్లు ప్రాణాగ్ని వాక్తత్త్వమై యున్నది. దీనిచే ప్రాణము నకును, ప్రాణముచే చిత్తమునకును బుష్టికలుగును. మనము తిన్నయన్నము మొదట వాగ్రూప ప్రాణాగ్నియం దాహుత మగును. అనగా:—మొదట ప్రాణాగ్నిపై దానికి జితి కలుగు చున్నది. పిమ్మట రస-బల-క్రమిక పిశకలనముచే నది మనః పోషక మగును. సప్తధాతువుల క్రమికచితికి పిమ్మట నాయన్నము శుద్ధ చాంద్రసోమముగా బరిణతినొంది మన స్స్వరూప సమర్పక మగును. అనగా:-హుతాన్నము స్థూల పార్థివ భూత భాగము ద్వారా ధాతుచితి రూపమున బరిణత మగుచు జివరకు మనస్సుపై చిత మగుచున్నది. సోమచితి మూలముననే మనసును చిత్త మందురు. మనస్స్వరూప మన్న చితిపై నాధారపడి యున్నది. కనుక శ్రుతి "అన్నమయంహి

గోమ్య మనః'' అన్నది. ఈమన స్సింద్రియముల ద్వారా వ్యయ మగుచుండును. ఈ లోపపూర్తికి మనస్సు అశనయా ప్రాణాగ్నుల ద్వారా మరల నన్నము నాకర్షించును. ఇట్లు వాక్చిత్తముల యుత్తరోత్తర చిత్రక్రమమే యజ్ఞసాధక మగు చున్నది. కనుక యజ్ఞమునకు 'వాచశ్చిత్త స్యోత్తరోత్తరక్రమో యజ్ఞః' అని లక్షణ మేర్పడును.

అన్నివిధముల 'అగ్నౌ సోమాహుతి ర్యజ్ఞః' అనిదే ఫలితార్థము. సర్వ పదార్థములును సమష్టిగ వ్యష్టిగ అగ్ని షోమ మయములై యున్నవి. కనుక 'అగ్నిషోమాత్మకం జగత్' సార్థక మగుచున్నది.

ఇంతవరకు యజ్ఞస్వరూప సిద్ధికి అగ్నియందు సోమా హుతి కావలయు నని యేర్పడినది. ఆహుత మగు సోమము :- హవి-పశు-రాజ-వాజ-గ్రహ-అను నిట్టి భేదములచే అనేక విధ ములుగ నున్నది. ఆహుతిద్రవ్య మగు సోమముయొక్క విజా తీయతవలన నొకే అగ్నియజ్ఞ మనేక ప్రకారము లగును. (1) వ్రీహ్యాద్యోషధులు సోమమే. దీనివలన నగు దానిని హవి ర్యజ్ఞ మందురు. అగ్నిహోత్ర, దర్శపూర్ణమాస చాతుర్మాస్యాది యిష్టు లిందుజేరును. (2) పశుయజ్ఞ మందు పశు వపాగత సోమాహుతి జరుగును. ఇందు పశు వపేక్షితము కాదు. తద్వ పాగత సోమ మపేక్షితము. పశువధలేక యిది సాధ్యము కానందున ఈయజ్ఞసిద్ధికి పశ్వాలంభన కావలయును. (3) రాజ సోమము వలననగు నది రాజసూయ యజ్ఞము. (4) వాజ

సోమ నిష్పన్నమగు యజ్ఞము వాజపేయము. (5) గ్రహానిష్ప న్నము (వల్లీసోమము) జ్యోతిష్టోమము. ఇక పంచపశువులు గ్రహసోమమువల్ల నిష్పన్నమగునది చితి లేక చయన యజ్ఞము. ఇందు రెండు కలియుటచే ఇతర యజ్ఞములకంటె నిది యుత్కృష్ట మని యంగీకరింతురు. కర్మయయ్యు జ్ఞానైక సాధ్య మగు నమృతత్వ ప్రాప్తికారణ మగునదీచయన యజ్ఞమొకటే కనుకనే "నామృతత్వస్యతు ఆశా స్తివిత్తేన ఋతేచయనాత్" అని సిద్ధాంతము వెలసినది. పురుషాశ్వగవావ్యజములను నైదు పశువులును ద్యావాపృథివ్యములు. పృథివి, అంతరిక్షము, ద్యులోకము నను నీ మూటి రసతారతమ్యమున నీపంచ ప్రాకృతిక పశుస్వరూప నిష్పత్తియగును. ఇందు పురుషపశువు సర్వశ్రేష్ఠము. ప్రధానము కనుక మొదట దీనిం జూతము :—

## 1. పురుషుడు

పార్థివాగ్ని ఆంతరిక్ష్యాగ్ని (వాయువు) దివ్యాగ్ని (ఇంద్రుడు) సమన్వయమువలన వైశ్వానర స్వరూపనిష్పత్తి యగును. అగ్నిత్రయమూర్తి యగు నీవైశ్వానరతత్త్వమే పురుషపశువు. ఈశ్రుతి జూడుడు.

"ఇమే వై లోకా పూః అయమేవ పురుషో యోయం పవతే
సోఽస్యాం పురిశేతే తస్మా త్పురుషః" (శత. 13-6$\frac{2}{1}$)

వైశ్వానర పురుషుని యీ వ్యాపకస్వరూప నిరూపణ శ్రుతి యిట్లొనరించెను :—

"సయం సవై శ్వానరః-ఇమేసలోకాః-ఇయమేవ పృధివీవిశమ్ అగ్నిర్నరః-అంతరిక్షమేవ విశ్వమ్ వాయుర్నరః-ద్యౌరేవ విశ్వమ్-ఆదిత్యోనరః-తేయేత ఇమేలోకాః-ఇదం తచ్ఛిరః-ఇదమేవపృధివ్యోషధ యఃశ్మశ్రూణి, తదేతద్విశ్వం వాగేవ అగ్నిః సనరః సోపరిష్టాదస్యభవతి ఉపరిష్టాద్ధస్యాఅగ్నిః ఇదమేవాంతరిక్షమ్ తస్మాదేతదలోకమ్ అలోక మివాహ్యంతరిక్షమ్ తదేతద్ విశ్వం ప్రాణఏవ వాయుః సనరః సమ ధ్యేఽన్తస్యభవతి-మధ్యేనహ్యంతరిక్షస్యవాయుః శిరఏవద్యౌః నక్షత్రాణి కేశాః తదేతద్విశ్వంచక్షురేవ ఆదిత్యః సనరః-అవస్తాత్ శీర్ష్ణోభవతి-అవ స్తాద్ధిదివి ఆదిత్యః-తద స్యైతచ్ఛిరో వైశ్వానరః-ఆత్మాయ మగ్నిశ్చితః ఆత్మానమేవాస్యైతత్ సంస్కృత్యశిరః ప్రతిదధాతి." (శత. 9-2)

వైశ్వానరపశు వగ్నిప్రధానము కనుక వృషామూర్తి. ఇయ్యాది ప్రధానముగ గలప్రాణి, పశువు లందు పురుషు (మనుష్యు) డనబడును. ప్రాకృతిక పురుషపశు ప్రతికృతి పురుషుడు. ఇతర పశువులకంటె నిత డావిరాట్టునకు సన్నిహిత ప్రతి కృతి. కారణ మేమన :—వైశ్వానరుడు త్రైలోక్య మందు వ్యాప్తుడై యున్నాడు. అటు ప్రజాపతియు త్రైలోక్య వ్యాప్తుడు, అతడు అగ్న్యవచ్ఛేదమున అర్థశక్తిమయుడు. వాయ్వవచ్ఛేదమున క్రియాశక్తిమయుడు. ఇంద్రావచ్ఛేదమున జ్ఞానశక్తిమయుడు. ఇతర పశువులందు కంటె నితనియందు జ్ఞానక్రియార్థముల పూర్ణవికాస మున్నది కనుక పురుషపశువుం గూర్చి 'పురుషోవై ప్రజాపతేర్నేదిష్టమ్' అని చెప్పబడెను. పురుషసూక్త మీవిరాణ్మూర్తియగు పురుషపశు నిరూపణ జేయుచున్నది.

త్రివృత్ స్థానీయ మగు నగ్ని మొదటిసాహస్రి. పంచదశ వాయువు రెండవది. ఏకవింశాదిత్యుడు మూడవది. ఇందు అగ్ని ప్రధానము వైశ్వానరరూపము. వాయుప్రధానము హిరణ్యగర్భమయము. ఆదిత్యప్రధానము సర్వజ్ఞరూపము. వైశ్వానరు డొకకళ. హిరణ్యగర్భు డష్టవిధ ధిష్ణ్యాగ్ని సంబంధమున అష్టకళుడు—దివ్యుడగు సర్వజ్ఞు డొకకళ. మొత్తము 10 కళలు కలిసి విరాట్పురుషుడు-ఈశ్వరప్రజాపతి యితడే. వైశ్వానర-తైజస-ప్రాజ్ఞమూర్తి పురుషుడు పశువు. పార్థివ ప్రాణ ప్రధానతవలన నితడు వైశ్వానరుడు. సహస్రమూర్తి యీశ్వరున కేదైన బ్రతిమ యున్నచో నది పురుషపశువే. ఈ యాధారముననే యీ నిగమవచనములు వెలసినవి.

(1) పురుషోవై సహస్రస్య ప్రతిమా. (2) ప్రాజాపత్యోవై పురుషః. (3) పురుషః ప్రజాపతిః, (4) పురుషోహిప్రథమః పశూనాం (5) పురుషః పశూనాం, (అధిపతిః) (6) షోడశకళోవై పురుషః, (7) సవాఽయంపురుషః సర్వాసు పూర్షు (పృథివ్యంతరిక్షద్యులోకేషు) పురిశయః.

## 2. అశ్వః

ఇది ఆపోమయ సౌరతేజో నిష్పన్నము. సావిత్రియను సౌరతేజము భూపిండము వంకకువచ్చి, దానిండీకొని యాంతరీక్ష్యార్ణవసముద్రగ తాపత్త్వ సంశ్లిష్ట మగుచు, తన సౌర లోకము వంక కరుగుచుండును. పార్థివప్రాణయుక్తమై లోకాలోక పర్యంతము వితతమగు నీసౌరతత్త్వము, 'అశ్వ' నామమున వ్యవహృతము, అప్తత్త్వాభిమాని దేవత వరుణుడు.

నుక అశ్వమును వారుణ మనవచ్చును గాని, శుద్ధవారుణము ాదు. మరేమన :-సౌరతేజసంశ్లిష్ట మగు నాంతరీక్ష్యాష్ట త్వమే అశ్వమునకు గారణమగును. కనుక వారుణమైనను ాని సౌర్యపశువుగనే యెంచిరి. శుద్ధవారుణపశువు మహి ము. వరుణేంద్రులకు బరస్పరవిరోధము. అశ్వమం దింద్ర సౌర) ప్రాణమునకు మహిమమందు వరుణునకు బ్రధానత నుక రెంటికి బరస్పర విరోధము సహజము. 'అశ్వమాహిష్య' మను దాని మూల మిదే.

అశ్వమున కాంతరీక్ష్యాచ్ఛాగ మాత్మ (శరీరము) అష్టత్వము ఋతప్రధాన మగుటచే బ్రతిష్ఠాశూన్యము. కనుక తత్ప్రధానమగు నది యన్నివిధముల దనశరీరమును స్థిరముగ నుంచు ొనజాలదు. అశ్వము మూడుకాళ్లపై నిలబడుటకు గారణ మిదే. సూర్యకేంద్రమునుండి సౌరరశ్ములు నలువైపుల బ్రసరించును. కేంద్రబిందువు వస్తువున కక్షము. ప్రాజాపత్యాగ్నిమయ కేంద్రము పృథివికి అక్షము. దాని యాధారముననే అహోరాత్రములు భూమి తిరుగును. దీనివలన దైనందినగతి యేర్పడుచున్నది. అక్ష సంబంధముననే పార్థివగతిని 'స్వాక్షపరిభ్రమణ' మందురు. సూర్యుడును భూపిండమట్లు తన యక్షాధారమున స్వస్థానమున దిరుగుచుండును. అందుకు నిదర్శనము, సూర్యునందలి విభిన్న స్థానములందున్న మాఠర-పింగళ-దండాది చిహ్నముల స్థానపరివర్తనమే. ఈయక్షస్థానమే అక్షి. రశ్మినిర్గమనము దీని నుండియే. ఆరశ్ములను మరీచు లందురు.

సూర్యు డగ్నిమయుడు. ఇతనినుండి యనంత రశ్ములు వెలువడు చున్నవి. ఆ రశ్మిగతప్రాణములు అనంత రుద్రులు. వీని కేకైక శాసకుడు సూర్యుడు. అతడు 'క్షత్రరుద్రుడు' రశ్మిస్థ మరీచిమయ ప్రాణములు విట్ శబ్ద వాచ్యములు 'ఏకో రుద్రో నద్వితీయాయ' యన్న దాసూర్యుడే. ఈ క్షత్రరుద్ర-విడ్రుద్ర సంపత్తి నిరూపణ జేయుచు శ్రుతి యిట్లు చెప్పు చున్నది.

“అసౌ యస్తామ్రా అరుణ ఉత బభ్రుః సుమంగళః
యే చైనం రుద్రా అభితో దిక్షు శ్రితాః సహస్రశో వైషాం హేడ
ఈమహే”

సూర్య ప్రజాపతియొక్క యక్షిభాగ విసర్గత రశ్ముల ఘర్షణచే బుట్టి జలమర్ణవ సముద్రమునకు ప్రతిష్ఠ యగును. నాల్గువిధముల జలములం దీసౌరజలమును మరీచి యందురు. ఇది రుద్రాగ్ని యశ్రువులు. సౌరతేజగర్భిత మగునీ యశ్రు భాగము ప్రజాపతియొక్క అక్షి. (హృదయము) ఋక్సామ వితానమువలన బహిర్మండల కారణమగునది హృదయమే. ఈ అక్షిభాగమే పైవిధమున నశ్రురూప పరిణామము నొందు చున్నది. అదే పృథివీసంక్రాంతమై అశ్వరూప మగును. రుద్ర తేజ మతిప్రఖరము అది దీనికి జనకము కనుక ఇతర పశువుల కంటె నిది వీర్యవత్తమ మనిరి. అంతరిక్ష్యాప్తత్త్వగర్భిత రౌద్ర తత్త్వమే విద్యుత్తు. ఇది ఆపోమయి దీని కాంతరిక్ష్యాపస్సు ప్రతిష్ఠ 'యదేత దావిద్యోతతే విద్యుత్ (కేన) అన్నట్లీవిద్యుత్తు

ంద్రుడు - దేవతలం దితడు వీర్యవత్తముడు. కనుక తత్ప్రాణ ప్రధానమగు నశ్వమును వీర్యవత్తమము. ఇందువలన నశ్వముసౌర్యమని వచదగును. అది విద్యున్మూర్తి. కనుకనే నేడును వైజ్ఞానికులు విద్యుచ్ఛక్తి పరిమాణము నశ్వపశువుచే జేయుచున్నారు.

ఆపోమయాశ్వ పశువు భూపిండము నుండి సూర్యుని వరకు వ్యాపించి యున్నది. ప్రాతఃకాలము మొదలు సాయంకాలము వరకు దీనికి వ్యాప్తి. ఉషాకాల ముపక్రమ బిందువు. ప్రాకపాయి ఉపసంహార బిందువు. ఉష మస్తకస్థానము. ప్రాకపాయి పృష్ఠస్థానము. సౌర త్రైలోక్యమందు ఆపోమూర్తి, ఇంద్రప్రాణ ప్రధానము, నగు నీ యశ్వపశువు నిలువబడియున్నది. దీనిని చక్కఁగా నెఱుంగుట వేదము నెఱుంగుట.

సూర్యుడు త్రయీమూర్తి. ఇతడే వాజి రూపమున పరిణతుడై జిజ్ఞాసువులకు వేదస్వరూపముం దెలుపుచున్నాడు. యాజ్ఞవల్క్యుడు వేదతత్త్వము నేర్చిన దీ వాజిరూప సూర్యునుండియే. ఈ ద్యావాపృథివ్య, అప్ప్రధాన ప్రాణాత్మకాశ్వపశువున కే ప్రాణియందు ప్రధానత కలదో అది అశ్వమని వ్యవహారము. ఈ శ్రుతివచనము లీ అశ్వరూపమునకు పుష్టి నిచ్చును.

(1) ప్రజాపతేర్వా అ క్ష్యశ్వయత్-త త్పరాపతత్-త దశ్వోఽభవత దశ్వ స్యాశ్వత్వమ్, త ద్దేవా అశ్వమేధేన ప్రత్యదధుః (తాం. బ్రా) (2) అథ య దశ్రు సంక్షరిత మాసీత్, సోఽశ్రురభవత్, అశ్రుర్హవై త మశ్వ ఆ త్యాచక్షతే పరోక్షమ్: (శత) (3) అదోఽ్భ్యహవా అగ్రేఽశ్వః సంబభూవ సోఽద్భ్యః సమభవన్నసర్వః సమభవత్ అసర్వో హివై

సమభవత్, తస్మాన్న సర్వైః పద్భిః ప్రతితిష్ఠతి ఏకైకమేవ పాద ముదచ్య తిష్ఠతి. (శత) (4) అత్యోఽసీత్యాహ. తస్మాదశ్వః సర్వాన్ పశూనత్యేతి (త్తై బ్రా) (5) అప్సుయోనిర్వా అశ్వః (త్తై.బ్రా) (6) అశ్వః పశూనా మోజిష్ఠోబలిష్ఠః (7) అశ్వఃపశూనా మన్నాదో వీర్యవత్తమః (8) క్షత్రంవాఅశ్వో విదేతరేపశవః (9) ఇంద్రోవాఅశ్వః (10) అసౌవా ఆదిత్యోఽశ్వః (11) సౌర్యోవాఅశ్వః (12) వారుణోహి దేవతయాఽశ్వః (13) రశ్మినావాఅశ్వో, యతఈశ్వరోవా, అశ్వోఽయత ధృతోఽప్రతి ష్ఠితం, పరాంపరావతంగంతోః (14) సముద్రఏవాస్యబంధుః సముద్రో యోనిః (15) ఉషావాఽశ్వస్యమేదస్యశిరః (16) ప్రతూర్తం వాజిన్నా ద్రవ వరిష్ఠామను సంవతమ్ దివితేజన్మ పరమ మంతరిక్షే తవనాభిః పృథివ్యామధి యోనిరిత్ (యజు) ఇది యశ్వపశు స్వరూప పరిచయ సంక్షేపము.

## 3. గౌః

ఈ తత్త్వమునకు ప్రభవస్థాన మాపోమయ పరమేష్ఠి. వికాసస్థానము సూర్యుడు. వ్యాప్తిస్థానము త్రైలోక్యము. భాతి కప్రపంచ మంతయు. అన్ని యజ్ఞములు నీగోతత్త్వముపై ప్రతి ష్ఠితములు. భూతజనని సోమ మయీగా. సోమలోకము పర మేష్ఠి. దేవతా క్రమానుసారము పరమేష్ఠికి విష్ణువు దేవత. పర మేష్ఠ్య సోమ సంబంధమునుబట్టి విష్ణువును సోమవంశీయు డందురు. ఈ మనఃప్రాణవాఙ్మయ ప్రజాపతి ప్రాణభాగము నుండియే గోతత్త్వ ముత్పన్న మయినది. సౌమ్యప్రాణము గోవున కాత్మ. సౌరాగ్ని గోవుయొక్క శరీరము. కనుక దీని నమృతనాభి యనియు నాగ్నేయి యనియు నందురు. సూర్యుడు

సహస్రరశ్మి యగుటచే నీతత్త్వము సహస్రధా విభక్తము. అందు 333 తత్త్వములు పార్థివ వసుదేవతతోడను, 333 అంతరిక్ష్య రుద్రదేవతతోడను, 333 దివ్యాదిత్యునితోడను గూడియుండును. మిగిలిన ఒకగోవు కామగవి (పురాణభాషలో కామధేనువు.) అని ప్రసిద్ధము. పైని మూడు విధములుగ విభక్తమైన దని చెప్పబడిన గోతత్త్వము స్వస్వస్థానమునందే తనతన ప్రభుత్వము సాగించును. కాని యీ కామగవి అగ్ని రుద్రాదిత్యు లను మూవురితో గూడియుండును. అహోరాత్రములం దెపుడో యొకపుడొకమారు ఈకామగవి ప్రతియొక ప్రాణితోడను కూడును. ఆ సమయమున నాప్రాణి పల్కిన పల్కు నిజ మగును. ఆసమయ మెప్పుడో తెలియ నందున, శాస్త్రము సర్వదా 'శుభంబ్రూయాత్' అని యాదేశించును. కామగవి కది భోగకాలము.

సౌమ్యప్రాణమయ గోతత్త్వము సూర్యునితో గూడి రశ్మిరూప పరిణతి నొందును. ఆ సౌరరశ్ములు లోకాలోకవ్యాప్తములు. గోప్రాణమయ రశ్ములు. విష్ణుదేవతయొక్క గోతత్త్వమునకు శృంగములు. ఈశ్రుతిం జూడుడు :

"యా తేధామా న్యుశ్మసిగమధ్యై యత్రగావో భూరిశృంగా అయాసః
అత్రాహ తదురుగాయస్యవిష్ణోః పరమంపద మవభాసి భూరిః"

ఈ గోతత్త్వము రుద్రులకు మాత. వసువుల దుహిత. ఆదిత్యులసోదరి. యని చెప్పబడినది. ద్వాదశాదిత్య సమష్టి సూర్యుడు. ఇతడు పరమేష్ఠికి మనోతా. ఎట్లన :- పరమేష్ఠికి

భృగు-అంగిరా-అత్రి-అని మూడు మనోతాలు కలవు. అందు అంగిరాకు అగ్ని-యమ-ఆదిత్య అని మూడవస్థలు. భృగువునకు :-ఆపః-వాయు-సోమః-అని మూడవస్థలు. సౌమ్యప్రాణమును గోతత్త్వ మంటిమి. దీనికి ప్రభవము త్రయీగర్భి తాపోమూర్తి మనఃప్రాణవాఙ్మయ పరమేష్ఠి ప్రజాపతి. ఆంగిర సాదిత్యజనకము నీ పరమేష్ఠియే. గో-ఆదిత్యులు ఇరువు రొకే పరమేష్ఠి సంతానము కనుక 'స్వసాదిత్యానామ్' అని వచింపబడెను.

రుద్రు లాంతరిక్ష్య దేవతలు. ఈ కూటము ప్రాణప్రధానము. ఇందుండి మరు త్తుత్పన్న మయ్యెను. మరుత్తు నుండి స్పర్శధర్మ వాయువు వగు మారుత్రోత్పత్తి యగును. మారుత పితామహా రుద్రప్రాణ మాసౌమ్యగౌప్రాణ ప్రభవము. గోతత్త్వము ప్రజాపతి ప్రాణోత్పన్న మంటిమి. ప్రాణము ఋత తత్త్వము. ఇటు ఆంతరిక్ష్య రుద్రతత్త్వము ప్రాణాత్మ మగుటచే ఋతమే. ఋత ప్రథమరూపము పారమేష్ఠ్య గోరూప ప్రాణమే. స్వాయంభువు సత్యము. పారమేష్ఠ్య భార్గవ తత్త్వము ఋతము. ఇదే పిమ్మట నగు ఋతసృష్టికి జనకము. ఈ స్థితిలో ఆప్రాణప్రధాన మౌలిక గోరూప ఋతతత్త్వమును ఈ యాంతరిక్ష్య ఋతరూప రుద్రతత్త్వమునకు జనక మంగము. కనుక 'మాతారుద్రాణా' మనుట యుచితము.

అమృతసోమమును గోతత్త్వమున కాత్మ యంటిమి. శరీర మాగ్నేయ మంటిమి. అగ్నిప్రధానము లగు సౌరరశ్ములు

ఈ గోశరీరము. ఇయ్యది (రశ్ములు శరీరము) సోమతత్త్వముపై నాధారపడి యున్నది. మనము చూచు ప్రకాశ గోమూర్తి "త్వంజ్యోతిషా వితమోవవర్థ" అన్నట్లు సోమాహుతియొక్క ప్రభావమే. "అగ్నిర్భూస్థానః" అన్నట్లు అగ్నితత్త్వము భూలోకవస్తువు. దాని ఘనతా తారతమ్యము వలనను, గాయత్రీ ఛందో తారతమ్యము వల్లను, అది యెనిమిది విధములై అష్టవసు నామమున నొప్పుచున్నది. గౌతత్త్వ స్థూల భాగ (స్థూలశరీర) నిర్మాణము ఈ పార్థివ వాగగ్నిపై నాధార పడి యున్నది. కనుక 'దుహితావసూనామ్' అనుట తగి యున్నది.

వసు-రుద్ర-ఆదిత్యులు సౌర దేవతలు. అందరకు గౌతత్త్వ ముతో ఘనిష్ఠ సంబంధమున్నది. పృథివీ-అంతరిక్ష-ఆపః, అను భేదమున లోకసంస్థ నాల్గు భాగములు. ఇందు క్రమముగ 333-333-333-1 చొప్పున 1000 గా విభజింపబడిన గోతత్త్వ మున్నదని ఈవరకే యనుకొంటిమి. సోమమయ గోతత్త్వము లేనిచో యజ్ఞ మసంభవము. యజ్ఞము లేకున్నచో విశ్వసృష్టి యసంభవము. కనుక నీగోతత్త్వము విశ్వమునకు అందలి ప్రాణులకు జనకమందుము. ఇది లోకరూపము-లోకవ్యాప్తము. 33 దేవతల కాత్మ. అమృత సోమమునకు కేంద్రము. ఇట్టి యీ ప్రాకృతిక గో (ప్రాణాత్మక) పశువునుండి పార్థివ గోపశు నిర్మాణ మగును. దీని యందు దా ప్రాణమే యున్నది. దాని కిది ప్రతికృతి అభిన్నము.

ఈ గోతత్త్వ మగ్న్యవచ్ఛేదమున ఋగ్వేదమునకు వాయ్వవచ్ఛేదమున యజుర్వేదమునకు ఆదిత్యావచ్ఛేదమున సామవేదమునకు అబవచ్ఛేదమున నధర్వవేదమునకు నధిష్ఠాతయై యున్నది. తత్ప్రతిమాభూత గోపశువునకు నిదేన్ధిస్తి. కనుకనే వేదతత్త్వ మర్మజ్ఞులగు మహర్షులు ఆత్మయందు వేదవిద్యా వికాసము గలిగించుటకు గోసేవ సేవలోపాయముగ నంగీక రించిరి. గోసేవాప్రభావముననే సత్యకామ జాబాలి బ్రహ్మ వేత్త యయ్యెను. ఆర్యావర్తము గోధన మహాత్వ మెరుగనిది కాకున్నను నేడుదాసీనత వహించి దుర్గతివంకకు, నాశము వంకకు సాగుచున్నది. సర్వప్రతిష్ఠ గోవు. ఈ యుభయవిధ (ప్రాణాత్మక-ప్రాణ్యాత్మక) గోతత్త్వము నభిన్నముగా జూపు నీ యార్షవచనముం బరికింపుడు :—

"మాతారుద్రాణాం దుహితావసూనాం స్వసాదిత్యానా మమృతస్యనాభిః ప్రనువోచం చికితుషే జనాయ మాగా మనాగా మదితిం వధిష్ఠ."

అమృతసోమమునకు వర్ణింపబడిన గుణములుగల సోమ రస మీజగన్మాతయగు గోస్తనములం దున్నది. ఆయుర్వేదము కూడ నిట్లే యంగీకరించిన ట్లీ వాగ్భట వచనమువలన దెలియ నగును.

"స్వాదు పాకరసం స్నిగ్ధ మోజస్యం ధాతువర్ధనం
ప్రాయః పయః........తత్ర గవ్యంతు జీవనీయం రసాయనమ్
క్షతక్షీణహితం మేధ్యం బల్యం స్తన్యకరం పరం"

ఈ క్రింది వచనములు పై విషయములన్నిటిని బలపరచును.

(1) ఇమేవై లోకాగాః, (2) యద్ధికించాన్నం గౌరేవతత్, (3) యజ్ఞోవైగౌః, (4) సహస్రోవాఏషశతధారఉత్సః-యద్గౌః, (5) సహైషసోమోఽజస్రో-యద్గౌః, (6) వైశ్వదేవీవైగౌః, (7) ఆగ్నేయోవైగౌః, (8) గౌర్వాఇదం సర్వంబిభర్తి, (9) నైతేసర్వేపశవో యదజావయశ్చారణ్యాశ్చ ఏతేవై సర్వేపశవో యద్గంతవ్యాః. (10) ప్రాణోవైసోమః, (11) (ప్రజాపతిః) ప్రాణాదుగామ్.

N. B :—అన్యత్ర విస్పష్టమగు గో తత్త్వముంగూడ జూడుడు :—

## 4. అవిః (గొఱ్ఱె)

ఇది అంతరిక్ష్య ఆపోభాగమునకు జెందినది. సదా ఋత (అప్) తత్త్వవేష్టితమై యుండును. పంచాగ్ని విద్యానుసారము దిక్సోమము వృష్టికి మూలతత్త్వము. ఆదిత్యాగ్నియందు శ్రద్ధయొక్క (సోమమహాలికావస్థ) ఆహుతిచే సోమ ముత్పన్నమగును. ఋత-సత్య భేదమున దీనికి రెండు స్థితులు. ఒకటి పిండరూపమున బరిణమించును. అదే చంద్రుడు. ఇది సాయతనము సశరీరము నగుటచే సత్యసోమ మందురు. 'సహృదయం సశరీరం సత్యం' గదా! అట్టి పదార్థముతో నింద్రప్రాణ (రశ్మి) సంబంధము కలుగును. అందుచే సోమము ప్రకాశయుక్తమగును. చంద్రుని ప్రకాశము సూర్యునిదే. కనుక శ్రుతి "అత్రాహ గోరమన్వత నామ త్వష్టు రపీచ్యమ్ ఇత్థా చంద్రమసో గృహే" (ఋక్)

కొంతసోమ మిటునటు దిక్కులందు వ్యాపించును. ఇది వాయుద్వారమున పర్జన్యాగ్నియం దాహుతమై వృష్టికారణ మగును. కనుకనే ఛాందోగ్య మిట్లన్నది. "పర్జన్యోవావ గౌతమాగ్నిః తస్య వాయురేవ సమి ద్భ్రం ధూమో విద్యు దర్చి రశని రంగారా హ్రాదనయో విస్ఫులింగాః తస్మి న్నేతస్మి న్నగ్నౌ దేవాః సోమగ్ం రాజానం జుహ్వతి తస్యా ఆహుత్తేః వర్ష గ్ం సంభవతి."

దిక్కులందు వ్యాప్తమగు నీసోమమును దిక్సోమ మందురు. నిరాయతన మగు నిత్యాది "అశరీరం అహృదయం ఋతమ్" అనుటచే ఋత మందుము. ఈదిక్సోమమే "దిశః శ్రోత్రే" అన్నట్లు ఈశ్వర ప్రజాపతి శ్రోత్రేంద్రియ స్థానీయము. మన శ్రోత్రేంద్రియ నిర్మితియు దీని వలననే యగును. వృష్టి కారణ మగు దీని నుండియే 'అవి' ప్రాణవికాసము కలుగును. వర్షానంతరము భూమియందు కలుగు పచ్చిక పచ్చదన మీసోమగ తావిప్రాణ మహిమయే.

ఇది విశేషతః అంతరిక్ష్యపశువు. ఇయ్యది భూమికి జెందినది కాని, ద్యులోకమునకు జెందినది కాదు. కనుక దీనిని పార్థి పశు వనియు నందురు. కనుకనే గొఱ్ఱెకు మేకకు సహాచరత్వ మున్నది. గ్రహవిజ్ఞానముం బట్టి యుపాంశు గ్రహమునుండి అజపశు వుత్పన్నమగును. అంతర్యామ గ్రహమునుండి యవిపశు వుత్పన్న మగును. ఉపాం శ్వంతర్యామములు రెండు

గ్రహములును సహచారులు. కనుక నే రెండు పశువులును
జతగా నుండును.

ఉపాంశ్వాహుతి మొదటను, అంతర్యామాహుతి తరు
వాతను అగును. కనుక గుంపులో మేక ముందుగను, గొఱ్ఱె
వెనుకను నడచును. ఉపాంశ్వాహుతికి పిదప నూర్ధ్వభాగము
నకు ద దున్మార్జన జరుగును. అంతర్యామమూలము క్రింది
వంక కుండును. కనుక అజపశువు వెగురుచు, దుముకుచు,
మెడ పైకెత్తి నడచును. అవిపశువు, మెడవంచి భూమిని
వాసన జూచుచు నడచును. (శత. 4-5-5) ఇంతకును :—
అవ్యజ పశువులు సహచారములు, అని ఫలితార్థము. అవి
పశుధర్మముల కీ శ్రుతివచనములను బరికింపుడు :—

1. ఇయంవా (పృథివీ) అవిః
ఇయం హీమాః సర్వాః ప్రజాఅవతి (శత)
2. వారుణీ త్వాష్ట్రీచావిః
3. అంతర్యామపాత్రమేవాన్వయః ప్రజాయంతే
4. అవిర్వైనామదేవతా ఋతేనాస్తి పరివృతా
తస్యారూపేణేమే వృక్షా హరితాహరితస్రజః
5. (ప్రజాపతిః) శ్రోత్రాత్ అవిం (నిరమమీత)

## 5. అజః

ఇది ప్రధానముగ బార్థివపశు వగుటచే నగ్నిప్రధాన
మందుము. పార్థివప్రజాపతి పృథివీకేంద్రస్థుడు. "ప్రజాపతిశ్చ
రతిగర్భే" అన్నది ప్రసిద్ధమే కదా ! అత డగ్నిమూర్తి. పృథివి

కాధారము. కనుక 'అక్షు' మందురు. పూర్వోక్తప్రకారము ఈ యజ్ఞాగ్ని నిరంతరము విస్రస్త మగుచుండును. విస్రస్త భాగమును ప్రవర్గ్యము, ఉచ్ఛిష్టము మొదలగు పేరుల బిలుతురు. ఇది అజపశువున కుపాదానము. ఈ ప్రవర్గ్యాగ్నిచే నిష్పన్నము లగు నోషధి వనస్పతుల స్థానమే ఈ యజపశువునకు స్థానము. మనకు అన్నముగ నుపయోగపడుచున్నను నోషధి వనస్పతులు తరిగిపోవు. ఏల? అవి ప్రాజాపత్యాన్నములు. అజ పశువు నంత్రే. ఇతరపశువులకంటె వీని యుపయోగము హెచ్చు. కాని యివి క్షీణించిపోవుటలేదు. పార్థివప్రజలకు బ్రధానాన్న మజపశువే. నిరంత మద్యమాన మయ్యు నిది క్షీణింపదు. కనుకనే యిది 'అజ' అనబడుచున్నది.

సంవత్సర ప్రజాపతి ఈశ్వరప్రజాపతి. విశ్వోపదాన మయ్యు దీనికి మూలోచ్ఛిత్తి కాదు. గ్రీష్మ-వర్షా-శిశిరము లని దీనికి మూడు జన్మలున్నను క్షీణింపను. కనుక 'అజ' యై యున్నది. కార్యోత్పత్తికి పిమ్మట కారణనాశము లౌకికముగ జూచుచున్నాము. ఎట్లన :— పాలన్నియు కోవా - మీగడ యగుచో పాలుండవు. త్రుప్పుపట్టుచో లోహముండదు. కాని, ఈశ్వరసంస్థయం దట్లుకాదు. ప్రజాపతి ప్రవర్గ్యభాగముచే నిరంతరముగ బదార్థము లుత్పన్నములగుచుండును. కాని దేనికిని లోపము లేదు. కనుకనే ప్రజాపతింగూర్చి :—

"ఏషనిత్యోమహిమా బ్రహ్మణో నకర్మణావర్ధతే నోకనీయాన్" అని చెప్పబడెను. సంవత్సరప్రజాపతికి మూడు

ప్రసవములల్లో అజపశువునకు సంవత్సరమున మూడు ప్రసవములు. ప్రజాపతి మనఃప్రాణవాఙ్మయుడు. తదీయ ప్రాణభాగము నుండి గోపశువు వలెనే వాగ్భాగమునుండి అజపశు వుత్పన్నమగును. "తస్యవా ఏతస్యాగ్నేః వాగే వోపనిషత్" అన్నట్లు వాక్తత్త్వమగ్నియే, ఇయ్యది స్థూలధాతువు. దీనిచేతనే ధ్రువ భూలోకము నిర్మింపబడినది. అంతరిక్షాద్యులు ధర్త్ర (తరళ) సృష్టులు. పృథివి 'ధ్రువ' కనుకనే దీనిని 'కపాల' మందురు. ధ్రువభావయుక్త కపాలరూప భూపిండమం దగ్ని ప్రతిష్ఠితమై యున్నది. ఈ యగ్ని పేరే రసము. దీనికి బ్రహ్మౌదనము- పవర్గ్యము నని రెండవస్థలు. బ్రహ్మౌదనముయొక్క మూడవస్థలందుండి అగ్నివాయ్వాదిత్య భేదభిన్న దేవసృష్టి యగును. ఇక భూకపాలసంశ్లిష్టోచ్ఛిష్టభాగ మీ యజపశువునకుపాదానమగును. ఈ ప్రాణాత్మక- అజపశువున కే ప్రాణిపశువునందు ప్రధానత కలదో అది అజనామమున వ్యవహరింప బడుచున్నది. ఈ విషయము లన్నిటికి ఈ క్రింది శ్రుతివచనములు మూలములుగా జూడవచ్చును :—

1. అథయః కపాలేరసోలిప్తఆసీత్ - సోఽజోఽభవత్
2. తస్యాక్షిభ్యామేవ తేజోఽస్రవత్ - సోఽజః పశురభవత్
3. (ప్రజాపతిః) వాచోఽజమ్ (నిరమిమీత)
4. వాగ్వాఽజః............ఇది యజపశు నిదర్శనసంక్షేపము.

ఇతరపశువుల కీ పైనిజెప్పిన పంచపశువులం దంతర్భావము. కనుక వీనిని 'సర్వపశువు' లని యంగీకరింతురు. ఈ వాక్యము జూడుడు :—

"పురుషోఽశ్వోగౌరవిరజోభవన్తి ఏతావంతోవైసర్వేపశవః" (శత)

పై పంచప్రాణపశువులనుండి ప్రాణిపశువులు వెలసినవి. మొదటనే పంచపశువులు ద్యావాపృథివ్యము లంటిమి. ద్యావాపృథువులు త్రైలోక్యము. అష్టవిధ త్రైలోక్యములందు ప్రస్తుతము మన మనుకొనునది సంవత్సర రూప స్తోమ్యత్రిలోకి. ఇందు సామ్రాజ్యము అగ్నివాయురవు లను మూఁడు రాగ్నేయ దేవతలది. ఈ మూఁటికి రెండు సంధులుండును. ఈ విధముగ సంవత్సరాగ్ని పంచవిధము. అగ్నియొక్క పంచచితులివే. దీనిం బట్టియే "పంచచితికోఽగ్నిః అసిరి. పంచాగ్నులంబట్టియే సంవత్సరయజ్ఞము పాంక్త మనబడును. ఈ సావంత్సరిక పంచ చితికాగ్ని విస్రస్తమై మొదట పార్థివోపస్నునం దాహుత మగును. ఉప యోని. అగ్ని రేతస్సు. ఈ యాహుతిచే బుట్టు క్రొత్తయగ్నికి కుమారాగ్ని యని వ్యవహారము. సంవత్సరాగ్ని భూమిలో బడి తన స్వతంత్ర సత్తం బోగొట్టుకొని మూర్ఛిత మగును. కనుక 'క్రామియతే' అను వ్యుత్పత్తిచే కుమారాగ్ని యని పేర్వడసెను. పృథివియొక్క యొక సాంవత్సరిక పరిక్రమచే నాకుమారాగ్నిస్వరూప నిష్పత్తి యగును. ఇది పిమ్మటః- (1) రుద్ర (అగ్ని) (2) శర్వ (ఆపః) (3) పశుపతి (ఓషధి) (4) ఉగ్ర (వాయు) (5) అశని (విద్యుత్) (6) భవ (పర్జన్య) (7) మహాదేవ (చంద్రమా) (8) ఈశాన (ఆదిత్య) అను నెనిమిదిరూపములుగ బరిణతి నొందును. ఒకేయగ్నికివి యెనిమిదవస్థలు "అగ్నిర్వారుద్రః" అన్నట్లగ్నియే అష్టమూర్తిశివుడు.

వ్యష్టిరూపమున చిత్రాగ్ని ; సమష్టిరూపమున కుమారాగ్ని యితడే కుమారుడు తొమ్మిదవ వాడు. ఇతనికే పై యెనిమిది భేదములు.

ఈ చిత్రాగ్నియే పిదప బైని జెప్పిన పంచపశురూప పరిణతి గాంచును. కుమారాగ్ని రుద్రుడు పంచపశ్వధిష్ఠాత యగుటచే పశుపతి యందురు. ఇట్లు విస్రస్తమగు సంవత్సరాగ్నియే కుమార- చిత్ర- రూపమున బరిణత మగుచు జివరకు బంచపశురూప పరిణతినొందును. పశ్వగ్ని సాంవత్సరికాగ్ని కంతిమ పరిణామము "సంవత్సరాగ్ని విస్రస్త మయ్యెను. ఆప్రజాపతి చివరకీ పశువులందు ప్రాప్తము గావించెను. అచట నతడు తన రూపము నొందెను. ప్రజాపతి తన విస్రస్తరూప మిందు జూచెగాన "అపశ్యత్ తస్మాత్పశవః" అను వ్యుత్పత్తిచే అగ్ని 'పశు' నామప్రసిద్ధ మయ్యెను. ఈ పశువులతోడనే ప్రజాపతి తన విస్రస్తభాగ సంస్కారము గావించి తన లోపమును పూర్తి గావించుకొనెను." (శత : 6 కాం 2 ప్ర. 3-4 బ్రా)

అనగా :— సంవత్సరప్రజాపతియొక్క యగ్నిభాగము పశునిర్మాణమునందు వ్యయ మగుచుండును. మనము (పశువులు) అతని యగ్నిభాగముంగొని యుత్పన్నుల మైతిమి. ఇందుచే తనకు కల్గిన లోపమును బూరించుకొనుటకు బ్రజాపతి మన యాలంభనము సేయును. ఆ యాలంభనముచే మన (పశువుల) శరీరాగ్ని యుత్క్రాంతమై ప్రజాపతియొక్క సంవత్స

రాగ్నియందు (చి) జితమై తదీయ విస్రస్తభాగమును నింపును. ఈ విధముగ మనము దానిం దిని (అతని యగ్నిభాగముంగొని) బ్రదికి యుందుము. చివర కది మనలం దిని తన స్వరూపమును నిల్పుకొన జాలును. ఈ యాదానవిసర్గాత్మక భైషజ్యయజ్ఞము నిరంతరము జరుగుచుండును. ఆ ప్రజాపతియగ్ని మనయందు మనయగ్ని అతనియందును చిత మగుచుండును. ఈ యగ్నిచితి సంబంధముననే ఈ యజ్ఞము 'అగ్నిచిత్యా' 'అగ్నిచయన' 'చితి' అను నామము లొందెను.

అగ్నిమూర్తి యన్న సంవత్సరప్రజాపతి "అర్థంహ వై ప్రజాపతే రాత్మనః మర్త్య మాసీత్, అర్థమమృతమ్" అన్నట్లు అమృత మర్త్యభేదమున రెండుభాగములుగ నున్నది. యాజ్ఞిక పరిభాషంబట్టి అమృతాగ్ని 'చితేనిధేయ' మనియు, మర్త్యాగ్ని చిత్య మనియు నందురు. స్థూలభూతాగ్ని చిత్యాగ్ని; సూక్ష్మప్రాణాగ్ని చితినిధేయాగ్ని. భూతాగ్ని భూతము; ప్రాణాగ్ని దేవత. దేవతా-భూత రూపముననే ప్రాజాపత్యాగ్ని వికాసము జరుగును.

భూతప్రాణమయ సంవత్సరాగ్నినుండి పుట్టిన ట్టి- పూర్వోక్త పంచపశువులును భూతప్రాణమయములే. అందు భూతచితి ఋతురూపము. వసంత గ్రీష్మ వర్ష శరత్ హేమంత శిశిరము లను నీ పంచఋతువులును పంచభూతాగ్నులు. వీనిచే శరీరనిర్మాణ మగును. పశుశరీరము మర్త్యము. ఇందుగూడ

మజ్జాస్థి స్నాయు మాంస మేదస్సు లను పంచ మర్త్యచితు లున్నవి. అందు (అచట) అగ్నివాయ్వాదిత్యులు, రెండు సాంధ్యప్రాణములు అను పంచప్రాణచితు లున్నవి. ఇచటను ప్రాణము, అపానము వ్యానము, సమానము, ఉదానము, అను ప్రాణచితి పంచక మున్నది. రెండునొకటే.

ప్రజాపతి పశువుల భూత-ప్రాణము లను రెండు భాగ ముల నొకమారే తనయందు చయనముసేయడు. మరేమన :— చయనమునకు మొదట ప్రాణ-భూతము లను రెంతు చితులను విశకలనము గావించివై చును. మొదట పశువుయొక్క ప్రాణము వెడలిపోవును. ఈ ప్రాణచితి స్వతంత్రరూపమున నగును. భౌతిక శవభాగ ముండిపోవును. అగ్నిదాహముచే నదియు గ్రమముగ స్వతంత్రరూపమున బ్రజాపతియొక్క భూత భాగమున చితమైపోవును. ఇట్లు సంవత్సర ప్రజాపతి స్వయజ్ఞ సిద్ధికొరకు పంచపశ్వాలంభన సేయుచుండును. అందువలన నమృతభావాపన్ను డగుచున్నాడు. పార్థివ పంచపశ్వాలంభన లేక కేవలము నూతన పశూత్పత్తియే యగుచుండుచో కొలది కాలములోనే సంవత్సర ప్రజాపతి తన ప్రతిష్ఠం బోగొట్టుకొ నును. కాని య ట్లెన్నడును కాదు.

ఆలంభనసేయుట తప్పదు. ఆలంభనానంతర మతనిం జేరు నుభయ విధాగ్నిభావమువలననే యత డొక విధముగ జీవితుడై యున్నాడు. కనుకనే 'ఇతఃప్రదానాహ్యేతే' (ఉప జీవన్తి) యను నిగమము వెలసినది. ఇంతకును సంవత్సరప్రజా

పతి స్వ స్వరూపసిద్ధికొరకు తద్ద్వారా అమృతత్వ ప్రాప్తికొరకు నిరంతరము పంచపశ్వాలంభనము సేయుచున్నాడని తేలుచున్నది. ప్రాకృతిక పశ్వాలంభనమున కిది సంక్షిప్తస్వరూపము.

ప్రజాపతిశబ్దము ప్రజాసాపేక్షికము. ఇయ్యది మాతా-పితా-పత్నీ-పుత్ర-స్వామి-రాజా శబ్దముల వంటిది. ఈసాపేక్షం బట్టియే అభియుక్తులు "ఆత్మ ప్రాణ పశు సమష్టిః ప్రజాపతిః" అనిరి. ఆత్మభోక్త. ప్రాణము భోగసాధనము. పశువు భోగ్యము. ఈ మూటిసమష్టి ప్రజాపతి, సమష్టిగను, వ్యష్టిగను అన్నిటియందు నీ మూడుభావములు నున్నవి కనుకనే "ప్రజాపతిస్త్వేవేదం సర్వం యదిదంకించ" అను నిగమము వెలసినది.

(1) స్వయముగ నాత్మనిర్భరత కసమర్థ మగుతత్త్వము పశువు. (2) ఏతత్త్వముపై నాత్మప్రజాపతి భోగ్యరూపమున దృష్టి నుంచునో అది పశువు. (3) దేనివలన ప్రజాపతి తన విస్రస్తభావ పూర్తి గావించునో సంవత్సరప్రజాపతియొక్క ఆ ప్రవర్గ్యభాగము పశువు.

"సంవత్సరప్రజాపతి విస్రస్తభాగము ప్రవర్గ్యమై మొట్ట మొదట పార్థివోషాగ్నియం దాహుత మగును. ఉష యోని. సంవత్స రాగ్నిప్రవర్గ్య భాగము రేతస్సు; అంతరిక్ష మంతు వ్యాప్తమై యున్న మాతరిశ్వా వాయువు రేతోధా. పృథివి యొక్క ఒక సాంవత్సరిక పరిక్రమచే పార్థివోషస్సు నందు సిక్తమగు సంవత్సరాగ్ని పృథివీవస్తువై పోవును. అనగా తన

స్వతంత్రసత్తం బోగొట్టుకొని పృథివియందు మూర్ఛిత మగును. కనుక 'క్రాబ్రయతే' అను వ్యుత్పత్తిచే పార్థి వాగ్ని యొక సంవత్సరమునకు బిదప కుమార నామమునొందును. పిమ్మట నిది యష్టవిధ చిత్యాగ్నిరూపము నొంది చిత్రాగ్నియై యిదే పంచపశు రూపమున బరిణతి గాంచును." అని మున్ను చెప్పియుంటిమి. ప్రకృత మీమాంసావలోకన మేలయన :-ప్రజాపతికి భోగ్యము కేవలము పశుపంచక మని చెప్పుటకే.

ఒకనిదృష్టి యొకవస్తువుపై బడినప్పుడు లోకులు 'వాని దృష్టి దీనిపై (దానిపై) బడె' నందురు. భోగేచ్ఛయందు దృష్టి మాత్రమునకు బ్రధానత ఈయబడును. ఈదృష్టిభావముంబట్టియే పశుశబ్దమునకు "యదపశ్యత్ తస్మా త్పశుః" అను నిర్వచనము సేయబడెను. ఆత్మ పశుపతి. ప్రాణము పాశము, వాగ్భాగము పశువు. మూటి సమష్టియు పశుపతి. ప్రతివస్తువునందు నీమూడు భాగములు నుండును. చీమలబారుం జూడుడు. అందొక పెద్ద చీమ నాయకత్వము వహించి యుండును. గార్హస్థ్యమునం దొక ప్రజాపతి తప్పనిసరియే కదా! బాలక్రీడయం దైనను ఒక నాయకత్వ ముండును. వన్యపశువులందు సింహము మృగేంద్రు డన్నది సహజముగ నున్నదే. పెక్కులేల? అంతటను ప్రజాపతి సత్త యగుపడును. కనుకనే "ప్రజాపతే నత్వ దేతా న్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ" అన్నది చరితార్థ మగుచున్నది.

ఇక :—పశువు భోగ్యము. పశుపతిభోక్త. అని సిద్ధమైనది. 'అన్నమత్తి' అను వ్యుత్పత్తిచే భోక్తాతత్త్వమును వైజ్ఞానికు లన్నాద మనియు 'అద్యతే' అను వ్యుత్పత్తిచే భోగ్యము నన్నమనియు నందురు. అన్నాద మగ్ని. అన్నము సోమము. కనుక పశువును సోమ మనియు, పశుపతి నగ్ని యనియు ననవచ్చును. పశువు అన్నము. దీనిని వాక్కంటిమి. హృదయమునుండి బయలువెడలుచు నశనాయా రూప వితానము నొందుచు నన్నముగోరు నే రశ్మిభాగము గలదో అది ప్రాణమందురు. ఇది యెందుండి వెడలునో ఆ మూలతత్త్వము ఉక్థ మందురు.

పైని జెప్పిన ఆత్మా-ప్రాణ-పశువులే క్రమముగ ఉక్థ-అర్క-అశితి అందురు. ఉక్థ మన్నాదాగ్ని. అర్క అగ్నిరశ్ములు. అశితి పశు వగు నన్నము. ఈ పశురూపాశి త్యావాహుతిచే ఉక్థాగ్ని స్వస్వరూపమున నుండును. ఉక్థ మను పేరు అశితి సంబంధముపై నిల్చియున్నది. నిజమే. శరీరాగ్నియం దన్నసోమాహుతి జరుగు చున్నంతవరకు నగ్ని జీవితమై యుండును. అశితియే మహాదుక్థ విస్రస్త భాగమును పూరించి యాప్యాయిత మొనరించు చుండును. సార్వజనీన మగు నీవిజ్ఞానముం గూర్చి శ్రుతి "అశీతిభి ర్మహాదుక్థ మాప్యాయతే" 'ఆత్మా మహా దుక్థమ్' అన్నది.

ఆత్మఉక్, అన్నముథమ్. థమ్ ప్రతిష్ఠాద్యోతకము. ఉః ప్రాణమునకు కకారము వాక్కునకు ద్యోతకములు. ఆత్మ

స్వాయముగా మనఃప్రధానము. ప్రాణవాక్కులు లేకుండ మన స్సుండదు. వాక్కునందు ఉ-అ-క అను నక్షరములున్నవి. ఉకారము ప్రాణమునకు అకారము మనస్సునకు కకారము వాక్కునకు వాచకములు. ఆత్మయం దకారకళ కంతర్భావము. మిగిలిన ఉకార (ప్రాణ) కకార (వాక్కు) లకు అకారాత్మక (మనోమయ) ఆత్మతో నిత్యసంబంధ మున్నది కనుక నాత్మం గూర్చి 'సవాఏషఆత్మా వాఙ్మయః ప్రాణమయో మనోమయః' అని లక్షణ మేర్పడెను. ఈత్రిపుటీభావము గొనియే ఆత్మను ఉక్ అని వ్యవహరించిరి. ఈ యన్నాదరూప 'ఉక్' కు (ఆత్మకు) ప్రతిష్ఠ అన్నము. అటనే ఆత్మ నిల్చును కనుక నన్నమును థమ్ అని వ్యవహరించిరి. రెంటి సమష్టి 'ఉక్థమ్'. అన్నాన్నాద సమష్టి ఉక్థమ్. అగ్నిషోమ సమష్టి ఉక్థమ్. ఆదిత్యచంద్రులుక్థమ్. "సముదాయే దృష్టాః శబ్దాః అవయవే ష్వపివర్తన్తే" అన్నట్లు ఆత్మయు అన్నము గూడ నుక్థ శబ్ద వాచ్యము లగును.

పశుభాగ మాత్మయొక్క వాక్కళ. ఈవాక్కు అమృత మర్త్య భేదమున రెండు భాగములు. (1) అమృతవాక్కున కింద్రుడని పేరు. ఈయింద్రుని 'శ్వా' యందురు. వర్తమానమున ఈథర్ అనుచున్నారు. 'నేంద్రాదృతే పవత్తే థామ కించన' అన్న ట్లిది అంతటను వ్యాప్తమై యున్నది. ఇది లేని చోటు లేదు. మనము శూన్యమనుకొను చోటను నీ యింద్రతత్త్వ వ్యాప్తి యున్నది. 'శ్వా' యింద్రావస్థానమునే శునే హితం

అను వ్యుత్పత్తింబట్టి యీ స్థలమును శూన్య మందురు. ఇయ్యది సృష్టి కాలంబనము. అమృతాకాశ మిదే. దీనినే 'పరమేవ్యోమన్' అందురు. సర్వాధ్యక్ష మిది. (2) మర్త్య వాక్కు-ఇంద్రపత్ని. మర్త్యాకాశ మిదే. దీనిం గూర్చియే :— 'తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః' అని చెప్ప బడినది. ఇది విశ్వోపాదానము. ఈవాక్తత్త్వమే ఉత్తరోత్తర మగు బలచితుల వలన క్రమముగ వాయు-తేజో-జల-మృద్రూప పరిణతి నొంది పంచభూత స్వరూపము దాల్చు చున్నది. దృశ్యప్రపంచము పంచభూత సముచ్చయము. దీనికి మూలోపదానము వాక్కు. (మర్త్యవాక్కు) కనుకనే "అథో వాగేవేదం సర్వం" "వాచీమా విశ్వాభువనాన్యర్పితా" ఇత్యాది నిగమములు వెలసినవి.

విశ్వభారతియే విశ్వజ్యోతి. భావము జ్ఞానము. జ్ఞానము ప్రకాశము. కనులు దెరువగనే విశ్వము ప్రత్యక్షమగును. ఇది యొకవిధమగు జ్యోతి. వాఙ్మయపంచభూతములు లేకున్న విశ్వజ్యోతి కభావమే కదా! కనుక వాగ్రూప పశువు నవశ్యము విశ్వజ్యోతి యందుము. మరియు పంచభూతములే మన యన్నము. అన్నములేనిచో నంతట నంధకారమే. కనుక అన్న పశువును లేదా పశ్వన్నమును విశ్వజ్యోతి (సర్వజ్యోతి) యందుము.

పశుసోమాహుతిచేతనే అన్నాదాగ్ని ప్రదీప్త మగును. అగ్నియందు సోమాహుతి యజ్ఞము. ఈస్థితిలో 'త్వాష్ట్రా

చ్ఛబ్ద్యమ్' అన్నట్లు యజ్ఞరూపసమర్పక మగు నీ పశువును యజ్ఞ మనియు ననవచ్చును.

ప్రతివస్తువును ప్రజాపతి యంటిమి. అందు ఆత్మా-ప్రాణ-పశువులను మూడుకళల సత్తయు జెప్పితిమి. (1) ఆత్మ తత్త్వము 'ప్రజాపతిశ్చరతిగర్భే అంత రజాయమానః' అన్నట్లు వస్తుకేంద్రమున హృదయాకాశస్థ దహరాకాశ (దభ్రాకాశ) మందు బ్రతిష్ఠితమై యుండును. ఉపనిషత్తులందు దీనిగూర్చి "ఏషసర్వేషుభూతేషు గూఢోత్మా నప్రకాశతే దృశ్యతే త్వగ్ర్యాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అను నిత్యాదిగా గూఢోత్మ యని వ్యవహార మున్నది.

(2) ప్రాణతత్త్వము (శబ్ద స్పర్శ రూప రస గంధ రహిత మగు తత్త్వము) వస్తువునం దంతటను వ్యాప్తముగ నుండును. పాంచభౌతిక క్షరపరమాణువుల నొక సూత్రబద్ధము లుగ జేసి నియతకాల పర్యంతము వస్తుపుద్గలమును స్వస్వ రూప ప్రతిష్ఠితము గావించు శక్తియే ప్రాణము. దార్శనికులు దీని నక్షరు డనిరి. బ్రాహ్మణములం దిది 'విధర్త' యనబడెను. ఇది వస్తువునుండి పోగానే వస్తుగత పరమాణువులు శ్లథములు కాగా వస్తుస్వరూప ముచ్ఛిన్నమగును.

(3) ఇక మూడవదగు వాక్తత్త్వము. ఇది "క్షరః సర్వాణి భూతాని' అన్నట్లవి పరిణామి యగుటచే క్షర మని పేర్కొందెను. మనము కనులతో జూచుశరీరము వాగ్భాగము.

పూర్వపరిభాషానుసార మిదే పశువు. ఈ యాధారముననే వపువును (ప్రత్యేకవస్తు దృశ్యస్థూల పాంచభౌతిక పిండము) పశు వందురు.

పుట్టునట్టి ప్రతి పదార్థమును పశువు. ఇందు మాతా-పితా-పుత్రు లను మూడు భాగములు కూడి యుండును. మాతృశోణితము-పితృశుక్రము నౌపపాతికాత్మయను ఈమూటి సమన్వయముచే ప్రాణి పశుస్వరూపము నిష్పన్న మగును. మరియు ప్రకారాంతరమున :—గర్భ-ఉల్బ-జరాయు భేదమునను ప్రాణి-పశువు త్రిభావాక్రాంతమై యుండును. ఇందువలననే పశువును త్రివృత్తందురు. ఇంతవరకు పశువిషయికముగ జెప్పిన విశేషతల నీ క్రిందివచనములు స్పష్టము సేయును.

1. ఏష (అగ్నిః) ఉ ఏవోక్ తస్యై ఖత దన్నం థమ్-త దుక్థమ్
2. ఆదిత్యోవా ఉక్, తస్య చంద్రమాఏవ థమ్
3. పశుర్వై ప్రత్యక్షం సోమః
4. సోమఏ వైష ప్రత్యక్షం యత్పశుః
5. పశవోవా ఉక్థాని పశవో విశ్వం జ్యోతిః
6. పశవోవై యజ్ఞః
7. వపుర్హిపశవః
8. త్రివృద్వైపశవః పితా-మాతా-పుత్రః అథో గర్భ-ఉల్బంజరాయుః

కానిండు :-ఇంతవరకు పశువులేక యజ్ఞము సంపన్నము కాజాల దని యేర్పడినది. యజ్ఞార్థ పశుహింస యనివార్యము. కేవలము యజ్ఞార్థమే పశూత్పత్తియు నైనది. యజ్ఞ మాత్మకు

స్వరూపము. అందుకు పశ్వాలంభనము సేయుచో పశువు స్వాదిష్టము (ఆత్మోపయోగి) యగును. మనస్తుష్టికగు పశు మారణము మదిష్ట భావము. ఇది ప్రత్యవాయ జనకము. ఆత్మపతన హేతువు. ఆసురబుద్ధిగల నరరాక్షసు లీవృత్తిం బ్రధాన మనుకొందురు. దైవీసంపద్యుక్తులగు వైజ్ఞానికులు యజ్ఞసిద్ధికై పశ్వాలంభనము సేయుదురు. వారి కది ఇంద్రియ తృప్తికై కాక ఆత్మకల్యాణార్థమై యొప్పును. కనుకనే ఋషిః-

'స్వాదిష్ఠా వై దేవేషు పశవ ఆసన్ మదిష్ఠా అసురేషు' (తాండ్య)

అన్ని యజ్ఞములకును సోమమే గాని పశు వవసరము లేదు. సోమ మనేకవిధములు. కనుక నొకచో హవిస్సోమము, ఒకచో వాజసోమము, వేరొకచో గ్రహ (వల్లీ) సోమము, మరొకచో పశువపాగత సోమము ఆవశ్యకములు. ప్రాకృతిక నిత్య యజ్ఞములు వేరువేరు సోమములతో నిష్పన్నము లగును. వాని నాధారముగా గొనియే వైధయజ్ఞావిష్కారములు నయ్యెను. వానికే యాహుతిద్రవ్యములను ఋషులు చూచిరో ఆద్రవ్యములనే వైధ యజ్ఞము లందును వ్యవస్థ చేసిరి. ఒకచో హవిర్విధాన మున్నదిగదా యని అంతట నట్లే యనుకొనుట అసంగతము. ఋషులు సూత్రములం దేమి చెప్పిరో అది మాన్యము కల్యాణదాయకము. మన యిచ్ఛానుసార కల్పిత పద్ధతుల నేర్పరచి శబ్దముల కిచ్చవచ్చిన యర్థముచెప్పుట, శాస్త్రీయవచనములు ప్రక్షిప్తము లనుట, విక్షిప్తచిత్తత కుదాహరణములు.

'యజ్ఞమునకు వప గాని పశు వవసరము కాద' ను కొంటిమి గదా! కారణ మేమన:—ప్రాణదేవత వపయందే యుండును. యజ్ఞముద్వారా మనము మానుషాత్మను ఆధి దైవిక ప్రాణదేవతతో గ్రంథిబంధ సంబంధద్వారమున గూర్చ వలయును. మన మానుషాత్మ పార్థివ ప్రాణప్రధానము. అటు దేవప్రాణము సౌరప్రాణ ప్రధానము. విజాతీయము లగుటచే రెండును గలియజాలవు. ఈ విప్రతిపత్తి నిర్వారణార్థము పశు వపాగ్రహణము కావలయును. అనంతకాలము పరీక్షించి ఋషు లాయా ప్రాణదేవత లాయా పశు వపయం దుందురని గ్రహించి ఆయా యజ్ఞములం దాయా పశువిధానము నిశ్చ యించిరి. దివ్యప్రాణ మాసురవిరోధి యగుటచే, తత్ప్రాణ యుక్త వప ఆసురప్రాణాక్రాంతము కా రాదని లోహ మాసురధాతువుగ నెరింగి పశువు నినుముతో వధింప నొల్లక ముష్టిఘాత విధానమున నాలంభనము నిర్ణయించిరి. అపుడు వెలువడు పశుశబ్దము దుఃఖమయమై యాసుర మగు నని బలా త్కారమున నా శబ్దనిరోధము గావింప నేర్పాటుచేసిరి.

'హృన్మధ్యేస్తు వపావసా' అన్నట్లు హృదయస్థాన మం దొక తెల్లని పొరవంటి యాకృతికలది, సర్వప్రతిష్ఠారూపమగు సోమమయ స్నిగ్ధధాతువు వప యందురు. ఇదే మేద స్సనియు జెప్పబడును. దీని ద్వారా పార్థివప్రాణ దివ్యప్రాణములకు సంయోగము కుదర్ప వీలగును. 'మేధసంగమనే' అను వ్యుత్ప త్తింబట్టి మేధ యనియు నందురు. ఇది యొక విధ మగు

క్రొవ్వు (ఘృతము) ఇదే ఆ యా పశువులకు బ్రాణాయతనము. కనుక నే శ్రుతి యిట్లనుచున్నది. (1) మేదోవై మేధః, (2) పశో ర్వై మేధః, (3) మేధో వా ఆజ్యమ్.

అంతటను పశుమేధ కావలయునని లేదు. మేధోవ్యవస్థ యజ్ఞ స్వరూపముంబట్టి యుండును. యజ్ఞానురూప మేధ కావలయును. ఉదాహరణమునకు:-చయనము ద్యావాపృథివ్య యజ్ఞము. కనుక నిందు ద్యావాపృథివ్యము లగు పూర్వోక్త పంచపశువులు గావలయును. సోమయజ్ఞము సంవత్సర యజ్ఞము. దానికి బ్రతికృతి అజపశువు కనుక నం దిది ప్రధానత వహించును. దర్శపూర్ణమాసయజ్ఞము భూమండలమునకు జెందినది. కనుక నిందు పార్థివమేధోరూప వ్రీహియవలచే పనిజరుగును. ఇది సర్వయజ్ఞములకును బ్రతిష్ఠ. ఇం దుత్పన్నము లగు వ్రీహియవలం దాంశికరూపమున బూర్వోక్త పంచపంశు మేధోభాగ మున్నది. పురుషపశు మేధోభాగ మశ్వమున కుపాదాన మగును. అశ్వమేధోభాగము గోవునకు వచ్చును. గోమేధస్సు అంతరిక్ష్య అవి పశువునకు సంక్రమించును. అవి మేధోభాగము పార్థివాజ పశుసంక్రాంత మగును. అజయందు పంచరసములు నున్నవి కనుక దీనిని సర్వపశు వందురు. ఈ ప్రాణాత్మ కాజ పశు మేధోభాగముచే వ్రీహియవలకు బుష్టి కల్గును.

యజ్ఞ విజ్ఞానమునకు మొదట దేవతాతుల్యు లగు మహా ర్షులు యజ్ఞవిషయముం గూర్చి పూర్ణముగ నన్వేషించుచు

వచ్చిరి. వారు దర్శపూర్ణమాస యజ్ఞము సేయ నారంభించి నపుడు మేధాసంపత్తి కావలసి యున్నట్లు వారికి పొడకట్టినది. అందుకై మొదట వారు :పరీక్షకొరకు పురుషపశువు నాలంభనము గావించిరి. కాని, వారు పిదప పురుషమేధస్సు గోవునందు సంక్రమించి యుండునని నిశ్చయించిరి. కనుక దీనితో బనిజరుగునెడ పశుశ్రేష్ఠ పురుషాలంభన మేల ? యని గవాలంభనము జేసిరి. కాని అందును దర్శపూర్ణమాసములందు వలయు పర్థివాంశము వారికి లభింపకపోగా అవి నాలంభనము గావించిరి. కాని అందును వారు కృతార్థులు కాలేదు. అజాలంభనము గావించిరి. అందును నంత్రే ఫలితమైనది. చివరకు :-వ్రీహియవలం దీ మేధోభాగ మున్నదని నిశ్చయించిరి. వానితో దర్శపూర్ణమాసయజ్ఞము యథావిధిగ సంపన్నమగును. ఈచరమ పరీక్షానంతరము ఈ దర్శపూర్ణమాసయజ్ఞమందు పురోడాశరూప మగు నీపశువిధానమును జేసిరి.

ప్రకారాంతరమున జూతము :—ప్రాణ వియోగానంతరము తగులబెట్ట కున్న పురుషశవము వెంటనే కుళ్లిపో నారంభించును. కొలది సేపటిలోనే తద్గతవాయువు దుర్గంధిలమగును. ఏమి కారణమన:-పురుషమేధస్సు చాల శీఘ్రముగా నుత్క్రాంతమగును. శరీరగత దోషయుక్త వారుణ భావ నాశముగావించి శరీరమును పవిత్రముగ నుంచునది ఈమేధ స్తత్వమే. పురుషమేధకంటె అశ్వమేధ కొంత హెచ్చుతడ వుండును. అంతకంటె

గోమేధస్సు మఱికొంచెము మెరుగుగ నుండును. అజమాంస మన్నిటికంటె జాలతడవు క్రుళ్లిపోక యుండును. కనుక దానిని ఖాద్యపశు వనిరి. ప్రచారముకూడ అజమాంజమునకే హెచ్చు గదా! కనుకనే శ్రుతియు: "ఏష ఏ తేషాం పశూనాం ప్రయుక్తమో యదజః" అనియెను.

అజమేధస్సుకంటెను వ్రీహియవలమేదస్సు చిరస్థాయి యని యెరిగినదే కదా! దర్శపూర్ణమాస ప్రకృతియు, మౌలికము, ప్రతిష్ఠయు నగు యజ్ఞము. ఇందు చిరస్థాయి యగు మేధ యవసరము. కనుక నిందు పురోడాశ పశువే ప్రధాన మని నిర్ణయింప బడినది.

ప్రాణ ముత్క్రాంతము కాగానే ఈ పంచపశువులను దగులబెట్టకున్నచో నుత్క్రాంతమేధ లగు నివి మట్టిగలసి పోవును. ఆ మట్టినుండి యుత్పన్నము లగు ప్రవర్గ్యపశువుల నమేధ్యపశువులుగ నెంచిరి. వానియందు మేధభాగ మేమియు లేదు. మేధభాగము బుద్ధివర్ధకము. అమేధమాంసము బలవర్ధక మయ్యు నాసురము - దివ్యబుద్ధినాశకము. ఇట్టి పశువులైదు. పురుషునుండి కింపురుషుడు - అశ్వమునుండి గౌరపశువు, గోవునుండి గవయము, అవి నుండి యుష్ట్రము, అజమునుండి శరభము బుట్టినవి. ఉత్క్రాంతమేధ లగు పంచపశువుల యాలబ్ధభాగము నుండియే యీ యమేధ్యపశువుల వికాసము కలిగెను. వీని నుపపశువు లందురు. ఇవి యుత్క్రాంతమేధ లనియు,

ఆసురభావ వర్ధకామిషభాగమేపీని యందున్నదనియు, ఇది అబోధ మగుటచే దినరాని దనియు, యాజ్ఞవల్క్యు డనెను. వైధమాంసముపై నాక్షేపణ సేయువారు ధ్యానపూర్వకముగ 'తస్మాదేతేషాం పశూనాశితవ్యమ్, ఉత్క్రాంతమేధావై తేప శవః' అను నిషేధవచన మర్మము నెరుంగవలసియున్నది.

పశువులేకుండ యజ్ఞసంపత్తు సంపన్నము కాజాలదంటిమికదా! దర్శపూర్ణమాసమందు పశువునకుబదులు పురోడాశమే "అయినచో పాంక్తపశు సమన్వయమున బాంక్తయజ్ఞ స్వరూప నిష్పత్తి యగును. యజ్ఞసంపత్తు అన్ని విధముల గతార్థ మగును. కాని, పురోడాశమందా యజ్ఞ సంపత్తు యెట్లు లభించును?" అన్నచో సమాధానముగ నిదానము నాధారముగగొని పురోడాశ మందు పాంక్తపశు సంపన్నిరూపణ సేయుచు, "యదాపిష్టా నంథలోమాని" ఇత్యాదిగ జెప్పబడినది. ఈ క్రింది బ్రాహ్మణభాగము నవలోకింపుడు :—

"పురుషంహవై దేవా అగ్రే పశుమాలేభిరే తస్యాలబ్ధస్య మేధోఽపచక్రామ సోఽశ్వంప్రవివేశ తేఽశ్వమాలభన్త తస్యాలబ్ధస్య మేధోఽపచక్రామ స గాంప్రవివేశ తే గామాలభన్త తస్యాలబ్ధస్య మేధోఽపచక్రామ సోఽవింప్రవివేశ తేఽవిమాలభన్త తస్యాలబ్ధస్య మేధోపచక్రామ సోఽజంప్రవివేశ తేఽజమాలభన్త తస్యాలబ్ధస్య మేధోఽపచక్రామ స ఇమాంపృథివీం ప్రవివేశ తంఖనంతఇ వాన్వీషుః తమన్వవిందన్ తా విమౌవ్రీహియవౌ తస్మా దప్యేతా వేతర్హి ఖనంత ఇవైవానువిందన్తి సయావద్వీర్యవ ద్ధవా అస్యైతే సర్వేపశవఆలబ్ధాః స్యుః తావద్వీర్య వ

ద్ధాస్యహావి రేవ భవతి యఏవ మేతద్వేద శ్రోత్రోసాసంపత్ యదాహుః 'పాంక్తః పశు రితి'

యదాపిష్టాని అథలోమానిభవన్తి యదాపఆనయతి అథత్వగ్భవతి యదాసంయౌతి అథమాంసంభవతి సంతతఇవహి సతర్హి భవతి ససంతతమివహి మాంసం యదాశృతః అధాస్థిభవతి దారుణఇవహి సతర్హి భవతి దారుణమివహ్యస్థి అథయ దుద్వాసయిషన్ అభిధారయతి తం మజ్జానం దధాతి ఏషోసాసంపత్ యదాహుః పాంక్తఃపశు రితి.

సయంపురుషమాలభన్త సకింపురుషోఽభవత్ యావ దశ్వంచ గాంచ తౌ గౌరశ్చ గవయశ్చ అభవతాం యమవిమాలభన్త సఉష్ట్రో భవత్ య మజమాలభన్త సశరభోభవత్ తస్మాదేతేషాం పశూనాం నాశితవ్యమ్ అపక్రాంతమేథా హ్యేతే పశవః.

నమో వేదవేద్యాయ.

ఇతి శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్ర చల్లా సుబ్బా
రాయ తనూభవస్య కృష్ణమూర్తి శర్మణః
కృతిషు, అనుశ్రుత్యుపనామక శ్రీ విజ్ఞాన
లక్ష్మీనారాయణీయే, ప్రస్థానమీ
మాంసాయాం, శ్రీమద్భగవ
ద్గీతావిజ్ఞానాంతర్గత కర్మ
యోగ విజ్ఞానమ్

సంపూర్ణమ్.